# దళిత కథలు - 3

(అస్పృశ్య కథలు)

1910 - 1998

సంపాదకత్వం

డా॥ కె. లక్ష్మీనారాయణ



రమా పబ్లికేషన్స్
19-437/ఎ-47-ఇ/1
వినాయక నగర్, పాతూరు
అనంతపురం - 515 005

# DALITHA KATHALU - 3
( ASPRUSYA KATHALU)

*Compiled & Edited by*
## Dr. K. Lakshmi Narayana



నిడో (NIDO) ప్రచురణలు - 3

ప్రథమ ముద్రణ మార్చి - 1999
ప్రతులు 1000

కవర్ డిజైన్ - శీలావీర్రాజు

వెల - లైబ్రరీ ప్రతి 75/-
సాదాప్రతి 50/-

టైప్ సెట్టింగ్ :
శ్రీ సాహితీ గ్రాఫిక్స్ చిక్కడపల్లి. హైదరాబాద్

ప్రింటర్స్: ఉషా లేజర్ గ్రాఫిక్స్
జి. 18 సావరిన్ షెల్టర్స్, లక్డీకాపూల్, హైదరాబాద్ - 500 004

ప్రతులకు...

1. శ్రీమతి కె. రమాదేవి 19-437/ఎ-47-ఇ/1, వినాయక్‌నగర్, పాతూరు, అనంతపురం
2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (అన్ని బ్రాంచీలు)
3. నవోదయ బుక్ హౌస్, కాచిగూడ. హైద్రాబాద్
4. దిశపుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్
5. మణిబుక్ స్టాల్, సండేమార్కెట్, నెల్లూరు

# అంకితం

ఆంధ్ర రాష్ట్ర వ్యాప్తంగా దళితుల పక్షాన నిలబడి. వారి సమస్యలు పరిష్కారం తో పాటు వారికి తగిన విధంగా సహాయ సహకారాలు అందిస్తున్న ఐక్యదళిత స్వచ్ఛంద సంస్థల (D.V.A.F) సమాఖ్య కు నావంతుగా ......

డా॥ కె. లక్ష్మీనారాయణ

# దళిత కథలు - 3 అస్పృశ్య కథలు

## తర తరాలు అస్పృశ్యత నుండి పోరాట దిశగా....

భారత దేశంలో అనాదిగా మతాలు కులాలు ఉపకులాలూ ఉన్నాయి. ప్రపంచంలో ఏ దేశంలో లేనన్ని కులాలు ఈ దేశంలో ఉన్నాయి. అలాగే వేదాలూ ఉపనిషత్తులూ, అవి కీర్తించే దేవుళ్ళూ ఉన్నారు. ఒకప్పటి మానవుల అవసరాలు తీర్చుకోవడం కోసం వృత్తులు ఏర్పడ్డాయి. అయితే ఈ వృత్తి విభజనలోనే అసమానత ఉంది. డా॥బి. ఆర్ అంబేద్కర్ అన్నట్లు అది శ్రమవిభజనే కాదు. శ్రామికుల విభజన కూడా అయ్యింది. ఫలితంగా కొన్ని కులాల వాళ్ళు పేదరికానికి అగౌరవానికి, అణచి వేతకు గురయ్యారు. అలాంటి వాళ్ళలో దళితులు ప్రథములు, పీడనకు లోనైన కులాలు అనేకం ఉన్నా, తక్కిన కులాల కన్నా దళితులు అదనంగా అస్పృశ్యతను అనుభవించారు. వాళ్ళు సంపద ఉత్పత్తి చెయ్యడంలో అగ్రగాములు, కాని అభివృద్ధిని అనుభవించడంలో వారిది చిట్ట చివరి బంతి మర్యాద, మన్ననలకు ఇంకా దూరంగా నెట్టబడ్డారు. ఇంకా దారుణ వాస్తవం ఏమిటంటే ఏ సవర్ణులకైతే తాము ఊడిగం చేస్తున్నారో వారితోనే ఈ సడింపుకు గురికావడం.

వలస పాలన భారత దేశంలో తర తరాలుగా ఊడలుదించుకున్న కుల వ్యవస్థను కదిలించింది. పరిణామ శీలంగల సమాజంలో నూతన వ్యవస్థ బూర్జువా వ్యవస్థ వేళ్ళూనింది. పారిశ్రామిక, ఫ్రెంచి విప్లవాలలోంచి పుట్టుకొచ్చిన స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదాలు భారత దేశంలోనూ ప్రతిధ్వనించాయి.వలస పాలకులు ప్రవేశ పెట్టిన విద్య సంఘ సంస్కరణకు పునాది వేసింది. సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా కొనసాగిన ఉద్యమంలో అస్పృశ్యతా వ్యతిరేకత ఒక అంశం. ఆ తర్వాత జాతీయోద్యమంలోనూ అది ప్రధాన సమస్యగానే నిలిచింది. కాని దళితుల సంస్కరణ కోసం గాంధి తనదైన పద్ధతిలో కృషి చేస్తే, మహాత్మా పూలే. డా. బి. ఆర్. అంబేద్కర్‌లు దళితుల విమోచన కోసం పోరాటం చేశారు. అయితే కథా సాహిత్యం అప్పటికప్పుడే తిరుగుబాటు స్వభావాన్ని సంతరించుకోలేదు. సంస్కరణకే పరిమితమైంది. తిరుగుబాటు ఉన్నా అది సాత్వికంగానే ఉంది. 1960 తర్వాతనే దళిత కథలోకి నెమ్మదిగా తిరుగుబాటు ప్రవేశించింది. ఆంధ్ర ప్రదేశ్‌లో దళితోద్యమం దళిత కథకు అచ్చమైన తిరుగుబాటును నేర్పింది. పోరాట బాట చూపింది. ఈ సంకలనంలో ఈ పరిణామాన్ని ప్రతిబింబించే కథలున్నాయి.

ఈ సంకలనంలో ముప్పై కథలున్నాయి. కొన్ని కథల్లో సంఘ సంస్కరణోద్యమం మరి కొన్ని కథల్లో సాంఘిక పీడన ఇంకొన్ని కథల్లో దళితుల పోరాట పటిమ, ఆలోచనాదృక్పథం కన్పిస్తాయి. ఈ సంకలనంలో మొదటి కథ 'మాదిగవాడు' కులంపేరు ప్రధానంగా గల కథ రచనాకాలం ముప్పై యవదశకం ప్రారంభం దళితుల్లో ఒకరైన మాదిగల ప్రధాన వృత్తి చెప్పులు కుట్టడం. ఇది ఒకనాడు దళితునికి గౌరవాన్నీ, మానసిక ఆనందాన్ని కలిగించేదని ఈ కథ అంతసూత్రం ఈ శతాబ్ది ప్రారంభంలో అస్పృశ్యత హీనంగానూ, మహా పాపంగానూ పరిగణింపబడేది దళితుడు అసహ్యంగానూ అవమానంతోనూ చూడబడేవాడు. ఈ కాలంలో అస్పృశ్యత సంఘ సంస్కరణోద్యమంలో భాగమైంది. పలువురు సంస్కర్తలు దళితులు పక్షాన నిలిచి పోరాటం చేశారు. ఈ నేపథ్యం నుండి 'యీరమ్మ' 'ధర్మతల్లి' 'అయ్యోపాపం' ధన్యజీవులు వంటి కథలు

వచ్చాయి." సముద్రంలో క్రూర జలచరములతో పాటు మౌక్తికములు మణులు" ఉన్నట్లే సంఘంలో సంస్కర్తలు ఉన్నారనేది ఈ కథల్లో సారంశం. మొదటి సారిగా దళితులు రాసిన దళిత కథగ 'అయ్యోపాపం' రచయిత్రి గొట్టుముక్కల మంగాయమ్మ కథా ప్రారంభంలో ఈ విషయం రచయిత్రి ప్రస్తావించింది. రచయిత్రికన్నా ముందుగాని ఆ తర్వాత యాభైయవ దశకం వరకూ ఏ దళిత రచయితా దళిత సమస్య గురించి కథ రాయలేదు. 'మాదిగపల్లె' అ సమగ్రకథ దొరికినంత వరకు మాత్రమే ప్రచురితమైంది ఈ సంకలనానికి చేరాల్చిన అంటరానిబాలిక (కనుకుర్తి రామకోటయ్య చౌదరి) ఒక హరిజనునికథ (కూచి నరసింహం) మాదిగాడి పెళ్ళాం (వెంకటప్పయ్య) నిరంజనశాస్త్రి (రాయసం వేంకటశివుడు) కథలు అలభ్యం. వీటి కోసం ప్రయత్నం సాగుతోంది.

ఒకనాడు దళితుడు బానిస వాడి శ్రమగానీ, సంపద కానీ వాడి స్వంతం కాదు ఇది చరిత్ర చెప్పిన సత్యం. ఈ నేపథ్యంలో భాగంగాదళితుడి సంపదను మోసంతో కాజేసిన సవర్ణులు 'కయ్యకాలువ' 'అంటరాని పొలం' 'కుట్రల్లో కూలోడు' కథల్లో కన్పిస్తుంది. కూతురు వైద్యం కోసం భార్య తాళిని అమ్మిన దళితుడు 'ముత్తాయి కూతురు' లో ఎదురౌతాడు. 'సశ్చాద్భూమి' ఒక వినూత్న కథ పాకీ జీవితాన్ని వివరిస్తుంది. దళితులు తమ వృత్తిని దైవంగా భావించుకోవాలని, స్వశక్తితో బ్రతకమని అలా బ్రతుకుతున్న వాళ్ళలో కులం పేరు చెప్పుకోలేక, సతమతమయ్యే వాళ్ళకంటే నిర్భయంగా తమకులం పూరు చెప్పుకోగల సామర్థ్య కలిగి జీవించమని తెలిపే కథ. తెలుగు కథా నికా సాహిత్యంలో మునుపెన్నడూ ఏ రచయితా పరికించని చోటును భద్రంగా , పవిత్రంగా, అక్షర సత్యంగా, వాస్తవికతా దర్శనంగా అందించిన ఆణిముత్యం ఈ కథ. సమాజంలో విప్లవాత్మక పరిణామాలు సంభవిస్తున్నా అంటరాని తనం పొడచూపుతూనే ఉందనేది 'అప్పావు పిళ్ళ ఆత్మఘోష' 'నెంబర్రాళ్ళు' కథలు సూచిస్తాయి చిత్త శుద్ధి లేని సమాజంలో ఎన్ని సంస్కరణలు జరిగినా అంతరాలు పొడసూపుతూనే ఉంటాయనేది 'మనిషి' కథ ధ్యేయం.

ఈ శతాబ్ది ప్రారంభం నుండి సంఘసంస్కరణోద్యమం ప్రబలంగా సాగింది. ఈ ఉద్యమంలో అస్పృశ్యత భాగమైంది దళితులు ఆలోచనాపరులయ్యారు. అంత వరకూ తమ జీవితంలో కోల్పోయిన సమానత్వం గురించి వీరి ఆలోచన మొదలైంది. అజ్ఞానం అచేతన నుండి ప్రేరణ విద్యను ఆర్జించడం వ్యక్తిత్వంగా జీవించడం అన్యాయాన్ని నిరసించడం వంటి విషయాల పట్ల ప్రేరేపితులయ్యారు. ఈ నేపథ్యమే ఈ సంకలనంలోని కొన్ని కథలకు మూలమైంది. విద్యను సాధించడం 'కిటుకు' 'బతుకుబడి' కథల్లోనూ, అన్యాయాన్ని అసమానతను ఎదిరించడం చీకటి నాడీవెలుగు నెత్తురూ" "జలగ" కథల్లోనూ కన్పిస్తాయి. తరాల బ్రాహ్మణీయ భావజాలన్ని ఎదిరించిన కథ 'దేవుడు' దేవాలయాన్ని నిర్మించేది మేమే! గుడిలో దేవుణ్ణి ప్రతిష్టించేదిమేమే! కాని గుడిలోకి రాకూడదనడం ఏ వేదం సృష్టించిన వాస్తవం ఇది అని ప్రశ్నించడం ఈ కథలోని అంతరార్థం. అస్పృశ్యత లేని దళిత సవర్ణ మానవ సంబంధాలు 'ఎండుచేపలు' లో ధ్వనిస్తాయి. దళితుని స్మశాన జీవితాన్ని 'చావుకూడు' వివరిస్తుంది. శాస్త్రీయ పరిజ్ఞానం కూడిన వైద్య విద్యార్జనలో కూడా కులాల అంతరాలు ఉన్నాయనేది 'సరీసృపాలు' కథేతివృత్తం. నగర జీవితంలో కులాల అంతరాలు పరిమితంగా ఉంటాయని విద్య ఉపాధి పొందిన దళితులు వ్యక్తిత్వంతో బ్రతుకుతారని 'చెప్పులు' కథలో కన్పిస్తే విద్యా, ఉద్యోగం వుండి నగర జీవితాన్ని గడుపుతున్న దళితులు, తమ గతాన్ని మరిచిపోయి గ్రామీణ దళిత జీవితాన్ని ఆ మనుషులను అసహించుకుంటారని 'కులం' కథలో ధ్వనిస్తుంది.

ఈ దేశంలో దళితోద్ధరణ కోసం రిజర్వేషన్లు ఉపాధి పథకాలు, ప్రగతి పథకాలు వెలిశాయి. వీటి అమలు కోసం ఉద్యమాలు సాగుతున్నాయి. ఇంత ప్రయత్నం జరిగినా ఆ పథకాలు దళితునికి అందటం లేదని దళిత ౌ దృష్టిలో అవి ఎండమావులేనని, ఈ పథకాల వల్ల దళితుని జీవితం ఇంకా అణగారి పోతుందని సవర్ణులు దళితుల కోసం చేసే ప్రతి పనీ, వారికే లాభాదాయకంగా ఉంటుందని " ఇదికతా" కథ అంతస్సూత్రం కులాలను విభజించిన మనుధర్మం సవరుల్ల కుట్రయని

ఆకుట్రను దళితులు అర్థం చేసుకొన్నారని, దళితులు ఆమను ధర్మాన్ని వ్యతిరేకించే భావజాలాన్ని పొందారనేది నేనూ! నా బొద్దింక!! కథ అంతసూత్రం దళితులు చైతన్యవంతులయ్యారని దళితుల పట్ల సవర్ణుని ఆలోచనా విధానాన్ని ఎదిరిస్తారని, అస్పృశ్యత అంతమయ్యే రోజులు దగ్గరపడుతున్నాయనేది (వెంటాడిన అవమానం) కథ అంతరార్థం ఈ సంకలనంలో చివరి కథ 'అనుబంధప్రశ్న' ఇది దళితుల మధ్య ఇవాళ నలుగుతున్న రిజర్వేషన్లకు సంబంధించిన రిజర్వేషన్లు పోగొట్టుకున్నామని కొందరూ, రిజర్వేషన్లు పోతాయని కొందరూ పోరాటాన్ని సాగిస్తున్నారు అస్పృశ్యులైన వారిద్దరి మధ్య పోరాటం సాగుతోంది. ఈ పోరాటం సవర్ణుల కుట్రయని, ఉన్న వాటాలో భాగం కోసం కాకుండా సమాజం నుండి రావాల్సిన వాటా కోసం రెండు వర్గాలూ పోరాటాన్ని సాగించాలని ఈ కథ సూచిస్తుంది రెండు వర్గాలూ చదవాల్సిన కథ ఈ సంకలనంలో పరివర్తన (అందె నారాయణస్వామి) మధ్య వర్తులు (అల్లంరాజయ్య) కథలు చేరాల్సి ఉంది. ఆర్థిక పరిమితుల వల్ల అలాంటి పెద్ద కథలను, తీసుకోలేదు ఇది ఒక అసంతృప్తి.

ఈ కథలు చదివిన సమాజం బహుముఖాలుగా విస్తరించిన అస్పృశ్యతా స్వరూప స్వభావాలను అర్థం చేసుకుంటుంది. బ్రాహ్మణీయ భావజాలాన్ని గుర్తిస్తుంది. మనుధర్మాన్ని నరసిస్తుంది. మనువు పంథా నుండి గాక, మానవత్వ పంథా నుండి ఆలోచన మొదల పెడుతుంది. మనుషుల మధ్య ఉన్న అంతరాలు తొలిగిపోతాయి. తరాలుగా దగాపడిన దళితుడు అస్పృశ్యత నుండి విముక్తి పొందుతాడు తమ హక్కుల కోసం పోరాటం సాగిస్తాడు.

ఈ సంకలనానికి పలువురు సహాయ సహకారాలు అందించారు. రాష్ట్ర వ్యాప్తంగా తమ కథలను పంపి ప్రచురణకు అనుమతినిచ్చిన రచయితలకు రచయిత్రులకూ, నా పరిశోధనకు మార్గ దర్శకత్వం వహించిన గురువులు ఆచార్య కొలకలూరి ఇనాక్ గారికి, వారి ధర్మపత్ని శ్రీమతి కొలకలూరి భాగీరథమ్మ గారికీ, ఈ ప్రయత్నానికి స్ఫూర్తి నిచ్చిన శ్రీ కె. సదాశివరావు గారికి, ఈ సంకలనాలు ప్రచురణలో నావెన్నుతట్టి ప్రోత్సహిస్తూ, తగిన సమయంలో తగిన సహాయ సహకారాలు అందిస్తున్న గురువులు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారికి, నా సాహితీ మిత్రులకు, రాష్ట్ర వ్యాప్తంగా ఈ దళితకథల సంకలనాలను అభిమానిస్తున్న సాహితీ వేత్తలకూ కృతజ్ఞుడను.

డి.వి.ఏ. ఎఫ్ సంస్థ హైదరాబాద్ కేంద్రంగా ఉంటూ రాష్ట్రంలోని దళితుల సామాజిక సమస్యలను పరిష్కరిస్తూ వారి పాలిట చిరుదీపంలా ఉంటోంది. ఈ సంస్థ అంబేద్కర్ ఆలోచనా దృక్పథంతో పనిచేస్తోంది. ఈ సంస్థ ఈ సంకలన ప్రచరణకు ఆర్థిక సహాయాన్ని అందించింది. అందుకు ఈ సంస్థకు హృదయా పూర్వక కృతజ్ఞుడను. నన్నూ నా సాహిత్యాన్ని గుర్తించి, నా అభివృద్ధికి తోడ్పడుతున్న పెద్దలు, ఆత్మీయులు శ్రీ.టి.జె.పి యస్. వర్ధన్, వారి ధర్మపత్ని శ్రీమతి నందవర్ధన్ హైదరాబాద్ గార్లకు శతాధిక కృతజ్ఞతాంజలులు. అలాగే నన్నూ! నా సాహిత్యాన్ని ప్రేమించి నా అభ్యున్నతికై ఆశీర్వదించిన పెద్దలు మోస్ట్ రెవ మారం పూడి జోజి, బిషప్, విజయవాడ గారికి హృదయ పూర్వక కృతజ్ఞుడను రచనావృత్తికే పరిమితం చేసిన నా శ్రీమతి కె.రమాదేవికి కుమారులు కె.హేమంత్, కె. యశ్వంత్‌లకు, పుస్తకానికి అందంగా ముఖ చిత్రం వేయించిన శ్రీ శీలా వీర్రాజుగారికి, డి.టి.పి చేయించిన శ్రీసాహితీ గ్రాఫిక్స్ వారికి అందంగా అచ్చు వేయించిన ఉషశ్రీ ప్రింటర్స్ వారికి కృతజ్ఞుతలు.

డా॥ కె. లక్ష్మీనారాయణ

## విషయసూచిక

# 1 మాదిగ వాడు

## శ్రీ లీలాసరోజిని

ఒక వంతెన దగ్గర మాదిగవాడొకడు కూర్చున్నాడు. యౌవ్వనం చేత వాడి దేహం మిసమిస లాడుతున్నది. వాడిపక్కన ఒక యువతి కూడా కూర్చున్నది. వీళ్ళ ముఖాలుచూస్తే యిద్దరూ తమ హృదయాలను ఆనందదేవతకు పీఠాలుగా చేసినట్లు కనబడుతున్నది. వీళ్ళిద్దరూ భాగస్వాములని చూడగానే తెలుస్తుంది.

ఆనందమయమైన చూపులతో, తనకు కావలసినవన్నీ భార్య అందిస్తుండగా చిరునవ్వు నాట్యంచేస్తున్న పెదవులను విప్పి మధురముగా పాడుతూ ఆమాదిగవాడు చెప్పులుకుడుతున్నాడు.

ఇట్లా సంతోషంగా వున్న ఈ దంపతుల నావూరి రాజు చూశాడు. ఈయన కెంత ధనమున్నా సంతోషములేదు. ముఖమెప్పుడూ దుఃఖాచ్ఛాదితముగానే ఉంటుంది. కాంతివిహీనమయిన కండ్లతో వీళ్ళను చూచి "నేను కోటీశ్వరుడను. వీడమిత దరిద్రుడు. నాకానందము లేదు. వీడు దానిననుభవిస్తున్నాడేమి ? దినమంతా నేనేవిధంగా గడిపినా నన్నడ్డు పెట్టేవాళ్ళులేరు. నాకొక్క దినమయినా పాడవలెననేబుద్ధి పుట్టదెందుకు ? నేనొక సంజ్ఞ చేసినంత మాత్రాన్నే వీడి తల ఎగిరిపోతుంది. వీడు దానిని తెలుసుకోకుండా అమాయకుడుగా ఉండబట్టి ఈ విధమయిన ఆనందాన్ని అనుభవిస్తున్నాడు ? వాడి భార్యకు వాడిమీదవుండే భక్త్యానురాగాల కంతులేదే! చక్కనినిరాడంబరమయిన జీవితాన్ని గడుపుతున్నారు. నాకు వీళ్ళకున్నంత మానసికానందము లేదేమి? అనుకొని ఒక నిట్టూర్పు విడిచి ఆ వీధినుండి వెళ్ళిపోయాడు.

రాజు హృదయంలో తనకన్నా ఆమాదిగవాడు ఎక్కువ ఆనందాన్ని ఎందుకనుభవిస్తున్నాడో తెలుసుకోవాలనే ఆలోచన బాగానాటుకుంది. కళ్ళుమూసుకున్నప్పుడంతా ఆ ఆనందమయులు కనబడుతుండే వాళ్ళు. క్రమంగా చీకటిపడ్డది. రాజు తన మృదుతల్పము మీద పండుకొన్నాడు. మాదిగవాడిని గూర్చిన ఆలోచన లాయనతలలో ప్రవేశించినవి. తానుగడిపిన జీవితమును తలచుకొన్నాడు. యువరాజుగా నున్నప్పుడు ఒక ఖైదీలాగా వుండేవాడు ననుకొన్నాడు. "భౌతికసౌఖ్యాలనంతముగా అనుభవించాను. కానీ నిరాడంబరముగాపాడుతూ మానసిక ఆనందముతో ఒక్క రోజైనా గడపలేదు" అనుకొన్నాడు.

తరువాత రాజైనాడు. ఎప్పుడూ రాజ్యానికే ఆపదవస్తుందో అనీ తనపైన యెవరైనా కుట్రలు పన్నుతున్నారేమో ననీ భయము వేధించుతుండేది. ఇందువల్ల యువరాజుగా వున్నప్పుడేమైనా శాంతి వుంటే అదికూడా పోయింది. ఆ మాదిగవాడెందుకంత శాంతమును సంతోషమును అనుభవించుతున్నాడో ఎంత ఆలోచించినా తెలియలేదు. ఇంతలోకే కొద్దిగా నిద్దరపట్టింది. ఆ కలత నిదురలోకూడా వాళ్ళమూర్తులే కనబడ్డవి. వెంటనే మెలకువ వచ్చింది. ఆరాత్రంతా నిద్దరపోలేదు. తానుకూడా చెప్పులు కుడుతూ కూర్చుంటే ఆనందము కలుగుతుందేమో

ననుకొన్నాడు. తాను మాదిగవాడినని కొంతసేపు భావించుకొన్నాడు. ఆ కాసేపూ సంతోషం గలిగినట్లు కనిపించింది. వెంటనే రాజ్యమును వదిలి చెప్పులుకుడుతూ కూర్చుంటే ఆనందము కలుగుతుందేమో ననుకొన్నాడు. తాను మాదిగవాడినని కొంత సేపు భావించుకొన్నాడు. ఆకాసేపూ సంతోషం గలిగినట్టు కనుపించింది. వెంటనే రాజ్యమును వదలి చెప్పులు కుట్టుకోవడమా - ఛీ! సిగ్గు మాలిన పనిఅనుకొన్నాడు.

తెల్లవారింది. మళ్ళీ మాదిగవాడుండే స్థలానికి వెళ్ళాడు. వాడు యథాప్రకారముగానే వున్నాడు.

రాజు ఎప్పుడు చూచినా రాజ్యమెట్లా వున్నదోననీ, యువరాజేవిధంగా వుంటున్నాడోననీ, తన పరిపాలనలో యే అక్రమము జరుగుతున్నదోననీ, శత్రురాజులెవరైనా వస్తే తానుముసలివాడననీ, సైన్యము క్రమంగా వున్నదో లేదోననీ, ఈ విధమయిన అనేకాలోచనలలో మునిగి ఉండేవాడు. రోజంతా ఇవే ఆలోచనలు. ఇప్పుడొక కొత్త ఆలోచనకూడాను. అది మాదగవాడంత ఆనందమెట్లా అనుభవిస్తున్నాడనేది. ఎంత ఆలోచించినా ఆయన కేమీ తెలియలేదు. చివరకొక రోజు వాడంతానంద మనుభవించడానికేదో రహస్యమున్నదనుకొని వాడిదగ్గరకు వెళ్ళి తెలుసుకుందామని బయలుదేరాడు.

ఈయన వాళ్ళుండే స్థలానికి వెళ్ళేటప్పటికి వాళ్ళు పనిముగించుకొని ఇంటికి వెళ్ళబోతున్నారు. రాజును చూచి సాగిలపడి మ్రొక్కారు. ఇది వరకు రాజు వీళ్ళను చూచినప్పుడు మారువేషంతో వున్నాడు. అందు చేత వీళ్ళకాయన రాజని తెలియలేదు. ఈ సారి మారువేషంతో లేడు. రాజును చూడగానే మాదిగవాడికీ వాడిభార్యకూ భయం వేసింది. ఆభావం వాళ్ళముఖాలలో స్పష్టంగా కనబడ్డది. రాజు వాళ్ళను లెమ్మనమని ఈ విధంగా అడిగాడు.

"నెలకెంత సంపాదిస్తావు?"

"ప్రభూ! నా అపరాధం మన్నించండి. నేనెప్పుడూ నా ఆదాయాన్ని లెక్క పెట్టలేదు. నేనెప్పుడూ ఈ రోజెట్లా గడుస్తుందా అని ఆలోచించలేదు. మీ అనుగ్రహం వల్ల మాపొట్టలు గడుస్తున్నవి" అన్నాడు మాదిగవాడు.

"సరే రోజుకెంత సంపాదిస్తావు?" అని రాజడిగాడు.

"ఒరోజు తక్కువ ఒక రోజు ఎక్కువ వస్తుంది" అని జవాబిచ్చాడు.

"ఎక్కువ వచ్చినరోజు డబ్బేమిచేస్తావు?" అని అడిగాడు రాజు.

"ఎక్కువ వచ్చిన రోజు కూడా అంతా ఖర్చు పెట్టుకొంటాను క్షమించండి" అన్నాడు.

"తక్కువ వచ్చినప్పుడెట్లా గడుపుకొంటావు?"

"అట్లాగే గడుపుకొంటాను ప్రభూ" అన్నాడు మాదిగవాడు. రాజు వాడి అమాయకత్వానికి నవ్వుకొని ఈ విధంగా అన్నాడు.

"ఈ నూరు వరహాలు పుచ్చుకో, వీటిని భద్రంగా దాచి పెట్టు. నీ కెప్పుడైనా జబ్బు చేస్తే ఉపయోగపడుతవి"

రాజునోటినుంచి ఈ మాటలు రాగానే ఆనందంతో వాళ్ళ ఒళ్ళు పొంగిపోయింది. కృతజ్ఞతతో సాష్టాంగ పడ్డారు. తరువాత రాజుగారి రథం అక్కడినుండి వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరు తమ గుడిసెకు వెళ్ళి డబ్బు నొక మూల పాతిపెట్టారు. అయితే ఆ రాత్రంతా ఇద్దరూ నిద్రపోలేదు తెల్లవారింది. పని చేసుకోడానికి వెళ్ళారు. కాని పాడుతూ సంతోషముతో పనిచేయడంలేదు. ఇద్దరి మనసులలోకూడా యెవరైనా డబ్బు దొంగిలిస్తారేమోననే భయం; ఇంటికి వెళ్ళేదాకా తోచింది

ఆ రోజు చతుర్దశి. సూర్యుడస్తమించాడు. చంద్రుడు తన కిరణాలను అంతటా ప్రసరింపచేస్తున్నాడు. ఆ చక్కని వెన్నెలలో పచ్చిక బయళ్ళన్నీ అందంగా కనపడుతున్నవి. ప్రసూనాలన్నీ వికసించినవి. రాజు తన ధవళాశ్వమునెక్కి బయలుదేరాడు. ఆ పక్కనున్న సరోవరంలోని కలువలన్నీ రాజురాక చేత వికసించి మనోహ్లాదంగా వున్నవి.వాటిని చూడగానే ఆయనకు ఆనందంచేత వికసించిన ఆ దంపతుల కండ్లు జ్ఞాపకమునకు వచ్చినవి. ఆ ప్రదేశాన్నుంచి ఆయన యిదివరకు రెండుమూడుసార్లు యిటవంటి వెన్నెట్లోనే ప్రయాణం చేశాడు. కాని ఆ రోజు వెనుకటికన్నా అక్కడున్నవన్నీ యెన్నో రెట్లెక్కువరమ్యంగా వున్నట్టు తోచింది. చక్కని ఆ పచ్చిక బయళ్ళమీద గుఱ్ఱమును త్వరగాపరుగెత్తించిన కొద్దీ ఆయన కెక్కువ ఉత్సాహం కలిగింది. ఆయన వెనుక పరివారమేమీ లేదు. "చీకటి పడకముందే వస్తాను. యెవరూ రావద్దని' ఆజ్ఞాపించాడు. రాజు ఒంటరిగా ప్రకృతి సౌందర్యాన్నిచూచి ఆనందించవలెనెనని కోరుతున్నాడనుకొన్నారు. ఆయన ఆజ్ఞ నెవరతిక్రమించుటకు సాహసించుతారు?

రాజురాత్రంతా ప్రయాణం చేస్తూనే వున్నాడు. తెల్లవారేటప్పటికి ఒక అడవిలో వున్నాడు. ఆయన కిరుపక్కల వున్న పెద్ద చెట్లను చూశాడు. అవి చాలా గంభీరంగానూ, మౌనంగాను వున్నట్లు తోచింది. తానుకూడా అట్లాగే ఏ కష్టసుఖాలను వెల్లడిచేయకుండా గంభీరంగా వుండవలెననుకొన్నాడు. అక్కడ యీర్ష్య క్రోధము పేరాశ మొదలయినవాటి కవకాశం లేదనుకొన్నాడు. ఈవిధంగా ఆలోచిస్తుండగా అలసిపోయిన ఆ గుఱ్ఱం రాలి యెండిపోయిన ఆకులమీద చక్కని గలగలమనేధ్వని కలిగించుతూ నెమ్మదిగా వెళ్ళుతున్నది.

చీకటి పడేటప్పటి కొకపల్లెటూరి పొలిమేరకు చేరుకున్నాడు. ఆ వూరిలోని చిన్న దీపాలు మినుకుమినుకుంమంటూ నక్షత్రములవలె కనపడుతున్నవి. రాజు గుఱ్ఱాన్ని అక్కడి బయళ్ళమీదికి విడిచిపెట్టాడు.

కృష్ణ పురానికి ఒక మాదిగవాడు కొత్తగా వచ్చాడు. వాడికి పని అంతబాగా చేతకాదు. అయినా చుట్టూ పాత చెప్పులు పెట్టుకొని ఒక పెద్ద చెట్టుకింద కూర్చుని బాగుచేస్తుండేవాడు. మధ్య మధ్య తననెవరైనాచూచి కనుక్కొంటారేమోనని యిటు అటు చూచేవాడు. వెంటనే ఒక విధమైన లజ్జ కలిగేది. అది పోయి భయము వేసేది. రోజులు గడిచిన కొద్దీ మాదిగవాడికి భయముపోయింది. చిరునవ్వు నవ్వుతూ ఆనందంతో పాడుకుంటూ చెప్పులుకుట్టుకునేవాడు, ఎవరూకూడా వాడెవరో ఎక్కడి నుంచి వచ్చాడో తెలుసుకోలేదు.

అంతా క్రమంగానే జరిగిపోతున్నది. ఆ మాదిగ వాడూ వాడి భార్యా యెంత ఆనందమను భవించుతున్నారో యీ మాదిగవాడు కూడా అంత ఆనంద మనుభవిస్తున్నాడు. వాడిలాగానే పాడుతూ చిరునవ్వు నవ్వుతూ చెప్పులు కుట్టుతుండేవాడు. అయితే ఒక్కదానిలో మట్టుకు బేదముంది.ఆ మాదిగ వాడి పక్కన వాడి కష్టసుఖాలు పంచుకొనే భార్య వుంది. కృష్ణపురంలో మాదిగవాడి పక్కన తన కష్టసుఖాలు పంచుకొనే భార్యలేదు.

కృష్ణపురంలో వుండే మాదిగవాడు ముసలివాడైనాడు. ఒకరోజు జబ్బుచేసింది. ఆ మరునాడెవరికీ కనపడలేదు. అందుకని కొందరు వెళ్ళి గుడిసె తలుపు తెరిచారు. మాదిగవాడి శవం కనపడ్డది. ఆనాడే రాజుగా రెక్కడికిపోయినారని వెతుక్కుంటూ వచ్చిన రాజభటులు యీ శవంలో రాజుగారి చిహ్నాలు కనిపెట్టారు.

*- జయంతి, మే 1930*

2

# యీారమ్మ

## అరవ వేంకటస్వామి

"బాబూ! గవరయ్యోరూ! గవరయ్యగోరూ!"

"బాబూ! గవరయగోరూ! గవరయ్యగోరూ!"

(లోపలనుండి) "ఎవరురా వారూ?"

"నేనండి. ఎంకణ్ణండి. ఓసారి తలుపు తెరువండి."

(తలుపు చాటునుండి) "ఎందుకురా అయ్యోరు?"

"నాపిల్ల యీారమ్మకి వారం రోజుల నుంచి జరం అండి. మూసినకన్ను తెరవడంలేదండి. కటికలంకణాలు కట్టించినా తగ్గనేలేదండి. పైగా పరాకుమాటలుకూడా మొదలెట్టినదండి. అయ్యగారికడకి మందుకొచ్చానండి."

రంగమ్మ యవతలకి తొంగిచూసి "పదకొండుగంటలయింది, ఆయనయింకా గుళ్ళోనే ఉన్నారు. ముందు నాకుకనబడి నామడితగలబెట్టావు. నీమొహమ్మండా! మాలపీనుగవి. ఆమాత్రం తోచకపోయింది, భోజనాల వేళ బ్రాహ్మలవీధికి వెళ్ళకూడదని? ఇప్పుడుమళ్ళీ స్నానం చేసి తగులడాలి. అసలు వంట్లో బగాలేదాయెను. పో. అవతలకి," అని తలుపు గట్టిగా వేసుకొని లోపలికి వెళ్ళిపోయింది.

వెంకన్న కేమీ పాలుపోయిందికాదు. అమ్మ గారే యిలా తిడితే అయ్యగోరు మారెట్లా అగ్గి అయిపోతారేమోనని అక్కడనుండి వెళ్ళిపోవటానికి అతగాడి మనస్సు ఒప్పటంలేదు. ఉన్నది ఈరమ్మ ఒకర్తే పిల్లి. ఆపిల్లను కని తల్లి పరమపదించింది. అప్పటి నుండీ వెంకన్న ఎంతో ప్రేమతో కష్టపడి పెంచాడు యీారమ్మని. పదమూడేళ్ళ వయస్సాపిల్లకి. రజస్వలయింది. ఇంకా పెళ్ళికాలేదు. ఏదో కొంచెం చదువుకున్న వాడికిద్దామని అతడి ఉద్దేశం. పాపం, అయీారమ్మ కే యిప్పుడు జ్వరం వచ్చింది. వారం రోజులనుంచి వెంకన్న కూతురు ఆరోగ్యవతికావడంకోసం వేయి దేవుళ్ళకి మొక్కుకుంటున్నాడు. అమ్మవారు వనుములమ్మకి వేటపోతునిస్తానన్నాడు. గనిపోతురాజుకి నాలుగు కోళ్ళనికోస్తాననుకున్నాడు. ఇంతకీ నందమూరు కుగ్రామం అవడంవల్లా, ఆఊళ్ళో వున్న పూజారి గవరయ్య గారుతప్ప యింకెవరూ వైద్యులు లేకపోవడం వల్లా విధిలేక వారంరోజులు ఊరుకుని, యింక ఉపేక్ష చేస్తే తన కూతురు తనకు దక్కదని భయపడి బ్రాహ్మణవీధిలో కాపురం ఉన్న పూజారిగవరయ్య గారి కోసం వచ్చాడు.

పాపం వారం రోజుల నుంచీ ఒక్క కానీ అయినా సంపాదనలేదు. రోజూ జోళ్ళు ఒక జతకుట్టి, కొవ్వూరు తీసుకువెళ్ళి, సాయంత్రం దాకా తిరిగి, ఆ జోడులో వచ్చే లాభం, ఏ పావలాతోనో నూకలు తీసుకొస్తే అప్పుడు యీారమ్మ గంజికాచియిచ్చి, తానింతత్రాగుతుంది. ఒక్కొకనాడు

అతడు బి.ఏ., చదువుతున్నాడు. విశేషభాగ్యవంతుడు. ప్రజా సేవ ఆదర్శం గాగల యువకుడు. బి.ఏ., పూర్తి చేసిన తరువాత ప్రజోపయోగకరములైన కార్యాలెన్నో చేయసంకల్పించి ఉన్న ఉదారహృదయుడతడు.

అతని యింటి కెదురు గానే ఉన్నది గవరయ్యగారి యిల్లు. రామారావు భోజనం చేసి, వీధి అరుగు మీద కూర్చుని పత్రిక చదువుతున్నాడు. రాత్రి ఎనిమిది గంటలై ఉంటుంది. గవరయ్య కేకలు వినిపించగా, రామారావు చదువు ఆపి విన్నాడు.

"ఫో. ఫో. రాత్రి మందెలాయిస్తాననుకున్నావు? మాగన్ను పడినపిల్ల బ్రతకడం సున్న, ఏచింతామణి లాంటి దివ్యౌషధమోయివ్వాలి. ఖరీదైన ఔషధం యివ్వను. పైగా మాలపీనుగవు. నీకసలివ్వను. మీమూలాన్ని మా ఆచారం అంతా అడుగంటిపోతూంది."

రామారావు లేచి గవరయ్య గారి యింటికి వెళ్ళాడు. వెంకన్న దూరంగా నిలబడి వున్నాడు.

"బాబయ్యా! ప్రభువు లలాసెలవిస్తే ఏంజెయ్యను? పిల్లదాన్ని బతికించండి బాబూ! ఏదైనా చెప్పుల జోడు కుట్టి తమరి కిచ్చుగుంటానండి. బీదోణ్ణి."

"ఛీ. నీజోడెవడిక్కావలిరా? నిర్భాగ్యుడా! మీమాలాళ్ళని తవ్వి పాతరేసినా పాపం లేదు. మీద మీదకొచ్చి దూరంగా ఉండరా అంటే, 'అయ్యబాబో! ఆశారంకామోసు. గాంధి మహాత్ముడేటి చెప్పాడు?' అని తెగ నీలుగుతున్నారు. బ్రాహ్మల యింట్లో భోంచెయ్యండి అని ఆ గాంధి మహాత్ముడు మాత్రం ఎలా చెప్పాడో! కలియుగం. వర్ణసంకరం జరుగుతుందని వ్రాయబడేఉంది. ఏం! హడావిళ్ళు. రాజమండ్రిలో ఎవరెవరో బ్రాహ్మలూ, కోమట్లూ మాలకూడు తింటున్నారట. వాళ్ళ నీళ్ళు త్రాగుతున్నారట. దేశానికి ప్రళయం వచ్చింది. పైగా గుళ్ళో కివస్తాం అంటున్నారు కూడాను."

రామారావు యింక ఉండబట్టలేక పోయినాడు. ఇలా అన్నాడు.

"గవరయ్యగారూ! ఒక నిమిషం నామాట వినండి. గాంధిగార్ని గురించి మీరు విశేషంగా దురభిప్రాయపడుతున్నారు. ఆయనతత్వాన్ని మీరు కొంచెమైనా గ్రహించలేదు. గ్రహించలేరుకూడాను. మాల వాళ్ళని అనకండి. ఆ పదం వినడానికే యింపుగా లేదు. మహాత్ముడు "హరిజన" అన్నాడు. ఆ పేరు ఎంతముద్దుగా ఉన్నది. మహాత్ముడు భోజన ప్రతిభోజనాలు నిర్ణయించలేదు. వాళ్ళని నీచంగా హీనంగా చూడవద్దన్నాడు. కూడలిస్థానాల్లో ఉండేబావుల్లో నీళ్ళు తోడుకోనిమ్మన్నాడు. ఫో. ఫో. అని కసరికొట్ట వద్దన్నాడు. దేవాలయ ప్రవేశానికి నిరోధం కలిగించవద్దన్నాడు అస్పృశ్యులకి, రాజమండ్రిలో ఎవరెవరో ఏదో చేశారన్నారు. భోజన ప్రతిభోజనాలు చెయ్యలేదు. కాని యిష్టం ఉన్న వాళ్ళు చెయ్యవచ్చు. నూతుల్లో నీరు తోడించి త్రాగి నారు. దానిలో మా తప్పేమీ లేదే. పూర్వం అయినా అస్పృశ్యులని ఏదైనా ఒక వర్ణం ఏర్పరచలేదే మీ శాస్త్రజ్ఞులు. జాతి మత భేధం ఉండకూడదని, విశ్వమానవ సౌభ్రాత్రం ఉద్బోధిస్తున్న గాంధి మహాత్ముని తత్వం గ్రహించి, అనండి, ఏమాటలన్నాను. ఖండాంతరవాసులైన విద్యాధికులే అమహామహుని చిత్తం గ్రహింపలేక తబ్బిబ్బవుతూంటే మీరు, నేను ఒక లెక్కా? మాతావేశ పరుడై, మానవ కళ్యాణానికి పాటుబడ్డానికి మహాత్ముడు అపూర్వ మైన, త్యాగం చేశాడు కాదా? అజితేంద్రియుని నిరశన ప్రయోపవేశదీక్షకు ఫలంగా ఒక్కసారి భారత భూమి నావరించి ఉన్న అజ్ఞానాంధకారం పటాపంచలైపోయిందే? అసాధారణమైన సంచలనం కలిగిందే? అస్పృశ్యత అనేది మటుమాయమైపోయిందే!

ఏం? నిమ్న జాత్యుద్భవులుమాత్రం మనుష్యులు కారూ? వాళ్ళ తక్కువేమిటి? మనయొక్క వేమిటి? పరమేశ్వరుని విశాలదృష్టిలో మనమందరమూ సమానులమే. దేవాలయ ప్రవేశానికి మనం హక్కుదారు లమా? వాళ్ళు ఆలయము సమీపించడానిక్కూడా వీల్లేదూ? ఏం స్వార్థపరత్వం? అందుచేతనే ఎవరు ఏంజేసినా ఊరుకుని దేశానికి యీమహా అల్లకల్లోలం తెప్పించారు. మన దేశంలో అస్పృశ్యుల్లో ఎంత మంది భక్తులు లేరు? నందుడస్పృశ్యమహర్షికాదా? పాండురంగ విఠలునిదర్శన భాగ్యమందిన కామేళుడస్పృశ్యమహర్షి కాడా? శ్రీ కృష్ణ చైతన్యుని ప్రియ శిష్యుడై విష్ణుసాన్నిధ్యమునొందిన హరిదాసు అస్పృశ్యమహర్షి కాడా? ఒక్కసారి నేత్రాలు విప్పి చూడండి. అసేతుహిమాచలపర్వంతము మహాత్ముని కీర్తి కాంతి అస్పృశ్యతానివారణధ్వజంతో స్వేచ్ఛా విహారము సల్పుతున్నది! మహాత్ముని దివ్య బోధదిగంత రాళముల లోకూడా వీణారవమువలే ప్రతిధ్వనిస్తూన్నది. వినండి. ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే మహాత్ముని వంటి మతావేశ పరుడు, మానవాతీతుడు ప్రపంచములో ఎక్కడా లేడని మీరే తెలుసుకోగలరు.

బాబూ! లెండి. అతడు అస్పృశ్యుడనే భేదభావం విడిచిపెట్టి, ఒక్క సారి దయచెయ్యండి, ఆ పిల్ల కి మందియ్యండి."

"అబ్బా! ఎంత ఉపన్యాసం యిచ్చావయ్యా, కష్టపడి. బాగా నే వుంది. కాని, నేనామాలపల్లెలోకి రాను. ఖరీదైన మందు ఊరికేయివ్వను."

గవరయ్య స్వార్థప్రవృత్తిచూచి రామారావు అసహ్యించుకొన్నాడు.

"వెంకన్నా! నడు. నేను వస్తాను." అన్నాడు.

వెంకన్న రామారావు తనపాలిట భగవంతుడనుకున్నాడు. రామారావు వెంకన్న పూరింటిలో ప్రవేశించినాడు. ప్రమిదదీపపు మిసుకుమిసుకుమను కాంతిలో అతడు స్మృతిహీనయై చింకిచాపమీద పడుకొని ఉన్న యీరమ్మని చూశాడు. అకారణమైన ప్రేమతో నిండి పోయిన దాతనిమనసు.

ఆమె ప్రక్కనే కూర్చుండి నాడి పరీక్షించాడు. ఒక్క నిట్టూర్పువిడిచి "వెంకన్నా! కొవ్వూరు వెళ్ళి డాక్టరు లక్ష్మీపతిని తీసుకువస్తా" నన్నాడు.

"బాబూ ! చీకటిలో-"

"మరేంభయంలే"దని రామారావు బయలు దేరాడు.

## 3

నీలనీరదాచ్ఛన్నమై ఉన్న అంబరతలమునుండి వర్షము కురియసాగింది. మిట్టపల్లాలతో, పండిన చేల గట్లననుసరించి, ఆగభీరాంధకారసముద్రం యీదుకుంటూ రామారావు వెళుతున్నాడు. గింగురుమను శబ్దం చేస్తూన్నవి కీచురాలు. తూలుతూ, పడుతూ, లేస్తూ రామారావు ఆపైను వర్షంలోతడిసి ముద్దయిపోయి, వెళుతున్నాడు. భయంకరంగా అప్పుడప్పుడు దిక్కులు బేధిస్తున్న ఉరుములు. మెరుపులే అతనికి మార్గం చూపిస్తున్నవి. అంతకష్టపడుతున్నది. పాపం అనాథబాలిక - అస్పృశ్యబాలిక అయిన యీరమ్మ కోసం విశేషంగా ప్రయాసపడి రామారావు కొవ్వూరు చేరి లక్ష్మీపతిగారి గృహానికి వెళ్ళి తలుపుతట్టి నాడు. డాక్టరు గారి భార్య కిటికీతలుపు తీసి, "డాక్టరు గారు మధ్యాహ్నం బండికి కాకినాడ వెళ్ళారండి." అని చెప్పింది.

రామారావు నిశ్చేష్టుడైనాడు. అతని మొగము వెల్లబారించి హృదయం దుఃఖాతిశయం చేత

కరడుకట్టుకుపోయింది. ఉస్సురని ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి, తిరుగుముఖం పట్టినాడు. అమహాంధకారంలో - అభయంకర వర్షంలో - జలధరగంభీరగర్జనాలు శ్రవణ పుటాలు ఛేదిస్తుండగా నిర్భీతహృదయంతో నందమూరు చేరాడు. అతని హృదయం, దృష్టి సర్వమూ యీరమ్మని - మృత్యుదేవతచే కొన్ని గంటలలో కొనిపోబడడానికి సిద్ధంగా ఉన్న యీరమ్మని రక్షించడం మీదనే కేంద్రీకృతమై ఉన్నవి.

రామారావు తిన్నగా గవరయ్యగారి గృహానికి వెళ్ళి తలుపు తట్టి పిలిచాడు. పదిసార్లు కేకలు వెయ్యగా తలుపు తీసి "ఆమాలపిల్ల కోసం నువ్వు బాధపడ్డం చాలకా యేవిటి నన్ను కూడా చంపుతున్నా"వని విసుక్కున్నాడు.

"అయ్యో! అల్లా విసుక్కోకండీ. మీకు ఏమైనా సమర్పించుకుంటాను. దివ్యౌషధం ఇవ్వండి.'

"పాతిక రూపాయలిస్తే యిస్తాను." యిదేసమయం అనుకున్నాడు గవరయ్య అర్నెల్ల సంపాదన ఒక్క సారే అతని దగ్గర గుంజుకుందామని.

రామారావు తల్లిని లేపి తన పెట్టి నుండి లెఖ్ఖతీసుకువచ్చి అయిదు అయిదురాపాయల నోట్లు యిచ్చాడు. అవి చూడగానే గవరయ్యనేత్రాలు ఆనందోత్ఫుల్లములైనై.

లోపలికి వెళ్ళి చింతామణి యిచ్చి, "దీనికంటె మరణావస్థలో ఉన్న ఆపిల్లను బ్రతికించే మందే లేదు" అని తలుపు వేసుకున్నాడు.

రాత్రి ఒంటిగంటదాటింది. రామారావు త్వరితంగా నడచివెళ్ళాడు వెంకన్నయింటికి.

కన్నీరు కాలువకట్టేటట్లు ఏడుస్తూన్న వెంకన్నను హెచ్చరించి, రామారావు ఔషధం బహుకష్టం మీద అమెచే మ్రింగించాడు. నీరసంగా ఉన్న వెంకన్నని నిద్రపొమ్మనాడు. రెప్పవాల్చకుండా కూర్చున్నాడు రామారావు.

ఆహా! అస్పృశ్యబాలిక అంటే అతనికి ఎంత దయ!

అరుణోదయమయింది. తూర్పు కొండనుండి సూర్యుడు తొంగిచూస్తున్నాడు. యీరమ్మ కళ్ళు తెరిచింది. మెల్లగా "బాబూ!" అంది. రామారావు ఉలికిపడ్డాడు. "వెంకన్నా ! వెంకన్నా! లే.. పరుగెత్తు. ఇదిగో పావలా. వెళ్ళిపాలుతీసుకురా. కొంచెంత్రాగిద్దాం" అన్నాడు.

వెంకన్న పరమానందభరితహృదయుడై పరుగెత్తాడు. రామారావుని చూసి యీరమ్మ భయంతో "మా బాబేడీ?" అంది.

"మీ బాబు పాలకివెళ్ళాడు. అట్టే మాటలాడకు. అయాసపడవద్దు."

వెంకన్న పాలు తెచ్చాడు. రామారావు మెల్లగా అమెను లేవదీసి కూర్చుండబెట్టి పాలు త్రాగించాడు. వెంకన్నరామారావు పాదాలపై పడి "బాబూ! తమరు మాపాలిటి భగవంతులు. నన్ను రచ్చించారు." అన్నాడు. రామారావు వెంకన్నను లేవదీసి "ఇవిగో పాతిక రూపాయలు. కావలసినవన్నీ కొనుక్కో. నీ కూతురుకు తగిన సంరక్షణచెయ్యి. నేను సాయంత్రం వస్తాను."

అని రామారావు యింటికి వెళ్ళాడు. గవరయ్య గారింతలో రామారావు తల్లితో రాత్రిజరిగినదంతా చెప్పాడు. ఆమెకు కోపంకలగలేదు. పైగా కుమారుని మెచ్చుకున్నది. రామారావు తడిసి ఉన్న బట్టల్ని విప్పి కాల్యకరణీయాలు నిర్వర్తించుకొని, స్నానంచేసికాఫీ త్రాగి నిద్రపోయినాడు.

*- గృహలక్ష్మి, నవంబర్ 1932*

3

# అయ్యో పాపం!!!

గొట్టుముక్కల మంగాయమ్మ

"శునిచైన శ్వపాకేచ పండితా : సమదర్శిన:"

ఆర్యా! నమస్కారములు. ఈ కథ స్వానుభవముతో వ్రాసిన 'అస్పృశ్యతా పాపము'నకు సంబంధించినది. నేటివరకు అమలులోనున్న ఆచారములచే మాకు అక్కడక్కడా గలుగుచున్న అవమానాగ్ని హృదయము దహించి వేయగా ఇది వ్రాసితిని. నేనొక హరిజన యువతిని.

అవి మంచి రోహిణి గాడ్పులు. పగలు పదిగంటలు దాటితే రైళ్ళలో ప్రయాణం చేస్తూన్న ఫస్టు సెకండు క్లాసు ప్రయాణీకులు కూడా హడలిపోయే రోజులవి. ఆకాశాన్నుంచి చండభానుడు నిప్పులు గ్రుమ్మరిస్తున్నాడు. ఆ మండు టెండలకి వృక్షాగ్రాల నివసిస్తూన్న ఎన్నో గబ్బిలాలూ పక్షులూ విగతజీవులై నిలబడిపోతున్నాయి.

కలిగినవాళ్ళు పట్టివేళ్ళ తడకల్లో ఐస్‌క్రీమ్ పానం చేస్తూ చలువపన్నీరూ మంచిగంధమూ, పూనుకుంటూ హాయిగా మేడల్లోనుంచి బయటకు తొంగిచూట్టానికైనా అవసరం లేనిమంచిరోజులవి. ఇక గుప్పెడి పొట్టకూటికి ఎండనక, వాననక నానా బాధలూ పడుతూండే పేదవాళ్ళసంగతో?

ఇల్లాంటి భయంకరపురోజుల్లో బయలుదేరారు. అన్నపూర్ణా భాస్కరులు హరిజన యువతీయువకులు దంపతులు, చాలాదూరాన్నున్న వూళ్ళో అన్నపూర్ణ పుట్టింటివద్ద తల్లి విషజ్వరంతో ప్రమాదంలో వున్నట్టూ ఏకపుత్రికైన అన్నపూర్ణను చూట్టానికి అస్తమానలు ఆలాపిస్తూన్నట్టూ వుత్తరం రాగానే తొందరగా బయలుదేరారు.

చివుకూ చింతావల్ల తెల్లవారి 6గంటలకి కాస్త కాస్త చల్ది గంజి తాగేరోలేదో పాపం! తొందరగా ప్రయాణం సాగించారు. వెళ్ళవలసింది బహుదూరం బారెడు ప్రొద్దెక్కిందో లేదో, అప్పుడే వేడిగాడ్పులు విసిరివిసిరి తోలుతున్నాయి. రైలుమీదో మోటారుమీదో వెళ్ళొచ్చుగాని, ఏ పూటపాటు ఆ పూట సాపాటుకే చాలక బాధపడుతూన్న యీ హరిజన దంపతులకి ఆ సుఖమెల్లావస్తుంది. వాళ్ళకే భాగ్యమూ లేదు. ఉన్నదల్లా ఒకళ్ళనొకళ్ళు ఎప్పుడూ విడిచివుండలేని అద్వితీయ ప్రేమభాగ్యమూ ఏదో ఒక మాదిరి ప్రపంచజ్ఞానం తెలిసికోదగ్గ అయిదో క్లాసు వరకు చదువుకున్న విద్యాభాగ్యమూ తప్ప.

అప్పుడే యించుమించు పది పదిహేను మైళ్ళ వరకూ నడిచొచ్చాడు. మార్గమధ్యంలో అక్కడక్కడా వడదెబ్బకు అలిసిసొలసి పయనిస్తూన్న ఒకళ్ళిద్దరు అభాగ్యపు పాంథుల్ని చూచి

జాలిపడుతూ అన్న పూర్ణాభాస్కరులు కూడా అలిసిపోయారు. చెమట యిద్దరిగుడ్డల్ని తడిపేసింది!! క్రిందకాళ్ళు పైన నెత్తి మండిపోతున్నాయి.

మొగాలు కందగడ్డలైపోయాయి. నాలుకల మీద తడిలేదు. గొంతెండుకపోయింది. నీడా నీళ్ళు వీటికోసం తహతహ లాడిపోతున్నారు. గ్రుక్కెడు మంచినీళ్ళున్న గుంటకోసం అటూ యిటూ వెతక్కుంటూ నడుస్తున్నారు.

బాటపక్కనే పెట్టించారు చల్లని చలివేంద్రం దగ్గరవున్న వూళ్ళోళ కరణాలందరూ కలిసి పుణ్యం వస్తుందని నిమ్మరసం కలిపిన పల్చని మజ్జిగతో నిండి వున్న బానలు వరుసలు దీర్చి పందిట్లో పెట్టివుంచారు. దగ్గరగా వున్న బల్లమీద తళతళలాడుతూ పది పన్నెండు గ్లాసులున్నాయి. పుల్లనిమజ్జిగ కంపు దూరాన్నుంచి వస్తున్న తృషాతురుల్ని ఆహ్వానిస్తుంది.ఎదురుగా వున్న యింకో పందిట్లో తాటాకుల చాపలు పరచి వున్నాయి. పథికులు కూర్చుని మార్గాయాసం పోగొట్టుకుంటానకిని. వచ్చినవాళ్ళు తృప్తి దీరా దాహం త్రాగగానే ఒక్కొక్క విసనకర్ర చేతికిచ్చి కూర్చోమంటున్నాడు చలివేంద్ర నిర్వాహకుడు, కుండబొజ్జా, యజ్ఞోపవీతమూ విభూతి పెండికట్లూ అతడు బ్రాహ్మడే.

దూరాన్నుంచి ఇదంతా చూచారు. అన్నపూర్ణ ప్రాణం లేచివచ్చినట్లయింది వాళ్ళకు. పరమ సంతోషంగా దగ్గరగా వచ్చారు. నోటమాటలు స్ఫుటంగా ఎవరుమీరు అన్నాడు బ్రాహ్మడు. ఈ మాట వినగానే నడుమ విరిగినట్లయింది భాస్కరుడికి. "మాల్లాళ్ళమండీ" అంది హీనస్వరంతో అన్నపూర్ణ. చాలు చాల్లే ప్రక్కకు తప్పుకుని మరీ మాట్లాడండి!! దారికి అడ్డం లెండి గొప్పగొప్పవారు వచ్చిపోతున్నారు. ఇక్కడ మాలముండోళ్ళ దాహమియ్యరు. మాకు మైలగాదూ మీకునీళ్ళోస్తే!! పందిరి తాకపోకండి అన్నాడు భీకరంగా బ్రాహ్మడు.

"గంట గంటకీ, కాఫీ టీలు సోడా లైం జూస్‌లూ,తాగుతూ కారులో కాలు కింద బెట్టిందే తడవుగా,గొడుగునీడల్ని నడచేవాళ్ళందరికీ పిలిచి బలవంతంగా దాహమిచ్చేకంటే మాబోటి నోరెండి. ప్రాణాలు పోతూన్న వాళ్ళకిస్తే మీకు యెక్కువ పుణ్యం గాదా బాబూ, గ్రుక్కెడు అంది అన్నపూర్ణ కంపిత కంఠంతో...

"నోరుముయ్యి. ఇక్కడ మాట్లాట్టానికి వీల్లేదు. మీ వంటి చండాలపాళ్ళకోసం పెట్టింది గాదిది!! అల్లా వూళ్ళోకిపొండి- పొమ్మంటే పోరేం బుద్ధిలేదూ మీకు" అని కసురుతూగద్దించాడు బ్రాహ్మడు. నిలబడ్డానికేనా వీల్లేకుండా.

మొగాన్ని అర్థణాకానంత కుంకుమబొట్టూ ఎర్రటి పట్టుచీరా చేతినిండా గాజులూ, మెళ్ళో పట్టెడు మంగళసూత్రమూ ఎత్తుపీట మీద కూర్చుని వుంది. బ్రాహ్మణముత్తైదువ చల్లని మంచినీళ్ళ గంగాళం ముందుపెట్టుకుని, అగ్రహారపు పెద్దవీధి మొదట లోగిట్లో, ప్రతియేటా వేసవికాలం నాలుగునెల్లూ, ఆయిల్లాలు తనలోగిటి మండువలో అడిగినవాళ్ళకు లేదనకుండా శుద్ధిదాహమిస్తూ వుండడం రివాజట.

ఊళ్ళోకేనావెళ్ళి తనివిదీరా దాహముత్రాగుదామనుకుంటూ పెదిమలు చప్పరించుకుంటూవచ్చి చేరుకున్నారు. యీ మొదట యింటికి అన్నపూర్ణా భాస్కరులు. వీధిగుమ్మంలో నిలబడి గుండె ఆరుకుపోయింది గ్రుక్కెడు మంచితీర్థము యిప్పించమ్మా అని కేకేశాడు భాస్కరుడు.

చెంబుతోనీళ్లూ గ్లాసూ పట్టుకుని తొందరగా ఈవలకు వచ్చింది. ఎవరుమీరు నాయనా అగ్గిగొట్టి అలసిపోయినట్టున్నారూ అంటూ ఎంతో ఆదరణగా దగ్గరికొచ్చిందాయిల్లాలు.

మంచినీళ్ళు దొరికాయిగదా అనే ఆనందంతో మాలాళ్ళము తల్లీ యిల్లాపొయ్యించండి అంది

అప్యాయంగా అన్నపూర్ణ.

ఆ మాట వినగానే చటాలున వెనక్కితగ్గి ఎవర్రా ఇంతమోసం చేశారు!! మాలచచ్చినాళ్ళమని యింయేడవొద్దూ ఇది అగ్రహారమనుకున్నారా మరోటా? ఎంత విడ్డూరమొచ్చిందర్రా పాడు కాలం పోపొండి! ఇక్కడెక్కడా నీళ్ళందొరకవు. ప్రక్కవూరికిపొండి!! అని గ్రుక్క తిప్పుకుంటూ అనేసి, చటాలున తలుపుమూసి లోనికిపోయింది నిలువునా చచ్చిపోయి ముందుకు బయలుదేరాడు. భాస్కరదంపతులు.

"ఈ వేళ పెట్టనిరోజుగాబోలు, పురిసెడి మంచినీళ్ళే కరువయ్యాయి" అంది మెల్లగా అన్నపూర్ణ. ఆ మాటలేమీనేనొప్పుకోను. పెట్టనిరోజులనీ పూర్వ కర్మ ఫలితాలనీ, యీదొంగ వేదాంతాలన్నీ మనకోసమే కల్పించారీభాగ్యవంతులంతా మన రక్తమాంసాలన్నీ బాగా పిండుకుని, మనకు మంచినీళ్ళేనా దొరక్కుండా చేస్తూన్నందుకు మనము నోరుమూసుకుని వూరుకోవడానికి!! యిల్లాంటి పిచ్చిమాటలు నమ్మబోకు అన్నపూర్ణా" అన్నాడు భాస్కరుడు.

ఇలాగే యేమోమో గొణుక్కుంటూ, మోగాలు వ్రేలవేసుకుని ఓపికి లేక వకళ్ళ చేయివకళ్ళు పట్టుకుని నడుస్తున్నారు. వేడి గాడ్పులకు ప్రతి యింటి తలుపులూ మూసివున్నాయి. ఎవ్వరినే గ్రుక్కెడు మంచినీళ్ళు అడుగుదామని మెల్లగా నడుస్తున్నారు.

మేడపై అంతస్తుమీదున్న విలాసిని, వీధంట వెళుతూన్న మాల దంపతుల్ని కిటికిగుండా చూచింది.

"ఎవ్వరో చాలా నీరసంగా గాడ్పులలోబడి నడుస్తున్నారు. పార్వతీ పరమేశ్వరుల్లాంటి దంపతుల్లాగున్నారు. ఈ రోజు అతిధి పూజాభాగ్యమన్నా మనకు దక్కుతుంది. అలా వెళ్ళి వారి సంగతి కనుక్కొని యిటు తీసుకురారా" అని చెప్పి పంపిందావిలా సిని ఎంతో జాలితో నౌఖరిని.

నౌఖరు వచ్చి సంగతంతా తెలిసికొన్నాడు. మైల మైల అని అరుచుకుంటూపరుగెత్తి యజమానికి మనవిచేశాడు. ఆ బిడ్డ మండిపడి "నేను పుట్టి బుద్ధి తెలిశాక అగ్రహారపు వీధుల్లో మాలమాదిగాళ్ళు నడపటమే నేనెరుగను పైగా మంచినీళ్ళే కావాలన్నారూ, వాళ్ళు? విపరీతంగా వుందే? ఒరే! చప్పున వెళ్ళి ఆ దేబెలను వూరిబయటకంలా తోలేసిరా" అని ఆజ్ఞాపించింది.

యమభటుడులా వచ్చిఏమండర్రో ఇది బ్యామ్మల పుట్టని తెలీదూ పోపొండర్రావలకీ దామానికీ లేదు గీమానికే లేదు" అంటూ దుడ్డుగుర్ర యిద్దరి మెడమీదా వేసి వూరి బయటకంటా నెట్టేశాడు చాకలినౌఖరు దయాదాక్షిణ్యాలు విడిచేసి!!

పడమట గాడ్పుకి కొనవూపిరితోవున్న అన్నపూర్ణ, ఈ నౌఖరి గెంటులకి మరీ అలసిపోయింది. వూరి బయట పది పన్నెండుగ బాల దాకా నడిచి, స్మృతి దప్పి పడిపోయింది. బావురు మని యేడ్చాడు, భాస్కరుడు, పాపం! యేంజేస్తాడు. మెల్లగా దగ్గరగావున్న చెట్టు దగ్గరకు చేర్చాడు అన్నపూర్ణకు.

"పూర్వమేదో మహాపట్టణం పాపభారాన్ని దగ్ధమై 'కొల్లేరై' పోయిందట అల్లాగవరాదదూ? ఈ అగ్రహారం కూడాను దేవుడనేవాడొకడుండి చూస్తూ వుంటే భగవంతుడూ భాగ్యవంతులూ ఒకటే నేమో! లేకపోతే యిల్లావూరుకుంటాడూ. ఈకటికి వాళ్ళ హృదయాల్లో గ్రుక్కెడు మంచినీళ్ళిచ్చే దయాలేశమైనా గలిగించకుండా ఏవో యిల్లాంటి వూహలతోటేకొట్టుమిట్టాడుతూ నాలు కారుకుపోయి వికారంతో భాస్కరుడున్నాడు. ఈ రెండు ప్రాణాలూ, యీ పాడు అగ్రహారపు ఆచారాలకు బలిగాబో[illegible]!!!

"ఉష్ అల్లాహో అగ్బర్" అనుకుంటూ, చేత్తో మర చెంబు పట్టుకుని వెళుతున్నాడు ఆయాసంగా సాహెబు తొందరపనిమీద; దూరాన్నుంచే చూచేడీ దృశ్యం. గబగబా చెట్టు దగ్గరకువచ్చాడు. ఏమీ భాయీ బీబీపడీ వుంది. సూర్యుడికీ దెబ్బా భలే తగిలిందాభాయ్ అంటూ చప్పున మర చెంబు మూత విప్పి గ్లాసెడు నీళ్ళు అన్నపూర్ణ మొగాన్ని గొట్టి, కొంచెం నీళ్ళు నోట్లోపోశాడు. నీళ్ళు చప్పరించి గుటక వేసి కొంచెం కళ్లు తెరిచింది. గ్లాసెడు నీళ్ళు నోటి కందించాడు. గటగటా తాగి తెప్పరిల్లింది.మిగిలిన నీళ్ళన్నీ భాస్కరుడికిచ్చాడు ఇద్దరూకొంచెం తేరుకున్నారు.

"భలే దగ్గిరా వూరూ వుండిందీ పానీకీ ఇంతా ఖట్టం ఎందుకీ భాయ్ అన్నాడు సాహెబు ప్రాణదాత.

"మేము మాలాళ్ళం, అదంతా మంచినీళ్ళయినా యివ్వని మాయసంఘం, బాబూ!" అన్నారు ఏకకంఠంగా గద్గదికతతో అన్నపూర్ణాభాస్కరులు చేతుల జోడించి.

*- గృహలక్ష్మి, మార్చి 1935*

# 4

# ధర్మతల్లి

## శ్రీమతి చుండూరి రమాదేవిగారు

ఆ గుడిసెలో కాపురముండేది నేనూ, నా అన్న వీరడూ, మాతండ్రీనూ, మా అమ్మ లేకపోవడంచేత, నేను చిన్నదాన్నవడం చేత కలిగినదాల్లోనే కాస్త గారాబంగా పెంచేవాడు మా బాబు నేను ఏటి కెళ్ళి చిన్నకడవ నెత్తిని పెట్టుకొస్తూంటేనే నెక్క డలసిపోతానో అని ఎదురొచ్చి చేతులలో కడవ అందుకొనేవాడు. నేను కంటికి ఆగపడని ఘడియ యుగంలాగుండేది. మా అన్న కూడా చెమటోడ్చి, కూలిపని చేసివచ్చి నాతో కాస్సేపు మాటలు చెప్పకుండా గంజి తాగేవాడు కాడు. యిల్లా గడిచిపోతున్నాయి రోజులు. "పిల్లలు పెద్దవాళ్ళయినారు, నా బాధ్యత తీరింది. యింకా సంసారలంపటమెందుకని కాబోలు హఠాత్తుగా కలరావచ్చి, కాలం చేశాడు మా బాబు.

నాకు పిచ్చెత్తింది. మా అన్న పనిలోకెడితే ఒక్కదానికి తోచేది కాదు. మా అన్న, నేనూఒకరికొకరు ధైర్యము చెప్పుకొంటూ కొన్నాళ్ళకు ఆ దు:ఖము మరచిపోయాం. భగవంతుడు మాత్రం మమ్మల్ని మరువలేదు.

పది రోజుల నుండి వూళ్ళో అమ్మవారు తాండవమాడుతోంది. ఊరంతా అల్లకల్లోలంగా వుంది. ఇప్పుడు చూసినవారు కాస్సేపటికి కానరావటం లేదు. చేసే జాతరలు చేస్తున్నారు. వేసే బలులు వేస్తున్నారు. పెట్టే నైవేద్యాలు యింటింటా పెడుతున్నారు. కాని ఆ తల్లికి మాత్రం అనుగ్రహం కలుగలా, మూడురోజులు యిట్లు ముమ్మరంగా వుంది. తరువాత నాలుగురోజుల్నుండి అణగిపోయింది. ఎక్కడోగాని ఆ మాట వినపడ్డం లేదు. కాని మా వంతుమిగిలి పోయిందని కాబోలు మా అన్న కుకూడా వాంతులు ప్రారంభించాయి. "పూజారి పాపయ్యగారైనా కనికరించి ఒక మాత్ర యివ్వకపోతారా" అని వెడుతున్నానన్న మాటేగాని మనస్సులో లేదు. తలవంచుకొని మా స్థితి ఆలోచించుకుంటూ వెడుతున్నా. ఇంతలో "ఛీ! మాలముండా!! కళ్ళు కనపడవా! బ్రాహ్మణవీధిలో ప్రవేశించటమే కాకుండా వెధవముండని మణ్ణీళ్ళు తెచ్చుకొంటూంటే, మీది మీది కొస్తావా! మాయదారి స్వరాజ్యం వచ్చిందని మండిపోతున్నావేం!" అనే కేకలు విని తలెత్తి చూచేటప్పటికి దూరంలో బిందెడు నీళ్ళు పారబోసి వెనకకు వెళ్లే వితంతు వగుపడ్డది.

"అయ్యో! మమ్మల్నెంతహీనంగా చూస్తున్నారు! మా కిక ఉన్నతిలేదు. కాబోలు! అని ఆలోచిస్తూ పాపయ్యగారింటికెళ్ళి ఆయనను వేడుకొంటే పదిరూపాయలు ముందిచ్చి మాట్లాడమన్నాడు. నాతలమీద పిడుగుపడ్డట్టయింది. పది రూపాయలు ఎక్కడతేను! రెక్కాడితే కాని డొక్కాడని స్థితిలో మా అన్నకూడా పడిపోయాడు. నేనా ఆడదాన్ని! డబ్బు యిచ్చుకోలేము. బాబూ! కనికరించాలని వేడుకొంటేనల్లరాయైనా కరుగుతుందిగాని పాపయ్యగారి హృదయం మాత్రం కరుగలా. ఇల్లు అమ్మేసి పది రూపాయలు తెచ్చిస్తేనే గాని మందిచ్చాడు కాడు పాపయ్యగారు. నిలువనీడలేక

చెట్లకింద ఎండనక, వాననక విలువవలసివచ్చింది. మా అన్నకు జబ్బు తగ్గితే అదే పదివేలని పించింది. ఆ మారెమ్మతల్లి దయవల్ల తగ్గుముఖం పట్టింది. పథ్యం పెట్టుటకైనా చేతుల్లో డబ్బు లేదు. ఆకలితో అల్లాడిపోతున్నాడు మా అన్న. మా అన్న జబ్బుతో నీరసించిపోయాను. నిద్రాహారాలు లేవు. మండు వేసంగిఎండ. అలవాటులేని పని. ఎక్కడైనా గుప్పెడు గింజ లడుక్కునివచ్చి గంజి కాద్దామని బయలుదేరాను. సంపన్నులంతా భోజనాలయి తలుపులు బింగించేశారు. లోకం యెల్లాపోతే వారికేం? వూరంతా తిరిగినా ఒక్క కబళమయినా దొరకలా! నాకు కూడా ఆకలి దహించుకుపోతోంది, నిల్చునే శక్తి లేదు. మా అన్నస్థితి మనస్సు కలిచేస్తోంది. నాకు కేకేసేశక్తిలేక, ఒకఅరుగుమీద కూలబడ్డాను స్మృహ తప్పింది.

కళ్ళు తెరచి చూసేటప్పటికి నా దగ్గర కూచోని ఒకపుణ్యాత్మురాలు నా నోటిలో అన్నరసం పోస్తోంది. తెప్పిరిల్లి నిర్ఘాంతపోయాను. 'అమ్మా! నేను మాలదాన్ని అన్నాను. అయితేనేమీ పిచ్చిదానా! భగవంతుడు చేసే సృష్టిలో కులభేదములన్నాయా! మనుష్యులు తెచ్చిపెట్టుకొన్నవే గాని అంటూ కళ్లు మూసుకుని కొంచెము సేపు పరుండమని హెచ్చరించింది ఆ పుణ్యాత్మురాలు. ఆమె పోసిన జావ అమృతం లాగున తాగేశాను. కొంచెం స్మృహ వచ్చి కూచోటానికి శక్తి వచ్చింది. లేచి కూర్చున్నా. ఆ బ్రాహ్మణ వితంతువు మాస్థితిని గురించి చాలాసార్లు గుచ్చి గుచ్చి అడిగింది. చెప్పక తప్పింది కాదు మన సంగతంతయు, పూసగ్రుచ్చినట్లు చెప్పేశాను. వింటున్నంతసేపు ఆమె కంటి నుండి నీళ్ళు కారుతూనే ఉన్నాయి. ఇంత చిన్నతనంలో నీకెన్నికష్టాలే అంటూ ఇంట్లో కెళ్ళి ఇంతన్నం, కూరపట్టుకొచ్చి, మీ అన్నకు పెట్టి నీ వింత తినమని ఒళ్లోవేసింది. ఆమెకు నాకృతజ్ఞత ఎట్లా చెప్పాలో దయలేదు. నమస్కారం చేసి ఆ చల్లనితల్లిని తలచుకుంటూ మా అన్నదగ్గరకు బయలుదేరాను. మా అన్నకు ఆ తల్లిపెట్టిన అన్నం పెట్టాను. కొంచెం సేదదీరిన తరువాత ఆ పుణ్యరాలి కథంతా మా అన్నకు చెప్పాను. మా అన్న ఆమె మానవ స్త్రీ కాదు. మన పాలిటి ధర్మదేవత అని చేతులు జోడించాడు. మర్నాడు ఆ తల్లి మా అన్నకు, నాకూ కొద్ది రోజుల వర ్కు సరిపోయే బియ్యం పంపించింది. మళ్ళీ మా అన్న కూలిపనిలో కెళ్లే దాకా సరిపోయినవి. ఏదోమాదిరిగా మా అన్న కూలిపని చేసుకొని తెచ్చే డబ్బు వల్ల జీవిస్తున్నాం. లోకం లో యిటువంటి ధర్మతల్లులున్నారు క్రూర జలచరములు కాకరమైనసముద్రము మౌక్తికములూ, మణులూ వున్నట్లు.

*- గృహలక్ష్మి, మార్చి 1938*

5

# ధన్యజీవులు

## శ్రీమతి ఆయపెళ్ళ రామలక్ష్మి

హరిజనులు అస్పృశ్యులు కారు. వారూ మానవులే, వారు మన సోదరులు. వారు కష్టపడి చెమటోడ్చి పండించు ధాన్యాదులు మనము తినవచ్చు. వారిచ్చు పండ్లు ఫలాదులు మనం తినవచ్చు. కాని, వారిని తాకకూడదా? అస్పృశ్యకత? ఏ కౌటిల్యము దీని నేర్పరిచింది?

శంకరం అప్పుడే కాఫీ తాగివీధిలోకి వచ్చేడు.మాల వెంకడు ఎదురుగుండా ఏడుస్తూ వచ్చి నమస్కారం జేసి,

"బాబూ, రక్షించాలి. చచ్చిపోతున్నాది బాబు" అన్నాడు. శంకరంగారు 'ఏంరా? ఏమిటి ప్రమాదం వచ్చింది? చెప్పు వేగిరంగా'

"బాబూ నా భార్యకు వారం రోజుల బట్టి జ్వరం వస్తున్నాది. గర్భిణీ బాబూ. యీరోజున ఉష్ణం హెచ్చింది. తమరొకసారి దయచేసి యీ దీనుణ్ణి రక్షించాలి,బాబూ' అన్నాడు శంకరం పాదాలమీద పడి.

శంకరం వాడిని చూడగానే అతని జాలిగుండె వెన్నవలె కరిగిపోయింది. యిక వాడి ఏడుపు వినలేక వెంకడిని లేవనెత్తి భయంలేదని చెప్పి తీసుకెళ్ళేడు.

వెంకడి సంతోషానికి మేరలేదు. శంకరం రోగిని పరీక్షించి మూడు మోతాదులిచ్చాడు. వాటి అనుపానము మున్నగునవి కూడా చెప్పి, యింక భయము లేదురా, ఒక వారం రోజులకల్లా పురుడు వస్తుంది అని చెప్పి వెళ్ళిపోయేడు. వెంకడు తన కృతజ్ఞతలను చూపుతూ నమస్కరించాడు.

శంకరం వెంకటశాస్త్రికి ఒకడేకొడుకు. బి.ఎ. పాసయ్యాడు. కాని యిప్పటికాలంలో ఉద్యోగ మెవరిస్తారు? ఏ కోమటికొట్టు దగ్గరన్నా ఉద్యోగం దొరుకుతే వారిచ్చిన పదిహేనురూపాయలకు వారు చెప్పిన పనులు చెయ్యడం, తిట్లు తన్నులు తినడం అటువంటి ఉద్యోగాలు వెయ్యడం శంకరానికిష్టం లేదు. తన పూర్వీకుల దగ్గరనుండి వస్తూన్న వైద్యం నేర్చుకున్నాడు. వెంకట శాస్త్రి పూర్వాచార పరాయణుడు. పిత్రార్జితమైన మాగాణివల్ల సాలుకి 1500 వస్తాయి. శంకరానికి మేనరికం చేశారు. గంతకు బొంతన్నట్లు సరళ శంకరానికి తగ్గా ఉంది. నవనాగరికురాలు, జాలి, దయ, ప్రపంచానుభవం కలది.

వెంకడు మాలపల్లి కంతటకు పెద్ద. ఆ మాలలందరు అతనిమాట శిరసావహిస్తారు. వెంకటశాస్త్రి గారి పొలందున్నుతూ దాని వల్ల వచ్చే ధాన్యపు గింజలవల్ల జీవిస్తున్నాడు.

శంకరం మాలపల్లికెళ్ళి వెంకడికి మందిచ్చేడన్న సంగతి ఆ మర్నాడే ఊరంతా పాక్కి పోయింది. కొందరు సనాతనులు శాస్త్రి గారిని హెచ్చరించారు. కొందరు నవనాగరికులు శంకరాన్ని పొగిడేరు.

ఆ రోజునే శాస్త్రి కొడుకును పిలిచి,

"ఏంరా? అబ్బాయీ, నువ్వు నా పరువు తీస్తున్నావు. బ్రాహ్మణీకాన్ని మంటగలుపుతున్నావు? ఆ కిరస్తానీ చదువులు చదివించననంటే మీ అమ్మ శతపోరు పెట్టింది. నువ్వు మాలపల్లి వెళ్ళటం నిజమేనా?

శంకరం : నాన్నగారూ, నేను మాలపల్లి వెళ్ళడం నిజమేను. నేనుగాని అప్పుడు వెళ్ళకపోయినట్టయితే ఆ నిండుచూలాలి గతేమి కాను? వాళ్ళనంటుతే వచ్చిన నష్టమేమిటి? వాళ్ళు మనలాంటి మానవులే. హృదయము కలిగి కూడు తిని గుడ్డ కట్టవలసినవారే. ఏ శాస్త్రములో మాలవాళ్ళు అంటరాని వారని ఉన్నదో చెప్పండి. పురాణేతిహాసములు కూడా హరిజనులు అస్పృశ్యులని చెప్పలేదు. మహారామాయణ గ్రంథం రచించిన వాల్మీకి మహాముని పంచముడు కాడా? శ్రీరామునికి తండ్రివంటివాడును, గురువును ఆగు వశిష్టుడు హరిజన స్త్రీ యైన అరుంధతిని వివాహమాడలేదా? మన మనుధర్మ శాస్త్రంలో నాలుగు వర్ణములే ఉండెడివి. కాని క్రమేపి ధనవంతులు షడ్రసోపేతంగా భుజించుచు ధనమదాంధులై, శరీర పరిశుభ్రత లేక గంజనీళ్ళు త్రాగి బతికినవారిని అస్పృశ్యులనియు, కడజాతి వారనియు అనిరి. అటువంటి వారికి సహాయము చేయుటే మనవిధి. వారిని, నీచదశ నుంచి తొలగించి వారికి కావాలసిన సౌకర్యములు ఒనగూర్చుటకు నేను కంకణము గట్టుకొంటిని.

శాస్త్రి : శంకరం! యిదే నీకు ఆఖరుసారి చెప్పటం. ఆ మాలలను మనమంటరాదు. అవి మన పూర్వీకులు చెప్పిన వాక్యములు. వాటిని మనం అక్షరాలా జరిపించి తీరవలయును. నువ్వు యిక ఆ వ్యాకరణమును కట్టిపెట్టు. అట్లు కాని యెడల నిన్ను నా యింట్లో వుంచకపోవడమే కాకుండా నా ఆస్తిలో వీసమంతయినా నీకు చెందనివ్వను.

శంకరం : నాన్నగారూ, మీ ఆస్తి, యిల్లు నాకవసరం లేదు. నాకు నా సోదరులే ఆస్తి. వారిల్లు పాకయే నాకు యిల్లు. వారు కష్టపడి చెమటోడ్చి పండించు ధాన్యాదులు మనము తినవచ్చు. వారిచ్చుపండ్లు ఫలాదులు మనం తినవచ్చు. కాని, వారిని తాకకూడదా మీరు నన్ను యీ విషయంలో క్షమించాలి యిప్పుడే మీ యిల్లువిడిచిపోతున్నాను అంటూ శంకరం తండ్రికి నమస్కరించి తల్లిదగ్గరకు వెళ్లేడు.

వెంకట శాస్త్రి పండ్లు పటపట కొరుకుతూ దుర్మార్గుడా! తండ్రిమాట విననివాడు కొడుకా యీ క్షణమందే, నా కీజన్మలో నీ మొగము కనపర్చకుండా, పో అని గర్జించెను.

శంకరం, తల్లి వారిస్తున్నా గాని వినకుండా బయలుదేరేడు. సరళ కూడా వెళ్ళటానికి సిద్ధమయింది. అత్తగారు ఆమె చెయ్యి పట్టుకొని వెళ్ల వద్దని చెప్పింది. కాని సరళ అత్తగారూ, నాకుదేవుడైన నా భర్త విడిచి నేనుండలేను. నా పతిచరణములే నాకు గతి అని నమస్కారముచేసి పట్టు విడిపించుకొని తన భర్త వెనకాల బయలుదేరింది. శంకరం తిన్నగా మాలపల్లెవైపు వెళ్లేడు. యీ సంగతి మాల పల్లకి తెలిసింది. అందరూ తలోకర్ర పట్టుకొని బ్రాహ్మణవీధి వస్తుండగా, శంకరం వారిని శాంతివచనాలతో, తిరిగి పంపించాడు.

శంకరాన్ని,అతనిభార్య సరళని మాలజనమంతా తమ పల్లెకు తీసుకొనివెళ్ళారు. అందరూ పళ్ళు, ఫలములూ, పాలువారు వద్దనిననుతెచ్చి యిచ్చేరు. ఆ మర్నాడే ఆ ఆనంద దంపతులకు అచ్చట ఒక పాక వేయబడినది. శంకరం తన కుటీరం ప్రక్కనే మరొక పాక వేయించి ఒక బడి స్థాపించాడు.దానిలో స్త్రీ బాల వృద్ధులు కూడా ప్రవేశించారు. శంకరం వారందరకూ ఆరోగ్యవిధులు

గురించి, గాంధీ మహాత్ముని తత్వోపదేశము గురించి ఉపన్యాసాలిస్తూ ఉండేవాడు. అచ్చట కొన్ని రాట్నాలుపెట్టేడు. స్త్రీలు వృద్ధులు నూలు వడుకుతూ కాలక్షేపం చేసేవారు. బాలురు వ్యాయామ పరిస్థితులయందు చదువుయందు, కాలక్షేపం చేసేవారు. సరళ స్త్రీలకు గృహాలంకారముగురించి చెప్పి వారి వారి గృహములను పరిశుభ్రముగను, ఆరోగ్యవంతముగాను, తయారుచేయించింది. వారికి శిశుపోషణ గురించి చెప్పింది. శంకరం మాలపల్లినంతటను శుభ్రంగా చేయించాడు. వారిచే కల్లు మాన్పించాడు. వెంకడు తనకు కలిగిన కొడుకును శంకరయ్య అని పిలిచేవాడు.

వెంకటశాస్త్రి, శంకరం వెళ్ళిపోయిన దగ్గరనుంచీ, నీరసించిపోయేడు. క్రమేపి అది జబ్బులోకి దించింది. మంచం పట్టిపోయేడు. తన మూర్ఖపు పట్టుదల వదిలేసుకున్నాడు. శంకరాన్ని పిలిపించి దగ్గరగా తీసుకుని నాయనా, ఆఖరికి నీ పంతమే నిల్చింది. హరిజనులు అస్పృశ్యులవు కారు. వారూ మానవులే, వారు మనసోదరులు. ఏ శాస్త్రములో చూచినా హరిజనులు అస్పృశ్యులు కారనే చెప్పబడ్డది. మొదట అది గ్రహించుకోలేకపోయాను. హరిజనులకు తగిన సేవచేస్తూ హాయిగా కాలక్షేపం చెయ్యి అని వెంకట శాస్త్రి చెప్పి, తన ప్రాణాలను అనంత వాయువుల్లో ఐక్యము చేసేడు.

శంకరం తండ్రికి చేయవలసిన యథాక్రియలు నెరవేర్చడు. తనకు సాలీనా వచ్చే ధనములో కొంత ఖర్చు పెట్టి హరిజన సంఘమును స్థాపించేడు. తన యింటి కెదురుగా ఒక చావిడి కట్టించాడు. దానిలో రాట్నముల మీద నూలు వడికించేవాడు. తన భూములలోప్రత్తి వేయించేవాడు. యిప్పుడు ఏ మాలను చూచినా శుభ్రముగను ఖద్దరు కట్టినవాడై కనుపిస్తాడు. ఆ ధన్యజీవులు ఆగ్రామంలోనే కాకుండా ఆ చుట్టుపక్కల గ్రామాల్లోను హరిజనులకు రైతులకు ఆదర్శప్రాయులైనారు. శంకరం రైతుల బాధలను కూడానివారణ చేసేవాడు. ఏకలహమొచ్చినా శంకరమే తీర్పు చెప్పాలి. ఎవరికే జబ్బు వచ్చినా శంకరమే మందు యిచ్చే వాడు. ఆ వూళ్ళోవున్న కొందరు సనాతనలు శంకరాన్ని అతని కుటుంబమును వెలివేశామన్నారు. కాని శంకరం సరళ వారి మాటలకు జడియక తమ జీవితాల్ని తమ సోదరుల సేవ క్రింద వ్యయపరుస్తూ ధన్యజీవులయ్యారు.

*- గృహలక్ష్మి, అక్టోబర్, 1941*

# మాదిగ పల్లె

## శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

ఎవరోయ్ మాదిగలూ?'

తమ రెవరు బాబయ్యా?'

' మేము బ్రాహ్మలం'

ఈ మాటవిని అతను వులిక్కిపడి, లేచి, రెండడుగులు ముందుకు వచ్చాడు. పాగా తీసి మెడకి చుట్టుకుని .వినయం కనవరునట్తా నమస్కారం కూడా చేశాడు. వయస్సు యాభైయేళ్లుంటాయి. కారునలుపే గాని మొగుమ్మీద కళ వున్నది. నుదురు కొంచెం ఆలోచనాపరుడనీ, సూటిగా వెడతాడనీ చెబుతోంది.

'అయితే అలా వెళ్లండి దొరగారూ! ఇది మాదిగపల్లి. లేకపోతే, తమకెవరు కావాలో చెబితే ఆ గానుగు చెట్టు కింద నుంచోండి దొరగారూ, నేను తీసుకువస్తాను.'

'నేను మీ అందరికోసమూ వచ్చిను. ఇది మాదిగపల్లి అని నాకు తెలుసు. మీయిళ్ల మధ్య కాపురం చెయ్యడానికి వస్తున్నాను నేను'.

'మా లచ్చన్న కొంప బేరమాడుతున్నవారు తమరేనా బాబయ్యా'

'అవునోయ్!'

'తమకెందుకూ పంతులుగారూ అదీ?'

'చెప్పాను కదూ?'

'తమరు సెలవిచ్చేదంతా విడ్డూరంగా వుంది దేవరా! తమ వంటి ప్రభువులు మాదిగల మధ్య కాపరం...'

'అవును. అందుకోసమే ఆ యిల్లు బేరమాడుతున్నాను. మీతో వెళాకోళాలాడడం లేదు నేను'

'నమ్మలేకుండా వున్నాను బాబయ్యా.'

'చూస్తావు కదూ?'

'అయితే, ముందు ఇలా వచ్చి అరుగుమీద కూచోండి బాబయ్యా.'

'పద'

నేనతని వెనకాలే వెళ్లాను. అతను లోపలికి వెళ్లి చీపురు తెచ్చి, అరుగుతుడిచి 'దయ చెయ్యండి

దేవరా' అన్నాడు. మేము వాడుకుంటూవున్న చాప తమకి వెయ్యలేను. కిందే కూచోమనవలసి వచ్చింది. కోపం వద్దు బాబయ్యా అని చేతులు జోడించుకుని ప్రార్థించాడు.

'మీలో కాపరం చేశాటప్పుడు మీ చాపలు పనికి రాకపోవడం యేమిటోయ్? కాకపోయినా, అరుగు చక్కగా తుడిచావు. మరి చాపెందుకూ?'

నేను కూచుని, అతన్ని కూడా పక్కని కూచోమన్నాను, కాని యెన్ని విధాల చెప్పినా కూచోక పోవడమే కాకుండా, ఎదురుగా చేతులు కట్టుకుని కింద నుంచున్నాడు.

వూళ్లో వారంతా తమర్ని వెలిపెట్టరా యేమిటి పంతులు గారు?'

'ఈ కాలంలో వెలి యేమిటోయ్? అందులోనూ రాజమండ్రి వంటి పట్నంలో కూడానా?'

'తమకిక్కడ పనేమిటండి?'

'మీకు సేవ చెయ్యడం'

అతనిది వినిగతుక్కుమన్నాడు.

'మీతో పాటు కష్టమూ సుఖమూ అనుభవిస్తూ చివరికి మిమ్మల్ని పెద్దకులాల వారితో సరిసమాన స్థితికి తీసుకువెళ్లడం'

'ముందు తమరు మాదిగలయి పోరండీ?'

'లా అయితేనే నేను తలుచుకున్న పని చెయ్యగలుగుతా. కాకపోయినా, మాదిగలేం పుచ్చిపోయారా? అదీకాక బురదలో కూరుకుపోయిన వాణ్ణి పైకి తియ్యాలంటే తీసేవాడు కూడా ముందు బురదలో దిగవద్దుటోయ్?'

'ఎవరిచ్చారండి తమ కీ వుద్యోగం?'

'ఎవరూ యివ్వలేదు. ఒకరిచ్చేది కూడా కాదిది. ఇలాంటి ఉద్యోగం యిచ్చే వారున్నూలేరు. అసలిది ఉద్యోగమే కాదు.

అతనికి బోధపడలేదు. మాట్టాడలేకపోయాడు.'

'ఇది నేను సొంతంగా కల్పించుకొన్నది. సొంతంగా ప్రవేశించింది. ఈశ్వరుణ్ణి ప్రార్థించి, బాగా ప్రార్థించుకోగానేను చెయ్యవలసిన పని యిదే అని తేలింది.

'దీనివల్ల తమకి లాభమేమిటండి?''

'ఫాదరీల కేం లాభం కలుగుతోంది?'

'ఫాదరీల మాట కేం లెండి. బేధాలు లేని జాతి వారిది. కనికరంగల మనుషులు వారు.'

'మనం కూడా భేదాలు తీసేసుకుందం. ఇక కనికరమా? బాగా చూస్తే అది లేని మనిషి లేడు. అయితే, అది కొందరిలో యెక్కువా, కొందరిలో తక్కువా వుంటుంది. ఎక్కువగానే వున్నవారు కూడా కొందరు, కొన్ని కారణాల వల్ల యితర్లకి లొంగిపోయిన రాక్షసులయిపోతారు. కాకపోయినా, దొరలలో మాత్రం అందరూ కనికరం వున్నవారే వుంటారా? ఫాదరీలు మాత్రం ఆకాశం నుంచి వూడిపడ్డారా?'

'కులాన్నిటిలోకి తక్కువదీ మాకులం, మమ్మెల్నెవరు కలుపుకుంటారు దేవరా?'

నే నెలా వస్తున్నానూ మీ లోకీ?

'కోటి కొక్కరు-'

'కొన్నాళ్లకి పది మంది. విన్నావా? తరువాత వంద రెండు వందలు -

'ఎన్ని యుగాలకి అందరూ యేకమవుతారు బాబయ్యా?'

'భేదం యెన్నాళ్ల నుంచి వుందో చెప్పగలవా?'

'అబ్బో! వోరి నాయన ప్రపంచకం పుట్టినప్పణ్ణుంచీ -

'తప్పు. తప్పు అది నిజం కాదు. ఈ భేదం తరవాత వచ్చివుందిగాని అదిలో లేదు. అయినా, ఇప్పుడు, మళ్లీ మార్పు ప్రారంభం అవుతోంది. దీనివల్ల కలిగే మొదటి లాభమేమిటంటే? భేదానికిక దిగతీతే గాని బిగతీత వుండదు'

నాకేసి చూస్తూనే వొక్క క్షణంఆలోచించాడు.

'తమ దగ్గిర డబ్బే మాత్రం వుందండీ?'

'ఏమాత్రం కావాలంటావ్?'

వొక్క క్షణం పైకి చూశాడు. ఒక మాటు నాకేసి బాగా పరకాయించి చూశాడు.

'బాగా ఆలోచించే చెప్పు'

'ఆలోచిస్తే డబ్బుక్కర్లేదండీ'

'ఇంకేం మరీ? అసలు నాకు మాన్యాల మీద వచ్చే శిస్తు నా కుంటుంబానికే కటాకటీగా సరిపోతుంది. కనుక, మీ కోసం మనేనే మీ డబ్బు ఖర్చుపెట్టేలేను. పైగా, మీ పేరు చెప్పి నేను చందాలు వసూలు చెయ్యను. మీలోనే ఆవేదన కలిగిస్తాను. మీ కులాన్ని మీ చేతులతోనే వుద్ధరింపచేస్తాను. నేను సలహాలు మాత్రమే చెబుతూ వుంటాను. మీ రెక్కల కష్టం తోటే మిమ్మల్ని బాగుచేస్తాను.'

నా మాటలు అతనికి నచ్చినట్టులేదు.

'కొండకీ తల వెండ్రుకలూ ముడి పెడుతున్నారండి.

'నువ్వు సరిగా చెప్పావు. ఏమీ తేడా లేదు వస్తుందా? కొండకదిలి చక్కా వస్తుంది. లేదూ? నాకు వుత్సాహభంగమే.

కాని మీదే మీ పోదు; కాని మీరు కొంచెం వోపికపడితే రెండేళ్లలోనే మీలోగొప్ప మార్పుచూపిస్తాను.

'అయితే నన్నిప్పుడేం చెయ్యమంటారండీ?'

'నేను, ముందు, మీ కులపెద్దలందరితోటి మాట్టాడాలి.. అందర్నీ వొకచోట చేర్చగలవా?'

'దయ చెయ్యండి దొరగారూ'

ఇలా అంటూ పాపన్న, నన్ను, మాదిగపల్లి మధ్యకి తీసుకువెళ్లి రావిచెట్టు అరుగుమీద కూచోపెట్టి, తాను కులపెద్దల కోసం వెళ్ళాడు.

ధోరణి చూడగా మాదిగల బాగును గురించి యిది వరకేఅతను బాగా మథన పడుతూవున్నట్టుంది. 'ఇదీ మనకి మంచిదే' అనుకుంటూ నేను అరుగుమీద చతికిలపడ్డాను.

# 2

ఊహ తెలిసినప్పణ్ణుంచీ యీ భేదాలంటే యెలాగో వుండేది నాకు, కానైతే, నాకు శాస్త్రజ్ఞానంకాని, లోకానుభవం కాని వుందని కాదు; కాని, వొకణ్ణి ముట్టుకో గూడదన్నా, వొకడి దగ్గరికి వెళ్లగూడదన్నా 'ఏం?' అనిపించేది.

చిన్నప్పుడు, మావూళ్లో, నేనూ వొక రాజులపిల్లాడూ జతగా వుండేవాళ్లం. నాలుగోతరగతి దాకా యిద్దరమూ కలిసి చదువుకున్నాము. పాఠశాల లేనప్పుడు అతనూ నేనూ మా యింటోనో, వాళ్ల యింటోనో వుండే వాళ్లం. అతను భోజనం చేశాటప్పుడు, నేను, అతని యెదుట, వాళ్ల అమ్మగారు వేసిన పీట మీద కూచుని కబుర్లు చెబుతూ వుండేవాణ్ణి, కాని నేను భోజనం చేశాటప్పుడు, మా వాళ్లు, అతణ్ణి నా యెదుటికి రానిచ్చేవారు కారు. ఏం? అంటే అతను రాజుల పిల్లాడు. వారు మనకంటే తక్కువ. అన్ని కులాల్లోనూ మనదే గొప్పది. మనం అన్నం తినేటప్పుడు ఇతరకులాల వారెవరూ చూడగూడదు' అనే వారు 'ఏం?'... చూస్తే యేం?'

ఈ సందేహం తీరేది కాదు.

ఒకనాడు నేనూ, మా చెల్లాయి మాయింటో నట్టివాకిట్లో చద్దన్నం తింటున్నాము. చివర మా అమ్మ మా యిద్దరికీ మీగడ పెరుగు వడ్డించింది. మే మిద్దరమూ చెరో ముద్దానోట్లో పెట్టుకున్నాము.

అంతే,

సరిగా ఆ సమయంలో 'ముక్కుపుడకలు తయారయినాయండి' అని చెబుతూ రామలింగాచార్యులు తలుపులు తోసుకుని హాల్లోకి వచ్చి, అంతట్లో మమ్మల్ని చూసి, నాలిక కరుచుకుంటూ వెనక్కి చక్కాపోయాడు.

మా చెల్లాయి 'యిక నవ్వు ఆ అన్నం తినకూడ'దంది. మా అమ్మలేచివెళ్లి చెయ్యి కడుక్కురా. మరో కంచెంలో మళ్లీ అన్నంపెట్టి పెరుగుపోస్తా'నంది. కాని నేను లేవలేదు. పైగా మరో ముద్దతీసి గభీమని నోట పెట్టుకుని, మూడో ముద్దచేత పుచ్చుకున్నాను. ఆ పళంగా, మా అమ్మ, నా చెయ్యిపట్టుకుని లేవదీసుకుపోయి, చేతిలో వున్న అన్నం బలవంతాన పారేయించి, చెయ్యీ మూతీ కడిగేసింది. దాని మీద నేను కాస్సేపు గంతులు వేశాను, కాని లాభం లేకపోయింది.

అయితే నేను మొదటి కంచం దగ్గిర వుత్తరాపోశనమూ పట్టలేదు. రెండో కంచం దగ్గిర పరిషేచనమూ చెయ్యలేదు. ఆ అన్నమే గబగబ తినెయ్యాలనుకుంటూ వున్న నాకు అది తినకుండా చేయాలనివున్నమా అమ్మకీ కూడా యీ విషయం తోచలేదు. విశ్వబ్రాహ్మణుడు చూసిన అన్నం పారేసింది. ఇది మా అమ్మకి తృప్తి. భోజనం కాగానే నేను రాజుల యింటికి వెళ్లిపోయాను. ఇది నాకు తృప్తి.

మా చెల్లాయి మాత్రం రామలింగాచార్యులు చూసిన అన్నమే పూర్తిగా తినేసింది. మా అమ్మ దాన్నేమీ అనలేదు.

ఏం?

అప్పటికీ యిప్పటికీ కూడా యీ భేదకారణంనాకు భోధపడలేదు.

వైష్ణవులూ, వైఖానసులూ, విశ్వబ్రాహ్మలూ, మరి కొందరూ కూడా, యితర్లు చూస్తూ వుండగా భోజనాలు చెయ్యరు. చివరికి, వారు చంటిపిల్లలకు పెట్టే గోరుముద్దలు కూడా యెవరూ

చూడకుండానే జాగ్రత్త పడతారు. కాని ఎవరో ముసలిముత్తయిదువులూ, వితంతువులూ తప్ప తక్కిన స్త్రీలందరూ చాకళ్ళూ, మంగళ్లూ ఇంట్లో పనిచేసే దాసీలు చూస్తూవుండగా భోజనం చెయ్యడానికి ఒక్కక్కప్పుడు సందేహించరు. ఆ స్త్రీలు చేసిన వంటలు సోమయాజుల వార్లు కూడా లొట్టలు వేసుకుంటూ పీకల మొయ్యా అరగిస్తారు. ఎవరూ అక్షేపించరు.

ఏం?

ఇలాంటి సందేహాలతో నేను పెరిగి పెద్దనయినాను.

కాకినాడ కాలేజీ, హైస్కూలులోనేను, ఫోర్తు ఫారంలో చేరిన మొదటి రోజున వొక మాదిగ పిల్లవాడు వచ్చినా పక్కనేకూచున్నాడు. అతను ఫలానా అని తెలిసినప్పుడు నాకేమీ కంగారెత్తలేదు, కాని కొంచెం యెబ్బెట్టుగా మాత్రం వుంది. తరువాత వొక్కవారం గడిచాటప్పటికి అతనికీ నాకు స్నేహం కలిగింది. కానైతే అతని యింటికి నేను గాని, నాబసకి అతను గాని యెప్పుడూ వెళ్లడమూ రావడమూ జరగలేదు. స్కూలులో వున్నంతసేపూ మాత్రం వొకళ్లని విడిచి వొకళ్లం వుండలేకపోయేవాళ్ళం. ఇది చూసి బ్రాహ్మణ కుర్రాళ్లు కొందరు, నన్ను పులిని చూసినట్టు చూసేవారు. కొందరు మేష్టారుతో చెబుతావుండు' అనేవారు. అయితే యే మేష్టారూ, యెప్పుడూ నన్ను, సంగతేమిటని అడగలేదూ అతనితో కలిసి మెలిసి వుండవద్దని కూకలుపెట్టలేదూ.

# 3

నేనింటర్మీడియెటులో ప్రవేశించిన సంవత్సరమే నాకు పెళ్లయింది.

అప్పటికప్పుడే నాకు, అస్పృశ్యత అమానుషమనే భావం స్థిరపడిపోయి వుంది. సంస్కారం వేపుకి హృదయం పూర్తిగా మొగ్గిపోయి వుంది.

అంచేత అదివరకి పెళ్లిమాట జ్ఞాపకం వచ్చేటప్పటికి, ఏ సోమయాజులు గారి కూతురు సిద్ధపడుతోందో బాబూ అంటూ భయపడేవాణ్ణి. అయితే, చివరికి, నా భయానికి తగినట్టునొక చయనులు గారి కూతురే, నాకు తటస్థపడింది, గాని నా అదృష్టవశం వల్ల ఆమెపుట్టింట, మహేంద్రవాడలో కాక, అమ్మమ్మ దగ్గిర, రామచంద్రాపురంలో పెరిగింది, పెళ్లి అయిన సంవత్సరం దాకా - అంటే పదమూడో యేడు వెళ్లేదాకా ఆమె మిషను వారి బాలికా పాఠశాలలో కిరస్తానీ పంతులమ్మల దగ్గిర, మాల మాదిగవగైరా అన్ని కులాల పిల్లల తోటి కూచుని చదివింది. కాని సెకండు ఫారంలో ప్రవేశించిన మూడు మాసాలికి, అమ్మమ్మ చనిపోగా ఆమె మహేంద్రవాడలో ప్రవేశించింది.

ఆ వయస్సులోనూ, ఆ పరిస్థితుల్లోనూ ఆమె మహేంద్రవాడలో ప్రవేశించడం నాకు చాలా వుపయోగించింది. ఎలాగంటే? తండ్రి నిత్యాగ్ని హోత్రి అన్నలందరూ స్వాధ్యాయవేత్తలు పైగా మా మామగారు సభాపతి. అసలు మహేంద్రవాడ అంటే యెనబయిళ్ల వెల్లానటి అగ్రహారం. వారంతా అచ్చాడీలు, నిప్పు కడిగే రకం. వారిలో చాలా మంది శూద్రులు యింటి మజ్జిగ కొనుక్కుంటారు. గాని పసుపు నీళ్లు చల్లకుండా వాడుకోరు దీనికి సాయం సవితి తల్లి, ఆమెకి యెడబిడ్డా, చంటి బిడ్డానూ.

ఒక మూల చాకిరీ చెయ్యలేకా, మరో మూల ఆచారం చెయ్యలేకా, అన్నింటికీ మూలం, సవతి తల్లి యీసడింపులు సహించలేకా ఆమె అత్తవారింటికెప్పుడు వెళ్లిపోతాను దేవుడా అని

పరితపించిపోయింది.

మా యింటో కూడా కొంచెం అచారబాధవుండినా, మా యిద్దరి ప్రవృత్తి వొకటి కావడం వల్లా, మా యిద్దరికీ సంబంధించినంత వరకూ యే చాదస్తాలూ లేకపోవడం వల్లా పైగా నాకోసం పరితపించిపోయి వుంది కనకనూ ఆమెనేను గీసిన గీటు దాటకుండా నా కనుసన్నలలో మెలగజొచ్చింది.

తొలిమాటు కాపరానికి వచ్చిన రెణ్ణెల్లకి, సంకురాత్రి పండుగకు పుట్టించికి వెళ్లమని ఆమెని గెంటవలసి వచ్చింది. కాపరానికి వచ్చిన రెండేళ్లకి ఆమెగర్భవతి అయింది. పుట్టింటివారు అయిదో మాసంలో గాజులు పెట్టించారు. అది జరిగి నాలుగు రోజులకి ఆమెను తీసుకుని నేను రాజమహేంద్రవరం బయలుదేరాను.

అప్పుడు నేను బి.ఏ. సీనియరు క్లాసు రాజమండ్రీలో చదువుతున్నాను.

అది నడి వర్షాకాలం ఈ యింటి మీది కాకి ఆ యింటి మీద వాలడం లేదు.

రాయవరం మీదుగా మాచవరం వెళ్లి అక్కడ బస్సు అందుకోవాలి రెండెడ్లబండి యెక్కిమేమిద్దరమూ బయలు దేరాము.

మహేంద్రవాడకీ రాయవరానికీ మధ్య రోడ్డుంది. కాని అప్పటికింకా అది కంకరమొగం యెరుగదు. చక్రాలు, కుచాలదాకా దిగిపోతున్నాయి. పర్వతాల్లాంటి యెడ్లు రెండూ వైతరణిలో యీదుతున్నట్టుంది.

బయలుదేరిన రెండు గంటలికి మా బండి తోట దాటింది. అడ్డుపుంతలోకి వచ్చాం.

ఇంకేం చెప్పను? తలుచుకుంటే యిప్పటికీ వొళ్లు జలదరిస్తోంది. ! రామారావు ! పాతిక సంవత్సరాల మాదిగ స్త్రీ అప్పటికీ ఆమె యెనిమిదో మాసం గర్భవతి కూడా నాలుగేళ్ల పిల్ల. పిల్లకి జ్వరం మందుకోసం అస్పత్రికి వెడుతోంది. ఊరికే నడవలేని స్థితిలో పిల్లని యెత్తుకోవడం.

నేనే అనుకుంటే నా భార్య కూడా ఆమె స్థితి చూడలేక పోయింది. స్వయంగా కూడా గర్భవతి కనుక ఆమె మరీ బాధపడి పోయింది.

నా భార్య హృదయం దూసుకుపోయేటట్టు నాకేసి తీవ్రంగా చూసింది. నేను ఆ చూపులు ఆదరంతో స్వీకరించాను.

వెంటనే నా భార్య ఆమెని బండెక్కమని పిలిచింది. నేను చెయ్యి పట్టుకునిఆమెని యెక్కించి పిల్లని అందించాను. పైగా యెడ్లను, మరింత బాధపెట్టవలసి వస్తుందని నేను నడక ప్రారంభించాను.

అయ్యా, ఆ మాదిగ స్త్రీ సంతోషం యేమి చెప్పను?

(దొరికిన కథను ప్రచురించాను)

6

# కయ్యి- కాలువ

## కరుణకుమార

లక్ష్మమ్మ గొప్ప అదృష్టజాతకురాలు. పాకనాటి కాపుకులంలో పుట్టింది. మల్లా అవసర మహాలక్ష్మి. పూర్వ జన్మంలో ఇంత పెట్టి పుట్టిందేమో, ఈ జన్మంలో భోగం అనుభవిస్తోంది.

లక్ష్మమ్మ పుట్టింటివారిది చాలా గట్టి సంసారం. మొగ పిల్ల కాయలు లేనందువల్ల లక్ష్మమ్మకూ, ఆవిడ అక్కకూ, ఒక వూళ్ళోనే మనువులు కుదిర్చి తండ్రి ఇద్దరికీ చెరి ముప్ఫయి వేల రూపాయల ఆస్తి ఇచ్చి మహావైభవంతో వివాహం చేసి, వాళ్ళను కాపరానికి పంపేడు. కాని కాపరానికి వెళ్లిన మరుసటి సంవత్సరమే లక్ష్మమ్మ భర్త కాలం చేసినందువల్ల అప్పటి నుంచి ఇప్పటివరకూ ఆవిడ నిరంకుశమైన వైధవ్యాన్ని అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తోంది. ఇదొక్కటే ఆవిడకుకొరక పెట్టాడు భగవంతుడు. ఇది మినహా ఆవిడ సంసారానికి ఏమీ కొఱతలేదు.

అటు పుట్టింటవారి వల్ల దఖలుపడ్డ ముప్ఫయివేల రూపాయల ఆస్తి, యిటు ఆ తింటివారివల్ల లభ్యపడ్డ ఏభై వేల రూపాయల ఆస్తి కలిసి, భర్త చనిపోయేటప్పటికి ఓ 80, 90 వేల రూపాయల ఆస్తికి లక్ష్మమ్మ హక్కుదారయింది. చనిపోయేముందుమంచం మీద ఇంకా తెలివుండగానే భర్త సినలైన వీలునామా వ్రాసి ఏభై ఎకరాల మాగాణీ, డెబ్భై ఎకరాల మెట్టా, మామిడితోటా, నాలుగెకరాల పాటి మట్టిదొడ్డీ, పశువుల బీళ్ళూ, పది అంకణాల మిద్దీ, ఇన్ని పాడిపశువులూ, నాలుగువందల సన్నజీవాలూ ఒకటేమిటి, ఒకరి దగ్గరకు పోనక్కరలేకుండా అమర్చి పెట్టినట్టు ఇనప్పెట్టి బీగాలతో సహా చేతిలో పెట్టి "నేనులేనన్నకొరత తప్ప యిక నీ కేమి లోపం లేదు. ఇంట్లో తల అట్లా వీధిలో పెట్టుకోకుండా ఈ యావదాస్తీ నువ్వు అనుభవించుకొని జీవించు' ' అని అంత్యకాలాన ఆశీర్వదిస్తూ ఆవిడ భర్త అదృశ్యమైనాడు.

లక్ష్మమ్మది మొదటి నుంచి గట్టి పిడికిలి. పొలంలో పండిన అరవై పుట్ల ధాన్యం లగాయతు దొడ్లో పశువులువేసే పేడవరకూ సమస్తమూ ఆమె రొఖ్ఖరూపంగా మార్చి వృద్ధి చేసిన సంసారం అది. రాగులు,సజ్జలు, జొన్నలు, మిరపకాయలు, చింతపండు, మామిడికాయలు, టెంకాయలు, టెంకాయపీచు, తాటికాయలు,తాటాకు, తాటిబుర్రల,పాలు, పెరుగు, వెన్న, నెయ్యి ఒకటేమిటి, పాటిమట్టి, ఎరువుమట్టి, దూడా దుడుకూ సమస్తమూ రొఖ్ఖంగామార్చి చేతపట్టుకొనే అలవాటు లక్ష్మమ్మకు. అందువల్ల భూములు,దొడ్లు, బంగారునగరలు, వెండి సామానులువగైరాల అడుమానం మీద ఇచ్చిన అప్పు పత్రాల మీదా, ప్రోనోట్ల మీదా సాలీనా వచ్చే నాలుగువేల రూపాయల నికరం వడ్డీకి తోడు, ఈ విధంగా కూడా ఎట్లాగన్నా సంవత్సరానికి ఇంకా, 6వేల రూపాయల మట్టి ఆదాయం చేరుస్తూ ఆమె ఈ ముప్ఫై ఏళ్ళుగా తన ఆస్తిని రెండు లక్షలకు పైగా పెంచింది.

లక్ష్మమ్మ తోడపుట్టినపడుచు కాపరం అంత నాదారుస్థితికాదు కాని లక్ష్మమ్మస్థితితో

పోల్చుకుంటే వాళ్ళ స్థితిధూపానికి ఆగదు. అయినప్పటికీ ఆవిడ అక్కకి ఒక కొడుకూ, ఒకకూతురూ కలిగి యింత సిరీసంపదతోనే కాలక్షేపం చేస్తున్నారు వాళ్ళు. లక్ష్మమ్మ అక్క కొడుకురామిరెడ్డికి ఇప్పుడు ముప్పయి సంవత్సరాల వయసున్న వచ్చి పెళ్ళి చేసుకుని తన ఇల్లు తానుచక్కపెట్టుకొంటున్నాడు. లక్ష్మమ్మకు 'నా' అన్నవాళ్ళు ఎవరూ లేనందున,తన సేద్యం మంచి సెబ్బరలు విచారించడానికి ఇంట్లోతన కింత లెక్కా డొక్కా వ్రాయడానికి రామిరెడ్డి కాస్త చేతి కందివచ్చినప్పటినుంచీ లక్ష్మమ్మ అతగాడినే రప్పించుకుని తన పనులు నెరవేర్చుకొంటూ ఉంది. మొగదిక్కులేని సంసారం అయినందువల్లా,ఈ తనువులు శాశ్వతం గానందువల్లా, తలలో నాలుకలా నమ్మకంతో అంటిపెట్టుకొని వుంటే లక్ష్మమ్మ ఎప్పటికైనా తనయావదాస్తినీ అక్కచెల్లెండ్రిద్దరి సంసారాలకీ ఒక్కడే మొగపురుగు అయిన తనకు సంక్రమింపచేయకపోతుందా అని రామిరెడ్డి కొండంత ఆశ పెట్టుకొని వున్నాడు. అందువల్ల లక్ష్మమ్మకు చీమకాటంత బాధ కలిగిందంటే తనకు లోకమే మునిగిపోయినట్లుగా భావించుకొని, గుండెలు గవుక్కొంటూ పరుగెత్తి ముందు తన పిన తల్లికిసేవేసి ఆవిడ మెప్పు పొందుతూ వస్తున్నాడు రామిరెడ్డి.

లక్ష్మమ్మకు ఇప్పుడు ఏభైయోపడి దాటి అరవైలో పడింది. రామిరెడ్డికి నోరు ఊటలూరుతోంది; లొట్టలు వేస్తున్నాడు; సమయం కొరకు కాచుకొని ఒక ధ్యానం చేస్తూ వున్నాడు రామిరెడ్డి.

## 2

కొండడు మాలవాడు. అనగా పంచముడు పోనీ, హరిజనుడనే అందాం. గోచీపెట్టుకొనే ఈడులో కొండడు లక్ష్మమ్మకాడనే బర్రెగొడ్లు కాస్తూ వచ్చినప్పటికీ వాడికి ఈడువచ్చి పెళ్ళిచేసుకొని, భార్య కాపరానికి వచ్చిన తర్వాత, వాడు లక్ష్మమ్మను వదలి యిప్పటికి పదేళ్ళుగా తన రెక్కల మీదనే ఆధారపడి, యింట్లో భార్యనీ, డైబ్భైఏళ్ళ ముసలితొక్కు తల్లి వెంకినీ పోషించుకొంటున్నాడు.

ఏ ఆసామినో, ఆశ్రయించుకొని,ఎవరి కమతంలోనో అంటిపెట్టుకొని, సంవత్సరం జీతం మీద కాలం గడుపుకొంటూవుంటే తీరేపోను కొండడికి, కాన మునూట అరవై నాలుగు రోజులూ రాత్రింబగళ్ళు చెమట ఊడ్చి చాకిరీ చేసినప్పటికీ, సంవత్సరానికి ఏ పందుం, పన్నిద్దుం గింజలోకాని, జీతంరాలని నౌకరీ అవడం వల్ల కడుపునిండక సంసారాన్ని పోషించుకోలేక వెతలుపడుతున్నాడు కొండడు.

అదీగాక ఈ ఆసాములతో అన్నీ ఇక్కట్లే, జీతగాడు వచ్చి పని చేసిన రోజులకు ఒకటింటికి ముంతెడుగింజల చొప్పున కూలి ఇచ్చి, వాడి కెప్పుడైనా ఏ కడుపునొప్పో, కాలునొప్పో వచ్చి నౌకరీకి రాలేక నిలిచిపోయిన రోజులకు రోజు ఒకటింటికి రెండుముంతలచొప్పున వాడి దగ్గర తిరిగీ ముజంతీసుకొంటారు. ఇదేమి నాయమో! అసాములు జీతగాళ్ళకూ కూలినాళ్ళకు తమ గింజలు కొలిచే ముంత వేరు జీతగాళ్ల దగ్గర నుంచి ఆసాములు ముజరా తీసుకొనేటప్పుడు కొలిచే ముంతవేరూ! మొదటి ముంత చిన్నదీ, రెండోముంతపెద్దదీని, ఇల్లాంటి దుర్భరమైన పరిస్థితుల్లో ఎన్నాళ్ళు బ్రతకగలడు కొండడు!

ఈ కళ్ళాటలు పడలేక ఆ వూళ్ళే మాలమాదిగలకు పది కుటుంబాలవాళ్ళకూ సర్కారువారు ఈ సందుకట్ల కొన్ని బీడు భూములు సాగుబడి చేసుకొనేటందుకు పట్టాలకు ఇస్తున్నారంటే,

కొండడుకూడా తాశీలుదారుగారి దగ్గర ఓ అర్జీ గీకించి దాఖలు చేశాడు. కొండడికిగాని, వాడి అవిభక్తకుటుంబంలో మరియెవ్వరికిగాని, అంతకు పూర్వం ఎన్నడూ సర్కారుభూములు, పట్టాకు ఇచ్చివుండకపోవడం చేత ఇతరులతోపాటు వీడికిగూడా, ఒక ఏభై సెంట్లు (అర ఎకరా) భూమి ఎకరా మూడువందల రూపాయల చొప్పున ఖరీదు వేసి, అరెకరమూ నూటయాభై రూపాయలకు సర్కారువారు కొండడికి పట్టా కిచ్చారు. ఇంత చేస్తే చచ్చినంత మరమ్మతు చేస్తేగాని సాగుబడికి లాయఖుకాని భూమి అది మనిషెత్తున తుంగ బలిసిపోయి అడవున్నట్టుంది. నీళ్ళకు మిట్టప్రదేశం, అరగజం గడ్డతీరు తీయిస్తేనేగాని కయ్యలోకి చుక్క ఎక్కదు. నీళ్ళు పారించుకొనేటందుకు ఆ కయ్యకు ప్రత్యేకం కాలవలేదు. సర్కారువారు విధించిన క్రయం నూటయెభై రూపాయలూ ఖజానాలో జమకట్టంగనే, సర్కారువారు కొండడి చేతిలో పట్టాకాగితం మాత్రం పెట్టి, నలుగురితోపాటు, వాడికిగూడా 'యిదిగో ఇదీ నీ భూమి' అని ఆ కయ్యకు హద్దులు చూపించి చక్కాపోయారు.

సెంటుకు కనీసం ఒక రూపాయ చొప్పున ఏభై సెంట్లకు ఏభై రూపాయలు ఖర్చు పెట్టితేనేగాని కయ్య మరమ్మత్తుకాదు, తుంగాదుడునూ కొట్టించడానికే యిద్దమో, ముత్తుమో కావలసిఉండె ఏ రోజుకారోజు రెక్కాడితేనేకాని డొక్కాడకపోయె ఇంట్లో కొండడికి! ఈ జన్మలో తన పేరిట వోయెకరాభూమి ఏర్పడితే తనజన్మ తరించి కష్టాలు గట్టెక్కుతాయనే ఆశపడ్డాడు. కాని తీరా భూమి పడిన తర్వాత ఆ కయ్యను సాగుబడి చేసుకోవాలంటే తన శక్తి కణకువైన పనిలా తోచలేదు కొండడికి. ఇప్పటికి చేసిన అప్పు తలుచుకొంటేనే వాడికి శరీరం నీరయిపోతోంది. భూమి దగ్గరకు వచ్చి చూచుకొంటే దిక్కుతోచడం లేదు. భూమి సాగుబడి చేసుకోవడమా లేక అంతటితో దాన్ని విరమించుకొని మళ్లా మామూలుప్రకారం ఏ అయ్య కాడనో జీతానికి కుదరడమా ఈ రెంటిసందున పడి నలిగిపోతున్నాడు కొండడు. అయిందేదో అయిపోయింది మన కీ జన్మలో స్వంత కయ్యనీ, స్వంత సేద్యమనీ, స్వంతెద్దులనీ అనుకొనే ప్రాప్తంలేదు. ఇంతటితో ఈ కయ్యను పోకడ పెడుదా" మనుకొని నిస్పృహ చెంది పట్టావచ్చిన మరుసటి నెలలోనే యితరులకు అమ్మకం చూపేడు.

కొండడికి పట్టాకిచ్చిన కయ్య లక్ష్మమ్మ స్వంతపట్టాభూమి నూరెకరాల ఏక ఖండంగల నట్టుకు దక్షిణపు తట్టున అనుకొని ఉన్నది. కయ్యసందునా, లక్ష్మమ్మ భూమిసందునా గనిమె తీస్తే, అలగ్గా కయ్య ఆవిడ ఖండంలో కలిపిపోతుంది. ఆ కయ్య కోసరం ముప్పయేళ్ళకు పూర్వం లక్ష్మమ్మభర్త రివిన్యూ అధికార్లకూ, డి.పి.డబ్ల్యూ, అధికార్లకూ అంచాల క్రింద ముప్పై నలభై రూపాయలు ఖర్చుపెట్టీకూడా ఆ భూమి పట్టాకివ్వడం ఆక్షేపణకరమని అప్పట్లో సర్కారువారు తీర్మానించడం వల్ల విఫలమనోరథుడయినాడట అది లగాయతు భర్త చనిపోయిన తర్వాత కూడా ఆశపడ్డ కయ్య చివరకు లభించకపోవడమేగాక దాని కొరకు లంచాలుగా పోసిన నలభైరూపాయలూ నట్టేట కలిపిపోయెనే అని లక్ష్మమ్మ అప్పటికీ ఇప్పటికీ ఆ విషయం తల్చుకొని కుళ్ళిపోతూవుంటుంది. ఎట్లాగైనా కయ్యలో కయ్యను కలుపుకోవాలని ఆవిడకూడా ఒకటి రెండుసార్లు ప్రయత్నించిందిగాని ఆవిడ ప్రయత్నం కొనసాగలేదు. అందువల్ల ఆ కయ్యను లక్షాధికారైన తాను కోరినపుడు పట్టాకు ఇవ్వకుండా ఇప్పుడు ఒక మాలవాడికి పట్టా కిచ్చారనేసరికి లక్ష్మమ్మకు ఆపాదమస్తకమూ తేళ్ళూ జెర్రెలూ పాకినట్టయిపోయింది. తన కయ్యకింద మాలవాడు ప్రవేశించాడని విన్నప్పటినుంచీ ఆమె అన్నం తినక మంచం పట్టింది. రాత్రింబగళ్లూ వాణ్ణి దుమ్మెత్తిపోస్తోంది. వాడి వంశం నాశనంకావాలని శాపనాకారాలు పాడుతోంది.

కొండడికి చేతిలో దమ్మిడీలేక ఒక్క దున్నపోతు కాని, ఒక్క అరకకొయ్యకాని లేక రెండువందల రూపాయలతో తెచ్చుకొన్న కయ్యను సాగుబడి చేసుకొనే దారీ తెన్నూ కనబడక దిగులుపడి ఉక్కిరిబిక్కిరయి వాడు తన్నుకులాడు కొంటూ ఉంటే, తన భూమిలో కలిసే కయ్యను తాను ఇంత ప్రయత్నించినా తెచ్చుకోలేక ఆఖరుకు తన కళ్ళయెదుట ఒక హీన జాతి మాలవాడు తన్నుకుపోతున్నాడే, ఎట్లాగబ్బా జీవించేవని యింట్లో లక్ష్మమ్మ మరణవేదన పడుతోంది.

అట్టి సమయంలో కొండడు ఆ భూమి అమ్మకం చూసాడని వినీ వినటంతోనే లక్ష్మమ్మ ప్రాణాలు లేచివచ్చినట్లుగా సంతోషించి రామిరెడ్డిచేత మాలవాడికి కబురు చేసింది. బేరమాడింది. తాను ఖర్చుపెట్టిన రూపాయలు తన కిచ్చివేస్తే ఈ క్షణంలో భూమిని వదులుకోంటానని కొండడు జవాబు చెప్పేడు. వాడా మాటలు అనే సరికి లక్ష్మమ్మ గుండెలు బాదుకొని.

అమ్మయ్యో! నీ కెంత దురాశ పుట్టిందిరా మాలముండాకొడకా! బ్రతకడానికా నాశనం కావడానికా ఇట్లాంటి దుర్బుద్ధులు నీకు ఈ కయ్యకు గాను నా మగడు ముప్పై ఏళ్ళనాడు దూటబిళ్లల్లాగ, నలభైరూపాయలు ఆ సర్కారువారి యెదాన్ని కొట్టినాడు, ఈ ముప్పై ఏళ్లుగా నలబై రూపాయలకూ వడ్డీ కట్టుకొంటే నూరు రూపాయలయింది. ఈ నష్టం నీ తాత ఇస్తాడను కొన్నావా? నీ ముత్తాత ఇస్తాడనుకొన్నావా? దురాశలకు పోబోకు, దుఃఖానికి చేటు, ఎట్లాగా ఆ కయ్య నీవు మరమ్మతు చేసుకోలేవు. మరమ్మతుకు గాను నేనింకా ఏభై రూపాయలు ఖర్చు చెయ్యాలిసుంది. అప్పటికి నాకు నూటయేభై రూపాయలవుతుంది. తెలిసిందా? నీవు ఈ సందునా ఆ సందునా కచ్చేరిచుట్టు తిరిగి డబ్బు ఖర్చుపెట్టావు కాబట్టి అందుకు భత్యఖర్చుల క్రింద పదిరూపాయ లిస్తారు. ఆ కయ్య నా పేర విక్రయించి పారెయ్యి" అన్నది.

"అమ్మయ్యో! నీ కెంత దురాశ పుట్టిందమ్మా" అని కొండడు కూడా గుండెలు బాదుకొంటూ వెళ్ళిపోయాడు.

తాను రెండువందలు పెట్టి కొన్నకయ్యను పదిరూపాయల కిమ్మని లక్ష్మమ్మ చేసిన బేరాన్ని తలుచుకొనేవరకు కొండడికి అదివరకున్న నిరాశా, నిస్పృహా వదిలి ఎట్లాగైనా సాధించి కయ్యను నిలబెట్టుకొని సాగుపడి చేసుకోవాలన్న పౌరుషం పుట్టుకొనివచ్చింది. దేవుడి మీదే భారం వేసి కొండడు ఉళ్ళోకి చక్కా వెళ్లాడు. మొదటి మారాజునే మళ్ళా బ్రతిమలాడుకొని, ఇంకోయాభై రూపాయలకు ప్రోనోటు వ్రాశాడు. ఈ పైకంతో భూమి మరమ్మత్తు చేసి ఆ సంవత్సరం శ్రావణమాసం రాగానే వరినాటు వేశాడు. ఇరవై ముప్ఫైయేళ్లుగా బీడుగా ఉన్న భూమేమో ఆ సంవత్సరం కాలం సక్రమంగా రావడం చేత నారు గుచ్చీగుచ్చంగనే, కర్రలు నలుపుతిరిగి గంటలు కట్టి పైరు నవనవలాడుతూ ఎక్కి వచ్చి, అరెకరా కయ్యా ఒక పుట్టెడు గింజలదాకా చితక పండింది. కొండడికి కొంత ధైర్యం చిక్కింది. దేవుడి కృప చల్లంగుంటే, నాలుగేళ్ళలో అప్పుతీర్చేసి బయటపడతామనుకొని, సాయంకాలం ఇంటికి పోయి, ఉడుకునీళ్ళు పోసుకొని, అరబయట నులకకుక్కి మీద పండుకొన్నప్పుడల్లా ఏవేవో వూహలో మేడలు కడుతూవున్నాడు కొండడు.

కొండడితో బేరం చెడ్డప్పటినుంచీ లక్ష్మమ్మకు దిగులుగానే వుంది. తన కయ్యలో కలిసే కయ్యను చూచి చూచి వదులుకోడానికి ఆవిడ కిష్టంలేదు. పోనీ ఎంతయినా, సరే, డబ్బిచ్చి తీసుకొందా మనుకొంటే చేతులారా అన్ని రూపాయలు మాలవాడిచేతిలో పోయడానికి మనసొప్పలేదు. రోజులు గడచిన కొద్దీ ఆవిడకు కడుపులో ఈ బాధ జాస్తీ అవుతూవచ్చింది. దానికి తోడు అయేడు తన నూరెకరాల నట్టువా సగటున ఎకరానికి ఓ పుట్టెడు గింజలు పండి

తన ఇంట్లో నూరుపుట్లు వేసుకొనీ కూడా తన నట్టువలో కలిసే కయ్య అరెకరమే మాలవాడికి పుట్టుడు గింజలు పండిందని తలుచుకొని ఆవిడ కడుపు దహించుకొనిపోతోంది.

ఒకటి రెండుసార్లు రామిరెడ్డి పిలిపించి "అబ్బాయా! ఏమిగతిరా, మాలవాడు బంగారం వంటి అరెకరా కయ్యా అధ్వాన్నం చేసి తన పొట్టన పెట్టుకొన్నాడు. నేను ఏబావో ఏగొయ్యో చూసుకోవలసిందేగాని గతిలేదిక. తలకింద కొరివిలా ఈ మాలమాదిగ కొడుకుని నా కయ్యల క్రింద పెట్టుకిని నేను నలుగురిలోనూ తలయెత్తి ఈ గడ్డమీద కాపురం చెయ్యలేను. అన్నిటికీ నువ్వే వున్నావు. ఏం చేస్తావో చెయ్యి" అని సొదపెట్టింది "కానీలే అమ్మా! తొందర పడబోకు, వాణ్ణి అక్కడనుండి లేవగొట్టే ఉపాయం ఆలోచిద్దాంలే కాస్త నిదానించు" అని రామిరెడ్డి ఆమె నూరడించాడు. కాని లక్ష్మమ్మ మనస్సు కుదుట పడలేదు.

జ్యేష్ఠమాసం వచ్చింది. తొలకరించింది. రైతులు నార్లు వేసుకొంటున్నారు. పొలాల్లోకి ఎరువు బూడిద తోలుకొంటున్నారు. తొలకరి భూమి కాస్త మెత్తపడడంచేత కొంతమంది ఆ తడిమీదే అరకలు కట్టి ఒకటి రెండు చాళ్ళు వెలిదుక్కులు చేస్తున్నారు. కొండడుకూడా తన కయ్యలోకి ఎరువు తోలడానికి ఎవరినో ఎరవడిగి ఒక కాడి దున్న పోతులు తెచ్చుకొని బండికట్టాడు. తనూ, తన భార్యా ఇద్దరూ చెరొక గంపా తీసుకుని వో ఇరవై గంపలు జల్లిలో పోశారు. ఇక బరువు లాగలేవు దున్న లనుకొని కొండడు బండి యెక్కాడు కొరడా ఆడించాడు సంగం దూరం బండి తోలుకు వచ్చాడు.

కొండడి కయ్యకు తూర్పునా, ఉత్తరాన్నా, పడమరాకూడా లక్ష్మమ్మ పొలం కమ్ముకువుంది. దక్షిణపు తట్టు మాత్రం సర్కారు అసలు మినహా చెరువుతొట్ట పోరంబోకు భూములున్నవి తన కయ్యకీ పోవడానికి కొండడు లక్ష్మమ్మ భూములగుండా పోయితీరాలి. మరో మార్గం లేదు. పడమరగా ముప్పాతిక మైలు పోతే చెరువులోకి పోయే డొంక వుంది కాని అది చాలా చుట్టు. సుమారు రెండు మూడు వందల ఎకరాల భూమి చుట్టుకొస్తేనేగాని కొండడా దారిగుండా తన కయ్యలోకి రాలేడు. ఎరువుబండి తోలుకొని కొండడు తన కయ్యల్లోనుంచి పోతున్నాడని లక్ష్మమ్మకు తెలిసింది. వెంటనే యిద్దరు సేద్యగాళ్ళను పంపి బండిని మళ్ల గొట్టించింది.

కొండడికేమీ పాలుపోలేదు. ప్రదక్షిణం చేయించి తీసుకుపోదామనుకొంటే రెండు సబుర్లు తోలేవరకే పొద్దు గుంకుతుంది. ఊరికీ, తన కయ్యకీ ఓ మైలుంది. అసలే దూరంగా ఉన్న తన అరెకరా భాగ్యానికీ రెండు మూడు మైళ్లు ప్రదక్షిణం తిరిగి సేద్యం చేసుకోవాలంటే, అలవయిన పనిగా కనపడలేదు కొండడికి. అందువల్ల బండినక్కడే విప్పుకొని కొండడింటికి పోయి భార్యను పిలుచుకొని, యిద్దరూ చెరొకగంపా నెత్తిన పెట్టుకొని, ఎట్లాగైతేనేం, రెండోరోజు సాయంత్రానికి అరెకరా కయ్యలోనూ ఓ ఆరుబళ్ల యెరువు మెడనరాలు మెలితిరిగేటట్టు మోసి మోసి కయ్యలో పోశారు.

లక్ష్మమ్మ కెదలో గాభరా పుట్టుకొస్తోంది. ఏ విధాన్నీ మాలవాడు లోబడడంలేదు. ఆ మధ్య ఒకసారి కొండడి అరక దున్నిన పశువులు పగటి వేళ లక్ష్మమ్మ పొలంలోవున్న మంచి నీళ్ల దొరువుకాడికి నీళ్లు తాగనుపోతే, తన దొరువులో నీళ్లు తాగడానికి వీల్లేదని ఆవిడ పశువులను మళ్ళగొట్టి బందెల దొడ్డిలో పెట్టించింది. 'దేవుడా' అంటూ పశువు 1కి 12 అణాల వంతున నాలుగు పశువులకూ మూడు రూపాయలు కట్టి, కొండడు పశువులను బందెనుండి విడిపించుకొన్నాడు. లక్ష్మమ్మ ఇంకా ఏమైవెమో చేస్తూనే ఉంది. ఎన్ని చేసినా మరుసటి

సంవత్సరంకూడా కొండడు మొండికెత్తి నలుగురితో పాటు తానుకూడా సకాలంలోనే తన కయ్యను సాగుబడిచేసుకొని మొలగొలుకులు నారు గుచ్చాడు. ఆయేడుకూడా కాలం సరిగ్గానే రావటం వల్ల సకాలంలో మూడు నాలుగు వర్షాలు కురిసి పైరు ఆరంభంలో బాగానే ఎక్కివచ్చినా, వెన్ను తీసి పొట్టమీదికి వచ్చేవరకు వర్షం బిగించి కాలం బెట్టచేసి నీళ్లకు ఎద్దడయింది. ఎంత యెద్దడయినా లక్ష్మమ్మబోటి మారాజులు మాత్రం కాలవల్లో వచ్చే నాలుగు చుక్కలూ తమ పొలాలకే పెట్టుకొని, తమ పైరు మాత్రం ఎండిపోకుండా కాపాడుకొంటూ వచ్చారు. కొండడి కయ్యకు నీరు పారుదల అయ్యేటందుకు ప్రత్యేకం కాల్వలేదు. మడవ తీస్తే నీళ్ళు లక్ష్మమ్మకయ్యలోనుంచి తన కయ్యలోకి రావాలి. నిరుడు ఆమె కయ్యమీది మడవ గుండానే పారించుకొన్నాడు కొండడు. ఈ సంవత్సరం మాత్రం లక్ష్మమ్మ మామూలు మడవను పూడ్చివేసి, తన కయ్యలో నీళ్ళు మాలవాడి కయ్యలోకి చుక్క రాకుండా, గనిమె గజం ఎత్తున మట్టి పోసి గట్టిపరచి, తన కయ్యలో అదనంగా నిలిచే పులకనీళ్ళకు పడమటితట్టు చెరువులోకి పొయ్యేటట్టు ఇంకో కొత్తమడవ పెట్టించింది. ఆయేడు బీదల పొలాలకు నీరు చాలక పైర్లు ఎండిపోతూ వున్నప్పటికీ అదృష్టం కొద్దీ లక్ష్మమ్మ కయ్యలో మోకాలులోతు నీళ్ళు నిలవడమే కాకుండా, ఇంకా పై నీళ్ళన్నీ వచ్చిపడడం చేత అదనమై, కొత్తగా పెట్టించిన మడవగుండా అవన్నీ చెరువుతొట్టిలోకి వృథాగా పోతున్నవి. చెర్వుతొట్టిలోకిపోయిన నీళ్లు తన కయ్యలోకి కాలవ తవ్వుకొని మళ్లించుకొందా మనుకొన్నాడు కొండడు కాని తన కయ్య చెర్వుతొట్టి కంటె మిర్రుగా వుండడం చేత నీ ళ్లెక్కక, ఆ ప్రయత్నం చాలించుకోవలసివచ్చింది వాడు.

ఫలితానికి వచ్చిన పైరు, ఆరె నెలలుగా చెమటవోడ్చి కష్టంచేసి పెంచుకొన్న పైరు. ఇంక లెక్కకు రెండుకళ్లు తగిలితే మళ్లా ఒకపుట్టెడు గింజలు నమ్మకంగా పండే పైరు, కాని తన కయ్యలోకి నీళ్లు వచ్చే మార్గం కనబడలేదు వాడికి లక్ష్మమ్మ కరుణించాలె. తనకు నీళ్లు ప్రాప్తించాలె. నీళ్ళులేక కయ్య ఎండిపోతోంది. తడి ఆరి అడుగు వేస్తే దిగబడడం లేదు. క్రమక్రమంగా చెమ్మ ఆరిపోయి కయ్యలోని వరిగంటల సందుల్లో భూమి బద్దలయి బీటలు తీస్తోంది. డొక్క లెగరవేస్తూ, వెక్కి వెక్కి రోదన చేస్తున్నాడు కొండడు. కాని యెండిపోయి బీటలు తీసిన కయ్యను మెత్తనిచేయడానికి ఆ ప్రవాహం చాలలేదు.

పొద్దునెత్తిమీదికి వచ్చింది.నీళ్ళులేక పైరు మాడిపోతోన్నట్టుగానే, పొద్దుటినుండి చద్ది దాహమైనా లేక వాడి కడుపుకూడ మాడిపోతుంది. ఇంటికి పోయినాడు ఇంత అన్నం గతికాడు. భార్యను పిలిచాడు. ఇద్దరూ కలిసి ఒక గూడ సంపాదించారు. నేరుగా కయ్యకాడికి పోయారు. లక్ష్మమ్మ కయ్యల్లోనుండి చెరువులోనికి పోయేనీటికి అడ్డుకట్టవేసి, ఒక సన్నని కాలవ తీసి, గూడతో పొద్దుగూకులూ నీళ్లు ఎత్తిపోశారు. కాని వెనుకవాలుగావున్న ఆప్రదేశం గుండా నీళ్ళు కయ్యలో కెక్కలేదు. అయినప్పటికీ చీకటి పడెవరకు నాలుగోవంతు కయ్య సుమారుగా తడిసింది. రాత్రి యింటికి పోయి,నీళ్ళు పోసుకుని, కూడు తిని, పది గంటలకు వెన్నెట్లో మళ్ళా కయ్యకాడికి పోయి తెల్లవారుజామున కోడికూత కూసేవరకూ నడుములు పడిపోయేటట్లు భార్యాభర్తలిద్దరూ ఆ గూడతో నీళ్ళు ఎత్తిపోస్తూనే ఉన్నారు. ఆ తడితో పైరు కొంచెం పాటుకు తిరుక్కున్నప్పటికీ, ముప్పై లంఖణాలు చేసి పథ్యం పుచ్చుకొన్న రోగి ఎక్కివచ్చినట్టయి, అదును తప్పిన తడి అయినందున పుట్టెడు గింజలు కావలసిన కయ్య అర్థ పంట పండి, ఒక పందుం గింజలు రాలింది. తనకెంత ప్రాప్తమో అంతే ననుకొన్నారు కొండడు.

పుష్యమాసం వచ్చింది. పైర్లన్నీ పంటలకు వచ్చినై, కూలి వాండ్లందరూ కోత లకు వంగారు.

వారం రోజులలో తన పైరు యావత్తూ కోయించి కుప్పలు వేయించింది లక్ష్మమ్మ కూటికి కొరత బడ్డ యానాదులు, ఎరుకలు, మాలలు, మాదిగలు పైరు కోతయిన పొలాల్లో పన అడుగున మిగిలిన పరిగకఱ్ఱ లొక్కొక్కటే ఏరుకొని సాయంకాలానికి ఓ సందడు కట్ట అయ్యేటట్టుగా కట్టుకొని, ఇళ్ళకు తెచ్చుకొంటున్నారు.

కొండడి తల్లి వెంకి ముసలిది అయినా పూర్వకాలపు మనిషయినందున డెబ్బయ్యోపడిలో కూడా శరీరం చేవదేరి ఇంకా దారుఢ్యంగానే ఉంది కాయకష్టం చేసిన అలవాటు కొద్దీ, అది యిప్పుడుకూడా ఒక్క నిముషం ఇంట్లో ఊరికే కూర్చోలేదు. పొయిలోకి ఇన్ని చితుకు లేరుకురావడమో, ఇంత పేడ పోగుచేసి పిడకలు చేసుకోవడమో, అసాములు కుప్పలు నూర్చి ధాన్యం బండ్లమీద తోలుకొనిపోయిన తర్వాత కళ్ళంలో తడినేల కంటుకొని పోయిన గింజలను పత్తిపుల్లల చీపురుతోనో, కందిపుల్లల చీపురుతోనో ఒక్కొక్క గింజే కళ్లంలోని మట్టిగడ్డలతో సహా గీకి గీకి, పొద్దుగూకేవరకు ఏ అర్ధ శేరుగింజలో చేటలో వేసుకొని ఇంట్లోకి చేర్చడమో ఇట్లాగే కష్టపడి సంసారానికి కాస్త సాయపడుతూనే వుంది. ఆ అలవాటుకొద్దీ, ఈ సంవత్సరం కోతలు పూర్తి అయి కుప్పలు పడడంతోనే వెంకి పదిరోజుల పాటు వరికొయ్యకాలంతా తిరిగి తిరిగి ఒక అరమోపు పరిగకయ్యలు పోగు చేసి ఇంట్లో చేర్చింది.

కొండడు కూడా తన కయ్యలో పైరు కోశాడు. వెంటనే అపందుం గింజల పంటా పనిమీదనే పిడివాటు కొట్టేదామనుకున్నాడు. కాని పిడివాటు కొట్టితే గింజలు కఱ్ఱకంటుకొని సరిగ్గా రాలవేమో, పంట కాస్తా పోతుందని భయపడి. ఒక్క వారం రోజులు వెసులుబాటు చూసుకొని నాలుగు బఱ్ఱెగొడ్డుల్నీ వాటిని మళ్ళించి తొక్కిద్దామని ఆలోచన చేసి కయ్యలోనే ఒక చిన్న కుప్ప పడవేశాడు. కొండడు. లక్ష్మమ్మకూడా కొండి కయ్యకి ఆనుకొనివున్న నూరెకరాల పంటా కోయించి, అక్కడక్కడ నాలుగు కుప్పలు వేయించింది.

## 4

కోతలు ముగిసి కుప్పలుపడేవరకు రైతాంగానికి రవంత వెసిలిక చిక్కింది. అట్టే ఆలోచించుకోగా తన కయ్యకి దిగులులేకుండా నీళ్ళుపారే కాలవ లేకపోవడం కొండడికి చికాకుగా తోచింది. కాలవ కావలేనంటే ఎట్లాగూ లక్ష్మమ్మ కయ్యలో నుండే తనకు రావలె. విధిలేదు కాబట్టి ముందు లక్ష్మమ్మ నడిగి ఆమెచేత కాదనిపించుకొన్న తరువాతనే పై వ్యవహారం చూచుకొందా మనుకొని ఒక రోజు కొండడు లక్ష్మమ్మ ఇంటిపోయి "అమ్మా! నువ్వు గొప్పమారాజువి. నీ మీద పగబట్టితేనే బతకలేను. నీ దయ వల్ల చిన్నతనంలో నాకు గంజిపోసి బతికించావు. ఇప్పుడు పెద్దవాణ్ణయిన తర్వాతకూడా నువ్వే అన్నం పెట్టాలసిన గండం వచ్చింది. అయిందేదో అయిపోయింది. కాని అమ్మా! నీకు దణ్ణం పెట్టుతా. నీ కయ్యలోనుంచి నా కయ్యలోకి జానెడు వెడల్పు కాలవ గనుక ఇస్తివా, నీ పేరా దీపం పెట్టుకొని మొక్కుకుంటా" అని అడిగాడు కొండడు.

"కాలవా! నీకా! ముష్టి అరెకరాకయ్య చేతిలోకి వచ్చి రెండోయేడు డింకా జరుగలేదు. అప్పుడే నీ కయ్యకు కాలువలూ మడవలూ కావలసివచ్చినైగా! ఔరా! అయిన నూరు రూపాయల కయ్యా-మనోటికాడ అన్నం - ఎత్తుకొనిపోయి నీ యెదాన్ని పెట్టుకోవడమేకాకుండా పైగా కాలవ కోసరం బేరానికి వచ్చావయ్యా! ఇస్తా కాలవ ఇస్తానులే! ఈ పొంగు బోర్లాపడడానికే వచ్చిందిలే నీకు ఎందుకు పాపం అని అజ్ఞాయించి ఊరుకొనివుండా, ఈపాలి నా కయ్య తొక్కి చూడు, రెండు కాళ్ళూవిరగ్గొట్టిస్తా'

' అంది లక్ష్మమ్మ.

"నాకు ఊరికనే పనిలేదులే అమ్మా! కాలవకుగాను నీ విచ్చే స్థలానికి క్రమమైన క్రయం గట్టి డబ్బు తీసుకొని మరీ యిద్దువు గానిలే" అన్నాడు కొండడు.

"ఛీ! నోరు మూసుకొని బయటికిపో! శుభమల్లే మంగళవారప్పూటా ఇంటిముంగిటికి వచ్చి కయ్యమ్ముకో, కాలవమ్ముకో అని వెధవకూతలు కూస్తావు!నోట్లో పొడిపిస్తా చూడు. నాకేంగ్రహచారం పట్టలేదు. నీకు నా మళ్ళూ మాన్యాలూ అమ్ముకోడానికి ఈపాలి కాలవసంగతి ఎత్తావంటే మాటదక్కదు. పో" అని లక్ష్మమ్మ కసురుకుంది.

ఇక లాభం లేదనుకొని కొండడు ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా ఆ ఫిర్కా రివిన్యూ యినస్పెక్టరు దగ్గరకు వెళ్లడు. అదివరలో కొండడి కయ్య పట్టాకు తెప్పించినపుడు కొంత మేత మేసిన గొడ్డుకాబట్టి రెవిన్యూ యినస్పెక్టరుకు వాణ్ణి చూడడంతోనే నోరు ఊటలూరింది. కొండడు చెప్పుకొన్న విన్నపం విన్నాడు. "ఇది మన చేతిలో పని, ఎంత సేపు! ఎల్లుండి మర్నాటికి కాలవకు ఉత్తరవు తెచ్చిపెడతా' ' నని చెప్పి అనుకొన్న దానిలో ముందుగా సగమూ, పనిపూర్తయిన తర్వాత మిగిలిన సగమూ కొండడు తన కిచ్చేటట్లు ఖరారు చేసుకొని, మొదటి సగం అయిదు రూపాయలూ ఆక్షణంలోనే చేతిలోకి రాల్చుకున్నాడు. 'రేపు జాగ్రత్త' అనే బ్రతుకు తెరువు తెలుసుకొన్న ఆ రెవిన్యూ ఇనస్పెక్టరు వెంటనే తహశీలుదారుకూ, డిప్టీకలెక్టరుకూ అర్జీలు వ్రాసి పోస్టులో రిజస్టరు చేయవలసిందని కొండడితో చెప్పాతూ, "ఒరే! కొండా! ఇక్కడ ఇనస్పెక్టరుని ఎలాగో తృప్తిపరచాంగదా, ఇక పరవాలే దనుకొంటావేమో ఇవి డెల్టాకొంపలు. ప్రతీపనికీ, డి.పి.డబ్ల్యూ వారితోనూ, మాతోనూ కూడా అవసరం ఉంటుంది. తీరా ఫలితానికి రాబొయ్యే సమయంలో ఆ హోవరుసీరు ముండావాడు ఒక్క కలంపోటు పొడిచాడంటే ఆ చిక్కులోంచి పెరుక్కోలేక చావాలి. అర్జీలు పంపడంతోనే ఆవోవరుపీరుకాడికి పోయి, దణ్ణంపెట్టి చెప్పుకో, తెలిసిందా? తర్వాత నన్ను నిష్ఠూరమాడితే ప్రయోజనం లేదు" అన్నాడు!

"సరేలే అయ్యా! నా కళ్లాటలు నే పడతాలే. నువ్వు మట్టుకు నిండా దయవుంచాలి" అని కొండడు దణ్ణంపెట్టి వెళ్ళి, రెండు అర్జీలకూ రెండు పావులాలూ ఇచ్చి వ్రాయించి డిప్టీకలెక్టరు కొకటీ, తహశీలుదారుకొకటీ పోస్టులో వేసి ఇంటికి వచ్చాడు.

కొండడు వెళ్ళినమర్నాడే రెవిన్యూ ఇనస్పెక్టరు "ఇట్లా ఇట్లా వ్యవహారం జరగబోతుంది. మీ జాగ్రత్తలో మీరుండవలసింది" అని జవాను ద్వారా లక్ష్మమ్మకు కబురుచేశాడు. లక్ష్మమ్మ స్వయంగా వచ్చి మాట్లాడ్డానికి వీల్లేక రామిరెడ్డిని ఇనస్పెక్టరు పంతులుకాడికి పంపుతూ, కూడా పది అరటికాయలూ, పది అరటిఆకులూ ఇచ్చి పంతులి కియ్యమని చెప్పింది. రామిరెడ్డి ఇనస్పెక్టరు పంతులుతో అంతా మాట్లాడి మనస్సుకు తెచ్చుకొని 'ఇంటికిపోయి మా పిన్నమ్మతో మాట్లాడివస్తా' నని కూర్చున్న మనిషి లేచాడు.

"ఇదిగో! ఊరికినే మంత్రానికి మామిడి కాయలు రాలేకాలం కాదని మీ పిన్నమ్మతో గట్టిగా చెప్పు. మాలవాడు ఏవేవో సిఫార్సులు తీసుకొనిపోయి పై ఆఫీసుల్లో గట్టి ప్రయత్నం చేస్తున్నాడు. పైగా సర్కారుకు హీన జాతులంటే తగని అభిమానం. ఈ తిరుగుళ్ళన్నీ మీకు తెలియవు. చేసే ప్రయత్నం ఘట్టిగా చెయ్యాలని ఆమెతో నొక్కిచెప్పు. తెలిసిందా" అని పంతులనే వరకు 'చిత్తం అట్లాగేలెండి' అని రామిరెడ్డి ఇంటికిపోయి లక్ష్మమ్మతో అన్ని సంగతులూ చెప్పాడు.

"ముందుగా చెయ్యిజారితే తంటాగాని నోరుజారితే పరవాలేదు. ఇచ్చి పుచ్చుకోవడాలు తర్వాత

చూచుకోవచ్చు గాని, అసలు మనకు అనుకూలం అయితే కార్యం అంతా అయిన తర్వాత ఇనస్పెక్టరు ఇరవై రూపాయ లిస్తామని మాట మాత్రం పడేసి చక్కారా" అని లక్ష్మమ్మ చెప్పింది. ఆ మాటలే తీసుకువచ్చి రామిరెడ్డి ఇనస్పెక్టరు కందించాడు ఆయన పెదవి విరిచాడు లాభం లేదనుకొన్నాడు. కొండడు ఇచ్చుకొన్న అర్జీలు రిపోర్టు నిమిత్తం ఇనస్పెక్టరు వద్దకు రాగా ఆయన ఎటూ తేల్చకుండా, ఎవరికీ అనుకూలం లేకుండా, 'కాలవ ఇస్తే ఇవ్వవచ్చు. ఇవ్వకపోయినా కొండడికి వచ్చిన ఇబ్బందిలే' దని గోడమీది పిల్లివాటంగా రిపోర్టు వ్రాసి అర్జీలు పైకి పంపివేశాడు. ఇక పదిహేను ఇరవై రోజుల్లో తనకు అనుకూలంగా ఉత్తరువులు వస్తవని కొండడు ఆశతో ఎదురు తెన్నులు చూస్తున్నాడు.

## 5

కుప్ప లింకా ఇప్పుడప్పుడే నూర్చరు. ఉగాదికిగాని కళ్లాలు చేయడానికి కయ్యి లారవు. అందువల్ల కుప్పలన్నీ పొలాల్లోనే ఉన్నవి.

లక్ష్మమ్మ రాత్రిపూట కుప్పలవద్ద మనుష్యుల్ని కాపలా పెట్టుతూనే వుంది. రోజూ రేపటివేళనో, మాపటి వేళనో ఆమె ఒకసారి కుప్పలచాయ బోయి.తన సొమ్ము భద్రంగా ఉన్నదో లేదో అని చూచుకొంటూనే వుంది. తగని అనుమానం మనిషి! ఎవరినీ నమ్మదు. తన మనస్సే తను నమ్మలేదు. పొలంలో సొమ్ము ఇంట్లోకి వచ్చేవరకూ ఆమెకు ఒకటే అలాపనగా వుంది.

ఒక రోజు పద్దు పొడవకముందే ఆమె పొలంచాయ బోయి, కొండడి కయ్యకు సమీపంలోవున్న తన కుప్పలను తణిఖీ చూచుకొంటూవుండగా, అందులో ఒక కుప్పకు నెత్తిన నడిభాగంలో ఒక మోపుపన పెరికి బయటికి తీసినట్లు చిందరవందరగా ఆమె కళ్లకు కనిపించింది, మరి, ఎవరైనా కావాలని రాత్రిపూట చోరీగా వచ్చి ఆ కుప్పలో ఒక మోపెడుపన తీసి ఎత్తుకొనే పొయ్యారో, లేక అంతకు ముందటి రోజు సాయంత్రం కొట్టిన సుడిగాలికి, కుప్ప కప్పడంలో నసిలేక పై భాగంలో ఒక సందెడు గడ్డి గాలికి ఎగిరేపోయిందో, లేక ఆమె అనుమానపు కళ్ళకే ఆ విధంగా కనుపించిందో చెప్పలేం కాని మొత్తానికి ఎవరో తనను అన్యాయం చెయ్యాలని, రాత్రిపూట చోరీగా తన కుప్పలో పన పెరుక్కుపోయారని లక్ష్మమ్మ ఘట్టి నమ్మకం తట్టింది.

ఇక నెందుకు, తన రెండులక్షల రూపాయల సంసారమూ నట్టేట కలిపిపోయినట్లు, గుండెలు గుద్దుకొంటూ, ఆమె నోటికి వచ్చిన తిట్లు తిట్టుకొంటూ, వీధిన బడి గోలపెడుతూ పరుగు పరుగున ఇంటికి వచ్చి రావడంతోనే తొందరగా రామిరెడ్డికి కబురుచేసింది. ఏదో కొంప మునిగిందనుకొంటూ రామిరెడ్డి రామిరెడ్డి తల్లీ, రామిరెడ్డి చెల్లెలూ పరుగెత్తుకొని వచ్చేవరకు, లక్ష్మమ్మ తల విరబోసుకొని, దక్షిణపుతట్టు వసారాలో వట్టినేలను, రోజుతూ, రొప్పుతూ "అయ్యో నా కొడకా! అయ్యో రామిరెడ్డి! కొంప గుండం వేసుకొని పోయిందిరా, నాయనా! నా సంసారానికి నేటి కిన్ని కడగండ్లు వచ్చాయిరా తండ్రీ! అయ్యయ్యో! మేరు పర్వతంలాంటి కుప్ప, నా మొలగొలుకుల కుప్ప, బంగారం లాంటి కుప్ప నట్టేట కలిపిపోయిందిరా బాబూ! అని చూడవచ్చిన వాళ్ళకు అర్థం గాకుండా ఒక్కటే రోజుతూ, కంటికీ నేలకీ ఏకధారగా పెద్ద పెట్టున ఏడిచింది.

"ఏందమ్మా! అసలు సంగతేమిటో చెప్పవమ్మా! ఏం జరిగిందేమిటి? నిన్న పగటి వేళ పొలంచాయ పోయి చూచి వచ్చాను. మన కుప్పలన్నీ భద్రంగానే ఉన్నవే! ఇప్పుడేం వచ్చిందీ?' ' అని రామిరెడ్డి అడిగేవరకు

"దానికి కాలం వచ్చేటప్పటికి ఎంతలో పోవాలెరా నాయనా! నిన్న రాత్రి తెల్లవార్లూ ఎంత మంది జనం మోసినారోగాని సగం కుప్ప ఎగిరి పోయింది రా బాబూ! వీళ్ళు నాశనంగానూ! వీళ్ల కడుపులు మండిపోనూ! వాళ్ల వంశం నిర్వంశంగానూ!" అని లక్ష్మమ్మ మళ్లా అందుకొంది.

"అయితే ఎవరెత్తుకొని పోయినా రంటావు? అన్నాడు రామిరెడ్డి.

ఎవరని నన్నడుగుతా వెందుకయ్యా? అయ్యయ్యో! ఈ మాల మాదిగ కొడుకు నా ఇంటికి శనిగ్రహం పట్టినట్లు పట్టినాడురా బాబూ! తలకింద కొరివిలా నా కయ్యకింద వాడు ఊరికేనే చేరినాడనుకొన్నావా? మొన్న నేను వాడికి కాల విప్పలేదని వాడు నన్నప్పుడే బెదిరించి నా మీద శాల్దీలు తీసి వెళ్లాడురా బాబూ! ఆ మా ల మాదిగ కొండడు తప్ప మరొకరి పని గాదురా ఇదీ" అని లక్ష్మమ్మ మరీ ఏడిచింది.

"అట్లాగయితే నేనే విచారిస్తాగాని, నువ్వూరికే రచ్చచేయబోకు! మాలవా డెక్కడకు పోతాడు? నిముషాల మీద నీ సొత్తంతా నీయింట్లో చేరుతుంది. ఏడవబోకులే, లేచి పళ్ళుతోముకొని, ఇన్ని చద్దినీళ్ళు తాగు, అయ్యయ్యో! అరచి అరచి గొంతుకు రాచుకుపోయె ఆయాసమూ, శోషా కూడా వచ్చింది గదమ్మా తల్లి! లే! ఎండపడింది.లే!" అని రామిరెడ్డి ధైర్యం చెప్పాడు.

లక్ష్మమ్మకు విడిపోయిన జుట్టు రామిరెడ్డి తల్లి ముడివేసింది. సందిట పట్టి లక్ష్మమ్మను రామిరెడ్డి పైకి లేవదీసి చీడిమీద కూర్చోపెట్టాడు. లక్ష్మమ్మ చెదిరిపోయిన పైట సర్దుకొని, జుర్రున చీది నేలనేసి కొట్టింది వొంటి నంటు కొన్న దుమ్మూ, ధూళీ రామిరెడ్డి తుడిచాడు. రామిరెడ్డి చెల్లెలు పళ్ళు తోముకోను నీళ్ళు పిన్నమ్మపక్కన పెట్టింది. కళ్లు తుడుచుకొని లక్ష్మమ్మ మొగం కడుక్కొంది.

## 6

రామిరెడ్డి దూరాలోచన గల మనిషి. కానైతే జబ్బురకం మనిషి కాదు. పినతల్లి చేసిన చేష్టలన్నీ తనలో విమర్శించుకొన్నాడు . అతని కసలు పినతల్లి తత్వం మొదటి నుంచీ తెలవనే తెలుసు. ఇంటికి పోయి పైన గుడ్డ వేసుకుని చెప్పులు తొడుక్కొని, కర్ర చేత పుచ్చుకొని రామిరెడ్డి తిన్నగా కరణం రామగుండం బసవయ్యగారి యింటికి వెళ్లాడు.

బసవయ్యగారు నిఖారుసైన నియోగిబిడ్డ. తండ్రి పేరూ, తాతపేరూ మాత్రమే కాకుండా, అసలు అర్వేలవారందరి పేరుప్రతిష్ఠలూ కూడా ఏకటాకీని నిలబెట్టుతున్నాడాయన అనాదిగా వారిది పెద్ద కరణాల కుటుంబం అని పేరు పడింది. ఆయన స్వతహాగా తెలివితేటలు గల ఘటం. గ్రామంలో బసవయ్య గారి బావుటా బాగా ఎగురుతోంది.ఆవూరి మునసబు కమ్మనాయుడు. సంతకం మాత్రం ఎట్లాగో నేర్చుకొన్నాడు. బసవయ్యగారు నుంచోమంటే నుంచోవాలి. కూర్చోమంటే కూర్చోవాలి. అతను అందువల్ల ఆ గ్రామ సివిల్, క్రిమినల్, రెవిన్యూ వగైరా అధికారాలు బసవయ్యగారే చలాయిస్తూ రెండు చేతులా గ్రామంలో నొల్లుకొని తింటున్నాడు. కాని ఎంత సంపాదించినా ఆయన కుటుంబం పెద్దది; కూతుళ్ల పెళ్ళిళ్ళకి కార్యాలకూ, వాటికీ వీటికీ చాలక, కొంత వరకు లోకులకు ఋణపడ్డాడు. అచ్చం రామిరెడ్డికే ఆయన ఆరువేలు అచ్చువలసుంది. ఆ మొగమాటం కొద్దీ తనకు గ్రామంలో ఎంత పలుకుబడివున్నా, అప్పుడప్పుడు బసవయ్య రామిరెడ్డికి మాత్రం రవంత పక్కలు వంచుతూ వుండవలసి వచ్చింది.

రామిరెడ్డి రావడంతోనే బసవయ్య అతణ్ణి ఆహ్వానించి చావడిలో ఉత్తరపు తట్టు అరుగు

మీద చిరిచాపవేసి "ఏం ఇట్లా వచ్చావు, కథ" అని ప్రశ్నించాడు. "మీతోనే పని వుండి వచ్చా. నిన్న రాత్రి మా పిన్నమ్మ దక్షిణపు నట్టులోని కుప్పలో ఎవరో దొంగతనంగా పది మోపులు, పన కట్టుకొని పోయారుట. దాని కోసరం ఆమె గోలెడుతోంది" అన్నాడు రామిరెడ్డి.

"పది మోపులే? "

"ఆ! పదంటే పది కాదనుకో అంతకు తక్కువే కావచ్చు. ఎంత యినప్పటికీ దొంగతనం దొంగతనమే."

"కాదు మరీ! పాపం! ఆమె సొమ్ముకు కక్కుర్తిపడ్డ గాడిద కొడుకెవడయ్యా?"

"నీతో నిజం చెప్పొద్దూ; ఎత్తుకొన్ని పోతూవుండగా ఎవరూ కళ్ళారా చూడలేదు. మా పిన్నమ్మ కేమో మాల కొండడిమీద అనుమానం."

"అబ్బే! వాడట్లాంటి పనికి పోయేవాడు కాదయ్యా. పాపాం! ఎందుకు మనం మాత్రం ఒకరి మీద పాపపుమాటలు అనుకోవాలి?"

"అవును మరి. వాడి సంగతి నాకూ తెలుసు. అయితే ఆమె మాత్రం వాడే చేశాడు ఈ పని అని ఘంటా పథంగా చెప్పుతోంది. ఆమె మతం మార్చడానికి బ్రహ్మదేవుడి తరంగాదు."

"అయితే ఇప్పుడేం చేద్దామని నీ ఆలోచన?"

"చేయడానికేముంది? కొండణ్ని పిలిపించింది ఆమె కుప్పలో పోయిన కట్టలు ఆమె కిప్పించి వెయ్యి."

"అంతటితో ఆమె తృప్తిపడుతుందా?"

"అదీ సందేహమే. తీరాపదికట్టలు వాడిచేత ఇప్పించినా, చోరీ చేసి నందుకు వాడికి జల్మానా విధించి అది కూడా తనకే ఇప్పించవలసిందని ప్రాణాలు తీస్తుంది. ఆమెతో నక్కచావు వచ్చిపడిందయ్యా నాకు. ప్రాణాలు కొరికేస్తుంది. పాడుముండ!"

"ఎట్లాగా నీ రొట్టె విరిగి నేతిలో పడిందిలే. అసలామె సంసారానికెక్కు పెట్టి వున్నావు. మొత్తానికి నీది ధన జాతకమే."

"ఏమో! ఆ ముండ అంతరించే దెప్పటికో, మన పాచిక పారేదెప్పటికో! మరి ముందు దీని విషయం పరిష్కారం చేయాలె. ఈ పని నీ చేతిలో వుంది."

"మరీ ఇంత అన్యాయంలోకి దిగుతున్నా వేమిటయ్యా. రామిరెడ్డి! ఎత్తుకొని పోతూవుండగా ప్రత్యక్షంగా చూచినట్లు సాక్ష్యమేనా వుంటే ఏదో విధంగా యేడవ్వచ్చు. ఎవడో వీథిన పొయ్యేవాణ్ణి పిలిచి, నువ్వు లక్ష్మమ్మ కుప్పలో చోరీ చేశావని ఎట్లాగ నిరూపించడం? నువ్వే చెప్పు".

"సరేలే! ఈ ధర్మ పన్నాలన్నీ ఏకరువు పెట్టడానికి ప్పుడేమీ సందులేదు. నీకు తెలుసు. అసలు చోరీ జరిగిందో లేదో కూడా నాకూ అపనమ్మకమే. ఇంటికి వచ్చి మా పిన్నమ్మన్ని చూడకపోతివి. పొద్దుటినుంచీ ఆమె చేసే అఘాయిత్యం చేస్తే నువ్వేమనుకొందువో! ఈ విషయంలో మట్టుకు నువ్వు పూర్తిగా నామాట దక్కించాలె. నీకు తప్పదనుకో నా మెడకు గండకత్తెర చుట్టుకొంటే, నీకు చుట్టుకొన్నట్టు కాదూ, బసవయ్యగారూ?"

"అయితే భోజనం చేసుకొని మధ్యాహ్నం, వాణ్ణి పిలిపించి విచారించి ఏదో రకంగా తీర్మానం చేద్దాంలే. పెద్ద మనిషివి. నువ్వే స్వయంగా ఇంత నొక్కి చెప్పుతుంటే ఇక తప్పుతుందా?"

"సరే" అంటూ రామిరెడ్డి లేచి ఇంటికి వెళ్లాడు. పదకొండు గంటలయ్యేసరికి బసవయ్యపంతులు కూడా స్నానంచేసి. అహ్నికం పూర్తిచేసుకొని, భోజనం చేసి, మధ్యాహ్నం మూడుగంటలకు కొండడి కోసం ఇంటికి కబురుచేశాడు. బర్రెగొడ్డొకటి మేతా నీళ్ల మేయక పొద్దుగూకులూ అరుస్తూ పశువుల మీదికి ఎగబడుతూవుంటే, దున్నపోతును దాటించడానికి దాన్ని కొండడు పక్కవూరికి తోలుకు పోయాడని ఇంటికాడ చెప్పేవరకు పోయిన మనిషి తిరిగివచ్చి ఆ సంగతులే పంతులుతో చెప్పాడు. తాను చెప్పినపని ఏమి చేశాడో కనుక్కురమ్మని రామిరెడ్డి అప్పుడే కబురు చేశాడు. ఇక ఆలస్యం చేయడానికి వీలుండేటుట్టు లేదని రామిరెడ్డిని పిలిపించుకొని, అతన్నీ, ఇద్దరు వెట్టిగాళ్ళనూకూడా తీసుకొని బసవయ్యపంతులు ఎకాయెకిని మాలవాడలో కొండడి ఇంటికి పోయినాడు. విచారిస్తే కొండడు లేడని తెలిసింది.

కొండడిది ఒక దూలం చప్పరం. మామూలు చుట్టు గుడిసెకంటె రవంత పెద్దది. లోపల కొండడి తల్లి తప్ప ఇతరు లెవ్వరూ లేదు. కొండడి భార్య కూలికిపోయి ఇంటికి రాలే దింకా, దాని చంటిబిడ్డ పదినెల్ల కూన గుడిసెలో కింది గోతంపట్టామీద పండుకొని దొర్లుతూవుంది. ఆ పదిరోజులుగా తిరిగి తిరిగి ఏరుకొని తెచ్చుకొన్న పరిగలన్నీ కలిసి ఒకటి రెండు చిన్న కట్ట లయ్యేవరకు, కొండడితల్లి ఈ రెంటినీ ఒక గుడిసెలో ఒకతట్టుగా వేసి. ఆ రాత్రి కూటికి గింజలు లేనందున, పందెడు కఱ్ఱలు ఆ కట్టల్లోనివి తీసి గుడిసెవాకిట ఎండబెట్టి, ఎండిన కఱ్ఱలు కొద్ది కొద్దిగా తీసి కింద ఈతాకు చాపమీద వరివెన్నులు కుడికాలికింద వేసుకొని నలుపుతోంది. గింజలన్నీ రాలిన తర్వాత గడ్డిని మాత్రం ఒక పక్కగా పెట్టుతోంది.

బసవయ్యపంతులూ, రామిరెడ్డి, సిబ్బందీ వచ్చేవరకు వెంకికి గాభరా పుట్టింది. "ఇదేందబ్బా ఎన్నడూరాని అయ్యవారుకూడా మాలవాండ్ల గుడిసెకాడికి ఎండలోపడి వచ్చాడే" అని దానికి అర్థంకాకుండా వుంది.

"వెంకీ! ఆఖరుకు నీకొడుక్కి ఇల్లాంటి దొంగబుద్ధులు కూడా పట్టుబడ్డాయటె?" అన్నాడు బసవయ్య.

"ఏంది మారాజా! ఏం చేశాడయ్యా నా కొడుకు?"

"ఏం చేశాడా! నిన్నరాత్రి లక్ష్మమ్మ కుప్పలో పన పెరికి చోరీగా తెచ్చి ఇంట్లో వెసుకొన్నాడటగా! ఇదిగో రామిరెడ్డికూడా వచ్చాడు."

"ఏ లక్ష్మమ్మ సామీ! - రామరామ! మేమట్లాంటి పాపాలకు పొయ్యేవాండ్లము కాదుసామీ! నాకొడుకు ధర్మరాజు సామీ."

"ఛీ! నోరుముయ్యి ఊళ్ళో వాళ్ళసొమ్ము దోపిడీచేసి, ఇంట్లో వేసుకొని కమ్మగా తిందామనుకొన్నావా? నీ సంగతి నే నెరగనూ, అసలు నువ్వే చెప్పి పంపించి ఉంటావు కొండణ్ణి దోపిడీ చేయమని, జైలుకి పంపిస్తా చూడు."

"ఏందయ్యా సామీ! ఈ గొడవ ఈ రోజు నా కొడుకు నిన్న పగటేళనంగా బర్రెను తోలుకొనిపోయాడు నాయనా! రాత్రి వాడింటికి రాలేదు. ఆ పాపం మాకు తెలియదు సామీ! ఉంటే తింటాం. లేకుంటే పస్తు పండుకొటాంకాని, దొంగకూళ్ళు మాకు పనిలేదయ్యా! నీకు

దణ్ణం పెట్టి చెప్పుతా!'' అని ఎంకి అనేవరకు వెట్టివాళ్ళ నిద్దరినీ పిలిచి "ఒరే, లోపలికి పోయి సోదావేసి చూడండిరా, ఇంట్లో పనకట్టలుంటే బయట వేయండ'' అని బసవయ్య చెప్పాడు. వెట్టివాళ్ళిద్దరూ మాలవాళ్ళే, బసవయ్య ఈ మాట అనే వరకు ఇద్దరిలో ఒకడు కాలు ముడుకోసుపపోయినట్టుగా పోయి ముఖం తప్పించాడు. రెండోవాడు సందేహిస్తూ సందేహిస్తూ, ముఖం కిందికి వంచుకొని చేతిలో కఱ్ఱ కింద టక్కున కొట్టుతూ, అడుగులో అడుగు వేసుకొంటూ ముందరికి పోతున్నాడు. అది చూచి బసవయ్య పంతులు, "నీకేమైనా సొయ్యమా ఏందిరా? గుడిసెలో సోదావేయమంటే పెళ్ళినడకలు నడుస్తోవేందిరా? మెడలు విరగదతున్నదా, తొందరగా వెళ్లు'' అని వెట్టివాణ్ణి అదలించాడు.

వెట్టివాడు గుడిసెలో దూరాడు.

" ఇదేంది పంతులూ ఈ అన్యాయం .పిల్లోడూ, పిల్లాకూడా ఇంటికాడ లేకుండా చూచి నా గుడిసెకు నిప్పు పెట్టుతుండా వేమయ్యా'' అని వెంకి గొల్లుమన్నది.

మాలవాడలోని మాల లందరూ కూలికి పోయి నందున, ఎవరో అక్కడక్కడ ముసిలీ ముతకా, పిల్లాజెల్లా తప్ప ఇతరు లెవ్వరూ పెద్ద తలకాయలు కనపడడం, వెంకి గుడిసెకాడ జరిగే గలభాకు వున్న వాళ్ళే - పిల్లాపీచూ, పదిమందీ పోగయారు.వెట్టివాడితో గూడా వెంకి గుడిసెలో దూరింది. వాడి కాళ్లావేళ్లా చుట్టుకొంది. లోపలికి పోయిన వెట్టివాడు అయిదు నిముషాలవరకూ బయటకురాలేదు. వెంకి గోలపెట్టుతోంది దాని అవస్థచూచే వరకు వాడికి కళ్లవెంబడి నీళ్లు గిర్రున తిరిగినవి సోదా చేయడానికి కళ్ళచూపు అనలేదు వాడికి.

"లోపల దూరి ఎంత సేపటికీ బయటికి రా వెందువల్లరా? నీ కేమైనా ముసించిందా ఏమిటి? లేక ఈ దొంగసొత్తులో నీ కేదైనా భాగం వుందా? బయటికి రావేమి?'' అని బసవయ్యపంతులు బయట నుండి అరుస్తున్నాడు. వెట్టివాడు బయటికి రాలేదు. బసవయ్యకు వొళ్లు భగ్గుమనింది. వెట్టివాడు మొగమాటంవల్లనో, కులాభిమానంవల్లనో సమయానికి జంకుతున్నాడని, తానిక చెయ్యిచేసుకొంటేనేగాని వీల్లేదనుకొని బసవయ్య దుడుంగున గుడిసెలోకి దూరాడు. వెంకి ఏరి తెచ్చి పోగుపెట్టిన రెండూ కట్టలూ చూశాడు.

"ఈ కట్ట లెక్కడివే వెంకీ?'' అని అడిగాడు బసవయ్య.

"వరి కొయ్యకాల్లో పరిగ ఏరి తెచ్చుకొన్నవి సామీ! ముసిలిముండని. నడుము పడిపొయ్యేటట్టు ఒక్కొక్క కఱ్ఱేయేరి తెచ్చుకొన్నా, ఇది దొంగసొత్తు కాదు మారాజా! నీకు దణ్ణం పెట్టుతా'' అన్నది.

"తప్పుడు మాటలు కూస్తావు'' అంటూ ఆయనే రెండుకట్టల్నీ బరబర బయటికి లాక్కొని వచ్చాడు. వెంకి నోర నెత్తీలబలబకొట్టుకొంటూ బసవయ్యకు అడ్డుతగిలేవరకు, మాలముండ తనను తాకుతుందేమో, పాయశ్చిత్తం చేసుకోవాలెనని భయంతో, బసవయ్య తన చేతికఱ్ఱ రెండు చేతులతోనూ ఆ చివరా, ఈ చివరా పట్టుకొని వెంకిమెడ మీద బెట్టి ఒక్కనెట్టు నెట్టాడు. "చచ్చాను దేవుడా!' అని వెంకి నాలుగు గజాల దూరంలో పడిపోయింది.

బయటికి లాక్కొనివచ్చిన రెండు కట్టలు బసవయ్య చేతనే తన ఇంటికి మోయించేవాడు రామిరెడ్డి. కాని బ్రాహ్మణ్ణి కష్టపెట్టగూడదనుకొని, తన జీతగాళ్ళలో ఒకణ్ణి పిలిపించి రెండు కట్టలూ లక్ష్మమ్మ యింటికి చేర్పించాడు.

కిందపడిన వెంకి కిందనే పొర్లుతూవుండగా, తలపెట్టిన కార్యం జయప్రదంగా, కొనసాగినందుకు సంతోషపడుతూ, బసవయ్య జారిపోయిన జుట్టు ముడివేసుకొని, కర్ర చేతబుచ్చుకొని, చేతులు ఊగిసలాడించుకొంటూ, రామిరెడ్డి తో కూడా ఇంటికి వెళ్ళాడు. వెళ్ళి బావి దగ్గర ముఖాన్న ఉండిన గంధం పట్టెలూ, అక్షతల బొట్టూ పొయ్యేటట్టు పది పందెలు నెత్తికి తోడి పోసుకొని స్నానం చేసి, చేతికర్రకూడా, కడిగేసి, ఇంట్లోకి పోయి పట్టుగుడ్డ కట్టుకొని, విభూతి ధరించి మైలబడ్డ జందెం తీసివేసి కొత్త జందెం వేసుకొని నోట ఎనిమిది సార్లు గాయత్రి జపించాడు: తరువాత లేచి చలవమడతలు కట్టుకొని మంచి తీర్థం తీసుకొని వీధిలోకి పోయాడు. ఇంతలోనే లక్ష్మమ్మ పిలిపించేవరకు ఆమె యింటికి పోయి వీధి అరుగు మీద కూర్చొని అతనూ, రామిరెడ్డీ, లక్ష్మమ్మా ఈ ముచ్చటే ఏమిటో మాట్లాడుకొంటూన్నారు . రెండు వరికట్టలూ ఇంటికి చేరినప్పటికీ పోయిన పొత్తు పూర్తిగా రాలేదని లక్ష్మమ్మ సణుగుతూనే వుంది. చెవులో పోటులాగ. "బయటికి పోయిన మొగాడు. కొండడు ఇంటికి వచ్చిన తర్వాత కొరవగూడా ఏదో విధంగా భర్తీ చేసి పెట్టుత్తాం లేవమ్మా, నీ సొత్తు గడ్డిపరకంత కూడా ఎక్కడికీ పోదు."అని బసవయ్య ధైర్యం చెప్పి లక్ష్మమ్మను ఓదారుస్తున్నాడు."ఏమో నాయనా! నా ప్రాణం హరీ అనేవరకు ఏ కడగండ్లూ లేకుండా నా తను విట్లా తెల్లవారిపోతే, నా కంతే చాలు. లోకుల సొమ్ము నాకు అవగింజంత కూడా అక్కరలేదు. ధర్మాత్మురాలు లక్ష్మమ్మ అని లోకం మొగిపోతున్న రోజుల్లో, ఈనాటికీ మాలముండాకొడుకు నన్ను నలుగురిలోకి ఈడ్చాడు.వీణ్ణి పొలేరమ్మ ఖగ్గిచేసుకుపోనూ' అంటూ సింహద్వారానికి పొదుగిట అనుకుని, కంట తడిపెట్టుకొని పైట కొంగుతో తుడుచుకొంది లక్ష్మమ్మ.

# 7

కొండడు పడమట బారెడు పొద్దుందనంగా అసురుసుర్రై బర్రెను తోలుకొని, పొద్దుటి నుంచీ కూడులేక ఇంటి కొచ్చేవరకు, ఇల్లంతా బీభత్సంగా వుంది. వెంకి ఇంటి ముంగిట దుమ్ములో పొరలాడుతూవుంది. కొండడి భార్య ఇంకా ఇంటికిరాలేదు. జరిగిన విషయం అంతా కొండడు తెలుసుకొన్నాడు. వాడిమనస్సు చీకాకయింది. కథ పెరుగుతున్నందుకు వాడు వగచాడు. అధైర్యపడ్డాడు. కాని ఇంతలో సంబాళించుకొని 'వెధవ పరిగకర్రలు నాలుగూ తీసుకొనిపోతే పోయారు. ఇంత మాత్రానికే చెడేది లేదులే' అని వాటివిషయమై దిగులుపడలేదు కాని,తాను దొంగతనం చేసినట్టు నలుగురి లోనూ అపకీర్తి పాలు కావలసివచ్చిందే అని మాత్రం దుఃఖించాడు. ధైర్యం తెచ్చుకొన్నాడు మళ్ళా తల్లికి ధైర్యం చెప్పి లేవదీసి ఓదార్చాడు. మరికొంత సేపటికి? భార్య వచ్చింది. ముగ్గురూ కాస్సేపు కళ్ళనీళ్లు పెట్టుకొన్నారు. "ఇక ఊరుకోండి. ఇంతటితో మనం అదృష్టవంతులమే" అని కొండడు వాళ్ళని ఊరడించి, లేచి నీళ్లు పోసుకొందామని, కడవ దగ్గిరకు పొయ్యేవరకు కరణమూ, రామిరెడ్డీ పిలుచుకొని రమ్మన్నారని కొండడి తావుకు ఒక మనిషి వచ్చి పిలిచాడు. నీళ్ళు పోసుకొని కొండడు లక్ష్మమ్మ ఇంటికి పోయాడు, మళ్ళా ఏం తెచ్చిపెట్టబోతున్నారో అని భయపడుతూ, బసవయ్యా, రామిరెడ్డీ, లక్ష్మమ్మా కలిసి కొండణ్ణి పదిబూతులు తిట్టి, పోలీసుకు రిపోర్టు చేస్తామని బెదిరించి, కొరతపడ్డ వరికట్టల ఖరీదుకిందా, దొంగతనం చేసినందుకు అపరాధంకిందా వాడికి పదిహేను రూపాయలు జుల్మానా విధించి, ఆపైకం అప్పుడే రొక్కరూపంగా కట్టినాసరే, లేకుంటే లక్ష్మమ్మ పేర రూపాయికి నెలకు అణా వడ్డీవంతున అప్పుపత్రం వ్రాసి యిచ్చినా సరే, ఏదో విధంగా తీర్మానం చేయాలని కస్తీచేశారు. వారు చేసిన పంచాయితీకి కొండడికి కడుపు దహించుకొని పోయింది.

"నన్ను అడ్డంగా పండబెట్టి ముక్కలు ముక్కలుగా నరికినా సరే నేను మాత్రం ఒక దమ్మిడీ కూడా ఇచ్చుకోలేను" అన్నాడు వాడు. అట్లా అనే వరకు.

"నీ మదం అణుస్తా నుండరా! ఊళ్ళో వాళ్ళసొత్తు దొంగతనం చేసి, తేరగా ఇంట్లో వేసుకొని తినడమనుకొన్నావా" అని బసవయ్య గ్రుడ్లు వురిమి, లక్ష్మమ్మ సేద్యగాళ్ళలో ఒక గవండ్లవాణ్ణీ ఒక గొల్లవాణ్ణీ పిలిచి మీరు పోయి కొండడి ఇంటికాడ బర్రెగొడ్డును కొట్టుకొని రాండి. వీడేమో వళ్ళు తెలియకుండా మాట్లాడుతున్నాడు" అని ఉత్తర్వుచేసేవరకు, ఇద్దరు సేద్యగాళ్ళూ ఆ క్షణంలోనే పోయి, కొండడు లక్ష్మమ్మకాడ వుండంగనే బర్రెను తోలుకొనివచ్చి, లక్ష్మమ్మ పశువుల దొడ్లో కట్టివేశారు.

"ఏం చేసినా చెల్లుబడి అవుతుందిగదా అని మీరందరూ కలిసి చేస్తున్నారు ఈ పనులన్నీ, ఇంతకంటె మీరు నన్ను చెడగొట్టేదేముంది? అన్ని పాపపుణ్యాలూ ఆ భగవంతుడే కనిపెడ్తాడు లెండి" అని లోపల కుతకుతలాడే హృదయాన్ని తన నిస్సహాయస్థితివల్ల జనించిన వేదాంతంతో తృప్తి పెట్టుకొంటూ కొండడు ఇంటికి వెళ్ళిపోయాడు. ఇంటి దగ్గర తల్లీ భార్యా గోలు గోలుమని ఏడుస్తున్నారు. పొద్దు గుంకి ఇంటికి చేరిన మాల అమ్మ లక్కలుకూడా పోగయి దవడలు నొక్కుఉంటూ నిలబడ్డారు. కొండడు తల్లినీ, భార్యనూ కూకలేసి ఏడుపు మానిపించి ఆ రాత్రి గంజితాగి పండుకున్నాడు.

తెల్లవారింది. కొండడు రెండు కట్టల వరికఱ్ఱలూ పోయినందుకు దుఃఖపడలేదు గాని, ఎట్లా లేదన్నా ముప్పయి రూపాయలు కిమ్మతు చేసే నిక్షేపంవంటి బర్రె పోయినందుకు మాత్రం కొంత విలపించాడు. వాకిట బర్రె లేక ఇల్లంతా బావురుమన్నది. ఎట్లాగైనా పై వారికి తెలుపుకొని, పోయిన బర్రెను మాత్రం తిరిగి తెచ్చుకొందామనుకొని మహా దొర్లాడినాడు. కాని భత్య ఖర్చుకైనా చేతిలో దమ్మిడీ లేక పోయె ఒక వ్యవహారం ఎట్లా జరపగలడు? అదిగాక బసవయ్య రాక్షసుడు రామిరెడ్డీ లక్ష్మమ్మా బలవంతులు. తాను పోయి,బర్రెను తీసుకుపోయారని ఏ పోలీసువారితోనైనా చెప్పుకుంటే, బసవయ్యా రామిరెడ్డీ కలిసి, అసలు తన మీదికి తెచ్చిపెట్టిన దొంగతనం నేరాన్ని ఏ తప్పుడు సాక్ష్యమో సృష్టించి పెంచి పెద్దచేసి తుదకు తన్ను ఏ జైలులోనైనా పెట్టిస్తారేమోనని భయపడ్డాడు. కొండడు, ఎప్పుడూ ఇట్లాంటి లట్టాలు పడ్డవాడు కాదు. కాబట్టి వాడికి ముందు వ్యవహారం నడపడానికి ధైర్యం చాలలేదు. తాను దొంగతనం చేసినట్టు వచ్చిన అపనిందకే సంగం చచ్చి తిరుగుతున్నాడు. 'దాని తాడు తెగిరి, పోతేపోయింది బర్రె! నే నీతంటాలు పడలే'నని నిశ్చయించుకొని వూరుకొన్నాడు కొండడు.

ఇంతలోనే తన గ్రామ జమాబందీ- తాలూకా కచ్చేరికాడ డిప్టీకలెక్టరు గారు ఇక నాలుగు రోజుల్లో జరుపుతారని తెలిసింది. రైతులు తమ కష్ట సుఖాలను డిప్టీకలెక్టరు దొరతో చెప్పుకోవడానికై తలా ఒక అర్జీ వ్రాసుకొని జమాబందీ రోజున దొరదగ్గరకు పోతున్నారు. కొండడు తన కయ్యకి కాలవకోసరం పెట్టుకొన్న అర్జీల మీద ఇంకా ఉత్తరువులేమిన్నీ రాలేదు. జమాబందీలో దొరగారితో కాలవ సంగతి మొరపెట్టుకొని చెప్పుకొందామని. కొండడుకూడా ఒక అర్జీ వ్రాయించుకొని తాలూకా కచ్చేరికి పోయినాడు. దొరగారికి దణ్ణంపెట్టి తనకు కాలవ యిప్పించవలసిందని కోరగా డిప్టీకలెక్టరు పక్కనున్న తహసీలుదారువైపు చూశాడు. "గ్రామాల్లో పార్టీలు పెంచుకొని, తగవులాడుకొని, ప్రతీవాళ్ళూ కాలవలు కావాలని కోరుతున్నారు సార్! ఈ అర్జీదారుకు అరెకరా భూమి కంటే జాస్తిలేదు. వీడికి కూడా ఒక కాలవ కావలెనంటే ఎట్లా వస్తుంది? ఒకరికి గనుక ఇచ్చినామంటే, ఒక ప్రతీ

రైతూ తన ప్రతికయ్యకూ కాలవ ఇప్పించమంటాడు ఇది సాధ్యం అయ్యేపనిగాదు సార్!" అ తహసీలుదారు జవాబు చెప్పాడు.

"అవునవును, మీరు చెప్పింది నిజమే" నంటూ డిప్టీకలెక్టరు కొండడి వైపు తిరిగి, "నీ ప్రత్యేకంగా కాలవ యివ్వడానికి వీల్లేదు.నీ అర్జీ తోసి వేశాం" అని ఉత్తరువు చేశాడు.

"అయ్యా!నేను బీదవాణ్ణండి: నాకయ్యకు నీళ్ళు పారించుకునే ఆధారం లేదండి" అన్నాడు కొండడు.

"గ్రామంలో వెయ్యీ, రెండు వేల ఎకరాలకు నీళ్ళు పారుదల అవుతూవుంటే నీ అరెక కయ్యకూ నీళ్ళురావడం లేదంటే ఎవరైనా నమ్ముతారా?" అన్నాడు డిప్టీకలెక్టరు.

"లేదు సామీ! లక్ష్మమ్మగారూ, కరణం బసవయ్యగారూ కలిసి నన్ను అన్యాయం చేస్తున్నారు సామీ! నీ మీద చోరీనేరం మోపి నా బర్రెగొడ్డును తోలుకొని పోయారు సామీ! తమరు కటాక్షించకుంటే నా కయ్యను బీడెట్టుకుని పోవలసిందే సామీ!" అని కొండడు గోలచేశాడు.

"ఒరే! ఇది కచ్చేరీగాని, మీ మాలవాడకాదు, తెలుసునా? నీ నడవడికి మంచిదయితే గ్రామంలో అసాములు నీరు రానియ్యకుండా ఎందుకు చేస్తారు? అరెకరా కయ్యగలవాడివి నువ్వు లక్షాధికారులతో తగవుపెట్టుకోవచ్చురా?" అన్నాడు డిప్టీకలెక్టరు.

"వీడు గజదొంగ సార్! వీణ్ణి కె.డి. రిజిష్టరులో చేర్చడానికి పోలీసు సబినస్పెక్టరుగారు రాసుకొనిపోయారు సార్!" అని అక్కడనే నిలబడివున్న కరణం బసవయ్యగారు ఆ కొరవ పూరించాడు.

"గొప్పవాళ్ళతో ఎన్నడూ తగవు పెట్టుకోకూడదురా! పో!పో! ఈ లక్ష్మమ్మ కాళ్ళూ కడుపూ పట్టుకుని నలుగురితోపాటు నువ్వుకూడా నీళ్లు పారించుకొ, పో! ఆమెతో తగవులు పెట్టుకోకు" అన్నాడు డిప్టీకలెక్టరు దొర.

"అయ్యా! నా మీద అబద్ధపు కేసు పెట్టి ఈకరణం బసవయ్యగారు అన్యాయం చేస్తున్నాడండి ' అన్నాడు కొండడు. "జమాబందీలో అవన్నీ విచారించడానికి మాకు వీల్లేదు. నీ కేదైనా అన్యాయం జరిగితే సాక్ష్యం తెచ్చుకొని మేజిస్ట్రేటులోనో, సివిల్‌లోనో దావా పెట్టుకో మే మేమీ చేయడానికి వీల్లే"దని దొర ఇంకొ అర్జీదారును పిలిచాడు. నెత్తిన గుడ్డవేసుకొని కొండడు ఇంటికి పోయాడు

## 8

జమాబందీ అయిన మర్నాడే తాలూకాలో జరిగిన సంగతంతా లక్ష్మమ్మకు తెలిసిపోయింది మాలవాడికి బాగా జరిగిందని చంకలు తట్టుకుంది. వ్యవహారం తమకు అనుకూలమై, కాలవ ఇవ్వడానికి వీల్లేదని దొర తీర్మానం చేశాడు కాబట్టి, అనుకొన్న ప్రకారం ఫయినలు చేయించవలసిందని రెవిన్యూ ఇనస్పెక్టరు లక్ష్మమ్మ కాడికి కబురు చేశాడు. ఇప్పుడు చేతిలో దమ్మిడీ లేదని జవాబుచెబుతూ, కొండడికి పట్టాకిచ్చిన కయ్య మార్పించి తన పేర పట్టా తెప్పించినట్టయితే దానికీ, దీనికీ కూడా కలిపి అనుకొన్నది ఇస్తానుగాని ఇప్పుడేమీ ఇవ్వడానికి వీలులేదని జవానుతో చెప్పి పంపింది లక్ష్మమ్మ. ఇంతలోనే కొండడు వచ్చి ఇనస్పెక్టరుకు దణ్ణం పెట్టి -

"సామీ! నాకు కాలవ తెప్పిస్తానంటిరి. ఆఖరుకు డిప్టీకలెక్టరు దొర ఒప్పుకోకపోయె! నా అయిదు రూపాయలూ నాకు పారెయ్యండి" అని అడిగాడు.

" ఇదేమీ వంకాయల బేరం కాదు; కొరవ అయిదు రూపాయలూ నీవు అప్పు ఇచ్చివుంటే, నీకీపాటికి కాలవ వచ్చేవుండును. స్వల్పంలో అజ్ఞాయించినందుకు వ్యవహారం ఇట్లా అయింది. చేతికి వచ్చిన పైకాన్ని వాపసుయిచ్చే ఆచారం మన దగ్గర లేదు. పో" అన్నాడు ఇనస్పెక్టరు పంతులు. ఉసూరుమంటూ కొండడు వెళ్లిపోయాడు.

కొండడికి చెడ్డ రోజులు వచ్చినవి. లక్ష్మమ్మకు తన మీద ఇంత పగ ఎందుకో వాడికి అర్థంగాలేదు. ఆమెకు తోడు ఇప్పుడు బసవయ్యకూడ పగవాడయినాడు. కాలం కర్మంకూడా ఒనగూడినట్లయింది వాడికి.ఎవరితో పోయి చెప్పుకోడానికీ దిక్కుతోచలేదు. కయ్యకోసం తెచ్చిన అప్పు పెరిగిపోతోంది. లక్ష్మమ్మతో వ్యవహారం ముదిరిపోయింది. బసవయ్య పగ తాచుపగే: ఎప్పుడేం చేస్తాడో అని దిగులు. వెనుకటి గుండెనిబ్బరం చెడింది. ధైర్యం పలచబడుతోంది కొండడికి.

ఇంట్లో కూటికి గింజలులేక, అమరునాడు చీకటితోనే తన కుప్ప తొక్కించాలని ఆ రోజు తనూ, తన భార్యా యిద్దరూ పొలం పోయి కళ్ళం బాగు చేసి వచ్చారు. మాలవాడలోనే పది పశువులని సంపాదించుకొని తెల్లవారుజామున పోయి కుప్ప పడగొట్టాలనుకుని ఇద్దరూ కూలివాళ్లను మాట్లాడుకొన్నాడు. నెల పొడవంగనే లేచిపోదా మనుకొని పెందలకడనే నడుం వాల్చాడు కొండడు.

జమాబందీలో కొండడు డిప్టీకలెక్టరు దొరతో చెప్పిన నేరాలకు బసవయ్య ఉగ్రుడై ఉన్నాడు. "దమ్మిడీకి కొరగాని పక్షి పబ్లీకులో వచ్చి బ్రాహ్మణ్ణి. నీ మీద దొరదగ్గిర తంటాలు చేస్తాడా?హు! నేను నియోగిబ్ణిను వీడికి నా మజా తెలియదు. ఇంతవరకూ వచ్చింతర్వాత వెనక్కి తిరిగితే పంతులు ఆఖరికి మాలవాడిచేతిలో చిక్కుకొన్నాడంటారు నలుగురూనూ, ఇక గ్రామంలో వాడైనా కాపురం ఉండాలె, నేనైనా ఉండాలె. వీరి అంతు పట్టిచూస్తా" అని బసవయ్యపంతులు పరవళ్ళు తొక్కుతున్నాడు. కొండణ్ణి పిలిపించి సమక్షంలో వాణ్ణి నాలుగు బూతులు తిట్టి పంపడం అంటే ఆయనకు తృప్తి కాలేదు. శాశ్వతంగా నిలిచేటట్టు వాడికి తగిన వాత వేయాలని తీర్మానం చేసుకొన్నా డాయన. తాను వేసుకొన్న ప్లానుకు ఇక కొండడితో మాట్లాడక పోవడమే మంచి దనుకొన్నాడు. తన హృదయ గోళంలో ప్రజ్వలించే క్రోధాగ్ని ప్రత్యక్షంగా బయలుపడి శత్రునాశనం చేయవలసిందేగాని దాన్ని బయట పెట్టకూడదనుకొన్నాడు బసవయ్యపంతులు.

సాయంత్ర మయింది. బీదలను హింసించే దుర్మార్గుల చర్యలను చూడలేదేమో సహస్రకరుడు ప్రాపంచిక దృక్పథాన్నుండి చాటుకుపోయాడు.ఆ అసురసంధ్యవేళ బసవయ్య రామిరెడ్డిని పిలుచుకొని లక్ష్మమ్మ ఇంటికి పోయాడు. బసవయ్యకూ లోకానికీ అంధకారం అలుముకొంది.

"పంతులూ! ఆ కయ్య మనకు దఖలుపడేటట్టు చేస్తూ, నీ ధర్మాన కాలవ పోనేపోయింది. మాలవాణ్ణి మటుమాయం చేసి కయ్యలో కయ్య కలుపుకొనేదాకా నాకు నిద్రపట్టదు. పంతులూ! ఇదిగో, ఈపని నీ చేతిలోనే వుంది" అని లక్ష్మమ్మ అనేవరకు, "తొందరపడకు. వాడికి అంత్యకాలం సమీపించిందిలే; ఇప్పుడు నేను వచ్చింది అసలు ఆ పని కొరకే" అంటూ పంతులూ, రామిరెడ్డీ, లక్ష్మమ్మా మిద్దె మీదికి పోయి, ఒక అరగంట సేపు ఏమేమిటో గుసగుసలాడుకొన్నారు. సరేనంటే సరేననుకొని అందరూ మిద్దెదిగి కిందికి వచ్చారు. ఎవరిదారిని వాళ్ళు వెళ్లారు. బసవయ్య ఇంటికి పోయి ఉడుకునీళ్ళు పోసుకొని సాయం సంధ్య వార్చుకొని భోజనం చేసి పండుకొన్నాడు.

కొండడి ఇంట్లో కొండడు నిద్రపోతున్నాడు. బసవయ్య ఇంట్లో బసవయ్య నిద్రపోతున్నాడు. జగత్తంతా నిద్రపోతున్నది. ఒక్క లక్ష్మమ్మ తప్ప. లక్ష్మమ్మ కాదినం ఏకాదశీ పర్వదినం నిద్రపోలేదు. జాగారం చేస్తోంది. తనతో పాటు రామిరెడ్డిని కూడా మేలుకోబెట్టి అతని వల్ల భాగవతం చదివించి వింటోంది. రామిరెడ్డికీ అత్రంగానే వుంది - పడుకొంటే బాగుండుననేమో.

నెల పొడిచి కొండిణ్ణీ, వాడి భార్యనూ నిద్రలేపింది. కూలివాళ్ళను కేకేసి చద్దన్నం మూట కట్టుకొని, పశువులను తోలుకొని కొండడూ, వాడి భార్యా కుప్పకాడికి బయలుదేరారు. ఒక పావుగంట సేపటికి వాళ్లు కుప్పకు కనుచూపు మేర దూరంలోనికి వచ్చారు. చూస్తాడు గదా తేరిపారి కొండడు, పొగా మంటా కనపడింది. వాడికి తన కుప్ప వున్న స్థలంలో ఇదేమా అని వాడికి గుండె బేజారయింది. నవనాళ్లూ క్రుంగిపోయాయి. ఒళ్ళు తెలియలేదిక గుండెలు కవుక్కొంటూ ఒక్కటే పేరెంతీశాడు కొండడు కుప్ప కాడికి.

వచ్చాడు కొండడు. మండుతూన్న కుప్ప కెదురుగ్గా నిలబడ్డాడు. అప్పటికే కుప్ప నలువైపులా అగ్నిహోత్రుడి సందిట్లో చిక్కుకొంది. చిటపటమంటూ బ్రహ్మాండంగా మండిపోతోంది. తూర్పుగాలి అందుకొని అగ్నిపోయే ఆ మంటలకు కొండడి వాళ్ళుకూడా మంటలెక్కి పోతోంది. మొగాన నెత్తురుచుక్క లేదు. చూశాడు చూశాడు కుప్పకేసి; నివ్వెరపోయి వెర్రిచూపులు చూశాడు. చైతన్యం స్తంభించిపోయింది. మండుతున్న కుప్ప కేసి కొయ్యబారిపోయి చూస్తూ కుప్పగూలిపోయాడు కొండడు.

# 7 ముత్తాయి కూతురు

శ్రీ మా గోఖలే

ఆ గుంటుపల్లి పల్లెటూరుకు కొంచెం పెడగావున్న మాలపల్లిలో ఓ మూల గుడిసెలోంచి తెల్లవారి చద్దిబువ్వతిని, పైపంచతో మూతితుడుసుకుంటూ బయటికి వొచ్చాడు మాదిగ ముత్తాయ్.

గుడిసె పక్కన సాయిమేకుకు కట్టివున్న బర్రె వద్దకు నాలుగు గడ్డిపకరలు వేసి మునసబు కచేరి నౌకరుపనికి పోదామనుకుంటున్న ముత్తాయికి మట్టిగాబు దగ్గిర రొచ్చులో దిగి, ముంతతో గాబులో నీళ్లు తాగుతున్న తన నాలుగేళ్ళ కూతురు లచ్చి కనిపించింది.

"అప్పుడే తెల్లారిందంటే నీకు గాబు కాడికి చేర్డానికీ? మీ అమ్మ సూసిందంటే చంపుద్ది రాఇటే అన్నాడు ముత్తాయ్ బర్రెపడ్డకు గడ్డిపరకలు వేస్తూ.

"ఈ లచ్చి ముండ అప్పుడే గాబుకాడికి చేరిందీ? ఒస్తున్నా, ఇయాల దీనికి మూడిందే" అంటూ గుడిసెలోంచి, ముత్తాయ్ పెళ్ళాం మాణిక్యం కేకేసింది.

ముంత గాబులో దభీమని పారేసి బురదకొట్టే కొంటూ గబగబ ముత్తాయ్ దగ్గిరకు పరుగెత్తుకొచ్చింది లచ్చి.

"ఛీ, నీ బురద సేతుల్తో నన్ను ముట్టుకోమాక" అంటూ కూతురుకు దొరక్కుండా పక్కకు తిప్పుకుంటున్నాడు ముత్తాయ్ నవ్వులాటగా.

"మరి నాకు చెనగపప్పు తెచ్చిపెత్తానంతే"... అంటూ బురద చేతుల్తో ముత్తాయ్ వెంటపడింది లచ్చి పెద్ద పెట్టున కేరింతలు కొడ్తూ.

" ఆసి సచ్చిందానా, ఇంకా తెల్లగా తెల్లార్వన్నాలేదు అప్పుడే ఒల్లంతా బురదపూసుకుండా? ఇయ్యాల నీ ఈపు పగిలిందే - ఒత్తున్నా వుండు" అంది గుమ్మంలో కొచ్చిన మాణ్యెం, దూర్లోంచి మట్టి తీసుకుని లచ్చి దగ్గిరకొస్తూ.

"అయ్యా, అయ్యా" అనరుస్తూ మాణిక్యాలు దొరక్కుండా తప్పించుకుని ముత్తాయిని గభాలున వాటేసుకుంది లచ్చి.

"అయ్యో, సచ్చిందానా, అయ్యపంచకు బురద పూయనే పూశావుగందే! ఉండు నీకు రాసింది అంది మాణిక్యం లచ్చి మీదికొస్తూ.

".ఏహె ఉండు ఏంది నీ రగడా".. అంటూ లచ్చి ఒళ్లు తడివి".. పిల్లబల్లు ఎచ్చగా ఉండేమిటి అన్నాడు ముత్తాయ్.

ఆ? ఎచ్చగా ఉందా? అయ్యో నా తల్లీ'' అంటూ ఎన్నకరిగినట్టు కరిగిపోతూ లచ్చి పొట్టపట్టుకు చూసింది మాణిక్యం.

"పిల్లదానికి కాకతగిలిందిలేయే'' అన్నాడు ముత్తాయ్ లచ్చి మెడకింద సెయి పెట్టి చూస్తూ.

"ఎచ్చగా పొట్టావజానుంటే కాకతిరిగిందని ఇంకా మెల్లిగా అంటావేం? తెల్లారి ముక్కు కార్తుంటే అప్పుడే అనుకుండా ఇయ్యాలేందో ఉండదని'' అంది, మాణిక్యం లచ్చి సేతులూ, ఒంటి మీద బురద కడుగుతూ.

"ఏందే తెల్లారే పొట్టుకుందీ? కాత్తె కషాయం కాసిపోత్తావంటే? అన్నాడు ముత్తాయ్, అఃటీద లచ్చి సేసిన బురద తుడుసుకుంటూ.

"నువ్వు సేశాగా, ఇప్పుడే కాసిపోత్తా'' అంది మాణిక్యం, లోపల్నుంచి ఇంత ఉప్పుగల్లు తెచ్చి లచ్చికి దిష్టితీస్తూ.

"నిన్న రేత్రే మునుసుబు గారు ఊర్నుంచి ఒచ్చారంట. నేను కచేరిపావిడికి ఎల్తుండాగానీ పిల్లదాన్ని సుట్టముట్టించుకుని బయల్దేర్తూ.

"కాత్తె పెందలకాడే తిరిగిరాయ్యా,'' అంది మాణిక్యం లచ్చిని చంకనెత్తుకుని.

మాలపల్లి నుంచి గుంటుపల్లి ఎంతలేదన్నా ఆరుమైలు పై ఇలుకుంటుంది. గుంటుపల్లి మునసబు కచేరీలో ముత్తాయికి ఎట్టేపని. ఈ నౌకరీ ముత్తాయికి ముత్తాల నాటి నుంచీ దొర్లుతూ ఒచ్చింది. మోతాదు బడే సాయిలు కచ్చేరులో వేలి ముద్దర్లేయించడం, లెక్కల పుస్తకాలు, సిరాబుడ్లు సరి చూడ్డం, సిత్తు మాళ్లకు వారికీ వీరికీ ఎచ్చరికలు సేయటం మొదలైనవి విషకులుంటే ముత్తాయి పొలాల కొలతలకూ, ఏసేందుకు ఇంకా సిల్లరమల్లర పన్లు చేసేందుకూ ఏర్పాటైనాడు. ఇదిగాక దేవుడి తిరణాలకు కాష్టాలకు, కట్టెలు మోసి, పశువులు చస్తే తెచ్చుకుని ఆటితొళ్ళతో సెప్పులు, ఎద్దుమెళ్ళో పట్టెళ్ళు సికమార్లు, సెర్నాకోలలు వేసి కుటుంబం నడుపుకుంటున్నాడు ముత్తాయ్.

మాలపల్లి జనం కూలిజనం గనుక పెందరాడే వస్తారు. వీలుంటే పెళ్ళాలకు సాయంగా ఊరిబయట కుంటలో నీళ్ళు తెచ్చి బానలు, బుంగలు నింపి కూడు తిని కూతురికి పొయ్యే వారు పోతే, సీకల్తో లెగసే మోసంగానే నెత్తిన పైపం చేసుకుని ఎల్తుర్లో పెళ్ళాం, పిల్లలను చూసుకోనన్నా సూసుకోకుండా పని పోతారు కొందరు మాలపల్లి జనం.

"ఓరి ముత్తాయోవ్? ఇయాలేం కచేరికి మా ఊసేమీ వెల్తుండావు. మునసబుగారొచ్చాం? అని వీపుమీద కాండిబరువుకు నిగడదన్నుకుని కుంటనుంచి బరబరా ఒస్తున్న లచ్చాయ్ కేకేశాడు ముత్తాయిని.

"నిన్న రేత్తిరే ఒచ్చారు మునుసుబుగారు. శిస్తు బకాయిలు ఇంకా మిగులు ఉండగా, ఇయాల సానామటుకు వసూలుగావాలిమరి. ఇంకా నువ్వు కూలిపనికి పోకుండా ఈడే కూకుండా వేరా? ఇయాల మా మరదలు పిల్ల నీలుపోసి గాని పోనీవని నిలేసిందా ఏరా? అన్నాడు ముత్తాయ్ కావిడి బద్ద ఊపుకుంటూ దగ్గిర కొచ్చిన లచ్చాయ్‌తో.

"అది గంతేలే. పోనీగంధా అని ఏనాడన్నా కుంట నుంచి నాలుగు బుంగలనీలు తెచ్చిపోత్తానా? ఇదిగో ఈ వజానంటారు. అందులో నీకు సందు దొరుకుతేసాలు మరదల్ని ఎనకేసుకొత్తావు. నోట్లోకి కాత్తె పుగాకు ముక్కంటే పెట్టావంట్రా ముత్తాయ్?'' అన్నాడు లచ్చాయ్, కావడి బరువుతో కాసేపు ఆగు.

"ఎబ్బె నీతోడు, ఏలంటే ఏలెడుంటే ఇంతకుముంగలే పట్టుసుట్టుకుండా. ఉంటే రెప్పెడ్తాలే. పిల్లదానికి కాత్తె కాకతగిల్నట్టుందిరా లచ్చాయ్ అన్నాడు ముత్తాయ్

"చ, ఇంతకుముంగలే మీ గాబుకాడ నీలు పారబోస్తుంటే సూశాను గదంట్రా ముత్తాయ్? పిల్ల బాగనే ఉండదే? ఇంతలోనే కాకెట్టతగిలిందిరా?" అన్నాడు లచ్చాయ్ నమ్మనట.

అళ్ళమ్మ కేకలేత్తుంటే ఒచ్చి నాకళ్ళు వాటేసుకుంటే ఇట్టసూద్దునుగంద్దా, ఒళ్ళు ఎచ్చగా ఉంది అన్నాడు ముత్తాయ్, లచ్చి ఒటం వేడి తన సేతులకు ఇంకా తగుల్తున్నట్టుగా.

"ఓస్, మద్దాన్నానికి అదేజారిపోద్దిలే. మరి పిల్లదానికి నోట్టో కాత్తేమన్నా పోశావా?" అన్నాడు లచ్చాయ్.

"మీ ఒదినె కసాయం కాసిపోత్తానందిలే" అన్నాడు ముత్తాయ్.

"ఇనేం, మా మానిక్యం ఒదినెకు ఇసువంటి బైద్దికాలు సానా తెలుసు. ఇహ దానంతటదే పోద్దిలే. అదిగో ఏమరదలు దడికాణ్ణుంచి అప్పుడే నిక్కి నిక్కి సూస్తుండది. ఎల్తుండారోయ్ ముత్తాయ్" అంటూ కావడిబద్దతో కిర్‌కిర్ ఊక్కుంటూ ఎల్లిపొయ్యాడు లచ్చాయ్.

లచ్చాయ్ గుడిసెదడిదగ్గర నిజంగానే నిలబడి సూస్తున్న సుబ్బాం వేపు సెయి ఊపుతూ గుంటుపల్లి వేపుకు సాగాడు ముత్తాయ్.

సుబ్బాంటే తనకెంత గురో మధ్య మధ్యఅ నుకుంటుంటాడు ముత్తాయ్. తనకు మాణిక్యం మీద మనసుమళ్లి సెడ్డ తిపనబడ్తున్న రోజుల్లో సుబ్బాం అతి తెలివిగా యవారం పెళ్లి ఏర్పాటు దాకా నడిపి తనకూ మాణిక్యానికి జోడు కలిపింది. ఇందుకు తనూ, మాణిక్యానికి జోడు కలిపింది. ఇందుకు తనూ, మాణిక్యం గారు బొమ్మకు ఓ ఏటపోతును బలిచ్చుకున్నాను కూడా తన పెళ్ళయి మాణిక్యంతో సుఖంగా గడిసిపోతుంటే కొన్నాళ్ళకు సల్లగా నస సాగించింది మాణిక్యం. తనకు పిల్లలు పుట్టకపోవటం వల్ల తనకు గొడ్డుమోతని ఒకరిద్దరనుకోవటం ఇన్నానని మొదలుపెట్టింది మాణిక్యం. కరువులో అధికమాసం అన్నట్లు పిల్లలకోసం ఇప్పట్నుంచి ఎగబడద్దన్నాడు తను మాణిక్యంతో, ఇప్పటికిప్పుడు పిల్లలు పుట్టకపోతేమటుకు ముందుకు పుట్టరనే ఖరానా ఏమిటని కూడా తను మాణిక్యంతో సానాసార్లు సెప్పి చూశాడు. అయినా మాణిక్యం నస ఆపకపోంగా కనపడ్డ సెట్టుకు పుట్టకు దీపాలెలిగించి, పాలు పొంగించీ పప్పుబెల్లలు పెట్టి, తడిగుడ్డల్తో పెదచ్చినాలు సేసీ పెద్ద గందరగోళం సేసింది లచ్చిపుట్టేదాకా. లచ్చి పుట్టి మాణిక్యంమళ్ళీ మామూలుదారిన పడ్డప్పుడల్లా అనుకుంటాడు ముత్తాయ్. అందుకే లచ్చికి ఏ ఇంత ఎచ్చు తగ్గు లొచ్చినా కాత్తె కంగారుపట్టం ముత్తాయికి హెల్తీ. అయితే ఏ లచ్చాయ్‌లాంటి మనసు కలిగిన మనిషో గనకు పుడితే ధైర్నంగా నిలబడిపోయే మనిషే ముత్తాయ్ గూడా.

మునసబుగారింటి కెల్లి దణ్ణాలు పెట్టుకుని, మునసబుగారి గొడ్లసావిట్లో గొడ్లకు మేత ఉందో లేదో సూసి, జీతగాడు సావిడంతా బాగుసేసి పోయినా మళ్లీ ఒకటి రెండు పేడకళ్ళు తీసేసి, మునసబుగారి పెళ్లాం సెంద్రమ్మగార్ని పనేమన్నా ఉండదా అని అడిగి, లేదనిపించుకుని, మునసబుగారు గుడ్డలేసుకుని కచీరుసావిడికి బయలుదేర్తే ఎనికీడ్తేనాళ్ళూ, కచీరుసావిడి గుమ్మం దగ్గరకు సేరి సేతులు కట్టుకుని నుంచున్నాడు ముత్తాయ్.

పెదకరణం, సినకరణం అప్పటికేవచ్చి లెక్కలురాసుకోటం ఓరకన్నుతో మూశాడు ముత్తాయ్. "ఇవాళ సిస్తులు కట్టాలని మొన్న టంకు వేశావుట్రా ముత్తాయ్?" అని కేకేశాడు కచేరిలోంచి మునసబుగారు.

"సిత్తం దొరా. తమరు సెప్పినట్టే ఓపూట పూటంతా టంకేశానండి" అన్నాడు ముత్తాయ్ మునసబుగారి కంటికి కొంచెం ఓరగా కనుపిస్తూ.

"మరి ఏరీ ఇంతవరకు ఎవరూరాలేదేం?" అన్నాడు మునసబుగారు విసుగ్గా.

"బడేసాయిబు కేకేసుకురావటానికి ఎల్లాడండి. అదిగో రామయ్యగోరు ఒత్తున్నాడు దొరా" అన్నాడు ముత్తాయ్ రామయ్యకు దారి ఒదుల్తూ.

"ఇవాళే సిస్తు కట్టాలని గాపకమే లేదండి మునసబుగారూ" అంటున్నాడు కచేరిసావిట్లో పోయిన రామయ్య.

"ఇదేం మర్యాద రామయ్యా? ఇప్పటికి రెండు వాయిదాలు దాటేపోయినై. ఇంకెన్ని వాయిదాలు వేయించమంటావో నువ్వే చెప్పు అని నెమ్మదిగా అడుగుతున్నాడు మునసబుగారు.

"మళ్లీ టంకుదేనికీ? రెండుమూడు రోజులు పిలవకపోయినా వచ్చి కట్టిపోతే సరిగా" అంటున్నాడు రామయ్య.

"ఒరేయ్ ముత్తాయ్? ఆ రత్తయ్యను వెళ్ళి పిలుచుకురారా ఊరంతకి తెలిసినా ఆయనక్క మటుకు తెలియలేదంటాడూ? అని కేకేశాడు మునసబుగారు.

"రత్తయ్య బఱ్ఱెగొడ్డు ఇంతకుముంగలే వచ్చి పోయిందంట, మరి ఏం వస్తాడో అన్నాడు రామయ్య.

"సరే, చచ్చిన గొడ్డును బతికించటం ఎవరివల్లవుతుంది. రామయ్యా, సర్కారుసొమ్ము కట్టకపోతే పేచీ వస్తుంది గానీ? వెళ్ళి కేకేసిందిరా ముత్తాయ్‌కి అన్నాడు మళ్ళీ మునుసుబుగారు.

చచ్చిన బఱ్ఱెగొడ్డు చుట్టుతా తిరుగుతున్న రత్తయ్య కెదురుగా వెళ్ళి నిలబడ్డాడు ముత్తాయ్.

"వెయ్యేళ్ళు బతకరా ముత్తాయ్, అనుకుంటుండగానే ఒచ్చావు. ఎటువంటి బఱ్ఱెగొడ్డు చచ్చిందో చూశావా?" అన్నాడు రత్తయ్య విచారంగా.

"తమరి బఱ్ఱెగొడ్డు నాకు తెలవదంటండీ దొరా మాలావుపుటగ్గలది" అన్నాడు ముత్తాయ్.

"సరే, బతక నిబిడ్డ బారెడు మరి దీని సంగతేమంటూ? బయటకి చేరేస్తావా" అన్నాడు రత్తయ్య.

"అదేంటి దొరా కొత్తగా మాట్టాడ్తుండారూ సచ్చినగొడ్డును మేం గాకపోతే ఇంకెవరు తీసికెల్తారు అన్నాడు ముత్తాయి.

"అది సరే లేవోయ్. కాదని ఎవరన్నారూ? ఇదిగో ముత్తాయ్? ఎందుకంటున్నావో అనుకోవద్దు గానీ బఱ్ఱె ఖరీదు నాలుగు రూపాయలవుతుంది. తరువాత నీ ఇష్టం అన్నాడు రత్తయ్య.

"సచ్చినబఱ్ఱె నాలుగు రూపాయలా? ఎప్పుడూ ఇన్లేదండి దొరా అన్నాడు ముత్తాయ్, అట్టా నోరు తెరుస్తూ.

"ఇప్పుడు వింటున్నావుగా, చచ్చినబఱ్ఱె అయినా నాలుగు డబ్బులు గిట్టుబాటు చేస్తుంది నాలుగో మూడున్నరో ఇచ్చుకుంటే దండగ కాదుగా అన్నాడు రత్తయ్య.

"తమ రట్టంటే మా బీదోళ్ళేం కావాలి దొరా. మునసబుగోరు తమర్ని కేకేయమంటే ఒచ్చానండి రత్తయ్యగోరూ అన్నాడు ముత్తాయ్.

"ఏన్నాం లేవోయ్ ఇంతకుముందరే మీ బడే సాయిబును తోలరుగా, మళ్ళీ నువుకూడానా! దాందుంపదెగిరి మరీ ఒకటే ఊదర్రైతే ఎట్లా? ఇదిగో నా చేత నాలుగుసార్లు ఎందుకనిపిస్తావ్

దీని విషమేమంటావో పైసలేసి మధ్యాహ్నం లోపల తేల్చి చెప్పయ్, మళ్ళీ ఇంకోర్ని చూసుకోవాలి అనేసి ఇంట్లోకి వెళ్ళిపోయాడు రత్తయ్య.

చచ్చినబఱ్రెగొడ్లు నోసూపు చూసి ఆలోచిస్తూ రత్తయ్య గుమ్మం దిగాడు ముత్తాయ్.

"ఒరే ముత్తాయ్?" అని కేకేశాడు బైస్కోలు బండి మీద ఉసిగా పోతూ బేకునొక్కి ఆగిపోయిన ఆసుపత్రి డాక్టరు.

"దణ్ణాలండి డాటరుదొరా" అన్నాడు ముత్తాయ్.

"ఒరేయ్, ఇంట్లో కట్టెలు లేవల్లే ఉంది? వెళ్ళి నేనుచెప్పానని చెంచయ్య కొట్లో రెండు గుళ్ళ కట్టెలు ఇంట్లో పడేసిపో అంటూ ముత్తాయ్ గుక్క తిప్పుకునేలోపే డాక్టరు బూస్కోలుమీద మాయమయ్యాడు.

ఇహ తప్పదు తొందరగా చేసేసి పోదామని చెంచయ్య కొట్టువేపుకు ముత్తాయ్ నాలుగడుగులు వేశాడో లేదో ఒరేయ్ ముత్తాయ్ ఒక్క క్షణం ఆగరా?.. అని ఆడగూతురు గొంతు వినిపించింది.

"అబ్బే ఏం లేదులే, ఏమిటా డాక్టరుగారు నీతోచెప్పిపోతున్నారు? అంది సీతారావమ్మ ఎదురింటి గుమ్మంలో నిలబడి డాక్టరు వెళ్ళిన దిక్కే నిక్కి నిక్కి చూస్తూ.

"ఆఁఏం లేదండీ సీతారావమ్మగోరూ! నాలుగు కట్టెపేళ్ళు ఇంట్లో పడేసి పోమన్నారైండి" అన్నాడు ముత్తాయ్‌తొందరపడుతూ.

"హాఁ అయినా ఆయనేం చెబితే నాకెందుకులే. ఒక్కసారి ఇటొచ్చిపోరా ముత్తాయ్. కర్మ కాలిపోను. తెల్లవారి లేవంగానే నాకీ బ్రహ్మత్య చుట్టుకుంది. మా దొడ్లో పిల్లి వచ్చింది. నాయన్నా యవ కాస్తదాన్ని ఆటైటైనా పారేసిపోదూ అంది సీతారావమ్మ ఆరాటంగా.

"అబ్బో.. సానాపన్లుండాయ్. దొర్సానమ్మగోరూ" అనంటున్నాడు ముత్తాయ్.

వాటికేంలే నీకెప్పుడూ ఉండేవే. నువ్వు ఇప్పుడు కాదన్నావంటే ఇహ బ్రహ్మదేవుడు దిగివచ్చినా ఆ పిల్లిని నాకంటికి కనపడకుండా తిప్పిందలేదు నాయన్నాయన అంది సీతారావమ్మ దొడ్లోకి దారితీస్తూ.

సీతారావమ్మ పిల్లి పని నుంచిబయటపడి, చెంచయ్య కొట్టుకు గబగబ వెళుతున్న ముత్తాయికి మాల పల్లి నుండి ఒస్తున్న ఆదాయ్ కోడలు వీరమ్మ దార్లో ఎదరైంది.

"ఏం ఈరమ్మా బాగుండావా? యాడకెల్తుండా? అని పలకరించాడు ముత్తాయ్ వీరమ్మను.

"పిల్ల కాలువగట్టుకెల్తుండా గానీ మీ లచ్చికి కాక తగిలిందంటగా? పిల్ల బురబుర్లాండ్తా అదేమయినా దగ్గతుండదంటా డాటరుగారికాడ ఏమన్నా మందు తీసుకురావని సెప్పమంది మాణిక్యం అంది వీరమ్మ.

"ఆఁ కాక బాగా ఎక్కవైందా ఈరమ్మా" అన్నాడు ముత్తాయ్.

"అదేమో మరి, పిల్ల సూడబోతే కాత్తె నలిగినట్టే ఉంది. ఎందుకైనా మంచిది ఆ డాటరుగార్నడిగి మందప్పిచ్చుకుని డబ్బున ఇంటికెళ్ళరాదూ? నేనెల్తుండగా నీ తమ్ముడు నాకోసం ఆ పిల్ల కాలవగెట్టుమీదే కూకునుంటాడు అంటువెళ్ళిపోయింది వీరమ్మ.

ఇంకొంచేంసేపటికి కట్టెలు, తెచ్చి దొడ్లో ఏసి, సెమట తుడుసుకుంటూ ఆసుపత్రిలో డాక్టరుకు కనుపించేట్టు కాత్తె పిడగా నిలబడ్డాడు ముత్తాయ్.

“తెచ్చి పడేశావా? అన్నాడు డాక్టరు రోగులకు మందులు రాసిస్తూ.

“పడేశానండి, పిల్లదానికి కాకతగిలింది దొరా” అన్నాడు ముత్తాయ్.

“ ఏ పిల్దానికీ?” అన్నాడు డాక్టరు, తలొంచుకుని రాసుకుంటూ.

“మా పిల్లదానికేనండి అన్నాడు ముత్తాయ్

“కాక తగిలిందా అన్నాడు డాక్టరు

“అవును దొరా అన్నాడు ముత్తాయ్.

“ఉహు, సరే కాసేపుండు అన్నాడు డాక్టరు ఓ జబ్బు మనిషిని పొట్ట ఒత్తి చూస్తూ.

“బురబుర్లాడ్తా దగ్గుకూడా బాగా ఉందంటండి దొరా” అన్నాడు ముత్తాయ్, కాసేపు సూసి.

“ఎవరికి అన్నాడుడాక్టరు, ముత్తాయ్ నోసారి మళ్ళీ చూస్తూ.

“మా పిల్దానికేనండి దగ్గూ జరం బాగా ఒచ్చిందండి అన్నాడు ముత్తాయ్ కాత్తె గట్టిగా.

“ఏం తిన్నదేం? అన్నాడుడాక్టరు.

“పిల్లముండ అదేం తింటదండీ నిన్న ఇంతంటే ఇంత ఉల్లికారం,దొగ్గలాకుపప్పు తిన్నదండి’ ’ అన్నాడు ముత్తాయ్.

“ఏదీ పిల్ల? ఇటు తీసుకురా? అన్నాడు డాక్టరు.

“పిల్లదాన్ని తీసుకురామంటారండీ” అన్నాడు ముత్తాయ్ కంగారుపడుతూ.

“తీసుకురాకపోతే ఎట్లాగయ్యా మందివ్వటం? ఊ వెళ్ళి తీసుకురా?

ఆ నడి రేత్రి ఒళ్ళు తెలియకుండా నిదరపోతున్న ముత్తాయిని లేపింది మాణిక్యం. గబాల్న చూచి ఒణుకుతున్న మాణిక్యంచేయి పట్టుకున్నాడు ముత్తాయ్.

“పిల్ల పిలుస్తే పలకటం లేదు అంది మాణిక్యం సన్నగా వినపడీ వినపడకుండా.

ముత్తాయ్ మంచమ్మీదకు ఒంగి లచ్చి గుండె మీద సెయి పెట్టాడు. “దేంటే పిచ్చిముండ పిల్ల సుబ్బరంగా నిదరపోతుంటేనూ అన్నాడు ముత్తాయ్ మాణిక్యం కళ్ళి అనుమానంగా చూస్తూ.

డొక్క లెగురేత్తుండది మాపిటాల అట్టాలేనేలేదు అంది మాణిక్యం సన్నగా మూలుగుతూ.

మైకంలో వున్న లచ్చి ఊపిరి పీల్చుకుంటానికి తంటాలు పట్టం నిదానంగా సూచిన ముత్తాయ్ మాణిక్యం కళ్ళ బిత్తర సూపులు చూశాడు.

“డాటరిదగ్గర కెళ్దాం పద” అంది మాణిక్యం.

ఇంత నిశిరేత్రప్పుడా? డాటరు పలుకుతాడా? అన్నాడు ముత్తాయ్.

“కాళ్ళు పట్టుకుందాం బగమంతుడే ఉండాడు.

దారి వెంట కుక్కలరుస్తూ వెంటపడుతుంటే విని పించుకోకుండా లచ్చిని బుజానేసుకుని ఒచ్చి డాక్టరు తలుపు గబగబ కొట్టారు ముత్తాయ్, మాణిక్యం.

“ఎవరది? తలుపు తెరిసి బ్యాటిలైటు ఏసి సూశాడు డాక్టరు.

“ముత్తాయిని దొరా రచ్చించాలి. “నీకేమన్నా మతుందా లేదా? గాథం చంపావే?

“మీ పాదాలు పట్టుకొంటాం దొరా డొక్కలేగరేస్తుంది.

ఏడ్సినట్టే ఉంది. మేమేం మనుషులకున్నారా, పిశాచాల మనుకున్నారా? పగలంతా చేస్తున్నావ్ ఇంత అర్థరాత్రి రాకపోతే

తమరు పిల్లదాన్ని చూద్దాన్నం చూసిచ్చారుగందా తగ్గిపోతుంధనుకుండాం దొరా. తలో కొంప మీనకొచ్చుద్దని.

"చాల్లే రండి లోపలికి"

సగం నిదరమత్తుతో ఒంగి లచ్చిని పరీక్ష చేస్తు డాక్టరు ఒక్కసారి నిటారుగా నుంచున్నాడు.

"మీ అలగా జనానికేం తెలియదు అన్నాడు డాక్టరు పెళ్ళున.

"అదేందొరా?" అన్నాడు ముత్తాయ్, మాణిక్యం ఒక్కసారిగా.

"ఇంజెక్షన్ ఇవ్వాలి, నా దగ్గర లేదా ఇంజెక్షను చీటీ రాసిస్తాను పొన్నూరు వెళ్ళి అర్జంటుగా తీసుకురావాలి?"

"అబ్బో, అంతదూరమా? ఇంత రేత్రి ఎవరు పలుకుతారు. డాటరుబాబూ?".. అన్నాడు ముత్తాయ్ నీలుకారిపోతూ.

"తెల్లవారేదాకా ఉండైనా ఇంజెక్షన్లు తీసికురావాలి అయిదు రూపాయలు తీసుకుపో.

అయిదు రూపాయలా? అన్నాడు ముత్తాయ్.

సూడు పిల్లకు ఇంకా మైకం ఒదల్లేదు అయ్యోనాలచ్చీ అంది మాణిక్యం కోక చెంబుమొహాన కప్పుకుని మూలుగుతూ.

డాక్టరిచ్చిన సిటీ ఒక గుప్పిట్లో పెట్టుకుని తడువుకోకుండా రెండో సేయి మాణిక్యం మెళ్ళో పోనిచ్చి. పుస్తైతాడు పటిక్కిన తెంచి ఇంకొక్క క్షణంలో గుంటుపల్లివీధులన్నీ దాటి పెద్దకాలువ గట్టెక్కి పొన్నూరు వేపుకు రొప్పుకుంటూ పరుగెత్తాడు ముత్తాయి సీకట్లో కలిసిపోతూ.

*-భారతి, మార్చి 1956.*

9

# అంటరాని పాలం

-ముద్దు కృష్ణ

ఆకాశం చిల్లిపండిందా అన్నట్టు వర్షం కుమ్మరిస్తూవుంది... మన్ను మిన్ను కానరాకుండా వుంది... ఢమఢమా అని ఉరుములు ఉరుముతూవుంటే గుండెలు గడగడలాడి పోతున్నాయి... జిఘాల్జిఘూల్మని మెరుపులు మెరుస్తూ ఉంటే కళ్లకు గాభరా కలుగుతు వుంది. గఢాంధకారం కప్పిన ఆరాత్రి ఎయింటిలో నుంచీ కూడా వెలుతురనేది కనపడ్డం లేదు. ఏ వీధిలోనూ నరసంచారం - కాదు ఏ ప్రాణి సంచారమూ లేదు.

ఆ అర్ధరాత్రి వేళ సత్యమూర్తి గదిలో మాత్రం దీపం వెలుగుతూవుంది. బైట చెలరేగుతూవున్న తుఫానుకన్నా యెక్కువ ఆందోళనతో మూర్తి ఆ గదిలో అటూ యిటూ పచారుచేస్తున్నాడు. మధ్య మధ్యలో ఆగి బల్ల మీద కాగితాలు తిప్పి చూస్తున్నాడు. ఇంతలో ఆకాశం విరిగి పడ్డట్టు ఢమ ఢమ ఢమా అని పిడుగు పడింది..... సత్యమూర్తి 'అక్కయ్యా' అని పెద్దకేక వేశాడు... కాంతమ్మ కంగారుతో పరిగెత్తుకు వొచ్చి "ఏరా, తమ్ముడూ, యేం జరిగింది" అన్నది. గుండెలు కొట్టుకుంటూ అక్కయ్యా, ఇంటెదర చెట్టుకిందవున్న పిచ్చాయ్యాపిల్లలూ యేమయ్యారో.. అంటూ వుండగా కాంతమ్మ అడ్డువొచ్చి "వర్షం రాగానే వాళ్లని ఎదటింటివాళ్ళ పశువుల పాకలో చెర్పించాను వాళ్ళు క్షేమంగానే వున్నారు. వొరేయ్ మూర్తి, అమాయకులైనవాళ్ళు అన్యాయం పాలు కావలసిందేనా?

"అక్కయ్యా, నేను జిల్లా మునసబు కదాదా నాయిష్టం వొచ్చినట్టు తీర్పు చెప్పవచ్చు ననుకుంటున్నావేమో, నాకు అంత స్వాతంత్ర్యంలేదు. సాక్షాలలో నిరూపణ అయిన రుజువులు బట్టి నా నిర్ణయానికి ఆధారాలు చూపించి మరీ తీర్పు చెప్పాలి. కాని నా నమ్మకమనీ, నాకు ఇది నిజంగా కనిపిస్తూవుందనీ అంటే, హైకోర్టు జడ్జీలు నా తీర్పుని కొట్టిపారేస్తారు. పైగా నాకు మాట కూడా వొస్తుంది. కాగితాలూ సాక్ష్యాలూ కూడా వాది తరపున సమస్తం పగడ్బందీగా వున్నాయి. ఈ రాత్రి తీర్పు రాద్దా మనుకున్నాను. కాని రాయడానికి చేయి రావడంలేదు. వాది తెలివితేటలు ప్రతివాది అమాయకత్వమూ చూస్తూవుంటే అనుమానాలు కలుగుతూవున్నా వాటికి ఆధారం కనబడ్డంలేదు. అయినా, నిజాన్ని తెలుసుకోలేకపోతానా న్యాయాన్ని నిరూపణ చేయలేకపోతానా. అక్కయ్యా నువ్వు వెళ్ళి పడుకో"

"వొరే మూర్తి నిద్రలేకుండా ఇలా రాత్రంతా ఆలోచనల్లో వుంటే ఆరోగ్యం ఏమౌతుందో"

"అక్కయ్యా ఆ సంగతి తరువాత, ద్రోహ బుద్ధితో చేసిన పనిలో ఎక్కడో ఏదో చిన్న దోషం వుంటుంది. అది కనుక్కునే వరకూ నాకు నిద్రరాదు. వెళ్ళు."

అని మూర్తి మళ్లీ పచారులు సాగించాడు. మధ్య మధ్య కాగితాలు తిరిగేసి తిరిగేసి చూస్తున్నాడు, ఇంతలో వాన ఆగిపోయింది. కొంతసేపు ఆకాశం కేసి చూస్తూ వసారాలో నిలబడ్డాడు. హఠాత్తుగా ఆలోచనతోచింది. గబగబా వెళ్ళి కాగితాలు చూశాడు. హమ్మయ్య అనుకున్నాడు. తీర్పు రాయడం ప్రారంభించాడు.

×××

పిచ్చయ్యకి, తాత ముత్తాతలనాటి పొలం రెండు ఎకరాలు ఉన్నది. స్వంతంగా వ్యవసాయం చేసుకుని దాని మీద పండిన గింజలతో బ్రతకడం ఎన్ని తరాలనుంచో జరుగుతూంది. పిచ్చయ్య ఆ భూమన్నా ఆ పొలంగట్లని పెరిగిన చెట్లన్నా ప్రాణంతో సమానంగా చూసుకునేవాడు. రైతన్న వాడికి తనభూమితో రక్తసంబంధం వుందంటే పిచ్చయ్యే తార్కాణం, ఈ పరిస్థితులలో అగ్రహారీకుడైన అంజనేయులు మంచితనంగా పిచ్చయ్య భూమిని చుట్టివున్న భూములన్నీ కొనేశాడు. ఒకనాడు పిచ్చయ్యని పలకరించి "నా భూమి ఏక ఖండంగా వుండాలని వుంది. చుట్టూ మా భూమి వుండి మధ్యను అంటరాని వాడిని నువ్వు ఉండడం మంచిదికాదు, నీరెండకరాలూ అమ్మేస్తేనేను కొంటాను" అన్నాడు. పిచ్చయ్య "బాబూ తాత ముత్తాలనాటి నుంచీ అనుభవిస్తున్నాం ఈ భూమిని అది నా ప్రానం అమ్మను బాబూ" అన్నాడు. "పోనీ నీకేమైనా డబ్బు కావాలంటే భూమి తనఖా మీదను ఇస్తాను. తీసుకో" అన్నాడు ఆంజనేయులు. "ఆతల్లి కడుపునిండా కూడెడతానే వుంది; అప్పెందుకు బాబూ" అని నిరాకరించాడు. అప్పటి నుంచీ ఆంజనేయులు పొలం వొచ్చినప్పుడల్లా పిచ్చయ్యని పలకరిస్తూనే ఉన్నాడు. మంచితనంగా మాట్లాడుతూనే వున్నాడు. కాలువ నీరు తమ పొలాలకు రప్పించడానికి ఇంజనీరుకి దరఖాస్తులు పెట్టినప్పుడు, పిచ్చయ్యచేత కూడా అర్జీలు పెట్టించి, తానే స్వయంగా తంటాలు పడి, తన పొలాలతో పాటు పిచ్చయ్య పొలానికి కూడా నీరు తెప్పించాడు. వ్యవసాయంలో కూడా పిచ్చయ్యకు ఎరువులు ఎలా తెప్పించుకోవాలో, వాటిని ఎలా వాడాలో సలహాలు చెప్పి సహాయపడ్డాడు.

ఈ విధంగా మూడు సంవత్సరాలు గడిచాయి. మూడవ సంవత్సరం పూర్తవుతుందనగా, పిచ్చయ్యకి ఒకరిజిష్టరు నోటీసు వొచ్చింది. వేలిముద్ర వేసి పోస్టుమన్‌దగ్గర నుంచి ఆనోటీసును పుచ్చుకొనేటప్పటికి ముచ్చెమటలు పట్టాయి. పరిగెత్తుకువెళ్లి బడి పంతులు చేత చదివించుకున్నాడు. తన భూమి మూడేళ్ళ క్రితం మూడు వేలరూపాయిలకు తనఖా పెట్టినట్టూ, వడ్డీ తో సహా చెల్లించకపోతే, దావా వేసి రాబడతాననీ, ఆంజనేయులు నోటీసిచ్చాడు. పిచ్చయ్య ఒక టే గోల. ఎవరితో చెప్పుకుని ఏం లాభం? ఒక వకీలు సలహా ప్రకారం తన భూమి తనఖాపెట్టలేదనీ ఈ నోటీసు కేవలం అన్యాయమనీ జవాబిచ్చాడు. దావా పడగానే స్వయంగా కోర్టుకి వెళ్లి ఆంజనేయులు ఇదివరలో తన పొలం కొంటానన్నాడనీ తాను అమ్మనన్నాననీ, ఇంజనీరుకి దరఖాస్తు పెట్టినప్పుడూ, ఎరువులకి అర్జీలు పెట్టినప్పుడూ, తనవేలి ముద్రలు ఆంజనేయులు వేయించాడనీ, చదువు రాకపోవడం వల్ల ఏ కాగితం మీద వేలి ముద్రలు వేశాడో తెలియలేదనీ చెప్పాడు.

ఆంజనేయులు తరపున తనఖా దస్తావేజు పకడ్బందీగా వుంది. వారి తరపున సాక్షులు కూడా ఎక్కడా బెసగకుండా సాక్ష్యం చెప్పారు. కోర్టులో ఈ వింత చూడడానికి వొచ్చిన జనమంతా తనఖా నిజమైనా కాకపోయినా పిచ్చయ్య పొలం పోయినట్టే అన్నారు.

తీర్పు రోజున కోర్టు జనంతో కిక్కిరిసి పోయింది. మునసబు కోర్టు అవరణలోకి రాగానే

పిచ్చయ్య ఆయనకి ఒక్క నమస్కారం పెట్టాడు. ఆనమస్కారంలో 'తమరే నాకు దిక్కు' అన్నంత అర్థం వుంది. మునసబు మాత్రం నమస్కారానికి తలవూపి వెళ్లిపోయాడు. పిచ్చయ్యకేసి చూడనైనా చూడకుండా.

మునసబు కచ్చేరీలోకి వొచ్చి కుర్చీలో కూర్చుని వాది ప్రతివాధులవైపు ఒక్క చూపు చూ కాగితాలు తీసి తనతీర్పు చదవడం మొదలు పెట్టాడు. తనకా దస్తావేజు బట్టి చూసినా, వా సాక్ష్యాదారాలను బట్టి చూసినా, వాదికి అనుకూలంగా తీర్పు చెప్పాలి. కాని" అని , కళ్లద్దాలు తీ తుడుస్తూ, ఆగాడు. కోర్టులో ఉన్న వకీళ్లు జనం అంతా విస్తుపోయి చూస్తున్నారు. అంజనేయులు అర్థంకాని చూపుతో నివ్వెరపోయి చూస్తున్నాడు... మళ్లీ కళ్లద్దాలు పెట్టుకుని మునసబు కోర్టంత కలియచూసి అంజనేయుల కేసి ఒక్క చిరునవ్వు విసిరి...'' ఎక్కువ తెలివితేటలు ఉపయోగించినవారు ఎక్కడో ఒకచోట ఒక చిన్న తెలివి తక్కువ చేస్తారు. అది సామాన్యంగా కనుక్కోవడం కష్టం ఈవాది ఒక్క పొరబాటుచేశాడు. ఈ తనఖా దస్తావేజు భారతదేశానికి స్వాతంత్ర్యం రాకపూర్వం తయారయినట్లు వున్నది... కాని దస్తావేజు స్టేంపు ముద్రచూస్తే భారతదేశం స్వతంత్రం అయినతరువాత తయారైనది. దీనిని బట్టి ఈ దస్తావేజు శుద్ధ ఫోర్జరీ అని నిర్ణయించడానికి ఏ అనుమానమూ లేదు. అందు చేతను ఈ కేసులో ఆయన ఖర్చుల్ని వాది ప్రతివాదికి ఈయవలసిందిగా ఈ కోర్టు నిర్ణయిస్తూవుంది. ఈ ఫోర్జరీ గురించి తగు చర్యతీసుకొమ్మని మెజిస్ట్రేటుకి తెలియజేస్తున్నాను అని చెప్పి బెంచి దిగి వెళ్లిపోయాడు.

పిచ్చయ్యచుట్టూ జనం చేరి అభినందిస్తున్నారు... కాని, పిచ్చయ్య అందరికీ దణ్ణాలు పెడుతున్నాడు, ఆనంద్రాశ్రువులు ఒకే ధారగా కారుతున్నాయి... మాటలాడలేకపోతున్నాడు.

10

# పశ్చాద్భూమి

కొలకలూరి ఇనాక్

ఆ రోజు ప్రతిరోజు మాదిరిగానే తెల్లవారింది. ఎర్రడాలుగా తిరిగింది ఆకాశం. అంతదాకా తెల్ల తెల్లగా ఉంది. మసకగా వున్న మంచుతెరలు పిచ్చిపోయాయి. తడితడిగా చెమ్మచెమ్మగా ఉన్న లోకం మీదికి వచ్చిన సూర్యుడు నేల వెన్నుమీద రసిగారుతున్న పుండులాగా వున్నాడు.

రాత్రి జ్వరంతో వేగిపోయిన పిల్లాడు పాడుచేసిన బట్టలు బాత్‌రూంలో పడేసి వచ్చిన ఇల్లాలితో 'నీకెంత ఓర్పే' అన్నాడు భర్త. మంచం మీదే అన్నీ అవుతున్న భర్త దగ్గరి బక్కెట్ లెవెట్రీలో క్రుమ్మరించి, నీళ్ళు పోసి తొరిపి వచ్చింది భార్య ఆమె వైపు నీళ్ళు నిండిన కళ్ళతో చూశాడు. నోట మాటలేని రోగి. దొడ్డికిపోయి ఇసుకలో కూర్చుని పిచ్చిగీతలు చూపుడు వ్రేలితో గీస్తున్న తమ్ముణ్ణి కసురుకొని లాక్కువచ్చి, నీళ్ళు కడిగి నట్టింటిలో కుదేసింది అక్క, చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న మామ వాంతులూ భేదులు చేసుకొంటే రాత్రి అంతా నిద్రకు దూరంగా వుంచి దగ్గరగా కూర్చున్న ఇంటి పెద్ద కోడలు తెల్లవారిం తరువాత కునుకుతూ ఉంది. హాస్పిటల్‌లో దిక్కులేని పక్షి ఎవరో అపస్మారకంగా వుంటే ఆమె బెడ్ దగ్గర నుంచి పేన్ తీసి తోటీ కిచ్చింది నర్సు.

రాంకోటి గుంట లోతూ పొడుగూ వెడల్పుచూశాడు. రెండు బారలుంది లోతు. బాగా పదిబారలుంటుంది పొడుగూ వెడల్పూ! నిలువెత్తున చుట్టూ పోగుబడ్డ ఎర్రకండ మట్టి ముద్దలుముద్దలుగా ఉంది. పై ఇసుక క్రిందికయి, క్రింది మట్టి పైకివచ్చి తెలుపు ఎరుపుల కలగలుపుగా వున్న మట్టికుప్ప ఎక్కి, గుంటలోతు చూసి నగరంవైపు కళ్ళు తిప్పిచూశాడు.

రోడ్డు కనిపించింది. ఏవో తిరుగుతూ వున్నాయి. తనుచూచేది కనిపించలేదు. నగరందాటి మలుపు తిరిగితే తప్ప కనిపించదు లారీ! నగరం అంతటా పొగ కావురు గమ్మింది. ఆ సమయంలో ప్రతి యింటిలో పోయి రగులుకొంటూ వుంటుంది.

రాంకోటి భార్యకు వయస్సు పైబడినా వృద్ధాప్యం తొంగిచూడలేదు. చీరె రెండుకాళ్ళకూ అంటుకుపోయేట్లు కట్టుకొంది. పై ట చెంగు నడుం చుట్టూ తిప్పి రొంటిలో దోపుకొంది. ముడకమీద క్షణకాలం నిలిచి జారిపడినచెమట బొట్టు ఓష్టం మీద చెమ్మగిల్లిపోతుంటే మోచేతితో తుడుచుకుంటుంది. నగరంలో విశ్రాంతిగా విశాలంగా వున్న పేటలో ఇళ్ళ వెనుకభాగంలోంచి నెత్తిమీద పల్లికతో రోడ్డు మీదికి వచ్చింది. మలుపులో వున్న తారుడబ్బాలో పల్లిక కుమ్మరించి, నెత్తి మీది కుదురు సరిజేసుకుని రెండు మోచేతులతో ముఖంవంతా తుడుచుకుని పక్కసందులోకి వెళ్లింది.

కాలి చిటికెనవ్రేలికీ, బొటనవ్రేలు పక్క వేలికి ఉన్న మెట్టెలు, కాళ్ళ కడియాలు నడుస్తుంటే మోగుతుండగా గొందిలోంచి తిరిగి, సందు దాటి వీధి లోకి వచ్చింది. ఇరవై ఏళ్ళ రాంకోటి కోడలు. ముక్కు చక్కగా ఉన్నా ముఖం ముచ్చటగా వున్నా ఆమె కవేమీ తెలియవు. ముక్కు మూసుకుని,ముఖం చిట్లించి, చూచీ చూడకుండా చూచే ఇరుకుపేట ఇళ్ళలోని యువకులకు ఆమె ఆకారం తెలుసు. చంకలో వున్న బుట్ట తారుడబ్బాలో దిమ్మరించి మళ్ళీ గొందుల్లోకి వెళ్లిపోయింది.

నగరంలో ప్రక్క పక్క రోడ్ల మీద లారీ వస్తూ ఉంది. మిలటరీ హోటల్లో పలావ్ వండిన పెద్ద రాగిపాత్ర పాయి సెగకు పొగచూరిపోయి నట్లుంది లారీ. వంకర్లు టింకర్లు తిరిగి. కాశీ మజిలీ కథల్లో రాక్షసుడులాగా ఉంది. అది రోడ్డు మీద ఆగివుంటే పర్లాంగు దూరంలో మనుష్యుల ఆకారాలు కాదు. అలికిడి కూడా ఉండదు. అది ఆగిపోతుంటే ఎదురుగావచ్చే మనుష్యులుముక్కులు మూసుకుని కళ్ళు చికిలించి దిక్కులు చూస్తూ నిలబడతారు రిక్షాలు, సైకిళ్ళు పక్క సందుల్లోకి వెళ్లిపోతాయి. కార్లు తప్పనిసరయితే ఆగమేఘాల మీద దూసుకుపోతాయి.

పేటలో వున్న తారుడబ్బాలు ఎక్కించుకుని రెండు టైర్ల బండిని ఈడ్చుకు వస్తున్న ఎద్దు పేడకడి వేసింది.బండి వెళ్ళిపోయాక పక్కింటి ఇల్లాలు బుట్టలో పేడకడి వేసుకుని తీసుకుపోయి, ఇంటి ముందు కళ్ళాపి కొట్టింది. టైరుబండి మీద వున్న తారుడబ్బాలు చొట్టలు పడి, నొక్కులు పడి వంకర్లు తిరిగి, పురావస్తు పరిశోధనశాఖలో భద్రపరుచుదగిన వస్తువుల్లాగా వున్నాయి.

టైరుబండి ఎదురైనచోట లారీఆగింది. లారీడ్రైవర్ పక్కన కూర్చున్న చిన్న రాంకోటి. రాంకోటి కొడుకు పాతికేళ్ళవాడు. కిందికి దిగాడు తారుడబ్బాలు మెల్లగా లారీలోకి ఎక్కించుకొన్నాడు. అతని చేతులు బలంగా వున్నాయి. మడికట్టు లావుగా ఉంది. తారుడబ్బా బలంగా పైకిలాగుతుంటే అతని దండెకడియం బిర్రబిగిసిపోయింది. మోకాళ్ళదాకా మడిచిన అతుకుల పేంట్ పూనికతో డబ్బాపైకి లాగుతున్నప్పుడు మోకాళ్ళ దగ్గర బిర్రుగా బిగిసింది.

ఆ పాకకు నిట్రాడి లేదు. రెండు పక్కల ఖాళీ గుంజలపైన అడ్డంగా వేసిన లావుపాటి బొంగు మీంచి కిందకి జారిన వెదురు తుంటెల మీద పడేసిన చినిగిన చాపతుంపు మీద బాచివట్టు వేసుక్కూర్చున్నాడు రాంకోటి.

మోకాళ్ళ దాకా వున్న కాకీనిక్కరు ఉండవలసిందానికంటే వదులుగా వుంది. పైన వున్నది చొక్కాకాదు కురుచ చేతులు జబ్బులు దాకా కూడా రాలేదు. ముతుకబట్ట బనీను కాదు. దానికంటే పెద్దది. మిషన్ మీద కుట్టించిందే! శ్లాక్ లాగా లేదు కుదురుమట్టంగా నడుందాకా ఉంది. నిక్కరు జేబులుకూడా మూయలేదు. ఆ గుడ్డ బనీను వంటి చొక్కా!

ఎడం చేతి పక్క కింది భాగంలో లోపలవైపు నున్న జేబులోంచి రాంకోటి పొగాకు కాడ తీశాడు. అంతా బారుగా చుట్టుకుపోయివున్న దాన్ని వెడల్పు చేశాడు. మొదట్లో పట్టుకొని కొన నుంచి కాడ పీకి వేరుచేశాడు. రెండు పక్కల ఉన్న పాయల్లో ఒకటి సాపు చేసి చావమీద పెట్టి, మిగతా పొగాకు బారుగా సాగదీసి తుంపులు తుంపులగా చేసి, పాయలో పాదిచేసి పెట్టి చుట్టుముట్టాడు. ఆ జేబు లోంచి అగ్గిపెట్టె తీసి పుల్లలాగి, వెలిగించి, రెండు వేళ్ళ మధ్య చుట్ట నోట్లో పెట్టుకొని బుగ్గలు చొట్టలు పడేట్లుగా రెండు పక్కల నుంచిచెంపలు పట్టుకారుతో ఒత్తిపట్టినట్లులోపలికి పోయేట్లు పొగపీల్చిగవదలు ఉబ్బించి పొగవదలిపెట్టాడు రాంకోటి. పొగ తాపీగా వదులుతూ ఎదురుగా అల్లంతదూరంలో వున్న గుంటవైపు చూస్తున్నాడు.

కాళ్ళు ఆరజాపి, మోకాటిచిప్పలు చేత్తో రుద్దుకొంటూ కుతిదీరా చుట్టకాల్చుకుంటున్నాడు. రాంకోటి పొట్టిగా గిడసబారి వున్నాడు. కళ్ళు చిన్నవి. కనురెప్పలపై వెంట్రుకలున్న జాడలేదు. బొణతలమీద వెంట్రుకల అక్కడొక్కటి ఇక్కడొకటి వున్నాయి. తల నున్నగా లేదు. కాళీకాళీగా తెల్ల వెంట్రుకలు చెదురుమదురుగా వున్నాయి. చెంపలు ఎండి ముడతలు పడి పెళుసుగా వున్న తమలపాకులులాగున్నాయి. రెండు పెదవులు కలిసే రెండుచోట్ల రైలింజన్లు ఢీకొంటే పట్టాలు చెక్కలు వంకర్లు తిరిగిపోయినట్లు ముడుతలున్నాయి. ఆ ముడుతలపైన వదేసి వెంట్రుకలు బారుగా కిందికి చూస్తూ వెండిదారాలు అతికించినట్లు మీసాలున్నాయి. పై పెదవిమీద, ముక్కు కింద పెదవి కొనదాకా వెంట్రుకలు లేవు.అక్కడ నున్నగా ఉంది. నూనె రాసిన లేత తమలపాకు మెరిసినట్లుగా మెరుస్తూ ఉంది. ముక్కు రంధ్రాల లోపల వెంట్రుకలు లేవు. వెంట్రుకల పాదుల ఉనికి కూడా లేదు. జోడుగుళ్ళ తుపాకీ బేరల్స్ మెరిసినట్లు మెరుస్తున్నాయి ముక్కుగోళ్ళు లోపలిభాగాలు. చావముందు విడిచిన అరిగి పీలికలయిన చెప్పులు ఉంగటాలు తెగి వికృతంగా వున్నాయి. చేతి వ్రేళ్ళు ఆకారానికి మించినంత బారుగా వున్నాయి.

మునసబు కొడుకు మునసబు.కరణం కొడుకు కరణం, వెట్టివాడి కొడుకు వెట్టివాడు అయినట్లు రాంకోటి కొడుకు రాంకోటి. తండ్రి తరువాత పొలంపుట్రా నగనట్రా ఇల్లు వాకిలీ మళ్ళూ మాన్యాలు కొడుకు సంరక్షించుకున్నట్లు, అవ్వ ఆభరణాలు తల్లికి, తల్లి సొమ్ములు కూతురుకు, కూతురునగలు కూతురు కూతురుకూ తరతరలానుంచి సంక్రమించినట్లు, తద్దినాలు పెట్టే తండ్రి కొడుకు తద్దినాలు పెట్టినట్లు వ్యాపారి కొడుకు వ్యాపారం నిలబెట్టుకొన్నట్లు వంశపారంపర్యంగా వస్తున్న ఆస్తిని హక్కునూ నిలబెట్టుకొన్నాడు.

రాంకోటి వయస్సు అరవై దాటింది. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్ద వాళ్ళిద్దరూ తండ్రి అంతటివాళ్లు కాలేదు. ఏదో చదువుకు మిణికారు. చాలీ చాలనిజీతాలతో చచ్చే చావు చస్తూ ఉద్యోగాలంటూ వెలగబెడుతున్నారు. వాళ్ళ సంసారాలు, పిల్లాజెల్లా,ఏవో బాధలు పడుతున్నారు. చిన్నవాడికి చదువు అబ్బలేదు. అందుకే రాంకోటి అయ్యాడు. పెద్ద రాంకోటి పలుకుబడి వల్ల చిన్న రాంకోటికి పాటి ఉద్యోగం అయినా చిక్కింది గానీ లేకపోతే అందుకూ పనికిరాని ఆకతాయతనం వున్న రాలుగాయ! పెద్ద రాంకోటికి ఆడపిల్లలు లేరు. ఇద్దరు కోడళ్ళు పెద్దవాళ్ళు కాపరానికి వచ్చినట్టే వచ్చి వెళ్ళిపోయారు భర్తల వెంట బాధ్యతలు మోసుకుంటూ చిన్న కోడలు ఇంట్లోనే ఉంది అత్తమామలను నమ్ముకుని, చిన్నకోడలే పెద్దరాం కోటికి కూతురులేని లోపం తీర్చింది. చిన్ని రాంకోటికి ఇంకా పిల్లలు కలగలేదు.

కాలం ఎంత ముందుకు పోయినా, పోకపోయినా, పట్టణానికొక రాంకోటి పదిలంగా ఉంటాడు. జబ్బుచేసిన నగరానికి, చీడ పట్టినవీధులకు, ప్రతి యింట వెలుపల తూగుతున్న జాతికి పరిచర్య చేసేందుకు బస్తీల్లో,పట్టణాల్లో నగరాల్లో, అమ్మలాగో, అక్కలాగో, అత్తలాగో, కోడలులాగో, భార్యలాగో, నర్సులాగో, అందరి ఏకరూపంలాగో, స్త్రీ కాని రాంకోటి స్త్రీలాగా మారి ఉంటాడు. రాజులు మారిపోయి రాజ్యాలు మారిపోయి ప్రజలే రాజులయి, ప్రభుత్వాలే ప్రజలయినా కావచ్చు. ఏది ఏమైనా కావచ్చు. కాని మానవజాతి మనుగడ వున్నంతవరకు రాంకోటి మారడు ఒక రాంకోటి కాకపోతే మరో రాంకోటి, ఇంకో రాంకోటి, వేరే రాంకోటి! రాంకోటి శాశ్వతం! రాంకోటి నిరంతరం! రాంకోటి కలకాలం! రాంకోటి చిరంజీవి!

మొదటి లారీ వచ్చింది. ఆ పాటికి చుట్ట సగం కాలిపోయింది. నోట్లో వున్న కొస కొరికి, ఉమ్మివేసి, కాలుతున్న పక్కనుసిరాల్చి, నేలమీద రాసి, ఆరిపోయిన తరువాత చెవిలో దోపుకున్నాడు

రాంకోటి. పెద్ద రాంకోటి లారీతో వచ్చి చిన్ని రాంకోటిని చూశాడు వెలుపలికి వచ్చి లారీ ఆగింది.

"ఏరా, తెచ్చా?"

'ఆఁ.'

చిన్న రాంకోటి గుడ్డమూట పాకలో పెట్టాడు. లారీ సీటులోంచి తీసుకువచ్చి, లారీ గుంట దగ్గర నిలబడింది. ఇద్దరూ లారీ దగ్గరకు పోయారు. తారు డబ్బాలు దించి, గుంటలోకి కుమ్మరించి, బారు కఱ్ఱకు కట్టిన దువ్వెనవంటి ఇనుప కొక్కేల పరికరంతో తారుడబ్బులు గీరి, మళ్ళీ డబ్బాలు లారీలోకి ఎక్కించారు.లారీ మళ్ళీ నగరం అభిముఖంగా నిలబడింది. డ్రైవర్ బీడి ముట్టించుకున్నాడు.

'రేయ్ రాముడు!'

'ఏంది?'

చొక్కా వంటి బనీను ఎడం ప్రక్కవున్న జేబులోంచి పర్సు తీశాడు పెద్ద రాంకోటి అది నలిగి నలువైపుల అణిగి , గుండ్రంగా ఉంది. పర్సు తెరిస్తేనే అది చదరంగా ఉందని తెలుస్తుంది. రెండు రూపాయల నోటు వెలువలికి, లాగి కొడుక్కు ఇచ్చాడు.

"పాయసం చెయ్యమంటున్నాఁవటాని జెప్పరా మీ యమ్మకీ!"

'సరే అట్లాగే!

'అట్లాటప్పాగుంటే ఈల్లేదని జెప్పు! ఫస్టుకలాస్‌గా వుండాలి. మంచి ఆకలితో రెపరెపలాడతా వస్తానాఁటాని జెప్పు!

చిన్న రాంకోటి రెండు రూపాయల కాగితం పేంట్ జేబులో పెట్టుకుని లారీ ఎక్కాడు. డ్రైవర్‌బీడి పీక అవల గిరాటు వేసి సీటెక్కాడు, లారీ బైలు దేరింది. లారీ వస్తున్నప్పుడు బాడీలో వెనుక నిలబడ్డ వాళ్ళిప్పుడు కూర్చున్నారు.

ఆ ప్రదేశం ఏభై ఎకరాల విస్తీర్ణం ఉంటుంది రైతులు అవతల పక్కనుంచి ఎరువు జల్లల్లోకి ఎత్తుకొంటున్నారు. రెండెడ్లబండ్లు ఎడ్లు, జీతగాళ్ళు, పలుగులు, పారలు, జల్లలు, తట్టలు, అటువైపు హడావుడిగా ఉంది. కరకర ప్రొద్దెక్కుతూ ఉంది. రాంకోటికి ఆకలి అయింది.

రాంకోటి పాకలోకి వచ్చాడు. మట్టి బాన ఒకటి మూలనుంది. దాని మీద మూకుడు దీసి ముంతతో నిండా నీళ్ళు తీసుకుని బాన దగ్గర పెట్టుకుని, కొడుకు తెచ్చిన మూట విప్పి కొసలు సాపు చేసి,విస్తరి వంపులు తిన్నగా చేసుకుని చూశాడు. అంతా ఒకే ముద్దగా అతుక్కుపోయి వున్న పెరుగు కలిపిన చద్ది అన్నం, పక్కన నిమ్మకాయ బద్ద, నంజుకుంటూ తింటున్నాడు.

ఎగువ నుంచి ఎవరో వస్తున్న అలికిడి అయింది. తలెత్తి వెదురుబద్దల గోడలోంచి చూశాడు. ఎవరో రైతు. ఎడం చయి బొటనవ్రేలు తర్జనితో ముక్కు ఊసుకుని,కుడిచేత్తోకట్టు పంచె ముంజెంగులు ఎత్తిపట్టి, మునిగాళ్ళ మీద ఎత్తుపట్టి ఎత్తిపట్టి అడుగులు వేస్తూ వస్తున్నాడా రైతు.

చద్ది తినటం ముగించి, గుడ్డ బైట విదిలించి ఎంగిలి విస్తరాకు తీసుకుపోయి, గంటలో పడేసిముంతలో నీళ్ళు చేతి మీద పోసుకుని కడుక్కొని, మూతి ముడుచుకుని, బనీనుతో అద్దుకొని చెవిలో వున్న చుట్ట తీసి ముట్టించుకొని పొగ వదులుతూరైతువైపేచూశాడు.

"ఏం జేత్తన్నా?"

"ఏదీ- ఇది గిప్పుటే సద్దినీ..?"

"ఇక్కడేందీ, అటన్నాబోయి దినకపోయా!"

రాంకోటి రైతుముఖంలోకి నిరుత్తరంగా రెణ్ణిముషాలు చూచి 'ఏందొరా! ఏంది చెప్పు?

'ఎరువు దోలుకుపోతా, జీతగాళ్ళొచ్చారు. బళ్ళాడిడిచేరు.'

'కాగితం తెచ్చా?'

'ఆఁ!'

రైతు జేబులోంచి కాగితం ఇచ్చాడు. తీసి చూసుకొని ఎన్నిబళ్ళు?"

"ఆర్లే! మూడిప్పుడు దోలుకుపోతా. మళ్ళీ రేప్పొద్దున్నే మూడు."

'అట్లాగే!'

కాగితం బనీను జేబులో పెట్టుకొన్నాడు రాంకోటి. ఇద్దరూ ఎగువకు పోసాగారు. ముందురైతు, వెనుకరాంకోటి. వాళ్ళిద్దరికీ ఎప్పుడూ పది గజాల దూరం. రాంకోటి రైతును కలుసుకోవాలని ఎంత తొందరగా నడిస్తే అంత తొందరగా రైతుముందుకు వెళుతున్నాడు. రాంకోటి కలుసుకోనూ లేదు. రైతు కలిసే అవకాశం ఇవ్వనూ లేదు. ఇద్దరూ ఎగువకు వచ్చాక రాంకోటి అన్నాడు.

"బాగా పొద్దెక్కిందియాల, పెందలాడే బళ్ళు కట్టించుకు రాలేకపోయావా దొరా?"

"ఏదిరా ఈలేదీ? బళ్ళు బాడక్కి దొరకటం ఎంత కష్టం ఏందీ?"

మిగతా రైతులు జీతగాళ్ళతో ఎరువు ఎత్తించుకొంటున్న తావుకు ఇద్దరూ చేరారు. ఇక్కడే ఎత్తుకోండి అన్నట్టుగా ఈడే అన్నాడు రాంకోటి. జీతగాళ్ళు అక్కడికి వచ్చారు. ఎరువు ఎత్తుకోవటం మొదలయింది. రాంకోటి బండి మీదున్న జల్లలు చూచి.

'దొరా! అన్నాడు.

రైతు తలెత్తిచూశాడు.

"ఏణ్ణుంచి దెచ్చా ఈజల్లలు? ఈ ఎరువు దోలుకుపోవటానికే ఇంత పెద్ద జల్లలు మేదరోడికాడ జేయించావేంది? ఎంత పెద్ద జల్లలు!

అబ్బే అదేం లేదు రాంకోటి ఇయ్యి మా వూలుజల్లలే! అబ్బే! ఏం పెద్దియ్యి?'

"ఏందోలే దొరా! కానీయండి!

పోయినేడు లారీలుతోలింది ఏటికి ఎరువయింది. ఇప్పుడు తోలేది వచ్చే ఏటికి ఎరువు ఇప్పుడు పనికిరాని అసహ్యం వచ్చే ఏటికి పనికివచ్చే ఎరువు.

ఆ ఎరువుపై మొలిచిన గరిక పరకలు కొరుక్కుతింటూ వుందొక ఎద్దు. దూరదూరంగా కట్టేసిన ఎడ్లు కొన్ని పడుకొన్నాయి. కొన్నినిలబడే వున్నాయి. కొన్ని నెమరువేస్తున్నాయి. తోకతో ఈగలు తోలుకొంటూ మెలకలుతింటున్నఎద్దునుచూచి 'ఏం దొరా! ఈ ఎద్దుకి గడ్డేయటం లేదేంది? అన్నాడు.

"ఎందుకేయంరా అదో కరువబోద్ది! ఏడ నాలుగు పరకలు గనపడ్డా ఎగబడుద్ది!

మొత్తం నలభై బళ్ళున్నాయి. ఎరువు బళ్ళలోకి ఎత్తుకొంటున్నారు. వచ్చే బళ్ళు వస్తున్నాయి. పోయేవి పోతున్నాయి. పోలుగర్ర ఎత్తి, కాడిక్రిందికి ఎడ్లులాగి, మెడకు పట్టెళ్ళు తగిలించి చిరతలు దిగేసి, జీతగాళ్ళెక్కిన బళ్ళు బైలుదేరటానికి సిద్ధంగా అయిదున్నాయి.

ఈ అయిదెవురియి రాంకోటి అడిగాడు.

'నాయేరా!"

"మీకు నాలుగే గందా! అయిదేంది?

రైతు నసిగాడు. ఏందో లేరా! పోనీయ్ జీతగాళ్ళకు తెలియదు.

రాంకోటి నవ్వాడు. నిజంగా జీతగాళ్ళకు ఏం తెలుస్తుంది? రైతుకే తెలియాలి. ఆయనెన్ని బళ్ళు అంటే అన్నే తోలుకుపోతారు వాళ్ళు. వాళ్ళ తప్పేం ఉంది?

"తీరా ఎరువెక్కించిన జల్లలు కుమ్మరిచ్చమంటే ఏన్నేయంగా వుంటదిగానీ ఆ డబ్బేందో ఈడ దగలేసిపోతే పోద్ది!

రాంకోటి నవ్వాడు. పోయినేడూ ఇంతేగా దొరా ! మళ్ళీ ఇచ్చా? ఎందుకొచ్చింది గానీ, ఎల్లండి.

రైతు బళ్ళతోపాటు వెళ్ళిపోయాడు.

వరినారు మళ్ళలో అప్పుడే బెత్తెడెత్తు పెరిగింది. వానలు పడేలోగా చేలల్లో ఎరువు తోలాలి. కాలువలు వచ్చాక నీళ్ళు పెట్టుకొని పొలం పదనుచేయాలి. వారం రోజుల్లో పెద్ద కాలువ వదులుతారని వినికిడి.రైతులు ఎరువు తోలుకుపోతున్నారు. తొలకరికి ముందే తంతంతా ముగిసిపోవాలి.

రాంకోటి పాకముందు కిందుగూర్చున్నాడు. చిట్టచివరికంటా కాలుకొచ్చింది. పెదాల మధ్య నుంచి చుట్టతీసిపాకకు దూరంగా పారేసి కాండ్రించి ఉమ్మివేసి చతికిలపడ్డడు. లారీలు వస్తున్నాయి. వెళుతున్నాయి. చిన్న రాంకోటి మళ్ళీ ఒకసారి లారీతో రావాలి. వాడి తల్లి ఇంటికి వచ్చిందో రాలేదో, పాయసం సంగతి చెప్పాడో లేదో ఆలోచించుకొంటున్నాడు రాంకోటి.

ఏడాది క్రితం నాగరక నగరం, అ నాగరకంగా తరిమిన లారీలు, ఇక్కడికి వచ్చి, ఇంతలోనే నాగరక నగరానికి నాగరకంగా పనికివచ్చే ఎరువు తయారుచేశాయి. భూమి తనచుట్టూ తాను తిరుగుతూ ఉందో లేదో తెలియదు గానీ, సూర్యుడు చుట్టు మాత్రం తిరగటం లేదు, కడుపు చుట్టూ తిరుగుతూ వుంది.

పండుగ రోజుల్లో ఇంటినిండా రకరకాల వంటకాలు, భార్యా కోడలూ ఇద్దరు అడుక్కువస్తారు. ఆడే వుండు, ఈడకు రాబాక. ఏందీ, మరీ దగ్గర కొత్తా? బావి దగ్గరకు రాకే మొద్దు! చెప్పేది నీకే! వినబట్టంలా?' అంటూ తాము చేసికొన్నవి కలవాళ్ళుపెడితే వాళ్ళు బుట్టలో వేయించుకుని, నెత్తినో చంకనో బెట్టుకురావటం చూస్తే తారు డబ్బావైపు వెళుతున్నారో, ఇంటికి వెళుతున్నారో తెలియనివాళ్ళు పోల్చుకోలేరు.

ఎందుకో రాంకోటి పై పెదవి చివరి అంచుల్లో ఉన్న తెల్లవెంట్రుకల గుంపు కిందికి వాలి

వున్నవి కొంచెంగా పైకి కదిలేట్టు నవ్వాడు. ఆ నవ్వులో ఆడుకుంటూ పడి దుమ్ము కొట్టుకుపోయిన పిల్లవాడు లేచి నిలబడుతుంటే చూచి నవ్వే తల్లి తీరు కనిపిస్తుంది. పట్టణంవైపు చూచాడు., లారీ ఒకటి మలుపు తిరిగి వస్తూ ఉంది.

కొడుకు లిద్దరూ గుర్తుకు వచ్చారు. కులవృత్తి మానవద్దని అందరూ చెప్పారు పూర్వం. ఇప్పుడు మానతాం అంటూ అందరూ ఎదురు తిరుగుతున్నారు. ఏ విషయం ఎక్కువగా ప్రస్తావించబడుతుందో ఆ విషయం మీద అనుమానం ఎక్కువవటం, లోకంలో సహజమే!

చెప్పులు కుట్టేవాడి కొడుకు చెప్పులు కుట్టననటం, చాపల్లేవాడి కొడుకుఅందుకు తిరస్కరించటం, గీసేవాడి కొడుకు ఎదురు తిరగటం ఈ రోజుల్లో రివాజు అయిపోయింది. కులవృత్తిలో వచ్చే సంపాదనకంటే రాబడికంటే ఎదురుతిరిగినవాళ్ళు వేరే వృత్తిలో ఎక్కువ ఆర్జించలేకపోవచ్చు. అయినా ఎదురుతిరుగుతారు.

ఈ ఎదరు తిరగటం ఎవడికీ ఎవడూనేర్పలేదు. అంటే ఏ ఒక్కడూ మరే ఒక్కడికీ బోధింపలేదు.ఈ శతాబ్ది జాతి జీవితంలోవచ్చిన మార్పే అది. ఎక్కడెక్కడో వచ్చిన పరిణామాలు ఇక్కడ నాటుకుపోయి మొలకెత్తాయి. తాను చేసేవని తప్పని ఎవరయినా అంటే తక్షణం మానుకొంటాడు మంచి మనిషి. తాను చేసేపని ఎగతాళి చేయబడితే, నిందింపబడితే, తిరస్కరింబడితే, సమర్థుడయితే మనిషి ఎదురుతిరుగుతాడు. అసమర్థుడయితే తలవంచుకుపోతాడు.

అలా ఎదురుతిరిగినవాళ్ళు పెద్ద వాళ్ళిద్దరు. వ్యవస్థలో అలా జరక్కుండా వుంటానికి ఎన్నో కట్టుదిట్టాలున్నాయి. వాటితో తెగదెంపులు చేసుకుని వెలుపలికి రాగలవాళ్ళు కొద్దిమంది! ఆకొద్ది మందిలో కొడుకులిద్దరు. పెద్ద వాడు రంగన్న తాలూకాఫీసులో కాపీయిస్టు! రెండో వాడు చింతయ్య కలెక్టరాఫీసులో ఎల్‌డిసి వాళ్ళకు పెద్ద జీతాలు ఏమీ రావు. బ్రతుకుదెరవు కటకటలాడుతూ ఉంటుంది.

నగరంలోంచి లారీ వచ్చింది. హారన్ వినిపించింది. రాంకోటి లేచి ముందుకు వచ్చాడు. ప్రొద్దు రెండు బారలెక్కింది. జూన్ నెల ఎండ ఉదయమే తీవ్రంగా ఉంది లారీకి చోటు చూపించి మట్టి గుట్టమీద నిలచున్నాడు. లారీతో వచ్చిన ఎవరో హడావుడిగా గుట్ట ఎక్కుతుంటే, ఇదుగో ఆ తొందరే వద్దన్నా! అన్నాడు.

"ఏం?"

"అవసలే పోతమట్టి. జవుకిస్తుంది. ఏందా దూకుడు? అగు ఆగాగు,కాలుజారి బిళ్ళబీటగా అందులోబడి కూరుకుపోయేవ్?"

ఎదుటి మనిషి ఆగిపోయాడు. అందరూ చెప్పినమాట వినరు. పిల్లలిద్దరూ అంతే! కొందరు చెప్పుడు మాటలు వింటారు. చెడిపోతారు.

లారీ వెళ్ళిపోయింది.

హాయిగా తాత ముత్తాతలు తరతరాల నుంచి చేసిన పని ఎందుకు చేజేతులా వదులుకొంటారు అని అందరూ చెప్పినా ఆలించలేదు రంగన్న. చింతయ్య వాళ్ళంటే కోపమే.

'తల్లితండ్రుల్ని మించిన దేవతలూ దేవుళ్ళూ లేరు. మీ నాన్నను కనిపెట్టుకుండు

బాగుపడిపోతావంటే ఆ మాటలు విని చెడిపోయిన రాముడు చిన్న రాంకోటి అన్నా దిగులే!

రంగన్న ఎప్పుడూ ఎందుకో బాధపడుతూ ఉంటాడు. ఏదో పొగొట్టుకొన్నవాడి లాగా దిగాలుపడి వుంటాడు. దేన్నీసహింపలేడు. ఎవడయినా ఏడుస్తుంటే వూరుకోలేడు. నవ్వుతున్నా చూడలేడు. పెద్దవాడి మనస్తత్వం బోధపడక బాదపడ్డాడు రాంకోటి. కొడుకునుచూద్దామని వచ్చిన మొదటిరోజే!

వాడి దొక అద్దె ఇల్లు! నెలకు ఏడురూపాయలు. తాటాకుల పాక! నలుగురు పిల్లలు. పెళ్ళాం ముక్కుతూ, మూలుగుతూ, చీదుతూ వుంటుందెప్పుడూ! కోడలు వరసెం నచ్చలేదు రాంకోటికి.

ఆ పెద్ద తాటాకుల పాకలో ఎనిమిది భాగాలు, ఎనిమిది సంసారాలు. అంతా వెరసి ఆ యింటిలో ఏభైమందైనా వుంటారు. ఇంత ఇంటికి ఒక్కటే లేవెట్రి!

రెండో రోజు ఉదయం పాకీమనిషి వచ్చేసరికి ఏభైమంది కంయ్‌మని లేచారు. ఆమె రెండు రోజుల్నుంచీ రాలేదుట. భర్తకు, పిల్లకు ఆరోగ్యం ఎత్తూ దించుల్లో వుందిట. ఆమె గోడు ఎవరూ ఆలకించటం లేదు. రాంకోటి రంగన్న అయినా ఏమన్నా మాట్లాడతాడేమోనని ఎదురుచూశాడు. చుక్కెదురయింది.

పాకీ అంటే పవిత్రం అనే అర్థం ఉందని చదువుకొన్న వాళ్ళెవల్లో చెబితే విన్నాడు రాంకోటి ఎప్పుడో! పాకిదొడ్డి అంటే మనిషి పావిత్ర్యం పొందే తావు అన్న మాటనూ నమ్మాడు. అయితే పాకీ మనిషి అవస్థ చూచిన తరువాత పవిత్రతకు అర్థం లేదనిపించింది.

ఓర్పు అలవాటు చేసుకొన్న మనిషి ఎంత కష్టం అయినా నవ్వుతూ సహింపవచ్చు. భరింపవచ్చు. రాంకోటి కెప్పుడూ తను బాధపడుతున్నట్లు ఆలోచన కలగలేదు. అయితే ఆ రోజు ఆమె దుస్థితి చూచి, కష్టం చూచి బాధపడ్డాడు.

బాచీపట్టు వేసుకుని అన్నం ముందు కూర్చున్నప్పుడు, రాంకోటి కొడుకు నడిగాడు.

ఏందిరా, నువ్వన్నా ఆగండాగండి. ఏం దీ గోలాఁవటాని అడ్డుబళ్ళేదేం పొద్దుని?'

'ఏంది? ఏందది?'

"పాకీ మనిషి రాలేదంట్రా పొద్దుని, అందరూకంయ్ కుయ్‌మని ఎగిర్రే అదే పొద్దున్నే!"

"మనకెందుకా రొంపి"

'అదేందిరా! నువ్వన్నా కలుగచేసుకోకపోతే ఆ దిక్కుమాలిందెంతేడిసి పొయ్యిందిరా!

ఆ ఁ ఇట్టాటియన్నీ బట్టించుకొంటే నేనీడ మిణికినట్టే! గుట్టు కాస్తా రట్టవుద్ది.

ఏందీ గుట్టేందీ, అది కాస్త రట్టవటఁవేందీ? ఏందిరా నువ్వనేది? నాకర్థం కాటల్లే చెప్పు!

'పెద్దగా అరవమాక! నేనెవుర్నో ఈడెవుడికీ తెలియదు.

ఏందీ రాంకోటి ఆశ్చర్యపోయాడు.

తెలిస్తే ఇంకేఁవయినా వుందీ! బాయిలో నీళ్ళు కూడా తోడుకోనియ్యరు. పలకరించే దిక్కుసంగతి పక్కనబెట్టు.

"ఎట్టెట్టా? నువ్వెవుడువో తెలీనీకుండా ఎట్టాగడుసుద్దిరా ఈడ?"

"ఈ డింతేలే! నువ్ గానీయ్"

భోజనం పూర్తయింది. ఆ సాయంకాలం నుంచి తలనొప్పి పట్టుకొంది. ఎడా పెడా వాయించింది. అర్థరాత్రి నుంచిజ్వరం తగిలింది. తెల్లవారేసరికి బాగా భారంగా ఉంది.

'ఏందిది? అన్నాడు రంగన్న పొద్దున్నే

"ఏందో లేరా.అదే బోద్ది

రంగన్న తండ్రిని హాస్పిటల్‌కు తీసుకుపోయాడు పెద్ద డాక్టరుకు చూపించాడు. ఇంజక్షన్లు ఇప్పించాడు మాత్రలు తెచ్చాడు మందు తెచ్చాడు. మరుసటి రోజు జ్వరం లేదు. తలనొప్పి లేదు.

"రాంకోటి?" ఎదురుగా వున్న రైతు పిలిచాడు.

"ఏం దొరా?"

"నే నేడు బళ్ళు దోలుకుపోతున్నా!"

అట్టాగే దొరా

రైతు రెండెడ్ల బళ్ళు వైపుగా నడుస్తున్నాడు. రాంకోటి లేచి వెంట నడిచాడు.

ఈ సాయిగారా దొరా! రాయీ రప్పా గుచ్చుకొనేనూ! బళ్ళ దగ్గరకు చేరుకున్నారు.

ఏడు బళ్లు పూర్తయినట్టేనా మీయి

ఆ

రాంకోటి, ఒక బండిచక్రం మీద కాలుబెట్టి ఒక కర్ర పుచ్చుకొని పైకి ఎక్కిజల్లలో చేయి పెట్టి చూచి దిగివచ్చాడు.

బండికి కట్టిన ఎద్దులు నడవసాగాయి. చొచ్చోచో నీ ఎద్దుగాల! అన్నాడు జీతగాడు. బండి ఆగింది.

'ఏం దొరా! తొక్కి తొక్కి ఎక్కించినట్టుండారే ఎరువు?

ఏందో లేరా

పొద్దెక్కుద్ది పొండి

బళ్ళు లాక్కుపోతున్నాయి ఎద్దు

అప్పుడే రెండు రెండెడ్ల బళ్ళు వచ్చాయి. గిత్తలు మంచి పూపులో ఉన్నాయి. చెంగనాలు తీస్తూ వచ్చాయి. ఒక బండి మీద జీతగాడు. మరో బండి మీద రైతు. ఎవరిదగ్గరా చెర్నాకోలలేదు. వంటిమీద చేయివేస్తే ఆగమేఘాల మీద ఎగిరిపోయేట్టున్నాయి. గిత్తలు. ఈగ వాలితే జారిపోయేంత నున్నగా వున్నాయి వాటి వీపులు, మూపులు వాళ్ళ దగ్గర కాగితం తీసుకొని బనీను జేబులో వేసుకుని, అవి మోసుకుపొగలిగినంత వేసుకుపొండి అనుకొని చుట్ట చుట్టు కొంటూ పాక దగ్గరకు వచ్చాడు. ఇంకా చిన్న రాంకోటి వున్న లారీ రాలేదు.

తాటాకు పాక మొగదల రాతిబండమీద కూర్చుని కాళ్ళు నేల మీద తాటిస్తూ

చుట్టముట్టించుకొని పొగలు వదులుతూ వున్నాడు రాంకోటి. పెదిమలు పొగ పీల్చటంతో లోపలికి పోతే పక్కగా పైనున్న మీసాలు క్రింద చూపులు మాని నిక్కబొడుచుకొని. పొగ వదిలేటప్పుడు యాథాప్రకారం క్రిందకి చూపులు మరల్చుకొంటున్నాయి. కుతిదీరా చుట్ట కాల్చుకుంటుంటే పాయసం గుర్తుకు వచ్చింది.

నిలవ నీడలేని మనిషి తాటాకు పాక వుంటే చాలనుకొంటాడు. పాక వున్నవాడు పూరికొంప వుంటే బాగుంటుదనుకొంటాడు. అది వుంటే మిద్దె. మిద్దె వుంటే మేడ. మేడ వుంటే బంగాళా. ఇలా ఒకదానికంటే మరొకటి గొప్పగా వుండాలని మానవుడి ఆశ! ప్రయత్నం! ఈ ప్రయత్నం నుంచి జీవితానికి నిర్వచనం పుడుతుంది. రాంకోటికి చుట్ట లేకపోతే చుట్టకోసం ప్రయత్నం చేసేవాడు. చుట్టవుంది గనుక పాయసం మీదికి మనస్సు మళ్ళింది.

భార్య ఇంటి దగ్గర ఈ పాటికి పాయసం చేసే ప్రయత్నంలో ఉంటుందనుకోవటంలో అతని ఆనందం మీసాల మీదుగా ప్రాకిపోయింది. పోగానే తాగాలి అనే కోర్కె క్కెడ పుట్టిందో కాని కడుపులో ఆకలి పుట్టింది.

మునుపొకసారి ఆశతో పాయసం చేయించుకొని, ఆవురావురు మంటూ ఎవరికీ ఏమి మిగల్చకుండా అటికెడు తానొక్కడే జుర్రుకొన్నాడు. అయితే హాయిగానే వుందిగానీ ఆ తర్వాత అజీర్ణం చేసింది. రెండు రోజులు విపరీతంగా కడుపునొప్పికి చుమ్మలు చుట్టుకుపోయాడు!

ప్రయివేటు డాక్టరు దగ్గరకుపోయాడు. హాలులో రోగులు కూర్చున్నారు. వరండాలో రోగులున్నారు ఇంటిముందు రోగులున్నారు.

అన్నంలేని రోగం, అన్నం అరగని రోగం! అంతకంటే రోగాలేమున్నాయి లోకంలో? ఏభై ఏళ్ళు నన్ను కాపాడితే, మిగతా ఏభై ఏళ్ళునిన్ను కాపాడుతానందట ఆదేదో దేశంలో, కడుపు, మనిషితో

రాంకోటి హాలులోకి పోలేదు. కాంపౌండు గేటు కూడా ఎక్కలేదు. ఇవతల నిలబడివున్నాడు. రోగులంతా వెళ్ళిపోయింతర్వాత డాక్టరు తనను పరీక్షిస్తాడని ఆశించాడు. అనుకొన్నట్లుగా రోగులంతా వెళ్ళిపోయారు. డాక్టరు రాంకోటిని చూశాడు. గుర్తించాడు. లోపలికి రమ్మనలేదు. డాక్టరు రాంకోటిని చూశాడు. గుర్తించాడు లోపలికి రమ్మనలేదు. తాను వెలువలికి రాలేదు. కాంపౌడరును పంపించాడు. అతనే రాంకోటి పాలిటి డాక్టరు! అయితేనేం రెండోరోజుకు కడుపునొప్పి తగ్గిపోయింది.

ఒక వారంరోజులు తర్వాత, ఆ డాక్టరు రోగిగా పెద్దాసుపత్రిలో చేరాడు. చిన్నపేగు మెలివడడంతో ఆపరేషన్ ఏదో అవసరమయిందని కాంపౌండర్లు చెప్పుకొంటున్నారు డాక్టర్లు ముగ్గురు నలుగురు చుట్టూ మూగారు. నలుగురు ముగ్గురు నర్సులు ప్రక్కనున్నారు.

ఓ రోజు సాయంకాలం నగరం నడిబొడ్డు మీద మెడపైకెత్తి నిలబడ్డ కళామందిరంలో కవులు కవిత్వం చదువుతున్నారు. రాగ తాళమయంగా నవరసభరితంగా చదువుతున్నారు. పాటకజనుల బాధల గూర్చి.

ప్రపంచం అంతా భవ్యంగా వుంది. స్వర్గంలో దేవుడున్నాడు.

ఒక కవి చదివిన ఆ అర్థం వచ్చే పద్యానికి పోటీగా సంగీతాత్మకంగా మరొకవి మునుం పెట్టాడు.

ప్రపంచం అంతా భవ్యంగా లేదు. స్వర్గంలో దేవుడు లేదు.

లౌడ్ స్పీకర్‌లోంచి వినబడుతున్న కవిత్వం రోడ్డు మీద చెట్టు క్రింద నిలబడి వింటున్న ఒక వ్యక్తి (కవి అయివుంటాడు) అక్కడికి - కవిత్వం చదివేందుకు -ఆహ్వానం వచ్చి వుండదు) అంటూ పోతున్నాడు ప్రక్క వ్యక్తితో

"అన్నీ ఎంగిలి కూతలు? ఎంగిలి తిళ్ళు! వాంతులూ బేదువూ! అంతా అజీర్ణరోగం! లోకం నిండా అజీర్ణం! రోగం రొచ్చు రొంపి! కవిత్వం నిండా గబ్బు! కళామందిరంలో కంపు!ఛీఛీ దుర్గంధం.

లారీ వచ్చి ఆగింది. గుంట దగ్గరకు వచ్చింది. గుంట దాదాపు నిండి పోయింది. ఇంకొక్క లారీ మాత్రమే రావాలి! అందులో చిన్న రాంకోటి వస్తాడు.

రాంకోటి లేచాడు. ఉంగటాలు తెగిపోయిన చెప్పులు కాళ్ళకు వేసుకోబోతూ చూశాడు. రెండూ పాదాలు క్రింద ఆరిగిపోయాయి. అప్పటికే అవి అతుకులు పడ్డాయి. జవజవలాడుతున్నాయి. కాళ్ళకు తొడుక్కొని లారీ దగ్గరకు పోయాడు.

'నాకొడు కెగిరిపోయేవోడే!' లారీ డ్రైవర్ చెప్పాడు.

'ఎవుడాడు!' రాంకోటి అడిగాడు

'ఎవుడో కుర్ర సన్నాసి ! చేతు లొదిలేసి సైకిల్ తొక్కుతున్నాడు గందా! ఆడొత్తన్నాడని నేనేమన్నాజూసేనా, పెట్టెనా? మలుపుదిరిగేసరికి కంటబడ్డాడు. లారీ సడన్ బ్రేక్ ఏసేసరికి సైకిల్ పప్పు పప్పు అయిందీ, ఆ డెగిరి మురుక్కాలవలో పడ్డాడు. నాయాలు ఎమికలన్నీ సరిగ్గా వుండయ్‌లే!

'ఆర్పాపం!'

'అందుకే గందా ఆలస్యెమయింది ఏం పర్లేదులే! ఆడు బాగుండాడు బురద గొట్టుకొని పందిపిల్లల్లే!'

'పొన్లే!'

లారీ వెళ్ళిపోయింది

చింతయ్యగూడా అంతే! చేతులు వదిలి సైకిల్ తొక్కుతాడు దుడుకు పిండం. ఏక్షణాన ఏం తెచ్చుకొంటాడో రాంకోటికి ఎప్పుడూ రెండోవాడంటే చెప్పలేని భయం.

చింతయ్య బొత్తిగా లెక్కాజమాలేని మనిషి. తూలుతూ ప్రేలుతూ వుండే బాపతు. ఏనాటికయినా డిప్టీకలెక్టరు అయితీరుతానంటాడు. తను వ్రాసిన కాగితాలమీద తప్ప కలెక్టరు కళ్ళు మూసుకొని సంతకం పెట్టడట. రాంకోటి చింతయ్య దగ్గరకు పోయినప్పుడు ఏమేమో చెప్పాడు. ఏజీవోలో అయినా గడగడా ఎండా కాలం చల్లని మంచి నీళ్ళు తాగినట్లు చెప్పేయగలడట మరదేమన్నా గొప్పో ఏమిటో! చింతయ్య పేంట్‌లోకి చొక్కా దిగేసుకొని చెప్పులేసుకొని రోడ్డు మీద వెళుతుంటే చూడాలి. అచ్చంగా దొరబిడ్డ వుండట్టుంటాడంటే నమ్మితీరాల్సిందే! తండ్రి ఆలోచనలు ఎప్పుడూ కొడుకుల్ని గూర్చి గొప్పగానే వుంటాయి.

చింతయ్యకు పిల్లాజెల్లా లేరు చీకూ చింతాలేని మనిషి! పెళ్ళాం తల్లో నాలుక! చెప్పినట్లు వింటుంది. చెయమన్నట్లు చేస్తుంది. ఇద్దరూ సాయంత్రం షికారుకంటూ బైలుదేరుతారు. జీతం కంటే పైరాబడి ఎక్కువగా వుంటుందట. ఆమె కవీ ఇవీ కొనిపెడుతుంటాడు. వాళ్ళిద్దరినీ చూస్తుంటే రాంకోటికి చాల ముచ్చట కలిగింది.

రెండో రోజు ఉదయం ఎవరో ఆడమనిషివచ్చి నీళ్ళు తోడి కుండల నిండా పోసింది. వంటగదిలోకి వచ్చి పాత్రలు తీసుకుపోయి కచికతో తోమి, శుభ్రంగా కడిగి యింట్లోకి తెచ్చింది. అన్నం పెట్టించుకొని వెనుక తట్టు వరండాలో కూర్చుని తిని లేచి వెళ్ళిపోయింది.

రాంకోటి ఉదయం ఆమెను చూశాడు. పాకీ పని చేసే మనిషి! ఆమె యింట్లోకి రావటం గూర్చి అర్థం కాలేదు. మూడు గతులు! ముప్పయి రూపాయిలు అద్దె! ఇంట్లో రెండు మంచాలు. పరుపులు! కూర్చునేందుకు కుర్చీలు! చింతయ్య పని మంచి వాటంగా వుంది.

ఆరోజు సాయంకాలం చింతయ్య తండ్రినీ, భార్యనీ సినీమాకు తీసుకుపోయాడు ముగ్గురూ కుర్చీలో కూర్చున్నారు. రాంకోటికి సినీమా చాలా వింతగా వుంది. అంతకంటే వింతగా తన కడుపున పుట్టిన కొడుకున్నాడు. కుర్చీలో కూర్చుంటే హంసతూలికాతల్పం మీద శయనించినంత ఆనందం కలిగింది ఏది అనుభవించటానికి అయినా ఆ రాత వుండాలనుకొన్నాడు. రాత్రి యింటికి తిరిగి వచ్చేటప్పుడు అడిగాడు.

"ఏందిరా,పొద్దుని ఆ మనిషి ఇంట్లోకి వొచ్చి కుండలూ సట్టులూ లొడపెడతావుందీ?"

చింతయ్యకు ఆ మనిషి గుర్తుకొచ్చింది.

'ఏం ఏం తప్పొందీ.'

'అది గాదురా! అదేం బాగుంటది? ఎవురన్నా నిన్నేమన్నా అనుకొంటే ఎట్టా?'

'అంటే ఏందీ నువ్వనేది.'

'ఆ మనిషి నీ యింటో దిరుగుతుంటే- ఏందీ- ఎవురన్నా ఈడు పలానోడు గా వోలు అనుకుంటే ఎట్టాగా అంట?"

'అందరికి తెలుసులే!'

'ఏందీ?'

'అవును-నాకేందే భయం!'

'ఆళ్ళంతా నిన్ను సులకనగా జూత్తే?'

'అసలు ఎవడీళ్ళందర్నీ లెక్కజేసేది? ఎదవనాయాళ్ళు. ఒకడెవడో ఏందో అనుకొంటాడని పుటక దాచుకోటానికి నేనేమన్నా అడ్డదిడ్డంగా పుట్టినోణ్ణా, ఏంటి - అట్టా వ్యవహారాలు ఉడకనిచ్చేది!'

చింతయ్య తెలియకుండా పెద్దకొడుకును తిడుతున్నట్టు అనిపించింది రాంకోటికి. వారం రోజులుండి భార్య మీద గాలిమళ్ళీ బైలుదేరాడు. ఈ పక్షం రోజుల్లో ఇద్దరు కొడుకుల్ని బాగా అర్థం చేసుకొన్నాడు రాంకోటి. ఇద్దరి మీద ప్రేమ వుంది. ఇద్దరి మీద కోపం వుంది. ఇద్దరి కుటుంబాలు నచ్చాయి. ఏదో ఒక కారణంవల్ల ఇద్దరిమీదా బాధ కలిగింది.

ఊరెళ్ళదామని బైలుదేరే రోజే ఉదయం కడుపులో నొప్పిగా వుంది. అయినా లెక్కచేయకుండా, పప్పులు కావాలన్న పిల్లవాడికి పప్పులు పెట్టిందాకా మారం చేసినట్టు, వెళ్ళాలంటే వెళ్ళాలని పట్టుబట్టుక్కూర్చుంటే ఏమీ చేయలేక చింతయ్య తండ్రిని రైలెక్కించాడు.

రైలు బయలుదేరేటప్పుడు ఆ పెట్టెలో జనంలేరు. ఒక మూల దుప్పటి పరిచి పడుకొన్నాడు. రాంకోటి. నాలుగు స్టేషన్లు దాటి దాటకముందే రైలు నిండా మనుష్యులైపోయారు. వీళ్ళంతా

ఎక్కడికి పోతారో, ఇంత తొందరేమిటో అర్థం కాలేదు. అర్ధరాత్రికి కడుపునొప్పి చాలా ఎక్కువయిపోయింది.

చాలా సార్లు లేవెట్రీలోకి పోయివచ్చాడు. శక్తి సన్నగిల్లిపోజొచ్చింది. విరేచనాలు అధికంగా అవుతున్నాయి. ఉన్నట్టుండి వాంతులు ప్రారంభమయ్యాయి. తెల్లవారింతర్వాత పది గంటలు అయితేగానీ తన వూరు చేరుకోలేడు. ఒపిక సన్నగిల్లిపోయింది. డీలా పడిపోయాడు.

మనిషికి అపరిమిత ఆనందం కలిగితే, ఆ ఛాయలో భయం తొంగిచూచే అవకాశం వుంది. అంతా దుఃఖం అయితే మొండికెత్తి కూర్చుంటాడు. కాదంటే క్రుంగిపోతాడు. అక్షణంలో రాంకోటి క్రుంగిపోయాడు. పక్షం రోజులు కొడుకు లిద్దరి దగ్గర తన గడిపిన జీవితం ఆనందమయిందే! భార్యను చూడాలని ఆక్షణంలో ఒక కోరిక ఆకస్మికంగా కలిగింది. వెంటనే భయం ఆవరించింది.

ఊరు చేరుకోకుండానే మధ్యలో తను చనిపోతే?ఆ అభిప్రాయం కలిగే సరికి రాంకోటి సంచలించిపోయాడు. ఊరు చేరిందాకా బ్రతికివుంటే ఆపైన చనిపోనని తేల్చుకొన్నాడు. కాని వూరు చేరటమే సాధ్యమయ్యేలా లేదు. కూర్చోలేకపోతున్నాడు పడుకొంటే బాగుండేది. అయినా పడుకోనిచ్చేదెవరూ? అందరూ కూర్చోవాలి! కూర్చునే హక్కు అందరికీ వుంది.

కడుపులో వడబెడలాడుతుంటే లేవెట్రికి వెళ్ళి, తిరిగి వచ్చేటప్పుడు అక్కడ రద్దిరద్దీగా కూర్చున్న అందరినీ దాటుకొంటూ ఆ మూలకు పోయి కూర్చోవటం కష్టమనిపించి వాకిలి దగ్గరగా క్రింద కూర్చున్నాడు.

ఎవరూ అతన్ని పట్టించుకోలేదు. చాలామంది అతని అవస్థ చూశారు. కొందరు కూర్చునే కునికిపాట్లు పడుతున్నారు.తీరా తలెత్తి చూస్తే మునుపు తను పడుకొన్న బల్లంతా మనుషులతో నిండిపోయింది. అంతేకాదు, కూర్చున్న ఖాళీ కాస్తా నిండిపోయింది. రాంకోటి ఏమీ పట్టించుకోలేదు.

తెల్లవారు జాము అయింది. రైలు వేగంగానే వెళుతూ వుంది. అయినా అలస్యంగా వెళుతన్నట్లునిపించింది ఉన్నట్టుండి వాంతి అయింది. నీళ్ళవాంతి కడుపులో ఏమీలేదు. బిక్కచచ్చిపోయాడు రాంకోటి ఏడుపు వస్తూంది. ఎవరూ పలకరించటం లేదు. దూరంగా తొలగిపోతున్నారు మనిషి పెట్టెలోకి ఎక్కటానికి ఖాళీ లేదని చెప్పగలవాళ్ళు నలుగురుకు తగినంత జాగా అతని కొక్కడికి వదిలిపెట్టారు.

ఆ పెట్టెలో లేవెట్రీ లేకపోతే ఎలా వుండేది? ప్రతి పెట్టెకొక లేవెట్రీ లోకంనిండా జనం జనం చుట్టూ అవసరాలు! ఇంటింటికీ వంట గది! దానికి దూరంగా మరోగది.దానికి దూరంగా మరో గది. దానికీ దీనికి అంతస్సూత్రం మనిషి! ప్రతి మనిషికి హక్కులున్నాయి. హక్కులు లెక్కాపత్రం లేకుండా వాడుకొంటున్నాడు మనిషి! హక్కులు అనుభవించి, బాధ్యతలు గమనించలేని మనుష్యులకు కూలీ రాంకోటి కూలివాడి బాగోగులు ఎవరికి పట్టాయి? అతని కష్టం చూచేదెవరు, జాలి తలచేదెవరు?

అతని తీరు చూస్తుంటే కలరా రోగి అనిపించింది. అందరికి జీవితం అంతా శృంగారమయం అనుకొనే వయస్సులో ఉన్న యువకుడు జీవితం నగ్నత భరింపలేకపోయాడు.

భార్యా ముగ్గురు పిల్లలతో రైలెక్కిన యువకుడింకొకడు తన బాధ్యతలు మరచిపోకూడదనుకొంటున్నాడు. అతని వైపు ఆ యిద్దరూ చూడలేదు. మూలన కూర్చుని కనుపించని ప్రకృతి రామణీయకం తిలకిస్తున్న యువతి ముక్కు మూసుకోవటం, ముఖం చిట్లించటం గమనించిన

యువకుడు ఆమెకీ రోగి ఇక్కడుండటం ఇష్టంలేదని తేల్చుకొన్నాడు.

ఆ యువకులిద్దరూ రైలు ఆగిందాకా రాంకోటిని ఓర్చుకోదల్చుకొన్నారు. ఎక్కువమంది నిద్రలో ఉన్నారు. అరుగుడేరుగురు కళ్ళు నులుంకొంటున్నారు. ఇద్దరు యువకులు నిద్రమాట అవతల వుంచారు. వాళ్ళొకళ్ళతో ఇంకొకళ్ళు ఏమీ మాట్లాడుకోలేదు గానీ, రైలు ఆగగానే ఇద్దరూ రాంకోటి దగ్గరకు వచ్చారు.

'దిగు!' అన్నారిద్దరూ. ఒకరి ముఖంలోకి మరొకరు చూశారు భావ సామీప్యం వల్ల.

'ఏంది?'

'దిగు దిగు!'

'ఏందిదీ నాదీ వూరు గాందే!' రాంకోటి విచిత్రంగా చూశాడు దిగే ఓపికి లేదనిపించింది.

'దిగు దిగు!'

'నాకు టిక్కెట్టుంది'

'సర్సర్లే! దిగు దిగు!'

రాంకోటిని చెరో చేయి పట్టుకొని ఇద్దరు యువకులు దించి ప్లాటు ఫారం మీద ఉన్న బెంచీ బల్లమీద పడుకోబెట్టారు రైలెక్కారు. పెట్టెలో పడుకొన్న భార్యనీ పిల్లల్నీ చూచుకొని తృప్తి పడ్డాడొక యువకుడు. మూలన కూర్చున్న యువతి ముఖంలో నవ్వుకోసం ఎడారిలో పువ్వుకోసంలాగా వెతికి కనిపించక మూతి ముడుచుకొని ఎటో చూస్తూ నిలబడ్డాడింకొక యువకుడు.

కపెర కపెర తెల్లవారింది ఆ స్టేషన్ చాలా చిన్నది. ఆ సమయంలో వచ్చే రైలు పోయే రైలు లేవు మనుష్యులే లేరు. స్టేషన్‌లో ఉన్న లేవెట్రీలోంచి చీపురుకట్టా. ఫినాయిల్ డబ్బాతో తిరిగి వస్తున్న పాకీవాడు రాంకోటిని చూశాడు. ఎక్కడో నూతిలోంచి మాట్లాడినట్లు అంత గొంతు విన్నాడు. ఇంటికి ఎత్తుకుపోయాడు రాంకోటిని.

రోడ్డు మూలమీద మలుపు తిరుగుతూ లారీ కనిపించింది. హారన్ వినిపించింది. రాంకోటి లేచి చూశాడు. లారీ వస్తూ వుంది. అందులో చిన్న రాంకోటి వస్తాడు. ఇంటి దగ్గర వాళ్ళమ్మతో పాయసం చేయమని చెప్పి వుంటాడు. ఈ పాటికి తయారవుతూ వుంటుంది. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చాడు. రైతు లింకా ఎరువు జళ్ళలో పోసుకుంటున్నారు.

అటు చూస్తుంటే ఒక రెండెడ్లబండి వెళుతూ వుంది. రాంకోటికి ఎందుకో అనుమానం వచ్చింది ఇదుగో ! ఎవురదీ! అపో! అపో బండిని! ఇదుగో నిన్నే!' కేకలు పెట్టాడు. కేక అందేంత దూరంలోనే ఉన్నారు. రైతులు బండి ఆగలేదు. రైతులూ జీతగాళ్లూ రాంకోటి వైపు చూశారు.

'చెప్పేది నీగ్గాదూ! అపమంటే ఏందాపవు! అపో!అపో! రాంకోటి అదరాబాదరా కాళ్ళకు చెప్పులేసుకొన్నాడు పడుతూ లేస్తున్నట్లు ముందుకు సాగాడు. గుంటమీదుగా దగ్గర గబగబా వెళుతున్నాడు గుంట ప్రక్క ఎత్తుగా పోసిన ఎర్రకంద మట్టిమీదికి ఎక్కాడు. కుప్ప కవుకిడుస్తూవుంది. రాంకోటి క్రిందికి చూడటం లేదు. 'ఆపో! ఆపో!' అంటూ ఎడ్ల బండి వైపు చూస్తున్నాడు.

రాంకోటి మట్టికుప్పమీద మలుపు తిరిగాడు. పెద్ద మట్టి పెళ్ల కొకదానికి చెప్పుకొట్టుకుంది. అప్పుడు 'ఆపో! 'ఆపో!' అంటున్నాడు రాంకోటి ఉంగటం తెగిన చెప్పు ఎదురు దెబ్బతో క్రిందికి వంగిపోయింది. మధ్య అరిగి కన్నం పడ్డ చోటుకు మడత పడింది. 'ఆపో!' అంటున్నాడు రాంకోటి

కాలుతీసి కాలు వేయబోయేసరికి మట్టి పెళ్ళతావు దప్పింది. దొర్లింది కాలు నిలవలేదు పట్టుచిక్కలేదు. మట్టి కుప్పమీంచి తూలిపోయాడు. బిళ్ళ బీటుగా పూర్తిగా నిండిపోయిన గుంటలో పడ్డాడు. పడుతున్నప్పుడు ప్రమాదం తెలిసివచ్చింది 'అపో!'అనలేదు 'దొరా!' అన్నాడు 'దొరా!' పెద్దగా ఆరిచాడు బోర్లాపడ్డాడు.

ఎదుర్రొమ్ము అనింది. మోకాళ్ళు అనాయి. కాళ్ళుగట్టునే ఉన్నాయి. గట్టును తన్నివట్టి పైకి లేవాలని చూస్తే మరింత లోపలికి పోయాడు గానీ గట్టెక్క లేకపోయాడు చేతులతో అదిమిపట్టి పైకి లేద్దామని ప్రయత్నించిన కొద్దీ చేతులు లోపలకు పోతున్నాయి గానీ వీలుచిక్కటం లేదు ముఖం అనలేదు. మెడ పైకెత్తి వుంచాడు. బలంగా గింజుకొన్నా ఫలితం లేకపోయింది. 'దొరా! దొరా!! దొరా!!!' ముమ్మారు కేక పెట్టాడు. అది ఏ దొరకూ ప్రత్యేకంగా పిలుపు కాదు. ఎవరయినా వింటే వచ్చి పైకి తీస్తారని ఆశ!

ఎరువు జల్లల్లో పోసుకొంటున్న రైతులై, జీతగాళ్ళూ రాంకోటి పడిపోవటం చూశారు. ఆ ఎడ్లబండి వెళ్ళిపోయింది. పిలువు విన్నారు. పరుగు పరుగున వచ్చారు. కొట్టుకులాడుతున్న రాంకోటిని చూశారు. అందరివైపు చూశాడు రాంకోటి. నోటి వెంట మాటలేదు. నోరు వాలిపోయింది. ముక్కు మునుగుతూ వుంది. కళ్ళు మాత్రం అర్థంలేని నీడలు చూడగలుగుతున్నాయి.

'లాగండ్రా బైటికి!'

'కాళ్ళు పట్టుగ్గుంజండ్రా!'

'తాడేసి లాంగడెహె!'

మాటలు వింటున్నాయి రాంకోటి చెవులు. కనురెప్పలు అనుతున్నాయి శరీరం పైభాగంలో తాడువేసిన స్పర్శలకూడా లేదు.

రాంకోటికి ఏమో అర్థం కాసాగింది. వాళ్ళు తనను పైకి తీయరేమోనని భయం కలిగింది. అభయంలోంచి ఆశ పుట్టింది.

లారీ వచ్చేస్తే...

రాంకోటి ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు నోరు మునిగింది. ముక్కు మునిగింది. కళ్ళు మునిగాయి. నుదురు మునిగింది.చెవులకు మాత్రం ఏవేవో శబ్దాలు వినబడుతూనే వున్నాయి. అక్కడ లేని శబ్దాలు! అర్థంలేని మాటలు! అనవసర ప్రసంగాలు! అవి విన్నా విన్నట్లు కాదు.

లారీ హారన్ వినిపించింది. రాంకోటి గుండె వేగంగా కొట్టుకొంటూ వుంది. గుండెపైన రాయి పెట్టినంత బరువు! ముక్కు దిబ్బిళ్ళుపడుతూ వుంది.

గుంట దగ్గర లారీ ఆగింది. 'ఏవయ్యిందే వయ్యింది?' శబ్దం వినిపించింది. రాంకోటి చిన్న రాంకోటి గొంతు విన్నాడు. ఎవరో లారీ లోంచి దూకిన చప్పుడు 'నాన్నా!' గుంట దద్దరిల్లేటట్లు కేక!'నాన్న!' శబ్దం చెవి దగ్గరగా వినిపించింది.

రాంకోటి హృదయంలో ఆశ పువ్వయింది. కళ్ళ ఎదుట కనిపించని కాంతి కదులుతూ వుంది. శరీరం ఎక్కడికో కూరుకుపోతున్నట్లుంది. ఆకాశం అందం కళ్ళముందు నిలిచినట్లయింది. గుండె చప్పుడు పెరిగింది. రాంకోటి శరీరం అంతా మొద్దుబారిపోయిన స్పర్శ!

(ఆంధ్రపత్రిక - కీలక సంవత్సరాది సంచిక (1968-69)

# 11

# మనిషి

## శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

ఛటర్జీ వద్ద సెలవుపుచ్చుకుని కలకత్తా మెయిల్లో కాలుపెట్టిన దగ్గరనీంచీ, బాజీ నెప్పుడు చూతునా, ఎప్పుడు చూతునా అని చక్రవర్తి హృదయం తటతటలాడిపోతోంది. ఎక్కడ కలకత్తా ఎక్కడ కోనసీమ! ఎంత దూరముందో అతనికే తెలియదు. బండి మెయిలయినా కొంచెం తాపీగా నడుస్తున్నట్టనిపించింది. అక్కడికి చేరుకునేసరికి తెల్లవారకమానదు, టైము చూస్తే రాత్రి తొమ్మిదిన్నర కాలేదింకా. ఆ కొండలూ, ఆ కాలవలూ, చెట్లూ, చేమలూ అన్నిటినీ చిమ్ముకుంటూ వెళ్ళిపోతోంది ట్రెయిను. అతని కళ్ల ముందు ప్రకృతి తన సౌందర్యాన్నంతా వొలకబోసుకుంటూన్నట్టనిపించింది, మరొకప్పుడైతే, ఏ ఇంజనో చెడిపోయి రైలు అకస్మికంగా మధ్యలో ఆగిపోతే బాగుండుననుకునేవాడు, కాని, ఇప్పుడు బాజీని చూడాలి.

బాజీ కిప్పుడు కొంచెం హెచ్చుతగ్గుగా మూడేళ్లు నిండవచ్చు. చిన్న పెదిమలూ, ముద్దులూరించే పాల బుగ్గలూ అంతా తల్లి పోలికే. తన నిప్పుడు ఆనవాలు పట్టగలడో లేదో.

చక్రవర్తి జమీందారు బిడ్డ. పోతుగడ్డ జమీందారు. కాలం చెయ్యగానే, జమీవారసత్వం నిష్కారణంగా దావాలోపడింది. చక్రవర్తి రాణి దుక్మిణీదేవికి కలిగిన బిడ్డ కాదనీ.. ఆమె నీళ్ళు పోసుకున్నట్టు, నటించిందనీ... నెలలు నిండినట్టు లెఖ్ఖకు రాగానే ఒక దాసీ పుత్రుణ్ణి సేకరించి పురిటి మంచం మీదికి తెచ్చుకున్నదనీ... ప్రత్యర్థులు అభియోగం తెచ్చారు.

ఇన్నాళ్లూ జమీందారు ఉప్పుతిని కండలు పెంచుకున్న ఉద్యోగస్తులే అటువేపు నించీ రకరకాల గడ్డి తిని.. కూటసాక్ష్యాలిచ్చి. ఆ అసత్యాన్ని సత్యమని రుజువుచేశారు. ఆ కూటంలో తన చేత మహోపకారాలు పొందివున్న విశ్వాసఘాతకుల్నీ.. దివాణంలో తనకి అతి సన్నిహితంగా మసులుతూ వెనకాల గోతులు తీసిన గుంటనక్కల్నీ.. ఎంతో మందిని గుర్తించాడు చక్రవర్తి.

జమీ పోయినందుకు చక్రవర్తి అంతగా చలించలేదు. అతనికి ఉదాత్తమయిన కళాహృదయముంది. చక్రవర్తి ఆంధ్ర దేశంలో సుప్రసిద్ధ చిత్రకారుడు. చిత్రలేఖనంలో అతనిది మెలిదిరిగినచెయ్యి. ఆ మధ్య అలహాబాదులో జరిగిన అఖిలభారత చిత్రకళా ప్రదర్శనంలో అతని 'కారుమబ్బులు' అన్న చిత్రం చూచినవాళ్లు హాలులో కించిత్తు చలికూడా వేసిందని అతిశయోక్తిగా చెప్పుకున్నారు.

కాని, జమీపోయిన సంఘటన అతని మనస్తత్వాన్నే వక్రంగా మెలిత్రిప్పింది. మనిషి మీద నమ్మకం పోయిందతనికి. వాస్తవానికి చక్రవర్తికి ప్రసక్తమయిన మానవప్రపంచం బహుసంకుచితమయినది. ఆ చిన్న ఆవరణలో అతనికి తారసిల్లిన వ్యక్తులందరూ కుత్సితులూ,

దుర్జనులూ అయినారు. వాళ్లని కొలబద్ధగా చేసుకుని అసలు మానవతనే శంకించే దుర్గతికి వచ్చాడు చక్రవర్తి. దావాదీనా, మనిషి అన్నవాణ్ణి అనుమానించకుండా వుండలేకపోయాడు చక్రవర్తి. వాళ్ల చూపులలో, మాటలలో కటుత్వమూ, కశ్మలమూ వూహించుకుని వైదొలగి పోతూవచ్చాడు.

అసలు నిఖార్సయిన ప్రజల్ని... రక మాంసాలతో వున్న ప్రజల్ని.. అమాయికత్వంలో మూతపడిపోయివున్న ప్రజల్ని.. చెమటోడ్చి, నెత్తురోడ్చి, దివాణంలో నడిచే కుట్రలకీ కుహకాలకీ దూరంగా.. తన దివాణానికి రంగరంగవైభవాలు సమకూర్చుతున్న ప్రజల్ని.. చక్రవర్తి ఎన్నడూ చూడనేలేదు. ప్రపంచంలో దరిద్ర మెంతవున్నదో, ఎంత మంది బ్రతుకే ఒక శాపంగా.. ఒక శిక్షగా అనుభవిస్తున్నారో, అతని వూహకందని వృత్తాంతం!

దావాలో నెగ్గినా ప్రత్యర్థులతన్ని వదలలేదు. శత్రుశేషం ఉండగూడదన్న రాజనీతి ననుసరించి... ఆ దుర్మార్గులు... యువరాణి ఉమాదేవి చుట్టూ చేరి.. చక్రవర్తిని వదిలిపెట్టి పొమ్మని హితబోధ చేశారు. అతని అభిజాత్యం నీచమయింది అని వర్ణించారు. 'నీవు ఉత్తమ కుల సంజాతవు' అని అగ్గించారు. ఆ దుర్బోధ లేవీ ఆమె చెవికెక్కలేదు. 'కడజాతివాడుకానీ, చక్రవర్తి నా భర్త - నా ఆరాధ్య దైవం' అని నిశ్చలంగా సమాధానమిచ్చి వాళ్ల నోళ్లు కట్టింది యువరాణి. ఆ తరువాతనయినా ప్రత్యర్థులు తమ పన్నాగాలు విరమించుకోలేదు. ఉమాదేవిని ఒక కళంకినిగా.. ఒక పతితగా.. చిత్రించి లేనిపోని అభాండాలు ఆమె నెత్తిన వేసి, చక్రవర్తి మనస్సు విరుద్దామని శతధా ప్రయత్నించారు.

ఉమాదేవి దుఃఖానికి మేరలేక పోయింది. ఎప్పుడు చూచినా శోకదేవతలా అగుపిస్తూ వచ్చిందామె. 'నేనీ లోకులకీ.. పలుగాకులకీ.. జడవను.. నిన్ను గూర్చి చెలరేగుతున్న విషప్రచారాన్ని నేను నమ్మను. నీ హృదయం నాకు తెలుసు' అని భోరోసా ఇస్తూనే వున్నాడు చక్రవర్తి.

కాని ఉమాదేవికి విరక్తి కల్గింది. ప్రత్యర్థుల కళ్లు చల్లగా.. ఒకానొక శుభోదయాన.. ఆమె ఆత్మహత్య చేసుకున్నది. ఇంత కసి చక్రవర్తి మీద పెరిగిపోవటానికి కారణం.. చిత్రమనిపించవచ్చును. అది యిదీ.. అతని మంచితనం, అతని నిర్లిప్తత... అశక్తత.. ఎప్పుడూ బొమ్మలుగిలికే వ్యాసంగంలో మునిగివుండడంలో పైకి కనిపించే అతని ఆలసత్యం... ఒకళ్ల దురాగతాలని సహించి పూరుకునే క్షమాగుణం.. తనకి నిర్హేతుకంగా అపకారం తలపెట్టిన దుర్మార్గుల్ని రాచిరంపాన పెట్టాలన్న ప్రతీకార వాంఛ యత్నించిత్తూ.. లేకపోవడం.. ఒక్కమాటలో తనని తాను సంరక్షించుకోలేని దౌర్బల్యం.

ఒక్కొక్కసారి చేతగానితనం ఘనీభవించిన చోట.. ఆ అలుసు చూసుకొని దుర్మార్గులు పెచ్చరిల్లిపోతారు. వాళ్ల దుర్మార్గానికి.. ఆ మధ్య స్తబ్దుగా.. అచంచలంగా పడివున్న నీరస పదార్థమే కారణమా అనిపిస్తుంది కూడా. అందుచేత క్షమాగుణం సర్వేసర్వత్రా సుగుణమేఅని చెప్పుకుందుకులేదు. ఒక సందర్భంలో అది దుర్జనత్వానికి ప్రేరణగా పరిణమిస్తుంది. అప్పుడు దానిని దుర్గుణం జాబితాలో చేర్చవలసివస్తుంది.

చక్రవర్తి ప్రతిజ్ఞ చేసుకున్నాడా అనిపిస్తుంది. నా చిత్రాలలోనుండి మనిషి పురుగు కనిపించగూడదు అనుకున్నాడు. అతని మనస్తత్వానికనుగుణంగానే అతని చిత్రాలలో. కొండా, కోనా.. చెట్టూ చేనూ.. అరణ్యమూ.. ఆకాశమూ.. ఇవే సాక్షాత్కరిస్తాయి. అన్నీ ప్రకృతి చిత్రాలే. ప్రకృతిలోని ప్రశాంతతా.. గాంభీర్యమూ.. సౌందర్యమూ సౌకుమార్యమూ అన్నికోణాలలోనించీ అతని కుంచె అందిపుచ్చుకున్నది. ఆ చిత్రాలలో మానవుడన్న వాడు మాత్రం కనిపించడు.

బాజీ తొంగిచూస్తున్నాడేమోనని ఎదురు చూడటమలవాటయిపోయింది చక్రవర్తికి. బాజీ తొంగిచూచే వరకూ అతని ఆలోచన ముందుకిసాగినా వెనక చూపుతోనే నడవడం ప్రారంభించింది. పగలెంత శ్రమించినా, గత చరిత్ర ఎంత కలత పెట్టినా, రాత్రి నిద్రపోయేముందు, స్టూడియో మూసి, దోమతెరలో పడుకున్న బాజీ కల్లు ఒక్కసారి ముద్దుపెట్టుకుంటే, అలిసిపోయిన అతని హృదయానికి ఆరోగ్యస్నానమైనట్టుండేది.

గోవిందు రాగానే బాజీ నెత్తుకునే పిల్లని తీశేశాడు చక్రవర్తి. ఇంటి పని చెయ్యటానికని వాణ్ణి వుద్దేశించకపోయినా, దయాధర్మ భిక్ష కింద వాడికి సాదరుకింద నెలకి నాలుగు రూపాయలిచ్చి అప్పనంగా చదువు సంధ్యలు చెప్పించి ముప్పొద్దులా తిండిపెట్టి మేపడమంటే అతనికి మనస్కరించ లేదు. ఎప్పుడు చూచినా చదువుకుంటూ వుండే వాడు గోవిందు. చిమచిమలాడేది చక్రవర్తికి లోపల. వాడు చదువుకుంటూ వున్నప్పుడల్లా, బజారు పనులూ, టేబిలు మీద దుమ్ము ఎక్కువగా వున్న సంగతీ, కిటకీల గుడ్డతెరలు దింపవలసిన అవసరమూ, బలీయంగా కనిపిస్తూ వుండేవి చక్రవర్తికి. పుస్తకంలో ఆనవాలు పెట్టుకుని లేచివచ్చే తోపుగానే కేకలేశేవాడు.

కోపాన్ని చూపించడానికి వీలులేని వాళ్లకి దానిని చిరాకుకింద మార్చుకోవలసిన అవసరమొచ్చి పడుతుంది. చదువూ గిదువూ కట్టి పెట్టమని చెపితే సరిపోదు, కాని, వాణ్ణి ఇక్కడ వుంచిందే అందెకాయెను. పోనీ ఎందుకొచ్చిన బెడద. నిర్మొహమాటంగా వాణ్ని వెళ్లగొడదామంటే పరువూ ప్రతిష్టా పోతాయి. మొన్న వొచ్చిన పెద్దమనిషీ దేశభక్తులిస్టుల్లో తన పేరుండటం, ఇవన్నీ జ్ఞాపకానికొచ్చాయి. అందుచేత అతని మనస్సు అతనికి తెలీకుండానే, చిరాకు పడవలసిన కారణాలకీ, కసురుకోవలసిన ఘట్టాలకీ వెతుక్కుంటోంది.

గోవిందుకీ బాజీకి ఆటలాడుకునే వయస్సయిన మూలాన్నో, మూడో వాడి ప్రసక్తిలేకనో, ఒకళ్ల అవసరం వొకళ్లకి బాగా అర్ధమయివుంటుంది. ఆసరాకి తగ్గగా మానేది దొరకక ఒకదాని నొకటి పెనవేసుకునే పూలతీగల్లానే ఆ రెండు లేతహృదయాలూ మెలివేసుకున్నాయి. క్రమేణా వొకరిని విడిచి వొకరు ఉండలేనంత మమకారం. వాళ్లిద్దరి మధ్యా గాఢంగా అల్లుకుంది, ఆత్మీయతకీ బీజమంటూపడడం తరువాయి, ఇట్టె నాటుకుని మొలకలై మారాకు వేస్తుంది. చక్రవర్తి ఇదంతా గమనిస్తూనేవున్నాడు. గోవిందు కడజాతివాడనే మీ మాంస చక్రవర్తి కెప్పుడూ అంతర్గతంగా వుండనేవుంది. దానికి తోడు బంగారు కణికలా అన్నట్టు మిసమిసలు చిమ్మే బాజీవేళ్లు మబ్బులో మెరుపుల్లా గోవిందు వల్ల బుజాలమీదా, అంతకంటే నల్లని ఆ ఉంజురు వెంట్రుకలలోనూ, జిలిబిలిగా అగుపించినప్పుడల్లా అతనిలో ఇంకా చావకుండా మిగిలివున్న జమిందారి నెత్తురు గిలగిలకొట్టుకోవడం ప్రారంభించింది. సంగీతంలో అపస్వరమొచ్చిందని తెలియకపోయిన సున్నితమైన చెవులకి కటువుగా వినిపించక మానదు. అలాగే, ఈ కలయికలోవున్న వైపరీత్యం హేతువాదానికి నిలబడకపోయినా, అతని మనస్సుకి మాత్రం అది అసందర్భంగా, అసంగతంగా వెగటు పుట్టించింది. ఇది తుచ్ఛమైన స్వాభిమానమనీ, పరిహరించుకోవాలనీ, గట్టి ప్రయత్నమే చేశాడు. కాని సంకుచితమైన దురాలోచనలు లోలోపల కుట్ర చేస్తూనే వున్నాయి.

ఒకనాడు గోవిందు హాలులో కిటికీ దగ్గర చదువుకుంటున్నాడు. బయట ఆ దారినే సినిమాపేపర్లు బండొకటి వెడుతోంది. బాజాలు వినిపిస్తున్నాయి చూడటానికి దగ్గరతోవ యేదా అని ఆలోచించాడు బాజీ. కిటికీకి దగ్గరగానే కూచున్నాడు గోవిందు. మరో సాధనం దొరకలేదు. ఆలోచనా తదనుగున మైన చర్యా, ,రెండూ వొక్కసారే, చెట్టాపట్టీలు వేసుకుని సాగుతాయి పసితనంలో, బీలు చూచుకుని గోవిందు బుజాలమీదకెక్కి, అక్కణ్ణించి సులువుగా కిటికీ

వూచలందుకున్నాడు బాజీ. కాని, బాజాలు చూస్తున్న సంబరంలో, కాలెక్కడ ఆనిందీ గమనించలేదు. పైగా చప్పట్లు కొడుతున్నాడు. కొంచెముంటే గభీమని క్రిందపడి కాళ్లు విరుచుకునేవాడే అప్పుడే ఏదో పనుండి హాలులోకివస్తూ, చక్రవర్తి హఠాత్తుగా చూచిపట్టుకుని దింపాడు. క్షణమాగి చురచురమని చూశాడు గోవిందువంకా, పుస్తకాల వంకా... కిక్కురుమనకుండా పుస్తకం మూశాడు గోవిందు.

అక్కడికీ ఎప్పుడైనా చక్రవర్తి కళ్లబడితే, పుస్తకం రహస్యంగా మూస్తూనే వున్నాడు వాడు. కాగా, ఈ మధ్య పుస్తకాలు తెరవాలిసిన అవసరమూ అంతగా కనిపించటం లేదు గోవిందుకి. చదువు కొంటూవుంటే, అదనీ యిదనీ, ఎడతెరిపి లేకుండా పనితగుల్తోంది, ఇకపోతే, ఖర్మంచాలక ఎప్పుడైనా బుక్కు తెరిచాడో, బాజీ ఏ మగ్గు బుట్టవొలకబొయ్యటమో, ఏ రంగు పులుముకోవటమో, ఏ బియ్యము విరజిమ్మటం వరకో వెళ్లి అధమపక్షం ఏ తలుపు సందునైనా వేళ్ళుంచి కెవ్వుమంటాడు తప్పదు. అంతవరకూ వొచ్చిందో, ఒక తట్ట వరస తివాట్లు, తలవాచేటట్టు తగుల్తాయి.

చక్రవర్తి బాజీనెప్పుడూ ఒక సముద్రపు వొడ్డుకిగాని, ఒక వూరేగింపుకిగాని, ఒక వుత్సవానికి గాని తీసికువెళ్లిన పాపానపోలేదు. స్టూడియోలో కుర్రాడు స్టూడియోలోనే మణిగిపోతాడు. వంట మనిషి మెస్‌లోనే మగ్గిపోతాడు. అందుచేత, బాజీకి మాలులోవున్న వస్తువుల్తోనే పరిచయం. స్టూడియో వైపున్న పువ్వులగుడ్డ తెర ఎప్పుడూ పక్కున నవ్వుతూ వుంటుంది. గోడలకున్న పటాలు మాట్లాడటానికి గొంతు సవరించుకుంటున్నట్టు, సముద్రపు గాలి కెప్పుయినా కాస్త కదిలేవి. ఎటొచ్చీ, తను పలకరిస్తే పలికీ, నవ్విస్తే నవ్వీ, జడిపిస్తే జడుసుకునీ, కొడితే ఏడిచీ, ఏడుపు వంటించీ కొద్దో గొప్పో సజీవంగా వున్నట్టు కనిపించే పదార్థం ఆ హాలులో గోవిందు వొక్కడే. అతనికీ తనకీ మధ్య ఈ పుస్తకాలూ, ఈ సిరాబుడ్లూ పరుచుకుని కూచోవటం బాజీకి కంటగింపుగావుంది. అందుచేత వాటి మీద పట్టించాడు. అన్నిటికన్న ఈ దండయాత్రతో గోవిందు చదువూ సంధ్యా ఒక్కదెబ్బతో పుడుగు నాకిపోయింది.

ఇప్పుడు చదువు సాగటంలేదని గోవిందు కేమీ వొరగలేదు. కానీ మేష్టారూరుకోలేదు. ఓనాడు చెప్పిచూశాడు, మర్నాడు కసురుకున్నాడు, మూడో నాడు చేయిజేసుకున్నాడు, కొన్నాళ్ల వరకూ పాఠాలు బాగా చదువుకొచ్చేవాడని తెలుసు! అందుచేత, ఇప్పుడు బద్ధకం బలిసిందని టీచరికి నిర్ధారణయిపోయింది.

పోను పోను, ఇక్కడ ఇంటోనూ, అక్కడ బళ్లోనూ, పలచపలచగా దెబ్బలు తినటానికి అలవాటు పడ్డాడు గోవిందు. ఈ యాతన భరించలేక ఒక్కొక్కనాడు అక్కడ పాఠాలూ, ఇక్కడ పనీ రెండూ ఎగేశేవాడు.

ఒకనాడు గోవిందు బాజీ నెత్తుకుని ఎందుకో వెక్కివెక్కిఏడుస్తున్నాడు పైకి వినపడకుండా, 'నాన్న గాలు కొత్తేలా?' అని పరామర్శించాడు బాజీ. చంకదిగి, 'బిచకొత్తులివ్వనా?' అని బెల్లించేసరికి గోవిందుకి యేడవబుద్ధి కాలేదు. ఆ తియ్యని పలుకులికి తన జీవితంలో గూడుకట్టుకున్న ఎంతచేదునయినా ఒక్క క్షణంలో విరిచేశక్తి వున్నట్లనిపించింది వాడికి. పకాలున నవ్వేశాడు.

మర్నాడు, తల్లిని చూడటానికని చింతలతోపులోంచి మాలగూడుం వెడుతున్నాడు గోవిందు. చెట్ల ఆకుల నీడలూ, మధ్య మధ్య వెన్నెలజాడలూ కలిసి మిలమిల లాడుతున్నాయి. వాటిని చెరిపేస్తూ దెయ్యం లాగ అతని నీడ ముందునుసాగుతోంది. ఆకుల సందునించీ చిన్నచిన్నపిట్లలు దాగుడుమూచ్చీలాడుతున్నాయి. ఆవేమీ చదువుకున్నాయి? ఏమిజీతం తెస్తున్నాయి? అంత కోలాహలంగా వున్నాయే! బ్రతుకు తెరువు అంత సులభంగా వుంటే! ఎవడితో చెప్పుకోగలడు

తన బాధ? దుఃఖానికి సానుభూతి సగం విరుగుడు. తల్లికి అర్థంకాదు. మొన్న బడిపంతులు కొట్టాడ ని బిక్క మొహం వేసుకుని చెప్పాడు, పాఠాలు చదవకపోతే ఎట్టారా నాయనా? అంది, మేస్టారు కొట్టిన మాట వొదిలేసి.

చక్రవర్తి కొడుతున్న సంగతి ఇంకా చెప్పనే లేదు తల్లికి. చెబితే, అక్కడ మానెయ్యమంటుందేమోనని భయం. మానెయ్యాలనేవుంది, కాని బాజీని వొదిలిపెట్టివుండగలడా? ఆ చిన్ని పెదిమలమీది జిలేబీ చుట్టలూ, ఆ చంపల మీది గులాబీ రేకులూ, అన్నీ వొక్కసారి పగ్గాలకిందమారి వాడి మనస్సుని వెనక్కి బలంగా లాగాయి. ఏమీ తోచలేదు.

ఆ వేళ పాఠాలు బొత్తిగా చదవలేదు గోవిందు. చదవటానికి తీరికాలేదు. బడిపంతులు బెత్తంతో చితకగొట్టాడు, ఇంటికివెళ్లి అమ్మని కావిలించుకుని బావురుమని ఏడిచాడు. తల్లి బెంబేలు పడిపోయింది. వొంటినితేలిన దద్దుర్లు చూచి హడిలిపోయింది. బడి మానెయ్యమంది. చదివి, వుద్యోగమో, సద్యోగమో చేసి తనని వుద్ధరిస్తాడేమో ననుకుంది ఆ పేదరాలు. గోవిందుకి తెలుసు. ఆశలన్నీ నిరాశ చేస్తున్నానే అని అతడికీ బెంగగానే వుంది. ఆలోచించాడు. అక్కడ కొట్టినా ఇక్కడ తిట్టినా అసలు చెప్పటం మానేశాడు.

ఆనాడు మధ్యాహ్నం మూడుగంటలయింది. చక్రవర్తి స్టూడియోలో కూచున్నాడు. ఆలోచనా స్రవంతికి ఏదో ఆనకట్టపడింది. వెయ్యదలుచుకున్న చిత్ర మతని వూహ కందక తప్పించుకుంటోంది. మెదడు ఖాళీగా వున్నట్టనిపించింది. ఏమా అని తర్కించి చూచుకున్నాడు. బాజీ రెండు మూడు రోజుల నించీ స్టూడియో వంక రావటం తగ్గించాడు, ఈ వేళ అసలు తొంగిచూడనేలేదు. హాలులోకివెళ్లి పరకాయించి చూచాడు. కర్టెన్‌లోనించీ ఒక సన్నని సూర్య కిరణం గచ్చునేలమీద పడి చిన్నగుండ్రని బంగారపు బిళ్లలా అవుపిస్తోంది. దానిని ఎలాగయినా ఏది జేబులో వేసుకుందామని తంటాలు పడుతున్నాడు బాజీ. పక్కనే నుంచుని గోవిందు పకపకమని నవ్వుతున్నాడు. చక్రవర్తి స్టూడియోలోకి వెళ్లిపోయిక్షణమాగి మళ్లీ వచ్చిచూచాడు పరీక్షగా. గోవిందు వీపుమీద స్వారీ చేస్తున్నాడు బాజీ. తువాలు మెడకింద నుంచీ తీసి కళ్లెంకింద పట్టుకుని చల్‌చల్ మంటున్నాడు. 'అదేమిట్రా, చవటా అని ఒక్క అరుపు అరిచాడు చక్రవర్తి. బాజీ పక్కున నవ్వాడు. గోవిందు వులిక్కిపడ్డాడు. ఆట కంతరాయం వచ్చి ఇద్దరూ ఇబ్బందిగా మొహం పెట్టారు. స్టూడియోలో కూచుని ఆలోచించుకున్నాడు చక్రవర్తి. తను అలా ఎందుకు కసురుకున్నాడో అతనికే అర్థం కాలేదు.

వియన్నాలో నానాదేశ చిత్రకళా ప్రదర్శన మొకటి జరగబోతోంది. దానికొక చిత్రం పంపించాలి. భారతదేశంలో సుప్రసిద్ధులైన వివిధ చిత్ర కారుల్ని కలుసుకోవలసిన అవసరముంది. లాహోరూ, బొంబాయి, మరి ఇతర చోట్లకీ వెడుతూవస్తూవున్నాడు చక్రవర్తి. ఇంటి దగ్గర నిలకడగా వుండటం లేదు. బాజీని పలకరించటానికైనా తీరిక చిక్కడం లేదు. క్రమేనా బాజీకి చక్రవర్తితో ప్రమేయమూ తగ్గిపోయింది.

ఒకనాడు, ఛటర్జీ దగ్గరకి వెడదామని చక్రవర్తి ప్రయాణమయ్యాడు. బెడ్డింగు సర్దుతూ 'బాజీ' అని పిలిచాడు. గోవిందు బాజీ నెత్తుకుని దగ్గరికొచ్చాడు. బాజీ మామూలుగా చేతులు చాపలేదు. చక్రవర్తిని గమనించనైనా గమనించలేదు. మనస్సు చివుక్కుమంది. వీళ్ళిద్దరూ కలిసితనమీద ఏదో కుట్ర చేస్తున్నారా? గోవిందువంక అసూయగా చూచాడు చక్రవర్తి. స్టూడియోలో కూచుని నిదానంగా ఆలోచించుకున్నాడు. బాజీ తనకి దూరమైపోతున్నాడా? గుండెలో రాయపడింది.

ప్రయాణం హఠాత్తుగా విరమించుకున్నాడు చక్రవర్తి. ఇహ ఎక్కడికీ వెళ్లదలుచుకోలేదు. కుంచెలూ, రంగులూ, కేన్వాసుగుడ్డలూ ఒకమూల పడేసి చిత్రలేఖనం కూడా కట్టి పెట్టాడు చాలా వరకు, ఎప్పుడైనా గుబులుపుట్టి బాజీ నిదురపోతున్నప్పుడు మాత్రం ఒక్కసారి స్టూడియోలోకి వెళ్లి వచ్చేస్తున్నాడు. ఇక బాజీ ఆటపాటలలో తనుగూడా కలగజేసుకుందామని గట్టి ప్రయత్నాలు చేశాడు చక్రవర్తి.

గోవిందు దూరంగా నిలబడివున్నాడు. బాజీ మొహం చిట్లించుకుని విసుగ్గా నుంచున్నాడు. తను రావటం వాళ్లిద్దరికీ ఏదో అడ్డంకిగా వున్నట్టు గమనించాడు. చక్రవర్తి. బాజీని చేతుల్లోకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. ఎత్తుకున్న మనిషి ఎవరో కొత్త మనిషి అన్నట్టు ఆస్తిమితంగా చూచాడు. బాజీ. చూచి చంకనించి దిగజారుతున్నాడు. 'బంగారుకొండ కదూ' అంటూ ఇంకా దగ్గరికి తీసుకున్నాడు చక్రవర్తి. గునుస్తూ చేతులతో తోసిపారేసి తుర్రుమన్నాడు బాజీ. చక్రవర్తికి చాకుతో పొడిచినట్టయింది. కళ్లు చెమ్మగిల్లాయి. విడిచిపెట్టి తలవంచుకుని దవడ గీరుకొంటూ దీనంగా వెళ్లిపోయాడు స్టూడియోలోకి. బాజీ కిలకిలనవ్వుతూ గోవిందుకేసి పరిగెత్తుకుపోయాడు. ఈ అవమానం, ఈ నిరాకరణ, భరించలేకపోయాడు చక్రవర్తి. అతని జీవితంలో కొత్తగావచ్చి ప్రవహిస్తూన్న అమృత వాహినులన్నీ వొక్కసారి ఇంకిపోయినట్టయింది. అతని చిత్రకళా, చిత్రకళా ప్రదర్శనశాలలూ, పూల మాలలూ, కరతాళధ్వనులూ అన్నీ వెలవెలపోయాయి.

ఎన్ని సాధనాలైనా ఆలోచించాడు బాజీని తన వేపుకి తప్పుకోవాలని, బిస్కట్లూ, చాకలెట్లూ తెచ్చి తెచ్చి బెల్లించాడు, కొత్త కొత్త ఆటవస్తువులు చేత్తో పుచ్చుకుని బాజీని ఆకర్షించటానికి ప్రయత్నించాడు. లాభం లేకపోయింది. గోవిందుతోనే వాడి ప్రపంచం పరిమితమైపోయింది. వాళ్లిద్దరూ గిరిగీసుకుని కూచున్నారు. తనని బైటకు నెట్టారు ఇంచుమించు, చక్రవర్తి మనస్సు ఆరాటపడుతోంది.

ఆ రాత్రి గోవిందుని యింటికి వెళ్లిపొమ్మన్నాడు చక్రవర్తి, వంటమనిషి భోజనాలయిన తరువాత వెళ్లిపోవటం రివాజు.. తానొక్కడే బాజీని పడుకోబెట్టుకుని పలకరించవచ్చును అనుకున్నాడు, వాణ్ణి ఎలాగయినా మంచిజేసుకోవాలన్న తపన ఎక్కువయింది. ఇష్టం లేకపోయినా, తప్పనిసరిగా గోవిందు వెళ్లిపోయాడు. రాత్రి రెండు జాములైపోయింది. కలత నిద్రగావుంది. ఆలోచన పరిపరివిధాల పోయింది. దూరాన్ని సముద్రం హోరుమని ఏడుస్తోంది. ఈదర గాలి కిటికీ తలుపుల్తో మాటి మాటికీ జగడమాడుతోంది. ఉలిక్కిపడి లేచాడు బాజీ, పక్కని గోవిందు లేడు. కెవ్వున ఏడుపు మొదలుపెట్టాడు. లేచి బాజీ నెత్తుకున్నాడు చక్రవర్తి. చేతుల్లో నిలవటం లేదు. పెంకు లెగిరిపోయేటట్టు ఏడుస్తున్నాడు బిస్కట్లిచ్చాడు. ఏడుపు మానలేదు. పాలు పట్టించాడు, గ్రాతలేదు. ఆట వస్తువులన్నీ మూలమూలాల వున్నవి చేర్చి ముందు పెట్టాడు, ఏడుపు ఎక్కువయింది. ఉయ్యాలలో పండుకోబెట్టి ఊయించాడు. మరీ గుక్కపెట్టి ఏడుస్తున్నాడు, ఖంగారు పుట్టింది, ఇంట్లో ఎవ్వరూ లేరు, అందుచేత అదుర్దా ఎక్కువయింది. బాజీని ఓదార్చే సాధన మేమిటో తెలియటం లేదు, లోపల ఏమైనా బాధగా వుందేమో, డాక్టరు దగ్గరకు కానీ త్రోవలో, ఏడుస్తూ వుండగా, అందులోనూ, ఆ నిశరాత్రివేళ ఎలా? ఇంత చలిగాలిలో కుర్రాణ్ణి ఎందుకు తీసుకొచ్చావయ్యా అంటే అంటే డాక్టరు? తీసికెళ్లకపోతే, ఏమని చెబుతాడు, డాక్టరుతో? పిల్లవాడేడీ అంటే? పోనీ డాక్టర్నే తీసుకొస్తే సరీ అనుకున్నాడు కొసకి. కాని ఎవరు పిలుచుకొస్తారు? బాజీని ఒంటరిగా ఇంట్లో వొదిలి వెళ్లటమెలా? ఏమీ తోచలేదు. మెదడు పని చెయ్యటం మానుకుంది.

ఏమనుకున్నాడో, బాజీ నెత్తుకుని స్టూడియోలోకి వెళ్లి స్విచ్ వేశాడు చక్రవర్తి. గోడకి తగిలించి వున్న వొక పెద్దపటం చూపించి తెర యెత్తాడు, అది ఉమాదేవి ఛాయా చిత్రం. ఎప్పుడోగాని ఆ తెరెత్తడు, నిదరబోయిన తన గతకాలపు ప్రణయజీవితమంతా వొక్కసారి కలుసుకున్నది చక్రవర్తి హృదయంలో. బాజీ రెప్ప వాల్చకుండా ఆ చిత్రంవంక వొక్క క్షణం చూచాడు. ఆవలింత లొచ్చాయి. బుజాలమీద అలాగే సోలి నిద్రపోయాడు. తెల తెల వారుతూండగా లేచి దోమతెర వొత్తిగించి చూచాడు చక్రవర్తి. రాత్రి కన్నీటి చారలు ఆ గులాబీ బుగ్గల మీద అలాగే వుండిపోయాయి. వాడిన కలవపువ్వులా వుంది వొడలంతా. తల నిమిరి ఆ చిట్టి చేతులు తన మెడచుట్టూ వేసుకున్నాడు.

తన బాజీకీ, తన కన్నబిడ్డకే తానక్కరలేదు! ఈ సన్నని కడుపుకోతకి అతని రక్తంలో వున్న ప్రతిబిందువూ గిలగిల కొట్టుకుంది. హృదయకోశాన్ని ఎవరో పెకలిస్తున్నట్టు బాధపడ్డాడు చక్రవర్తి. భౌతికంగా తన చేతులలో ఇమిడినా... తన హృదయం విప్పిన రెక్కల కింద ఇమడక తప్పించుకుంటున్న ఈ ముగ్ధ సౌందర్యాన్ని మళ్లా తనది అని ధైర్యంగా చెప్పుకోగలడా ఏ నాటికైనా? తను చేసిన అపరాధమేమిటో ఎంత తీరిచి చూచుకున్నా అతని కర్థం కాలేదు. తన పునికిబొమ్మల ప్రపంచమయితే.. వాడికి మనష్యలోకం కావలసి వచ్చిందా?హృదయానికి దగ్గరగా ఇంకా దగ్గరగా అదుముకున్నాడు బాజీని. గుండెలో మంట చల్లారలేదు. అతని కళాభిరుచులూ, కీర్తికాంక్షలూ, జీవితాశయాలూ... అన్నీ తమ తమ పనులు మానుకుని.. ఒక్కసారిగా గుమికూడి.. బాజీ ప్రేమభిక్షకోసమని చేతులు చాపాయి. అసలు ఈ యాతనని అర్థం చేసుకోగలిగితే బాజీ తనకి దూరమయ్యేవాడు కాడేమో. బొటబొట కారిన కన్నీటి బొట్లు బాజి నొసట చిందులు త్రొక్కుతున్న ఉంగరాల వెంట్రుకల మీద పడ వూగిసలాడాయి. కిటికీలోనించి చిక్కని నీరెండ బాజీ చెంపలమీదపడి వెక్కిరించింది.

రోజులు గడిచాయి. ఒకనాడు గోవిందు తల్లిని చూచేందుకని వెళ్లాడు గూడెం. రెండు రోజులుండి రమ్మన్నాడు చక్రవర్తి. వాడు చాలా పొద్దెక్కి లేచాడు. మాలగూడెంనించి స్కూలుకి వెళ్లేసరికి, మరీ పొద్దెక్కింది. నిన్నటి పాఠాలేమీ రాలేదు. ఆ లెఖ్ఖల అంకెలూ, హిస్టరీలో తరాఖులూ అన్నీ అలుముకుపోయి, వాడి మొదట్లో మసక చీకట్లో మంచుతెరలూ కమ్ముకున్నట్టుంది. పైగా బడికి ఆలస్యంగా వెళ్లట మొకటి, వెడదామా వొద్దా అని గుంజాటనలో పడ్డాడు. మరీ ఆలస్యమయిపోయింది. ఎటొచ్చీ, ఇప్పుడు వెళ్లినా, అసలీ వేళ ఎగవేసినా, రెండూ వొకటే. దేహశుద్ధి తప్పదు. ఇకపోతే, ఇప్పుడు చక్రవర్తి ఇంటికిగాని వెళ్ళాడా, స్కూలు ఎగవేసినట్టు తెలిసిపోతుంది, వీపు చిట్లుతుంది. గడ్డిమేటిపక్కని దూదూబిళ్ల ఆడుకుంటున్నారిద్దరు పిల్లలు. పిల్లిపిసరకాయలు కోసుకుందామా అన్నాడు వాళ్లతో. సరేనంటే సరేననుకున్నారు. చక్రవర్తి ఏ వూరైనా వెళ్లిపోయి, స్కూళ్లన్నీ వొక్కసారి మూశేస్తే నిర్విచారంగా వుండొచ్చు ననిపించింది వాడికి. దొకికిందే సందని ఆటల్లో మునిగిపోయాడు. కాలం గడిచిపోతున్న జాడలేదు. మధ్యాహ్నం అన్నం తినలేదు. నకనకలాడుతోంది లోపల. పొద్దు గూకింది. మళ్లీ తెల్లవారితేనే గాని బాజీ కనపడడు. ఆ పాపడిమీద బెంగపారింది. ఏదీకానివేళ ఇప్పుడు గాని చక్రవర్తి కళ్లపడితే చర్మ మొలుస్తాడు. రెండు రోజుల పోయిగాని తనని. ఆలోచించాడు ఒక వుపాయం తట్టింది. వెనకాల ప్రహరీ గోడ మీద నించీ లోపలికి దూకి బాజీని పలకరించి వొచ్చేస్తే సరి. వెళ్లాడు ఆ మసక చీకట్లో పిట్టగోడ ఎక్కి 'బాజీ' అని పిలిచాడు, లోపల నిశ్శబ్దం. కిందకి దూరిచ మునివేళ్ళ మీద పడుస్తూ, హాలులోకి వెళ్తూ, ఎలక్ట్రిక్ దీపం వెలుతురులోనించీ బాజీ కిలకిలలాడుతూ వొళ్ళే

కొచ్చి ఎగబడే సముద్రపు కెరటంటాగ చంకకి దూకాడు. లోపలనించీ చక్రవర్తి హఠాత్తుగా దూసుకొచ్చి చెళ్లున చెంపకాయ కొట్టాడు, బాజీ పిల్లిలా ముడుచుకుపోయాడు. బెదురుతో గబగబా స్టూడియోలోకి పరుగు పరుగున వెళ్లి నక్కాడు. గోవిందుకి తల గిర్రున తిరిగింది, భయోద్రేకంచేతగాన తెలివి తప్పలేదు, కళ్లు బయర్లుగమ్మినై, లేచి గిరుక్కున వీధిలోకి పారిపోయాడు, బాజీకి భయం వేసింది. ఇన్నాళ్ళూ చక్రవర్తితో చనువుగా వుండలేకపోయినా, అయనంటే బయపడవలసిన ఘట్టం ఇంతవరకూ రాలేదు. స్టూడియోలోకొచ్చి బాజీని చేతుల్లోకి తీసుకున్నాడు చక్రవర్తి. పులిపంజాలో దద్దరిల్లే జింకపిల్లలా వొణికిపోయాడు బాజీ. అపరిమితమైన దుడుకుగా వుంది వాడి లేతగుండెలో సముదాయించలేకపోయాడు చక్రవర్తి. చాలా తొందరపడ్డాననుకున్నాడు. అప్పుడు జ్ఞప్తికి వచ్చింది. అంతవరకూ తను గోవిందు నెప్పుడూ బాజీ సమక్షంలో కొట్టిందిలేదు.

రాత్రివేళ, గోవిందు తిన్నగా గూడెంలో తల్లి ఇంటికి వెడుతున్నాడు. మర్రితొర్రలోంచి ఒక గుడ్లగూబ వికారంగాకూస్తూ లేచిపోయింది. పక్కని కంచెలోనించీ ఒక జర్రెపోతు జర్రున పాకిపోయింది ముందునించి, గోవిందు జడసుకున్నాడు. చరచరా నడిచాడు. ఇంటికివెళ్లి మొహ్మదీకి దుప్పటి లాక్కుని మలకమంచం మీద పడుకున్నాడు. గుండెలో ఝల్లు ఇంకా వదల లేదు. తల్లి వొచ్చి మీద చేయివేసి చూచింది. వొళ్లు కాలిపోతోంది. జ్వరం మాంచి తీవ్రంగా వుంది.

గోవిందుకి జ్వరం తగ్గిందీ లేనిదీ చక్రవర్తికి తెలయలేదు.

పదిరోజులు పోయింతరువాత రమ్మనమని కబురు పెట్టాడు. గోవిందుతల్లి పంపనంది. చక్రవర్తి కేమీ పాలుపోలేదు. ఒకళ్లని ప్రాథేయపడటం అతనిచాతకాదు.

చక్రవర్తికిమరో బెడద వచ్చిపడింది. బాజీ నానాటికీ మందకొడిగా వుంటున్నాడు. అదేమో, ఆటపాటలు క్రమేణా మానేశాడు. వొంటరితనం ఫీల్ అవుతున్నాట్టు స్పష్టమయింది చక్రవర్తికి. రాత్రిళ్లు బొత్తిగా పట్టుకోలేకపోతున్నాడువాణ్ణి. పగ లెప్పుడైనా ఆడుకుంటున్నప్పుడు తను కనపడ్డాడా, తక్షణం ఆటవస్తువులన్నీ వొదిలేసి బెదిదిన లేడి పిల్లలా పారిపోతాడు. ఎక్కడో నక్కినక్కి భయం భయంగా చూస్తాడు. గోవిందుని కొట్టిన రాక్షసుడు, తను ! తానంటే అసహ్యమూ, భయమూ, ఆ పసివాని హృదయంలో కమ్ముకునిపోతున్నాయి. కొన్నాళ్లకి గుర్తించగలిగాడు చక్రవర్తి.

ఎత్తుకోటానికి మళ్లీ ఒకపిల్లని కుదిర్చాడు చక్రవర్తి. దానిదగ్గరా మాలిమికాలేదు బాజీకి. చక్రవర్తి కర్థమయింది. వాడికి గోవిందు కావాలి.

ఆఖరికి కర్తవ్య మాలోచించి వొక నిశ్చయానికి వొచ్చాడు చక్రవర్తి. బాజీకి సరియైన రక్షణా పోషణాలేక చిక్కి శల్యమైపోతున్నాడు.

చివరికి ఒకనాడు అమ్మమ్మగారింటికి తీసి కెళ్ళాడు బాజీని. చూడగానే బాజీ కెక్కడలేని చైతన్యమూ వొచ్చింది. పోయిన ప్రాణం లేచివొచ్చినట్టని పించింది వాడికి. అమ్మమ్మ ముసలిపండయిపోయింది. బాజీని చేతుల్లోకి తీసుకుని ముద్దాడింది. బిడ్డ నిష్కారణంగా చిక్కపోయాడని ఎంతో నొచ్చుకుంది. బాజీ మేనమామకి ఇద్దరు పసిపిల్లలున్నారు. పాలతో నీళ్లు కలిపినట్టు, ఆ వాతావరణంలో అక్యమయిపోయాడు బాజీ.

మోడువారిన చక్రవర్తి హృదయంలో మళ్లీ వసంతోదయమయింది.

బాజీ నెందుకు తీసుకొచ్చేసిందీ అక్కడెవరి తోనూ చెప్పలేదు చక్రవర్తి లోపల

అవమానభారంతో క్రుంగిపోతూ, 'బాజీ నా దగ్గర అంతగా అలవాటుపడలేదు ఎందుచేతనో అని మాత్రమే చెప్పగలిగాడు.

తన దగ్గర వుంచెయ్యమని అమ్మమ్మ పట్టు పట్టింది. సరేనన్నాడు చక్రవర్తి.

ఇహ ఎక్కడ తాముండటం చాలా అవసరమనీ మనిపించింది. చక్రవర్తికి, ఐతేనేమీ, బాజీ క్షేమంగా వుండటమే తనకు కావలసింది. బాజీ సుఖంగా కాలం గడుపుతున్నందు కానందమ్మూ, ఆ సౌఖ్యంలో ఒక్క అణువైనా తానీయలేనందుకు బాధా లోపల మెలివేసుకుని పీడిస్తున్నాయి. అమూల్యమైన వస్తువుని పోగొట్టుకున్న అభాగ్యుడిలా హతాశుడై పోయాడు చక్రవర్తి. తెలతెలవారుతూండగా సూట్‌కేసు సర్దుకుంటూ అనుకున్నాడు, 'ఇది వొక శిక్ష' యెడబాటు తప్పదు.

గుమ్మందగ్గర నుంచుని చూస్తున్న బాజీ, క్షణమూరుకుని, 'నాన్నా దా, అని తెలిశో, తెలియకో కవ్వించి వూరుకున్నాడు. ఆశాతరంగాలతో వుద్రూతలూగింది చక్రవర్తి హృదయం. కొన్నాళ్లూ ఆ పల్లెటిదిక్కున ఉండిపోదామా అనుకున్నాడు. ఏమో ఎన్నటికైనా బాజీకి తనమీద మమత్వం కలక్కపోతుందా? గోవిందుమీద తను చేయిజేసుకొన్నదృశ్యం వాడి మనఃఫలకం మీదనుంచీ చెరిపేయాలెనంటే కొన్నాళ్లు పట్టవచ్చు. అది అంత సాధ్యమా?

వెళ్లిపోతే ఈ బ్రతుక్కి మళ్లీ వెలుగున్నదా? ఈ అమావాస్య చీకటి రాత్రికి శుభోదయ మయిందేమో. రమ్మని చేతులు చాచాడు చక్రవర్తి. బెదురుతూ రివ్వున ఇంట్లోకి పరిగెత్తుకు పోయాడు బాజీ. ఒక్కక్షణంలో, తలెత్తిన ఆశలన్నీ నీటిబుడగలా అన్నట్టు మరుక్షణంలో టుప్పున పేలిపోయినై.

వెళ్లిపోతుంటే, వూరి చివరకూ బిలబిలలాడుతూ ఇరుగు పొరుగూ అందరూ వొచ్చి వుంటామన్నారు. బాజీ అమ్మమ్మ చంకలోనించి దిగి చూస్తూ నిలబడ్డాడు బొటన వేలు చీక్కుంటూ, తన జీవితంలోకి ఎలా నడిచి వొచ్చాడో అలాగే ఒక నీడలా కనుమరుగైపోతున్న ఈ విచిత్ర వ్యక్తి ఎవరనుకున్నాడో ఏమో. చక్రవర్తి వెనక్కి తిరిగి చూడైనా చూడలేదు.

పక్కని వరిచేనిలో గుడ్లు పెట్టిన భరతపక్షి అలికిడికి లేచి ఎగిరిపోతోంది. ఊరి చివర మఠంలో నించి బైరాగి వొకడు గంజాయి తాగుతూ మధ్య మధ్య ఏమి జన్మందేమి జీవనమూ అని ఎలుగెత్తి పాడుతున్నాడు.

ఆ తరువాత తనకు మిగిలిన వొంటరి తనంలో కెన్వాస్ మీద రచించిన మొట్ట మొదటి చిత్రం ఛటర్జీ కి పంపాడు చక్రవర్తి.

ప్యాకెట్టు విప్పాడు ఛటర్జీ.

చిత్రం పేరు 'కొండంత మనిషి'.

చిత్రమయిన హిమాలయ శిఖరానికి అట్టడుగున.. కరిగిన మంచు పెళ్లలలో కొట్టుకపోతున్న తన గుడిశవంక చూస్తూ.. ఎంతోకాదు నలుసంత మనిషి.. ఒక వృద్ధురాలు.. తన పాపని చింపిరి గుడ్డలతో మూపున కట్టుకొని... ఇరువు కొండ మెట్లెక్కుతోంది.

ఛటర్జీ ముగ్ధుడైపోయాడు.

*(భారతి జనవరి, 1971)*

12

# కుట్రల్లో కూలోడు

## వై.సి.వి. రెడ్డి

గంగడు ఆరడుగుల మనిషి. బలవంతుడు. పైశక్తి గలవాడు. వడదిరిగిన కండల్తో అందంగా వుంటాడు. వీధి అరుగు మాదిరీ వీపు తో విశాలమైన రొమ్ముతో గడిదేరినోడు. గంగడు కష్టజీవి. పట్టుదల మనిషి. స్వంతం నాలుగెకరాల బంజరు భూమిని తయారు చేసికొన్నాడు. బీడులో తుమ్మచెట్లు, ఈతచెట్లు, గడ్డిదిబ్బలూ కొట్టి చదును చేసుకొన్నాడు. అక్కడక్కడవున్న నేలరాళ్లు, తవ్వి తీసి గెట్టువారకు తోసేసినాడు. సంవత్సరాల తరబడి కష్టపడి తయారు చేసుకొన్నాడు. పట్టుదలతో చేసినపని. పెద్ద దీక్షతో చేసిన పని గంగనిది.

గంగనికి కూలికి పోకుంటే పూటగడవదు. భార్య లచ్చి గంగనికి సరిపోయినజత. ఒడ్డూ, పొడుగూ, అందమూ, అన్నీ వున్నతోడు. ఆమె పని పాటల్లో గంగనితోపాటు ఏపనైనా చేస్తుంది. ఇద్దరూ కూలికి పోతారు. తిండికీ గుడ్డకూ సంపాదించుకొంటారు. వాళ్లకు పిత్రార్జితం ఒక పూరిల్లుంది.

పనిలేని దినాల్లో భూమిలో రాయి రప్పా యేరి పారేస్తుంటారు. భూవతివుంటే పనుల్లేనపుడు పూటగడుస్తుందని. గంగని ఆశ. అందుకే పట్టుబట్టి భూమిని తయారు చేసుకొన్నాడు, లచ్చి, గంగనికి మంచితోడు. వాళ్లిద్దరూ అన్యోన్యంగా వుంటారు.

గంగనికి మెట్ట సేద్యం బాగా వచ్చు. విత్తనంగొర్రు, మెట్ల పాపనం వగైరా అన్ని పనులూ చక్కగా చేస్తాడు. గడ్డలమీద గడ్డి పోయేట్టుగా, కర్రపోకుండా, పైరులో సేద్యం చేయడం చిన్న పనేం కాదు. గంగడు మంచివామేటుగాడు. పొట్టువాములు చొప్ప వాములూ, వొరిగిపోకుండా వేస్తాడు. వాములు వేసేటప్పుడు గంగనికి గిరాకి ఎక్కువ. ఒల్లు దాచుకోకుండా పని చేస్తాడు. గంగడు కూలోళ్లల్లో పలుకుబడి గలవాడు. తెలివితేటలున్నాయి. మంచి, సేద్యగాడుగాబట్టి స్వంతపొలం కావాలనుకొన్నాడు. నిస్పదురుగా భూమిని తయారు చేసుకొన్నాడు. గొర్రు దించితే ఎత్తేపని వుండకుండా, అద్దం మాదిరి తయారు చేసుకొన్నాడు.

లచ్చికి తీరికవుండదు. వుండేందుకు వీల్లేదు. అమనికాలంలో ఏకళ్లంలో చూచినా లచ్చి వుంటుంది. ఇద్దరి మనుషుల పని చేస్తుంది. మొగకూలీలతో పాటి, కల్లాల్లో పడుగు పెరకను కూడా పోతుంది. కోతలకాలంలో గంగనితోపాటి, పనికి పోతుంది. గంగడు అన్ని పనుల్లో మొనగాడు. జొన్న కోతలో కొడవలి ఎగేసి కట్ట గట్టి, కొడవలిని పైన్నే పట్టుకొంటాడు. అంతనేర్పరి. పనిలో వలుపున్నవాడు. ఒకసారి పందెం వేసుకొని ఒకేరోజులోనే ఎకరా రాగిపైరు కోసినాడు. ఆపని అయిదారు మంది చేయలేని పని. అంతటి బలిష్టుడూ - నేర్పరీ, గుణవంతుడూ

పట్టుదలగలవాడూ అయిన గంగడు కూడా కూలీ నాలీ చేసుకొని బతకాల. కూలీ గూడా అందరితోపాటె యిస్తారు. లచ్చికి కూడా అందరితోపాటి యిస్తారు. అందుకే యిద్దరూ సంపాదించినా తిండికీ గుడ్డలకీ సరిపోతుంది.

నేరిస్తే బతుకుతారు అన్న అర్థం - గంగని విషయంలో వ్యత్యస్తంగావుంది. నేర్పడం అంటే పనిపాటల్లో వున్న నేర్పరితనం కాదన్నమాట - వైపూ వాటమూ తెలిసి బతకడం. వడుపుజేసి బతకడం. గంగడూ లచ్చీ పదేళ్లుగా చేసిన కష్టానికి సరైన కూలి యిచ్చివుంటే యీ పాటికి గంగడు ఒక చిన్న రైతు అయివుండేవాడు. వాళ్ల కష్టమంతా తిండికే సరిపోయింది. ఉపరాగా చేసినకష్టం గాల్లోకలిసిపోయింది పాపం. వాళ్లకు విశ్రాంతి అనేదే వుండదు. ప్రతి రాత్రి పులినొప్పులతో పొర్లుతూ పొర్లుతూ నిద్రపోవాల్సిందే. హాయిగా కన్నంటేది కరువయింది వాళ్లకు.

"పిల్లాజల్లా లేకుండా హాయిగా వుంది వాళ్లకేమి" అని ఎగతాళిగా మాట్లాడితే లచ్చికి ప్రాణం పోయినట్లవుతుంది. గంగడూ సిగ్గుపడిపోతాడు. "ప్రాపంలేదు మాకని" వేడిగా నిట్టూరుస్తారు.

ఈ ఏడు భూమిలో పైరు పెట్టాలని ఆలోచిస్తున్నారు. నాలుగెకరాలూ ఒక ఏడు పైరు పెట్టుకోగలిగితే డబ్బు తిరగడపడుతుందని అనుకొన్నారు. లచ్చికి ఎట్లయినా స్వంత భూమిలో పైరు ఎక్కించాలని మరీ పట్టుదలగా వుంది. గింజపైరు పెట్టుకొంటే కర్చులు తక్కువనీ, అనుకొన్నారు. పైరు పెట్టాలంటే రైతులను ఆశ్రయించాల. తప్పదు ఎద్దులు లేంది సేద్యం ఎట్లా. అందులో కొత్తసాగు. సేద్యం బలంగా చేయాల. రైతుల్ను ఆశ్రయిస్తే ఇరుకునపెడ్తారు. అనికూడా ఆలోచించినారు. ఏమైనా కానీ అని ఊరిలో మోతుబరిరైతు వెంకటరెడ్డి వద్దకుపోయి, ఆర్థిక సాయమూ ఎద్దుల సాయమూ అర్థించినారు. మానూల్లో చెల్లగట్టుతామనీ వినయంగా చెప్పుకొన్నారు.

వెంకటరెడ్డి గంగని ఎట్లా వుపయోగించుకోవాలో చాలా రోజుల నుండీ ఆలోచిస్తూవున్నాడు. గంగని నేర్పరితనం అతని వ్యవసాయానికి అవసరం - లాభం కూడా. భూములు బాగా పనపడి - పాతురవడికి తిరుగుతాయి. గంగడు మంచి సేద్యగాడు. ఎద్దులనూ బాగా మేపుకొంటాడు - అనీ అనుకొన్నాడు. "ఏరా గంగా నీచేను బాగుందంటే! సరేతే అప్పుడప్పుడు ఎద్దుల్ని స్తాలే - పైరెక్కించుకో - పాపం కష్టపడి తయారు చేసుకొన్నారు. నేను నగదుగా యివ్వలేను. నావద్దలేదు. నాదే నాకు బరువైంది. ఏమొస్తుంది వ్యవసాయంలో అన్నీ ఖర్చుల్లోనే మునిగి పోతాయి. సేద్యానికి ఎద్దుల్ను మాత్రం యిస్తాను. నా చేతనైన సాయం యిదేరా" అని ఆప్యాయంగా చెప్పినాడు. "సరేబ్బా మీదయ" అని మధ్యాన్నం వరకూ పనికివచ్చి - మధ్యానం నుంచీ ఎద్దుల్ను నాచేలోకి సేద్యానికి తోలుకొని పోతుంటానని అన్నాడు గంగడు. "ఆదినం నాక్కూలి వద్దబ్బా" అనీ అన్నాడు. "ఏదో మీ అండజేరి పొలంపండించుకొంటా" అని తృప్తిగా చెప్పినాడు. లచ్చీ గంగడు అదేమోపున సోమిరెడ్డి ఇంటికాడికి వచ్చినారు. సోమిరెడ్డి గంగని దూరం నుంచీ చూచినాడు. పలుకరిస్తూ "ఏరా గంగా చేను యీసారి విత్తనం వేస్తావా" అని ఆదరంగా అడిగినాడు. "అదేనబ్బా యీఏడు పైరు ఎక్కించాల వ్యవసాయం కర్చులకు మీరు సాయం చేయాలబ్బా। ఏదో మీ పేరు చెప్పుకొని బతుకుతాం." అని అన్నాడు. గంగడు.

సోమిరెడ్డి "ఆదిలోనే హంసపాది" అన్నట్లు నావద్ద లేదన్నాడు. "పైరులో వస్తుందబ్బా తప్పక చెల్లుపెట్టుతాం." అని ప్రాధేయపడినాడు.

"పైరులో రాకపోతే" అని అన్నాడు. కర్చులకైనా రాకుండా పోతుందా కష్టం చేసైనా మీరుణం

వుంచుకోముసామీ - నువు మంచిదనకుంటే చేను పైరెక్కదు. మేమెక్కడికి పోతాం. మీ ఇళ్లకాడ పడివుండేవాళ్లం" అని వినయంగా చెప్పుకొన్నాడు గంగడు.

"దినమూ మీ పనిలోకి వస్తానబ్బా - పనిలోనూ కొంత చెల్లు పెట్టుతాం మిగతాది పైరులో రాకుండా పోతుందా. మీరు మంచి దనకుంటే ఎట్లబ్బా" అని లచ్చికూడా పట్టుగా చెప్పింది. "చూస్తాం పైరు పెట్టుకోపోండి. వీలున్నంతా సర్దుతాను. నావద్ద లేనప్పుడు తొందరచేయద్దు. సార్లపడి అవసరం వచ్చినప్పుడిస్తూ వుంటాను. మాసూల్లో లెక్కలు చూచుకొందాం. లెక్క వొడ్డీ వేసుకొంటాను, మీరు మంచోళ్లనీ, కష్టపడతారనీ, నమ్మకం వుండి వొప్పుకొంటున్నాను. మాపనిలో ఎప్పుడు పిలచినా లచ్చివస్తూండాలి." అని అప్పులెక్కువవుతే మీరు తీర్చలేరు. మీకూ కష్టం నాకూ కష్టం. జాగ్రత్త" అని హెచ్చరించినాడు సోమిరెడ్డి. "సరేనబ్బా" అని లచ్చీ గంగడు తృప్తిపడినారు.

అనుకొన్నట్లు గంగడు వెంకటరెడ్డి పనిలోకి, లచ్చి సోమిరెడ్డి పనిలోకి, లచ్చి సోమిరెడ్డి పనిలోకి పోతున్నారు. వర్షం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నారు. వర్షాలు వస్తూనే సేద్యాలు మొదలు పెట్టాలనీ అనుకొంటున్నాడు గంగడు.

ఊరిలో పంచాంగం అయ్య కనపడితే "సామీ వానకు బలం ఎప్పుడుందీ యీఏడు ఏఏ పైర్లు బాగా పండుతాయి" అని వినయంగా అడుగుతాడు గంగడు.

"నీ కేంపోరా కష్టం చేసేవానికి నీవెట్లయినా బాగుంటావు అందరికీ పండితేనీకే పండుతాదిలే' ' అని కాబట్టనట్లు చెప్పినాడు పంచాంగమయ్యా. కూలోల్లంటే అందరికీ అలుసే. ఎవరూ సరిగా మాట్లాడరు. అని లోలోపల అనుకొన్నాడు గంగడు.

వర్షాలు పడినాయి. గంగడు అనుకొన్నట్లు రేపటి వేళల్లో ఎంకటరెడ్డి సేద్యానికి పోవడం, మాపటి వేళల్లో తన చేనిలోకి సేద్యానికి పోవడం చేస్తున్నాడు. వెంకటరెడ్డియింట్లో అన్ని పనులూ చేస్తున్నాడు గంగడు.

"కొత్తచేను సేద్యం బరువుగా చేయాల్సివస్తుంది. ఆరుకోల్ల మడకతో లోతుగా దున్నాల్సివుంది. ఎద్దుల్ను బాగా ఎగమేపుతేగానీ కుదరదు. లేకపోతే ఎద్దులు చెడిపోతాయి. తారిపోతాయి" అని వెంకటరెడ్డి నిత్యమూ హెచ్చరిస్తున్నాడు.

లచ్చి కూడా సోమిరెడ్డి యింటికి చీకట్లోనే పోతుంది. గింజలు దంచి పాచి కసువులూడ్చి పేడకాళ్లు తీసి మామూలు పనిలోకి పొతుంది సాయంత్రం చీకటి పడేవరకూ ఏదో ఒకపనిని పురమాయిస్తూనే వుంటారు. కను చీకటి పడినాక గంగడూ లచ్చీ యిల్లు చేరుకొంటారు పాపం వాళ్లు తీవ్రంగా కష్టపడుతున్నారు.

వరుపు సేద్యాలన్నీ అయిపోయినాయి. వర్షం వస్తే ఎరువు వుంటే తొలి, చల్లి, సేద్యంచేసి, విత్తనం వేయడానికి సిద్ధం చేయాల్సివుంది. ఈ ఏడు ఎరువు సంపాదించుకోలేరు. వేరే ఎవ్వరిని ఆశ్రయించినా పనుల్లోకి పోయి చెల్లగొట్టేదానికి మనుషుల్లేరు. అప్పుడప్పుడు సేద్యాలు లేనప్పుడు గంగడు పోవచ్చు. కానీ వేరే వాళ్లకు పోతే వెంకటరెడ్డి ఎద్దులను సరిగాయివ్వడేమోనని భయం ఎద్దులు లేకుంటేచేని విత్తనం అదనులో వేసుకోలేనని, బాధ పడుతున్నాడు. ఆస్తులు లేనోళ్లకు ధారాళంగా అప్పుపుట్టదు. రామిరెడ్డిని ఆశ్రయిస్తే కొంత డబ్బు ఎరువులకు యిస్తాడేమో అనీ అనుకొన్నాడు గంగడు. యిప్పట్లో సాధ్యమయ్యే పని కాదని వూరు కొన్నాడు. ఎన్నో ఏళ్లుగా

బీడుగా వుండిన భూమి యీ ఏడు పండకపోతుందా పైగా సేద్యాలు బాగా బలంగా చేసినాననీ, అనుకొన్నాడు. అన్నీ అడగత్తెర్లే. ఎట్లా ఎక్కడ యిరుక్కుటాడో! తెలియదు. గింజపైరు పండకపోతుందా అని మొండిగా వున్నాడు.

వర్షం వచ్చింది. అరిపోకుండా పక్వంగా గొర్రూగుంటకు సేద్యం చేసినాడు. లచ్చికూడా ఆ రోజు చేనికాడికి పోయి చూచి వచ్చింది. లచ్చి పెద్ద సంతోషంలో వుంది. విత్తనపు వానవచ్చేదే ఆలస్యం, భూమిలో విత్తనం వేస్తాం. కొర్రలు యింటినిండాకు వస్తాయి. అని అనుకొంటూ వుంది. పరాచికాలతో మురిపెపు మాటల్తో గంగడుని బాగా మురిపించింది ఆరోజు మొగుని ప్రయోజకత్వానికి ఎంతగానో ఉబ్బిపోయింది.

విత్తనం పదును అదున్లోనే అయ్యింది. మంచి వర్షం వచ్చింది. ఆరోజు లచ్చి భూమ్మీద నడవడం లేదు. సంతోషంతో, తేలిపోతూ వుంది. నాకూ ఒక్క నలుసుంటే ఎంతబాగున్ను అని అనుకొని, మొగందించుకొని క్షణ మాత్రం దిగులు పడింది. పదును అరిపోకముందే విత్తనం వేయాలని తొందర పెడుతూవుంది.

"రెడ్డీరు విత్తనం అయిపోయినాకనే మనం విత్తనం" అని నిరుత్సాహంగా అన్నాడు గంగడు. ఉండలేక ఒకరోజు వెంకటరెడ్డికి అడిగినాడు. "కొత్తభూమి, నీళ్లుబాగా పట్టుకొనేట్లు సేద్యమూ అయింది. పరవాలేదులేరా" అని అన్నాడు వెంకటరెడ్డి.

చేసేదిలేక వూరుకొన్నాడు. అంటే గంగనీ కష్టానికి తగిన విధంగా ప్రతిఫలం కొరవడుతున్నదన్న మాట. చేనిలో పదును ఆరిపోతే పైరు తర్వాత చాల రోజులు తట్టుకోలేదు. ఎండగిలిపోతుంది. వెంటనే వర్షంరావాల. పసురు పదున్లో విత్తేందుకు అందరూ ఆరాటపడ్తారు. అరుదల పదున్లో విత్తితే పైరు కర్ర దళసరంగా వుంటుందేకానీ - వర్షం వెంటనేరావాల. అదే గంగని ఆలోచన క్షణ క్షణ ఆరాట పడుతున్నాడు.

రాత్రి యింటికి వచ్చినపుడు - లచ్చి - "మనచేని విత్తనం ఎప్పుడు " అని వానవచ్చిన మరుసటిరోజు నుంచీ మొగున్ని అడుగుతూ వుంది. "విత్తేవాన్ని పిలిచినావా - బాగా తెలిసినోని పిలుచు - కొర్రలు కూడా తెచ్చిపెట్టినా - కందులూ పెసలూ వున్నాయి. అన్నీ సిద్ధం చేసినా - సోమిరెడ్డి అయ్యకు చెప్పి నేనూ విత్తనం కాడికి వస్తాను" అని అడిగింది. "పొద్దునపూట రెండు కాండ్లుంటే సరిపోతుంది - వెంకటరెడ్డి అయ్యను అడుగు - అరిపోతుందని చెప్పు" అని గట్టిగా చెప్పింది.

వారం రోజులకు ఎద్దులకు వుసివచ్చింది. గంగడూ లచ్చీ అరాత్రి విత్తనాన్ని గురించి మాట్లాడుకొన్నారు. "చేలో పెసర చెట్లుంటే గొడ్డోళ్లు పెరక్కపోతారు. వదుపుకోపడమూ కష్టం కల్లాలు లేనోళ్లకు ఎక్కడవుంది -కావలికి కష్టం - కావాలంటే కంది అక్కడివేసుకో. అని గంగడు చెప్పినాడు. వసతిలేనోళ్లకు అన్నీ సమస్యలే.

చీకట్లోనే విత్తనాల గింజలూ, కాయ కర్పూరం, పంచకజ్జాయమూ - అన్నీ సిద్ధం చేసుకొని చేనిలో గొర్రు దించినారు. గొర్రుకు దరగట్టి ఎద్దులకు కుంకుమబొట్లు పెట్టి - గంగడు గర్వంగా నవ్వుతూ మేడిపట్టినాడు. లచ్చి కంది అక్కడ వేసేందుకు సిద్ధంగా వుంది. టెంకాయ కొట్టినారు. అందరూ దండం పెట్టుకొన్నారు. వరపగ్గం వలచేత్తో పట్టుకొని 'దా' అని గొర్రుని నిబ్బరంగా సాగదోలి నాడు గంగడు. "కొత్తచేను ఎందుకైనా మంచిది కొంచెం పదుపుగానే విత్తు" అని

విత్తేవాన్ని హెచ్చరించారు. "కందిగింజలు బెత్తెడుకు ఒక గింజ పడేట్లుగా జాగ్రత్తగావిత్తు - సంతోషంలో సగం చేనికే అయిపోయేట్లుగా చేసేవు" అని మురిపెంగా అన్నాడు గంగడు. "సాల్లేబ్బా - నాకు తెలవదేమో ఎట్లిత్తేది - నీకే తెలిసినట్లు - ఉల్లాసంలో వూరకూరకనే పార్లి పార్లి మాట్లాడుతున్నావు - పోనీ - పొద్దు వుడిసింది" అని అలవాకగా నవ్వుతూ అనింది లచ్చి. మధ్యాన్యానికే అనుకొన్నట్లు ఏతొందరాలేకుండా విత్తనం అయిపోయింది. తృప్తిగా ఇంటికొచ్చినారు. ఆరోజు లచ్చి ఊరంతా తిరిగింది. అక్కడక్కడా సందర్భంలేకున్నా యీదినం మాచేను విత్తనం అయిపోయిందని చెప్పింది. పాపం ఎంతతృప్తో.

గంగడు తృప్తిగావున్నాడు. పదును ఆరిపోలేదనీ, పైరు బాగుంటుందనీ అనుకొంటున్నాడు.

కొత్తసాగు కాబట్టి గడ్డి బాగా పడింది. మెట్లపాపనానికి ఆలోచించినాడు గంగడు. మెట్లగుంటకమీద బరువు పెట్టి జాగ్రత్తగా కర్రపోకుండా - గడ్డలమీద గడ్డిపోయేట్టుగా - కర్రలకు మొదళ్లలో మన్నుబాగా ఎగదోసినట్లుండేట్లుగా - అద్భుతంగా పాసినాడు గంగడు. వర్లా వక్కలా - చేలోనూ - జారిపోయిన గడ్డిని కొద్ది మంది కూలోల్ల సహాయంతో తీయించినాడు. లచ్చి ఆపనంతా జాగ్రత్తగా చేసింది. ఒక గంట పొద్దు తీరిక దొరికితే గంగడో - లచ్చో చేనికాడికి పరుగులమీదపోయి చూచి వస్తుంటారు. పైరును సన్న పిల్లను సాకినట్లు సాకాలని యిద్దరూ అనుకొంటూ మురిసిపోతుంటారు. "ఇప్పటికేమో పైరు బాగుందబ్బా" అని అంటుంటాడు గంగడు.

అనుకొన్నట్లు వర్షాలు తర్వాత తర్వాత పడలేదు. అయినా లేదనకుండా పండింది. సోమిరెడ్డి పెట్టిన ఖర్చులకు పోను ఐదు మూటలు కొర్రలు మిగిలినాయి. ఊరికొట్టంలో వేసుకోలేక కొర్రలు వెంకటరెడ్డి యింట్లోనే కొలచిపోసినారు. తప్పిన సెత్త రెండుబండ్లు అవుతుందని అనుకొని వెంకటరెడ్డి వామిలోనే కలిపి వేసినారు. కంది అంతంతమాత్రమే పండింది. అరమూట కందులయినాయి. వాడికానికి పెట్టుకోకుండా అమ్ముకొన్నారు.

"ఒరే గంగా బాగా కష్టపడినావురా - నీకు పరవాలేదు - ఐదు మూటలు కొర్రలు మిగిలినాయి - రెండు బళ్ల సెత్తా మిగిలింది. తంటాలుపడి భూమి పట్టావచ్చేట్లు చూసుకోరా" అని సలహా ఇచ్చినాడు వెంకటరెడ్డి. "నాకెవరు పలుకుతారబ్బా - ఏదో మీబోటి గాళ్లు పట్టుకొంటే నెరవేరుతాది.' 'అని గంగడన్నాడు. "ఖర్చులూ కందాయాలకు నేనే పోరాడుకుంటానబ్బా" అని కూడా వివరంగా చెప్పినాడు. "నీకొర్రలున్నాయి - సెత్తావుంది - అదంతా ఖర్చయినా పరవాలేదు లేరా - పట్టావస్తే - లేకుంటే పనపడిసచేను - ఎవరికైనా కన్నెర్రకావచ్చు. ఇరుక్కున్నాక పెద్దరాగం పాడాలరా" అని కొద్దిగా భయపెట్టినాడు వెంకటరెడ్డి". సరే మీ యిష్టం - మీరేమన్నా చేయండి - అంతా మీదయ' ' అని బరోసా చెప్పినాడు గంగడు.

వెంకటరెడ్డి పట్టాకై ప్రయత్నిస్తున్నాడు. గట్టిగానే ప్రయత్నించి నాడని చెప్పుకోవాలి. ఏక్సాల్ పట్టా సంపాదించినాడు. గంగని. పనిమనిషిగా ముఖ్యంగా వుపయోగించుకోవాల. పైగా ఎప్పుడైనా గంగడు అప్పు అడిగితే ధారాళంగా యిచ్చేందుకు వసతి కుదరాల అదీ వెంకటరెడ్డి ఆలోచన. ఖర్చులూ - పన్నులూ - మామూళ్లూ - అన్నీ కలసి తడిసి ముప్పందుమైంది. కొర్రలూ - సెత్తా - పోయి - రెండు వందలు వెంకటరెడ్డి చేతి నుండి పెట్టినాడు. అప్పటికి లోలోపల బాధపడినా పనిలో కురుకుగా పోరాడినాడు - నాకు మేలే చేసినాడని వెంకటరెడ్డికి మనసులోనే కృతజ్ఞత చెప్పుకొన్నాడు గంగడు. వెంకటరెడ్డి చొరవను కొందరు మెచ్చుకొన్నాం కూడ.

లచ్చికిదంతా ఏమీ అర్థం కావడం లేదు. కొర్రలు పోయినాయే చేసిన కష్టం పోయిందే - అని

బాధ ' చేతులూ కాళ్లూ సచ్చుపడేట్లు కష్టం చేసినా సుఖపడేందుకు రాతలేదు'' అని గంగనితో బాధగా అనింది. ''పోనీ లేవే - భూమి దక్కింది. రెండు మూడేళ్లల్లో భూమి బాగా పనపడుతుంది. బాగా పండుతుంది. అన్నీ తీరుతాయిలే'' అని ఓదార్చాడు గంగడు.

వెంకటరెడ్డితోనే లావాదేవీలు జరుగుతున్నాయి గంగనికి రెండు వందలకు బాండు రాయించాడు ''ఎప్పుడు కావాలన్న పైరు ఖర్చులకు యిస్తూంటాడు - నీకేమిరా వెంకటరెడ్డి వున్నాడు అన్నిటికీ ఆదుకొంటాడు'' అని ఊర్లో అటూంటారు. ''మొదట్లో ఎద్దుల్ని - డబ్బు నావద్దలేదని ఖచ్చితంగా చెప్పి వెంకటరెడ్డే యిప్పుడు ఎందుకిస్తున్నాడురా'' అని కొందరనకపోలేదు.

గంగడు ఏమీ పట్టించుకోకుండా వెంకటరెడ్డికే సేద్యానికి పోతూంటాడు. తెల్లవారుజామున పోయి రాత్రికి యింటికి వచ్చే వరకూ చిన్నపనీ పెద్దపనీ, అన్నీ చేసి వస్తుంటాడు. దూరపు చూపున్నవాళ్లు ''వెంకటరెడ్డి అదృష్టవంతుడు. గంగడు చిక్కినాడు - అతని వ్యవసాయం కుంటుపడకుండా అద్భుతంగా జరుగుతూంది'' అనికూడా అనుకొంటున్నారు. లచ్చికూడా వెంకటరెడ్డి ఇంట్లోనే పొద్దస్తామానం వూరుకోకుండా పనిచేస్తూవుంది. కొంతమంది, వాళ్లు చేసేపనికి గంగనిచేను పూరక పైరు పెట్టియ్యచ్చు - కాదంటే మేపు తీసుకోవచ్చు'' అని కూడ అనుకొంటున్నారు. వెంకటరెడ్డి మనసులో ఏముందో ఎవరు చూచినారు. గంగనికి పూర్తి - అంటే శాశ్వతంగా పట్టావచ్చేదాకా పోరాడినాడు. పట్టావచ్చేతలికే నాలుగేళ్ళు పట్టింది. వర్షం వచ్చినప్పుడు బాగా పండేభూమిగా తయారైంది. అదంతా గంగని సేద్యం మేలుతో జరిగింది.

దఫాలుగా పట్టాకోసం తిరగడంలోనూ - మామూళ్ళకూ పన్నులకూ రెండు వందలు బాండు బాపతు అసలు వొడ్డీలూ అన్నీ కలిసి మూడేళ్లకు అరు వందలయింది. పైరు రాబడిపోను అంత పెద్ద మొత్తం బాకీ అయినందుకు, గంగడు లచ్చీ - చాలా బాధపడినారు. ఏంచేస్తారు శాశ్వతంగా పట్టావచ్చిందని తృప్తి తప్పితే - వారేనాడూ ఇంటిపట్టునవుండి సుఖంగా తిండి తినిందిలేదు. అడవిలో బువ్వ అడివిలో నీళ్లుగా బతికినారు. రెండేళ్లు జరిగింది. బాకీ ఎట్లబ్బా అని గంగడు లచ్చీ బాధపడుతున్నారు. తీరుస్తారో తీర్చలేరో తెలియదు.

''ఒరే గంగా అసలు వొడ్డీ చాలా అవుతుందిరా - పైర్లో చెల్లు వేయలేకపోయినావు. నేనేమిచేసేది. చేసినంతా చేసినా - నాడబ్బుకు మునకలేకుండా చూడు. వొడ్డీ మొదలు యీనాటికి ఎనిమిది వందలా ఎనభై అయింది - చుంగు డబ్బు తీసుకొని - తొమ్మిది వందలకు భూమిని వొడ్డి భోగ్యం రాయించాలరా - లేకుంటే నీయిష్ట - భూమి అమ్మమని చెప్పలేను. పాపం, కష్టపడి తయారు చేసుకొన్నావు.'' అని చెప్పాడు వెంకటరెడ్డి. పిడుగుపడినట్లయింది గంగనికి. ఏంచేస్తాడు - విధిలేదు - గంగనికి, వొడ్డిభోగ్యంగా చేనురాయించినాడు. అసలు ఎట్లా?

13

# అప్పావుపిళ్ళ ఆత్మఘోష

## పులికంటి కృష్ణారెడ్డి

అప్పావుపిళ్ళకు ఆవులింతకు అవినాభావ సంబంధముంది. అసలు అప్పావు పిళ్ళకోసం ఆవులింత పుట్టిందా...? అవులింత కోసం అప్పావుపిళ్ల పుట్టాడా?- అన్నది ఇంత వరకు తేలని సమస్య. అప్పావుపిళ్ళ ఆవులిస్తూనే నిద్రపోతాడు. నిద్రపోతూ, ఆవులిస్తాడు. అయితే అప్పావుపిళ్ళ ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే మనిషి కాదు.

అప్పావుపిళ్ల ఆవులిస్తే'అ' కు దీర్ఘమిస్తే 'ఆ... అని ఆ గుణింతం దిద్దే పిల్లవాడి దీర్ఘంలా ఆరంభమై ఒక మహా గాయకుని అలాపనలా తారస్థాయిని చేరి అటుపై గిరికీలు కొడుతూ కింద పడుతూ మంద్ర స్థాయి చేరేసరికి ఒక అయిదు నిముషాలు పట్టినట్లుంది. అందుకే అప్పావు పిళ్ళ ఆవులింత ప్రసిద్ధి కెక్కింది.

అప్పావుపిళ్ళ సతీమణి కాపేరు లేదు. ఏటేటా ఉత్సవాలలో మునిగితేలే ఊరి ముందర ముత్యాలమ్మ దేవతకా పేరు లేదు. ఎన్నికల్లో ఎదురు నిలబడితే కొమ్ములు తిరిగిన మొనగాణ్ణయినా వూరగాయ చప్పరించినంత తేలిగ్గా తలలు తీయించే పెద్దిరెడ్డి కా పేరు లేదు. పని గట్టుకుని ఈ ఇంటి గుట్టు ఆ ఇంటికి, ఆ ఇంటి గుట్టు ఈ ఇంటికి చేరవేసి జుట్లుపట్టించి వేడుక చూసే పరదేసిగాడి కాపేరు లేదు. అయితే అప్పావుపిళ్ల ఆవులింత మాత్రం ఆ పాయకట్టులో అద్భుతమైన పేరు మోసింది. ఎవరైనా కాస్త పాలుమాలి పగటి పూట ఆవులిస్తే చాలు - 'ఏమిరో! అప్పావుతో పోటీ పడేటట్లుగా ఉండావే- అంటూ ఎగతాళి పడతారు. అంతటితో తృప్తిపడకుండా అప్పటికి తామేదో వింతను వెదికి వెలికి తీసినట్లు సంబరపడుతూ గలగల నవ్వుతారు.

ఆవులింతకు అంత ఘనతను చేకూర్చిన అప్పావుపిళ్ల ఆరోజు నిద్ర లేచాడు. అయితే నిద్రలేస్తూనే అవులించలేదు.

అప్పావుపిళ్ల ఆవులించకపోయే సరికి అదేదో కొంపలు మునిగినట్లు సూర్యుడు తూర్పున్నే ఉదయించాడు. ఆ పల్లెను చుట్టుముట్టి ఉన్న చింత చెట్లమీది కాకులు మామూలుగానే అరుస్తున్నాయి. ఆడవాళ్ళు ఇంటి ముందర కళ్ళాపులు చల్లుతున్నారు. మరికొందరు ముగ్గులు వేస్తున్నారు. ఆవులించని అప్పావుపిళ్ళ మాత్రం ఆశ్చర్యంలో పడి అటుపై ఆలోచనలో మునిగిపోయాడు.

అప్పావుపిళ్ళకు ఒంటిగా పడుకునే అలవాటు లేదు. అతని కా అవసరమూ లేకపోయింది. చదువుకునే రోజుల్లో అప్పావుపిళ్ళకు అయ్యాసామి అనే స్నేహితుడు ఉండేవాడు. వాళ్ళిద్దరిది

ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకునే మైత్రి. చదువుకునే కాలమంతా ఒక కంచంలో తినకపోయినా ఒక మంచంలోనే పడుకున్నారు మరో మంచానికి గతి లేక, ఆ రోజులు అలా గడిచిపోయాయి. చదువు పూర్తయింది.

చదువు పూర్తయితే ఉద్యోగం, ఈ దేశంలో చదువుకొన్న ప్రతి వాడు రంచనుగా పది గంటలకు ముస్తాబై ఆఫీసుకు వెళ్ళగలిగితేనే - దాని పేరు ఉద్యోగం. కడుపుకు కూడు -వలసిన సౌకర్యాలు వనగూర్చగల ఏ పని చేసినా అది ఉద్యోగ మనిపించుకోదు. అందుకే అప్పావుపిళ్ళ కూడా ఉద్యోగాన్వేషణలో పడ్డాడు. బతుకులేనివాడు బడి పంతులన్నారు. బతికితే బడి పంతులుగానే బతకాలి!- అనుకొన్నాడు అప్పావుపిళ్ళ ఒక ప్రాథమిక పాఠశాలలో తాను సెకండరీ గ్రేడ్ టీచరయినా హయ్యర్ గ్రేడ్ ఖాళీనే పూర్తిచేశాడు.

చదువు.... ఉద్యోగం... మనిషి బతుకులో ఈ రెండు సమకూడితే కూడవలసిన మూడవది సంసారం. ఆ పనీ అయిందనిపించారు. అప్పావు పిళ్ల తల్లిదండ్రులు ఒక శుభమూహూర్తాన ఏ తల్లి తండ్రులో 'అయ్యో!' ఆడుకూతురా అని కనుక్కొన్న ఒక ఆడకూతురు అప్పావుపిళ్ళ ఇంటి కిల్లాలుగా మేం చేసింది. ఆ నాటి నుండి అప్పావు పిళ్ళకు ఒంటిగా పడుకునే అవసరం లేకపోయింది.

పాపం! అప్పావుపిళ్ళసతీమణి ఏ తల్లితండ్రులో కనుక్కొన్న ఆడుకూతురైతే మాత్రమేం?- ప్రతి అలవాటును అర్థం చేసుకుంది. పుట్టింటి మాట దాదాపు మరిచిపోయింది. 'ఏటా బాలింతరాలు' అనిపించుకొనింది. ఒకరికి తక్కువగా పదిమందిని కన్నది. ఒళ్ళు గుల్ల చేసుకొన్నది. అయినా ఏ మూడు నాలుగేండ్లకో ఒక సారి పుట్టింటి వేపు పెండ్లికనో, పేరంటానికనో ఒక నాలుగు రోజులు వెడితే అప్పావుపిళ్ళ నానా అవస్థలు పడిపోయేవాడు. అతనికి ఒకరాగాన నిద్ర పట్టేది కాదు. గలీబు లేకుండా ఖరాబయిన దిండు నైనా గట్టిగా అదుముకొంటే కానీ నిద్ర పట్టేదికాదు. అలాంటి అప్పావు పిళ్ల ఉన్నట్టుండి ఏ ,చైనా వాడో, పాకిస్తానీయుడో యుద్ధం ప్రకటించినంత వింతగా ఈ మధ్య ఒక నాడు భార్య చెవులో చిత్రంగా ఒక ప్రకటన చేశాడు తన పడక ఇంట్లో నుండి వీధి వసారా చేరుతుందో అని ఆమె నవ్వుకొనింది. యాభైరెండు నెత్తికెక్కిన మనిషి ఎక్కడ పడుకుంటే ఏముందిలే! అని సర్దుకొనింది.

ఇంటిముందు వసారాలో పడుకొనే అప్పావుపిళ్ళ ప్రతి నిత్యం అయిదు గంటలకే నిద్ర లేస్తూనే ఆవులిస్తాడు. ఆ ఆవులింత ఇటువైపు నాలుగిండ్లకు, అటువైపుకు నాలుగిండ్లకు అలారంలా పనిచేస్తుంది. అప్పావావులించినాడే! అయిదయింది గంట అంటూ అమ్మలక్కలు పనిలో పడతారు. లేవలేక లేచి నీళ్ళుతూ నిక్కుతూ ఇక తప్పదన్నట్లుగా పలకా పుస్తకాలు ముందుంచుకొని కండ్లు నలుపుకొంటూ గొణగడాని కారంభిస్తారు విద్యార్థులు. అదొక ఆనందం అప్పావు పిళ్ళకు, ఆ మాత్రం సామాజిక సేవ చేస్తున్నందుకు లోలోపలే గర్వం కూడా! కానీ ఆరోజు అప్పావుపిళ్ళనిద్ర లేచిసరికి పూరూరుగా ఇండ్లల్లోని ఆడవాళ్ళంతా వీధుల మీద పడ్డారు. ఆశ్చర్యపడినాడు అప్పావుపిళ్ళ. ఆశ్చర్యంలో పడి ఆవులించిడమే మరచిపోయాడు!

ఆశ్చర్యంలోపడిన అప్పావుపిళ్ల కాసేపు ఆలోచనలో పడ్డాడు. జరుగకూడనిదేదో జరిగిపోయినట్లు విచారపడ్డాడు. అటుపై వీధుల వంక వింతగా చూశాడు. అప్పటికే ఆడవాళ్ళు కొందరు ఇండ్ల ముందు చెత్త పూడుస్తున్నారు. కొందరు కళ్ళాపులు చల్లుతున్నారు కొందరు ముగ్గులు పెడుతున్నారు. వాళ్ళల్లో చురుకుదనం గమనిస్తుంటే - పోటీ తత్త్వం కొట్టొచ్చినట్లు కనుపిస్తూంది. వసారాలో కూర్చుని వీధుల వంక అలా ఆశ్చర్యంతో తేరిపార చూచిన అప్పావుపిళ్ళ కడపటగా తన యింటి

వాకిలివైపు చూశాడు.

పెద్దమ్మాయి పుష్పలత. చిక్కని పేడనీళ్ళతో వీధి ఈ చివర నుండి ఆ చివరి వరకు చక్కగా కళ్ళాపు చల్లింది. రంగు రంగుల ముగ్గులు పోస్తూ ఉంది. ఏమిటి విశేషం. అన్నట్లుగా ఆ ముగ్గువైపు చూశాడు అప్పావుపిళ్ల కన్నుల్ని నమ్మలేనట్లుగా అదుపులోకి తెచ్చుకున్నాడు. ఒక్కింత పెద్దవి చేశాడు. నిదానించి చూశాడు ఆ ముగ్గు మధ్య అందంగా 'విష్ యు ఎ హాపీన్యూ ఇయర్!" అని కనుపించేసరికి అప్పుడర్థమయింది అప్పావు పిళ్ళకు ఆనాడు సంవత్సరాది అని - అంటే జనవరి ఒకటి అని!! ముగ్గు వేస్తున్న ముద్దుల పెద్దకూతుర్ని గమనించాడు అప్పావుపిళ్ళ. ఆమె చుట్ట వేస్తున్న రంగు రంగుల మగ్గుల్ని చూశాడు. అప్పుడప్పుడే తొంగి చూస్తున్న ఉదయకాంతిలో ఆమె కంటే అందంగా ముగ్గు, ముగ్గుకంటే అందంగా ఆమె కనుపిస్తున్నారు. గుబురు మీసాల్ని చీల్చుకుని ఒక చిరునవ్వు వెడలింది. అంతలోనే అతని మొగం వడలింది. ఆ అమ్మాయి వయసుకు వాళ్ళమ్మ ఒక బిడ్డ తల్లి అని తోచేసరికి అప్పావుపిళ్ళ గుండెల్లో చేయిపెట్టి దేవినట్లయింది తానొక ప్రళయ రుద్రుడు కావాలని, కట్న మడిగే ప్రతి యువకుని గొంతు కొరికి నెత్తురు తాగాలని ఆవేశపడ్డాడు అప్పావుపిళ్ళ, ఆవేశంతో అటు యిటు కదలలేకపోయాడు అప్పావుపిళ్ళ

అంతలోనే అతని దృష్టి మారింది.

గబగబా లేవాలనుకున్నాడు. లేచినంత తొందరగానే వీధులమీద వీర విహారం చేస్తూ పోసిన ముగ్గుల్ని ఈ కాలితో ఆ కాలితో దున్నతూ చెరిపి పారేయాలనుకొన్నాడు. అంతా చెరిపివేసిన పిదప ఆ ముగ్గుల్ని పోసిన ముద్దరాంద్రను తన కూతురితో కూడ కలిపి వరసగా నిలబెట్టి ఈ చెంపా ఆ చెంపా కసి తీరే దాకా వాయించాలనుకొన్నాడు. అనుకొన్నాడే కానీ ఆ పని చేయలేకపోయాడు. అనుకొన్న పని చేయలేనపుడు ఎవడికైనా చేతనయింది ఆలోచన కాబట్టి అందులో పడ్డాడు అప్పావుపిళ్ళ.

"అసలు ఈ జనానికి బుద్ధుందా? ఉంటే తామెటు వెళుతున్నామో? ఆ మాత్రం అర్థం చేసుకోలేరా? తెల్లవాళ్ళు వదలిపెట్టినా వాళ్ళ ఆచార వ్యవహారల్ని మాత్రం వదలలేక పోతున్నారే... ఔరా తెల్లవాడా! ఎంత మంచి పునాదులు వేశావురా? పోనీ! నీ స్వార్థంలో నువ్వుచేసినా ఈ గొర్రెల ఆలోచననేమయింది? పీర్ల పండక్కు అయ్యవారికి ముడిపెడుతున్నారే! భారతీయులుగా పుట్టి పాశ్చాత్యుల సంస్కృతి ఉంది. మనకూ ఒక సంవత్సరాది పండుగ ఉందని మరచి జనవరి ఒకటి మీద పడుతున్నారే ఈ మనుష్యులు వీళ్ళకేం పోయేకాల మొచ్చిందో, పోలోమని వీధుల మీద పడి ఎక్కడ చూసినా 'విష్ యు ఎహాపీ న్యూ ఇయర్ !!' ని రకరకాల ముగ్గులు పోస్తారా! వీళ్ళందరినీ నిలువునా చీల్చినా పాపం లేద!!"

ఈ ఆలోచనలతో కంపించిపోయాడు అప్పావుపిళ్ళ. అయితే అటు యిటు కదల లేక ఆకుక్కిమంచానికే అతుక్కుపోయాడు. అతని తల వెనుక కనులుపుట్టి వెనుకకు చూస్తున్నాయి. గతం అందంగా కనుల ముందు మెదులుతూ ఉంది.

తాను పుట్టింది ఒక పల్లెటూర్లోనే అయినా ఆ పల్లెలో ఉగాది పండుగ ఎంత సంబరంగా జరిగేది తన చిన్న తనంలో, అమ్మ కోడికూతతో మేలు కొనేది. ఇంటిల్లిపాదికీ తలంటి స్నానంచేయించేది కొత్త బట్టలు తొడిగేది. కొత్త బెల్లంతో వేపపూత, చింతపులుసు కలిపి పచ్చిడి చేసేది. అప్పుడు అర్థం కాలేదు. కానీ ఇప్పుడు అర్థమవుతూ ఉంది ఆపచ్చడి జీవితానికే సంకేతమని జీవితమంటే చేదు - తీపుల సమ్మేళనమే అని. తాను వూరి మీద పడేవాడు ఈడు వాళ్ళతో

పొద్దస్తమానం గచ్చకాయ లాడేవాడు. పెద్దవాళ్ళేమో రామాలయంలో కూర్చుని పిచ్చయ్యశాస్త్రి చదువుతూంటే పంచాగం ఎంతో ఆసక్తిగా వినేవాళ్ళు. అవన్నీ యేమైనాయి ఈనాడు రాను రాను నాగరికత వాత పడిన మన ఆచార వ్యవహారాలు మంట గలిసి పోవలసిందేనా?

ఈ భావన మనసులో మెదిలేసరికి అప్పావుపిళ్ళ నిలువెల్లా వణికి పోయాడు. ఏదో ఘోరం జరిగిపోతున్నట్లు, భారతీయత తారుమారయిపోతున్నట్లు తపించిపోయాడు. ఏం చేయాలి. అని తనలో తాను ప్రశ్నించుకొన్నాడు. ఏమీ చేయలేక కుక్కి మంచంలో అలానే కూలబడ్డాడు.

"ఏవండీ! ఇంకా అట్లానే కూర్చున్నారే. పొద్దు బారడెక్కింది ఏడాది కొక్క పూట. పండగ పూటయినా పెందలాడే స్నానం చేస్తారా? లేదా?" అప్పావుపిళ్ళ సతీమణి ఇంట్లోకి జొరపడుతూ అడుగుతూ ఉంది.

మాటలో కాస్త నిష్ఠూరం చోటు చేసుకున్నా మరొకప్పుడయితే ఆ మాటల వెనుక నివురు గప్పిన అభిమానానికి నిజంగా అప్పావుపిళ్ళ ఆ కుక్కి మంచంమీదనే అందల మెక్కినంత ఆనందపడి అదో రకంగా చూసి ఇంకో రకంగా నవ్వేవాడు. కానీ ఆ నాడు సతీమణి వైపు ఎటోగా చూశాడు.

పెండ్లినాటికి ఆనాటికీ ఈ నాటికీ ఏ నాటికీ పోటీ లేకుండా నిలబడింది ఒక్కటే చీర ధర్మవరం పేటంచు సరిగ చీర సింగారించింది. అంతకు ముందు ముందే తల స్నానం చేసినట్లుంది. తల కూడా ఆరలేదు. కాన్పుకు పిడికెడు జుట్టు ఊడిపోతే ఆ ఏటాబాలెంతరాలికి పిడికెడు జుట్టు. ఆజుట్టు నుండి నీళ్ళు బొట్లు బొట్లుగా పడుతున్నాయి. చేతిలో హారతి తట్ట ఉంది. తట్టలో కొబ్బెరి చిప్పలు పూలు పండ్లు వగైరా వగైరా ఉన్నాయి అమ్మగారి మొహంలో పూజ సలిపిన సంతృప్తి చిలికిన మజ్జిగలో తేలుతున్న వెన్నెలా తేలుతూంది.

"అయితే ఏడాది కొక్కగా నొక్క పండుగని గుడిలో పూజలు చేసి వస్తూందన్న మాట ఇల్లాలు తనలో తాను గొణుక్కున్నాడు అప్పావుపిళ్ళ గొణుక్కొంటూ అగ్రహోదగ్రుడైనాడు. అటుపై ఆవేశంలో ఎగిరిపడి లేచాడు. ఆమె చేతిలోని తట్టను పెరుక్కొని విసిరి వీధిలోకి కొట్టి పిడికెడుకే అందని ఆమె జుట్టును పిడికెడు నిండుగా పట్టి మొగాన్ని వాటంగా తిప్పుకుని ఈ చెంపా ఆ చెంపా వాయించాలనుకొన్నాడు. అనుకొన్నాడే కాని ఆ పని చేయలేక అటు ఇటు కదలలేక కోపంతో కొంచెంసేపు వూగిన లాడాడు.

భర్త వైఖరి అర్థంకాక భార్య నిలువుగుడ్లతో నిలబడిపోయింది. అక్కడనుండి ఒక్క పరుగులో దేవాలయం చేరాలనుకున్నాడు అప్పావుపిళ్ళ ఆ దేవాలయంలో దేవుని ముందు నిలబడి 'ఒరే దేవుడా! వీళ్ళందరికీ బుద్ధి లేదనుకో నీబుద్ధేమయిందిరా? పీర్ల పండుగనాడు నోముల వ్రత మన్నట్లు పూజలు నువ్వెట్లా గ్రహిస్తున్నావురా? అయితే - ఆ తెల్లోళ్ళు నీగ్గూడు వేశారన్న మాట టోపీ! అందుకే వాళ్లందరి పూజలతో నువ్విట్లా కులుకుతున్నావు!" అని అడుగవలె ననుకున్నాడు. అయినా అడుగు ముందుకు వేయలేక ఆవు వెంట దూడలా ఆమె వెంట తలవంచుకొని లోనికి వెళ్ళాడు.

అప్పావుపిళ్ళ అభ్యంగన స్నానం చేశాడు. అంతలోపల అమ్మ గారు అయ్యగారికి ఉన్న మూడు జతల బట్టల్లో అతడు కట్టుకొన్నవి మినహా యిస్తే మిగిలిన రెండు జతల్లో కాస్తకుట్లు తక్కువ పడ్డ పంచెను. చొక్కాను అందించింది అవి పాతవే... చిరిగినవే... అక్కడక్కడ కుట్లు పడ్డవే! అయినా ఆమె అనురాగం పాత పడలేదు. చినిగి కుట్లు పడలేదు. అందుకే ఆనందంగా అందుకొన్నాడు.

అంతకంటే దర్జాగా ధరించాడు. పాలుసులూడి పళ్ళూడిన దవడలా తయారైన గోడ మీద మరకలు తేలి వేలాడుతున్న అద్దంలో తన చిరునవ్వుల చిద్విలాసాన్ని చూచుకొన్నాడు. నూగులు బియ్యం కలపోసిన స్థితిలో ఉన్న బుర్రమీసాల్ని దువ్వుకొన్నాడు. హుందాగా వసారాలోకి నడిచాడు.

ఇంటి వసారాలో అడగుబెట్టి ఇంటి ముందు నిలబడి ఉన్న గుంపును చూసి నిశ్చేష్టుడై నిలబడిపోయాడు అప్పావుపిళ్ళ. ఆ గుంపువైపు ఒక్క సారి తేరిపారచూశాడు. అందరూ తన బడిలోని విద్యార్థులని తోచే సరికి తోక తొక్కిన త్రాచు అయ్యాడు అప్పావుపిళ్ళ. ఒక చింతబరికె నందుకొని అందరి వీపులూ చిదగ్గొడుతూ దిక్కు కొకర్ని తరుమవలె ననుకున్నాడు.

అయ్యవారి అగ్రహాన్ని గుర్తించి పిల్లలు అటు యిటు కదల్లేకుండా అలాగే నిలబడిపోయారు. అప్పావుపిళ్ళ ఆలోచిస్తున్నాడు.

"అవును. ఒకనాడయితే తప్పకుండా అలా కొట్టేవాడు. ఆరోజుల్లో ఇంటి పాఠం అప్పచెప్పకపోతే గోడకుర్చీ వేయించేవాడు. చూచివ్రాత వ్రాయకపోతే చేతివేళ్ళు విరగగొట్టేవాడు. బడికి సక్రమంగా రాకపోతే పాఠశాల అనబడే ఆ పూరింట దూలానికి వేలాడదీసి కింద నాగదాడి పట్టలు - ముళ్ళ కంపలు పరచి " ఇక బడికెగ్గొట్టను! ఎగ్గొట్టను!!" అని 'కుయ్యో! అని మొత్తుకునే వరకు వదిలిపెట్టేవాడు కాదు. ఇంత చేసినా పిల్లవాని భవిష్యత్తు కోసమే అని, స్వార్థం లేదని పెద్దలు భావించేవాళ్ళు సహకరించేవాళ్ళు. కానీ రోజులు మారాయి. ఈ రోజుల్లో పిల్లవాడిని పల్లెత్తు మాటంటే కాస్త నోరున్న తల్లి అయితే పరక చేత బట్టి, సరాసరి పాఠశాల మీద పడుతుంది. కాస్త సంస్కారమున్న ఇల్లాలయితే 'ఏం అయ్యోరా, ఈ వూళ్ళో వుండాలనా, పోవాలనా?' అని నిలదీసి అడుగుతుంది. ఎందుకీ గొడవలని ఏ గొడవా పట్టించుకోకుండా ఈ కాలం బడి పంతుళ్ళు జీతపు రాళ్ళకోసం దినాలు లెక్కపెట్టుకునే స్థితికి దిగజారారు. కాల మహిమ! కాలంతోపాటు మనుషులు మారాలి కాబోలు!" అనుకొనేసరికి అప్పావుపిళ్ళ ముడతలు పడిన మొగంలో ఒకలేత నవ్వు వెలిసింది. ఆనవ్వును వూతగా కొని పిల్లలు ముందు పడ్డారు.

ఒక్కొక్కడు ముందుకు వస్తున్నాడు. ఒక నిమ్మపండో, అరటి పండో ఆఖరికి ఒక చాక్లెట్లో అప్పావుపిళ్ల చేతిలో పెడుతున్నారు. వంగి పాదాలకు నమస్కరిస్తున్నారు. అప్పావుపిళ్ళ గుండె ఆనందంతో పొంగి పోతూ ఉంది తొలకరి చినుకులలో తడిసిన పుడమి తల్లిలా హాయిగా ఉంది. వసంతాన్ని చూచిన కోయిల్లా పాడుతూ ఉంది.

రామాయణంలో పిడకల వేటలా అప్పుడు మనస్సులో మెదిలింది ఎప్పుడో విన్న విషయం. పట్టణాల్లో ఉపాధ్యాయుడూ, విద్యార్థి ఒక అగ్గిపుల్లతోనే సిగరెట్టు వెలిగించుకుంటారట! పైగా అది పొదుపు పాటించినట్లని విర్రవీగుతారట! గురువు శిష్యుడు కలిపి ఒక టేబిల్ మీద సరస్వతీ పూజకన్న మిన్నగా బ్రాందీపూజ చేస్తారట!

అప్పావుపిళ్ళ అవమానంతో కుంచించుకుపోయాడు. తనది ఉపాధ్యాయ కులమని చెప్పుకోవడానికి సిగ్గుపడ్డాడు. అయితే తానొక పరశురాముడు కావాలనుకున్నాడు. గండ్రగొడ్డలి చేబూని యిలాంటి చీడపురుగుల్ని ఛేదించాలనుకున్నాడు. ఆ పని చేయలేక అంతమాత్రమైనా ఆ పల్లెటూర్లో గురుభక్తి ఉన్నందుకు సంతృప్తిపడ్డాడు. అందుకే విద్యార్థుల్ని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాడు.

ఒక్కొక్క విద్యార్థి ముందుకు వస్తున్నాడు. వంగి నమస్కరిస్తున్నాడు. ఆశీర్వాదం పొందిన

ఆనందమేమో మరి తన్మయత్వంతో ఎగిరిగంతులు వేస్తూ గాలిలో తేలిపోతున్నాడు.

అలా ఆశీర్వదిస్తున్న అప్పావుపిళ్ళ దృష్టి ఉన్నట్లుండి ఒక పిల్లవాని మీద పడింది. వాడు గుంపుకు దూరంగా గుర్తింపబడనట్లుగా ఒదిగి నిలబడి ఉన్నాడు. ఈ తరవాత అప్పావుపిళ్ల గుంపును చూశాడు. దాదాపు వందమందికి పైగా ఉంటారు విద్యార్థులు. ఆ గుంపునుండి వెలివేయబడినట్లు నిలబడి ఉన్న ఆ పిల్లవాడెవరు?-

ఆ పిల్లవాడు మాదిగ గంగులుగాడి కొడుకు వెంకటయ్య - వెంకటయ్య తన బడిలోనే అయిదవ తరగతి చదువుతున్న పదేండ్ల పిల్లవాడు!

వెంకటయ్య వైపు తదేకంగా గమనించాడు అప్పావుపిళ్ళ. వాడి గుండెల్లో గుబులు కన్నుల్లో ద్యోతకమవుతూ ఉంది. కన్నులు ఆశతో ప్రతిఫలిస్తున్నాయి అయినా కాళ్ళకు సంకెళ్ళు-

అయినా వాడి ముందు వందమంది కట్టగట్టి నిలబడి ఉన్నారు.

వాళ్ళను దాటుకొని రావాలి! అని సాధ్యమా?

పోనీ- తనేవెళితే అమ్మో! ఇంకేమయినా ఉందా? ఆ పల్లెటూళ్ళో ఏరెడ్డసాని కాలుగిరి ఖణిల్లని రంకె వేస్తుందో!! ఏద నాయుడమ్మ నాల్క కొరికి నానా శాపనార్థలూ పెడుతుందో?-

వెంకటయ్య కళ్లటే నిస్సహాయంగా నిలబడిపోయాడు అప్పావుపిళ్ల గుంపులో నుండి ఒక్కొక్క విద్యార్థి వస్తూనే ఉన్నాడు. నమస్కరిస్తూనే ఉన్నాడు. ఆశీర్వాదం పొంది ఆనందంతో తిరిగి వెళ్ళిపోతూనే ఉన్నాడు. యాంత్రికంగా ఆలోచిస్తున్న అప్పావుపిళ్ళ మాత్రం వెంకటయ్య మీదే కొటకలాడుతూ ఉంది.ఎవడు వాడు? ఎవడు వాడు?.... అని ప్రశ్నిస్తూనే ఉంది.

ఎవడువాడా?

ఊరి ముందర టీ కొట్టులో వాడలోని వాళ్ళకోసం గుంజకు వేలాడ గట్టిన సత్తులోటావాడు.

సమాధానం కోసం సతమతమయ్యాడు అప్పావుపిళ్ళ ఆశించిన సమాధానం దొరక్క ఆవేదన పడ్డాడు. అయినా వెంకటయ్య కోసం అడుగు ముందు వేయలేక అలాగే నిస్సహాయంగా నిలబడ్డాడు. వంద మంది తరవాతనే వాడి వంతు వంద సంవత్సరాలతరవాతనే వాడి బ్రతుకన్నట్లు!

జనవరి ఒకటినాడు ఈ సంఘటన జరిగింది. అది జరిగి ఇప్పటికి దాదాపు పదిహేను సంవత్సరాలు అయింది. ఈ పదిహేనేళ్ళలో ఆ గ్రామంలో చాలా మార్పులు వచ్చాయి. ప్రాథమిక పాఠశాల మాధ్యమికి పాఠశాల అయింది. చదువుకొనే విద్యార్థుల సంఖ్య రెండింతలయింది. అందుకు తగ్గట్లుగా ఉపాధ్యాయుల సంఖ్య పెరిగింది. గ్రామస్థులు శ్రమదానంతో ఒక పంచాయతి కార్యాలయాన్ని నిర్మించారు. ఆ కార్యాలయంలో ఒక రేడియో వెలిసింది. సాక్షాత్తూ ఓ అమాత్య శేఖరుడే పంచాయతీ కార్యాలయ భవనానికి ప్రారంభోత్సవం చేశాడు. ఆ కార్యాలయంలోని రేడియోలో జాతీయత, నిరక్షరాస్యత, అస్పృశ్యతలాంటి పెద్ద పెద్ద మాటలు చెవులు చిల్లులు పడేలా వినిపిస్తూంటాయి. అప్పావుపిళ్ళ ఒకనాడు "హరీ!" మన్నాడు. అతని ఆత్మశాంతికి ఒక రోజున బడి మూశారు. అయినా అతని ఆత్మమాత్రం వూరి ముందరి టీ కొట్టులో గుంజుకు వేలాడగట్టిన సత్తులోటా చుట్టూ పరిభ్రమిస్తూనే ఉంది.

- ఆంధ్రప్రభ (29-8-79)

14

# కిటుకు

కొలువ మల్లయ్య

ఈత నార చేతుల్లోకి తీసుకొని కత్తితో చీల్చుతూ చాతాడు పేనుతున్నాడు బుచ్చయ్య. ఈతకమ్మ చీరడం వల్ల ఎర్రబడిన చేతులు మండుతున్నాయి. ముఖంపై, నల్లటి శరీరంపై చెమట బిందువులు ధగధగా మెరుస్తున్నాయి. బుచ్చయ్యకు సమీపంలో వాకిట్లో కొడుకును కూర్చుండబెట్టి కంచు తలెలో రాత్రి మిగిలిన చలి గడక వేసి కొడుకు ముందుంచింది మధునమ్మ. గుడిసెలో పొయ్యి మీదుంచిన గడుకెసరు సుయ్"మనియ పొంగుతుంది "గుడిసెసరు పొంగుతుంది బిడ్డ ఎసట్ల గడుకపోసత్త" దిగి తిను గుడిసె లోపలికెళ్ళింది మధునమ్మ.

ఆరేళ్ల పసివాడు రామయ్య తలెలో చేయి పెట్టి చలి గడుకను అటూ ఇటూ గెలుకుతున్నాడు పాచిపోయిన వాసన గుప్‌మని వస్తుంది. ఎర్రటి మిరుప కారంతో గడుక కలిపి నోట్లో పెట్టుకోబోయాడు... ఎంత ప్రయత్నించినా అది లోపలకు పోవడం లేదు.

"అవ్వా బువ్వంత ఆసనత్తంది నేందిన" అన్నాడు రామయ్య ఎసట్లో గడుకపోసి తెడ్డుతో రుద్ధి బయటకొస్తున్న మధునమ్మ కొడుకు మాటలు విని పాసిపోయింది... బువ్వడికెరాక అగుమంటాగ పోతిని. ఎట్లనో నాలుగు బుక్కల్దిను - ఉడికినంక మల్లింత తిందువుగని " అని ఓ బుక్క తీసి కొడుకు నోట్లో పెట్టబోయింది.

"నీయవ్వ నాకు పాసిపోయిందద్దుపో - నాకు మెతుకుల బువ్వే కావాలె. అని ముందటున్న తలెను దూరం జిరిపాడు.

"మనకు మెతుకుల బువ్వెట్ల దొరుకుద్ది బిడ్డ ఇంక నాలుగొద్దులయితె యాకాశి పండుగత్తంది - పండుగనాడు తిందువు తియ్యి" అని కొడుకును బ్రతిమిలాడింది మధునమ్మ.

"ఏమద్దు నాకిప్పుడే గావాలె పో" అని ముక్కు వెంట చీమిడి కారుతుండగా ఏడ్వడం మొదలుపెట్టాడు రామయ్య.

మధునమ్మ రామయ్యను దగ్గరకు తీసుకొని కొంగుతో చీమిడి తుడిసింది. "ఏడ్వకు బిడ్డ ఏడ్వకు. నువ్వీ బువ్వతింటే నూకలు పెడుత అని బురదకించ సాగింది.

భార్యను, కొడుకును గమనిస్తూ తాడు పేనుతున్న బుచ్చయ్య "గా పాసిపెయినది కూడెట్లా తింటడే? కొంచెమంతంబలుంటె పొయ్యి. కలుపుకొని తాగుతడు" అన్నాడు బుచ్చయ్య.

గుడిసెలో కెళ్లి కడుముంతలున్న అంబలి తెచ్చి కొడుకు తలెలో పోసింది మధునమ్మ. తలెచుట్టూ 'జుయ్' మని ఈగలు ముసురుతున్నాయి. "ఈగలు నాశినంగాను ఏన్నుంచత్తయోని

పొనంతీత్తన్నయి" అని చేత్తో అటూ ఇటూ ఊపి తలె రామయ్య నోట్లో పెట్టింది. గుటుకుంటూనే రామయ్యా గడుకంబలి తాగి "మరి నాకు నూకలు పెడుతనంటివి గద పెట్టు" అన్నాడు తల్లితో.

గుడిసె లోపలికెల్లి ఎసులలో వున్న పిరికెడు నూకలు తెచ్చి రామయ్య అంగిజేబులో పోసింది మధునమ్మ. "బుక్కుకుంట అయ్య సెప్పిన పన్జెయి" అని అన్నం చూడటానికి లోపలికెళ్లింది. జేబులో నూకలు పడ్డ తర్వాత బయటకెళ్లబోతున్న రామయ్యను పిలిచాడు బుచ్చయ్య. ఎట్లా ఉరుకుతున్నవ్ - గీతాడు జెప్పన గావలె పట్టు. దొరింట్ల కట్టుదాళ్ళు లెవ్వట - ఇచ్చి రావలె" అన్నాడు.

పోయేవాడల్లా తిరిగొచ్చి ఒక దిక్కు బుచ్చయ్య తాడు పేనుతుంటే మరో వైపు పట్టుకొని తండ్రి తిప్పుమన్నట్లు తింపుతున్నాడు రామయ్య. లేత చేతులు మంటగా వున్నా తండ్రి చెప్పింది చేస్తున్నాడు నోట్లోని నూకలు తినడం అయిపోగానే తాడు విడిచి పెట్టి ఒక చేత్తో అంగి జేబు పట్టుకొని మరో చేత్తో నూకలు తీసుకొని నోట్లో పోసుకోబోయాడు. తాడు పురి వదులయ్యింది బుచ్చయ్య క్కోపమొచ్చింది "నీ కడుప్పాడుగాను కొంచెం మాగరాదురా - ఎటు పోతున్నాయి నూకలు? తాడు మంచిగ పట్టుకో" అని గద్దించాడు.

చేతిలోని నూకలు గబుక్కున నోటోల్ల పోసుకొని తాడందుకున్నాడు రామయ్య. బుచ్చయ్య గబగబా తాడు పేనుతున్నాడు. రామయ్య తండ్రతో సమానంగా తాడు తింపడానికి సతమతవుతున్నాడు. ఉడికిన గడుక దించి మధునమ్మ వాకిట్లోకొచ్చింది.

"బువ్వయిపెయినాదే" పనిచేస్తూనే అడిగాడు బుచ్చయ్య.

"గడుకుడికింది గని పోసుక తాగుటానికే లేదు" అంది మధునమ్మ.

"నిన్న నాలుగు రాముల్కాయలు తెత్తిగాదె గవ్వంద లేవు"

"ఏం బెట్టండాలె? ఒక్కబొట్టన్న నూనెలేదు. నూనె లేకుంటందుతదెట్ల పాదయితది."

" నూనె లేకుంటె మానెయ్ ఉప్పు కారమేసుదుకవెట్టలేవు"

"పురాగ తాలుపులకన్న లేకపోతే నోట్లెకెట్ల పోతది. నీ మాటలుగని" "అబ్బో దొర్సాని పద్దాలె మాట్లాడవడ్తివేమే? నూనె లెకుంటెన్నిసార్లు తిన్లేదు? కాయిపాయిగ తినన్నంటెమనం దొరలమాయె. ఎట్లనో నాలుగు బుక్కలు నోట్లెపెట్టుకుంటయిపాయె. అట్టి తొక్కుతోనెంతని తినత్తది? జెప్పనండుపో. దొరింటికి పొయ్యిరావాలె" అన్నాడు బుచ్చయ్య. "అవు. మొన్ననే దొర తాళ్ళు పంపమని సెప్పంపిండు" అని లోపలికెళ్ళింది మధునమ్మ.

తాడు పేనడం పూర్తిగావస్తుంది. రామయ్యకు భలే బాధగా వుంది పని వల్ల కలిగే బాధకంటె, నూకలు బుక్కుకుంటూ స్నేహితులతో కలిసి ఆడుకుందామంటె తండ్రి ఆపిండని కోపంగా వుంది. బుచ్చయ్య చేతుల్లో రక్తం పేరుకుంది. రాముల్కాయం కూర పొయ్యి మీదేసి బయట కొచ్చింది మధునమ్మ.

"నువ్వాడుకోపో కొడుక. నేను మా పడత" అని కొడుకు చేతి లోని తాడు తీసుకుంది. రామయ్య హుషారుగా బయటకు పరుగెత్తాడు. "అవునాయ్యా! పొల్లగాన్ని గూడ గి నల్ల మొకప్పునికే ఉంచుతవా? సదువేత్తె సరుకారోల్లు పైసలిత్తంద్రట కద. ఈన్ని సదివిత్తామేంది?" అని భర్తదిక్కుఆశగా చూసింది మధునమ్మ.

"నాగ్గాడ పోరన్ని సదువెయ్యాన్ననే ఉందే కని మనకెల్లుతాదె"? "ఎల్లకుంటేంజేత్తది? ఇంకొంచెం కట్టపడుదామేంది? పొల్లగానికి నాలుగచ్చిరాలు సెప్పిత్తే మొకం తెలివోలుంటది". గా సదువుల సంగతి మనకెరుకలేపాయె. దొర నడుగేమంటడో..?

"నేం గూడ గదే అనుకంటన్ననే... గీ తాడు పట్టు పొయ్యి గీ మాట దొర సెవ్వులేత్త. జెప్పనింత బువ్వ పెట్టు." అని పేనడం పూర్తయిన తాడు చివర ముడివేసి చుట్టగా చుట్టాడు. వాకిట్లో పడేసి ముండ్లు పాయేట్టుగా బాగా రాకాడు. గుడిసె పక్కకున్న కుండల్లోని నీళ్లతో కాళ్లు కడుక్కున్నాడు. చేతులు రుమాలుకు తుడుచుకుంటూ గుడిసెలోపలికెళ్ళాడు. గొంగడి ముద్దగా వేసుకొని దానిపై కూర్చోబోయే సరికి గుడిసెలో ఒక మూలకు ఆరేసున్న ఎద్దు తోలు 'గుస్' మని వాసన కొట్టింది.

· "నీ యవ్వ ఆసన పాడుగాను. ఇంట్ల నిలవడత్తలేదు" అని దాన్ని బయటకు తీసుకెళ్లి గుడిసె కప్పుపై ఆరేసాడు. మళ్లీ లోపలికొచ్చి గొంగడిపై కూర్చున్నాడు.

"జెప్పనెయ్యి బువ్వ" అని భార్యను తొందరపెట్టాడు.

"ఎయ్యనే వడితి గొడాగలేవు. గడియ రికాంలేదు, గవ్వరాకల్లేద." అంటూ మధునమ్మ బుచ్చయ్య ముందరో తలెపెట్టింది. గడుక కుండ తెచ్చి అతనికి దగ్గరగా పెట్టి గంటెతో ఉడుకుడుకు గడుక తలెలో వేసింది. కసికెతో ఎర్రగా తయారయిన రాముల్కాయల కూర వేసింది. గడుక కూర కలిపి ఓ ముద్ద నోట్లో పెట్టుకున్నాడు బుచ్చయ్య. ఒక్క బొట్టయినానూనెలేక వండిన ఆకూరెలావుంది. బలవంతంగా కొంత తిన్నాడు. మిరపకాయ కారంతో కంచంలోని అన్నమంతా మరింత వేయించుకొని "అంబలున్నాదె!" అన్నాడు.

"ఉన్న తాడికిప్పుడే పొల్లగానికి పోత్తి ఇంకేడిది?" అంది మధునమ్మ.

"ఐతెమాయె తియ్యి" అని ఆ గడుకలో కొంత ఉప్పేసుకొని నీళ్లు పోసి కలిపాడు గటగటా త్రాగాడు. మూతి రుమాలుకు తుడుచుకుంటూ బయటకొచ్చాడు. తాడు చేతిలో పట్టుకొని "ఇగ నేం బోతున్ననే" అన్నాడు బుచ్చయ్య.

"అచ్చేటప్పుడు దొర్సాన్ని కొంచెమంత సింతకాయ తొక్కడుక్కురా. మరిషిపోయేవు. పొల్లగాని సంగతి గూడడుగు" అంది మధునమ్మ. "సరె మా అడుక్కత్త" అని బయలు దేరాడు బుచ్చయ్య.

ఆలోచించుకుంటూ కొడుకు చదువు గూర్చి కలలుగంటూ నడుస్తున్నాడు బుచ్చయ్య. తన కొడుకు అంగీ, లాగు తొడుక్కొని, చేతిలోపుస్తకాలతో ఠీవిగా బడికి నడుస్తున్నట్టు ఊహించుకుంటున్నాడు. తన కొడుకు చదువుకొని పెద్ద కులపోల్ల పిల్లలతో సమానంగా తిరుగుతున్నట్టు, ఇంగ్లీషు బాస దనా దన మాట్లాడుతున్నట్టు ఆలోచిస్తున్నాడు. తన కొడుకు చదువుకుంటే తన కష్టాలు గట్టెక్కుతాయని మురిసిపోతున్నాడు. రకరకాల స్వప్నాల్లో తేలిపోతూ పరధ్యానంగా నడుస్తున్న బుచ్చయ్య హడావిడిగా ఎదురొస్తున్న కృష్ణాశాస్త్రిని గమనించలేదు. పూర్తి దగ్గరకొచ్చి ఠకీమని ఆగి వెనుకకు రెండడుగులేసి "అప్రాచ్యపు ముండా కొడుక - కండ్లు కనపడుతలేవుర" అన్నాడు శాస్త్రి. శాస్త్రి మాటలతో ఈ లోకంలో పడ్డ బుచ్చయ్య అక్కన్నే ఆగిపోయి.

"లేదయ్యగారు... నేను మీరచ్చేది సూల్లేదు" అన్నాడు. "సరే పోరా పో. మీకు కండ్లు నెత్తిమీద కచ్చినయిరా" అని భుజమ్మీదున్న పంచెను దులిపి మళ్ళీ భుజమ్మీదేసుకొని ముందుకు పోయాడు. బుచ్చయ్య పక్కకు ఒరిగాడు ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలా ఆగి బుచ్చయ్య లో - అరే బుచ్చిగా

ఇటురా' అని పిలిచాడు. బుచ్చయ్య వెనుకకు తిరిగొచ్చి శాస్త్రికి కొంత దూరంలో నిల్చున్నాడు. "ఇంట్ల అమ్మ (భార్య) చీపుర్లు లెవ్వని గోల పెడుతుంది. రెండు కట్టుకొచ్చి రేపిచ్చెయి" అన్నాడు.

"మా ఇత్తగని అయ్యగారు! ఇదివరకిచ్చిన రొండు సీపుర్ల పైసలిప్పియ్యకపోతిరి. మేమెట్ల బతుకాలె బాంచెను?" అన్నాడు బుచ్చయ్య. 'వెధవ. అవసరమొస్తే పంచాంగం చూసి చెప్పనా. బ్రాహ్మని కిచ్చింది పోతాదిర - 'అన్నాడు శాస్త్రి ' నేనేం పనులు సేత్తనని పంచాంగం చూపిచ్చుకోవాలయ్యగారు. గా పైసలిత్తె నూనె బొట్టన్న తెచ్చుకుంట అన్నాడు బుచ్చయ్య. ఎప్పుడూ ధరిద్రమే వెధవలకు. రేపు రెండు చీపుర్లు తీసుకెళ్ళి అమ్మనడుగు నాలిగిటి పైసలిస్తది. అన్నాడు శాస్త్రి సరెరేపు మా ఇచ్చత్త అయ్యగారు అని కదిలాడు బుచ్చయ్య.

"అల్లమయితంది గీ బావనయినె దొరికిచ్చుకొని సోది జెప్పవట్టె ఎత్తనమదే కాని ఎప్పుడొక్క కొత్తన్న ఇయ్యకపాయె మంత్రాల,దివి దులకు పదులు దొబ్బుతండు గని. కిట్టపడి సేతులన్ని మండంగ చీపుర్లు గట్టిత్తె పుక్కానికే ఇయ్యన్నాయె - నీయవ్వ పెద్దొల్ల కెంతున్న సాలది" అని తనలో తానే గొణుక్కుంటూ, కొడుకు చదువు గూర్చి దొర అభిప్రాయం తెలుసుకోవాలని అనుకుంటూ దొర ఇల్లు సమీపించాడు బుచ్చయ్య.

పాటకుల లోపల పెద్దరువాజ బయట పడక కుర్చీలో కూచొని సిగరెట్ తాగుతూ హాయి నుభవిస్తున్నాడు సుధాకర్ రావ్ దొర. పాటకుల దగ్గర నిల్చొని తాడు క్రిందేసి, నెత్తిమీద రుమాలు తీసి చేతిలో పట్టుకొని దండాలు బాంచెను" అన్నాడు బుచ్చయ్య.

దొర బుచ్చయ్య దిక్కు చూపు నిలిపి ప్రతి నమస్కారం చేయకుండానే బుచ్చిగా కావురమచ్చినాదిర, గిప్పుడార నువ్వు తాడుదెచ్చేది" అన్నాడు మీరు సెప్పంపంగనే ఈత కమ్మ కురికితి, నార పీరితి పేనుకొని అచ్చెటాల్లకు రొండ్రోజులాయె బాంచెను. అల్లమేదజేత్తి" వినయంగా అన్నాడు బుచ్చయ్య.

అడిగిందానికేదోటి సెప్పుతర్రా. సరేగని ఆ తాడు లోపలాకిట్లో పడేసి ఇంటెనుకో తుమ్మ మొద్దుంది. ఎనుకనుంచి పొయ్యి పలుగ్గొట్టుపో" అన్నాడు సుధాకర్ రావు.

.... మా పలగ్గొడుత గని దొర ఒక్క మాటడుగల్ననుకుంటున్న." నీళ్లు నములుతూ అన్నాడు బుచ్చయ్య.

"ఏం మాటరో అడుగు" అన్నాడు దొర

"దొరా! నేనంటే సిన్నప్పట్నుంచి తాళ్లు పేనుకుంట, సెప్పులు కుట్టుకుంట. కూలి పనులు జేసుకుంట బతుకవడితి పొంగ మిగిల్నోడు నాకు గా రామిగాడొక్కడేనాయె. గానికి నాలుగచ్చిరాలు నేరిపియ్యాలనుకుంటున్న. పెద్దోల్లు మీ సెవులేసి మీ దీవెన్లు పొందన్నని" అన్నాడు బుచ్చయ్య.

సుధాకర్ రావు వినగూడని మాటలు విన్నవాడిలా ముఖం పెట్టాడు 'కూలి వెధవలు కూడా చదువుకుంటె ఇక మా పనులెవరు చేయాలి?' వీన్నీ ఆలోచన నుండి విరమింపజేయాలి' తనలో తానే అనుకున్నాడు "వారి బుచ్చిగా నీ కెవ్వల్రా గీ మాటలు సెప్పింది. చదువుకొని రాజ్జాలేలుతార్ర నీ కొడుకు" అన్నాడు.

"గదిగాద్దొర. ఇయ్యల్లరేపు అన్నికులాలోల్లు సదువుకుంటుండ్రుగద. నిజమే కని సదువులంటె ఏందనుకుంటన్నవు అట్లగనే ఐతాదిర' 'ఎట్లనన్న కట్టపడుత బాంచెను'.

"నువ్వు నీ పెండ్లాం పని జేసుకుంట బతుకుత లేరార? పోరనికి పుస్తకాలకు, పీసులకు, బట్టలకు పైసలేన్నుంచి తెత్తవుర? పిచ్చి ఆలోచన్లు పెట్టుకోకు". గదమాయించాడు దొర.

సర్కారోల్లు పైసలిత్తరటగద దొర మాదిగ మన్నెపోల్లకు, గవ్విటితో సదువుకోరాద? అన్నాడు బుచ్చయ్య.

దొర బుచ్చయ్య మాటలకు బిగ్గరగా నవ్వి 'గా పైసల్తోనేమయితదిర. అవ్వి గూడ అందరికత్తయమకుంటన్నవా? పది మందిల ఒక్కలిద్దరికి దొరుకుతయి. అవ్వేం మొదలయితయి? చదువంటే మాటలనుకుంటున్నవా. కయికిలో గంబలో సేసుకుంటె ఎసొంటి బట్టలయిన కట్టుకోవచ్చు బడికి పోయే పిల్లగాండ్లకు మంచి మంచి అంగిలాగులు పట్టియ్యాన్నాయె. బట్టలు మంచిగ లేకుంటె ఇజ్జద్దీత్తరు. మల్లపుస్తకాలకు పైసలు గావన్నాయె. బడికి పొయ్యేటోడు ఇంట్ల పని ఇనడు చేతికొచ్చిన పోరన్ని బడికి తోలుతె నీకెట్ల ఎల్లుతదిర? అన్నాడు.

అతని మాటలు వింటూ ఆలోచనలో పడ్డాడు బుచ్చయ్య అదే సమయమని మళ్లీ చెప్పడం మొదలు పెట్టాడు సుధాకర్‌రావు.

"వారి బుద్ధిగా నీ పోరన్ని ఇడసకు పాలేరుంచితివాంటే వేన్నీళ్ళకు చన్నీళ్లోలె నీకు తోడుంటది -గా చిన్న పోరన్ని ఎవ్వలుంచుకుంటరనుకోకు నాకే వుంచు... వాడే గొడ్లతోని పోతడు చదువు సంగతి మర్చి పోయి రేపట్నుంచాన్ని పనికి దోలు".

దొర మాటలు విని "సరే దొర" అని సమాధానమేం చెప్పకుండానే కట్టెలు కొట్టడానికై ఇంటి వెనుకకు వెళ్లాడు బుచ్చయ్య. మధ్యాహ్నం దాటేవరకు కట్టెలు కొట్టి చెమట కంపుతో వాకిట్లో నిల్చొని "దొర్సానీ" అని పిలిచాడు - లోపల్నుంచి దొరభార్య బయటకొచ్చి మురికిగావున్న పంచెతో చెమట కంపుతో నిల్చున్న బుచ్చయ్యను అసహ్యంగా చూసింది.

"ఏంగావాల్రా అడిగింది ముఖం చిట్లించి.

"దొరసాని కొంచెమంత సింతకాయ తొక్కు పెట్టుండ్రి - నోరం తెట్లనో వుంది' అన్నాడు దీనంగా.

"మొన్ననే పెడితిగాదుర మామిడికాయ తొక్కు బరుకతి దక్కో ముండకొడుకులు" అని తిట్టుకుంటూ లోపలికెల్లింది. ఓ బాదామూకులో చింతకాయ తొక్కు పెట్టుకొచ్చి చేతులో జాచుకొని నిల్చున్న బుచ్చయ్య చేతుల్లో పై నుంచి వేసింది. అది కళ్ళకద్దుకొని "పోతన్నా దొర్సానీ" అని చెప్పి ఇంటిదారి పట్టాడు బుచ్చయ్య - ఇంటికెళ్లి స్నానంచేసి గుడిసెలో మలక మంచం వాల్చుకొని పడుకొని ఆలోచన్లో పడ్డాడు. మొదట్నుంచి దొరనెంత నమ్మినా కొడుకు చదువు విషయంలో దొరమాటలు సరియైనవిగా అనిపించడంలేదు బుచ్చయ్యకు. రకరకాలుగా ఆలోచించాడు. రెక్కలు ముక్కలు చేసుకొనైనా సరే కొడుకుని చదివించడానికే నిర్ణయించుకొన్నాడు - తన ఈ గమ్యంలో ఎన్ని అడ్డంకులెదురైనా ఎదుర్కొనాలనుకున్నాడు అడుకోవడానికెళ్ళి ఇంట్లోకొచ్చిన కొడుకును ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు బుచ్చయ్య.

పట్టె మంచంలో పడుకొని ఇంటి పై కప్పుకేసి చూస్తున్న బుచ్చయ్యకు పాతికేళ్ళ క్రితం కొడుకు చదువుకొరకై తాను నిర్ణయించుకున్న రోజు జ్ఞాపకం వచ్చింది. కొడుకు చదువుకొరకై తాను రాత్రింబవళ్ళు విశ్రాంతి లేకుండా పనిచేసాడు. అనుకున్నది సాధించాడు - కొడుకునో మంచి ఉద్యోగి చేసాడు తాను పడ్డ కష్టాలకు ఫలితంగా కొడుకు కూడా పోకిరి వేశాలేయక కష్టపడి

చదువుకున్నాడు తన కలలకు ప్రతిరూపంగా నిలిచాడు. తన కష్టాలను గట్టెక్కించ్చాడు తామిప్పుడు గుడిసెకు బదులు పెంకుటింట్లో నివసిస్తున్నారు - మాసికలు పడ్డ పాత మురికి బట్టలకు బదులు శుభ్రమైన బట్టలేసుకుంటున్నారు - ఉద్యోగమయింతర్వాత కొడుకు రెక్కలొచ్చిన పక్షిలా ఎగిరిపోకుండా తమకు దిక్కుగా ఉన్నాడు - బుచ్చయ్యకు తానాలోజు తీసుకున్న నిర్ణయంపై ఎంతో గర్వంగానూ సంతోషంగానూ వుంది.

ఊరిజనం తన నిదివరకు "బుచ్చిగా" అని మాత్రమే పిలిచేవారు. ఇప్పుడు బుచ్చయ్యని పిలుస్తున్నారు భార్యను 'మదిని' అని పిలిచే వాళ్ళు కూడా మధునమ్మా అని పిలుస్తున్నారు రారా. పోరా అని బూతు మాటలుతో తప్ప పిలిచే దొరలాంటి వాళ్ళు కూడా అలా పిలవడం లేదు తమ మురికి బట్టలు, తమను చూస్తే దూరం దూరం జరగే వాళ్ళు ఇప్పుడు అసహ్యించుకోవడం లేదు - తమకు మరీ దూరంగా ఉండటం లేదు -- ఊరి ప్రజల్లో జరిగిన ఈ మార్పుకు ఆశ్చర్యపోతున్నాడు బుచ్చయ్య తన కొడుకు మంచి ఉద్యోగంలో వున్నాడు తన ఆర్థిక పరిస్థితి కొంత మెరుగు పడ్డంత మాత్రాన ప్రజల్లో తమపట్ల వచ్చిన మార్పులోని "కిటుకు" అతని కర్థం కావడం లేదు రెండు మూడేళ్ళు గా తీరిక దొరికినప్పుడల్లా అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు - ఆర్థిక పరిస్థితి మంచిగుంటే, మంచి స్థితిలో వుంటే ఏ కులం వాడైనా కొంతవరకైనా గౌరవపాత్రుడవుతాడని అతనికిప్పుడిప్పుడే అర్థమవుతుంది. ఈ దేశంలోని చాలా రుగ్మతలకు ఆర్థిక అసమానతలే చాలా వరకు కారణమన్న విషయం ఎంత నిరక్షరాస్యుడైనా బుచ్చయ్య తన అనుభవం ద్వారా తెలుసుకుంటున్నాడు.

దీర్ఘాలోచనామగ్నుడైయున్న బుచ్చయ్య ఇంటి ముందు స్కూటరాపి కోడలుతో ఇంట్లోకొస్తున్న కొడుకును చూసి ఈ లోకంలో కొచ్చాడు. కొడుకు కోడలు దిక్కు గర్వంగా చూసాడు.

15

# నెంబర్రాళ్ళు

## పులికంటి కృష్ణారెడ్డి

ఎగిరి ఒక్కతన్ను తన్నాడు. గబుక్కున వెనక్కు తిరిగి మళ్ళీ మూతి మాత్రం ముందుకు తిప్పి తుపుక్కున ఉమ్మాడు.

కోపమొస్తే మనిషి మనిషిని తన్నడం సహజం... లేకుంటే - కారి ఉమ్మడమూ సహజం. పనిపాటల్లో మోరకేస్తే పశు ప్రాయుడయిన మనిషి పశువును కూడా తన్నడం సహజం. లేదా కాండ్రించి ఉమ్మడమూ నైజం.

అయితే అతడు తన్నింది మనిషిని కాదు. కాండ్రించి ఉమ్మింది మనిషి మీద కాదు. పశువు మీద అసలే కాదు.

అల్లంత దవ్వులో నిలబడి ఆ దృశ్యాన్ని చూచి ఆశ్చర్యంలో పడి లేచేసరికి అతడు పరుగు నడకగా ఆ గనిమిల మింద పడి పోతున్నాడు. మరింత ఆశ్చర్యం వేసింది. అతని వెంట పడ్డాను. అతనిది నడక నాది పరుగు.

పారిపోతున్న వాడిని పట్టుకోవడాని కన్నట్లుగానో, లేదు - వెంటబడి ఎవరో తరుముతున్నట్లుగానో వుంది - అతడి తత్తరపాటు గమనిస్తుంటే.

రాయలసీమలో రైతు చేతికింది పొలాలు ఒక్క ఎకరం ఏక చదరంగా వుండడమంటే ఎంతో అరుదు. మిట్ట పల్లాలు ఎగుడు దిగుళ్ళు ఏటవాలు తలాలు ఎక్కడికక్కడికి ఎంతెంత మాత్రం చదర కట్టుగా వుంటే - అంతంత వరకు నాలుగు గనిమలు పోసి 'కయ్య' అని వ్యవహరిస్తారు. చాకలి ఉతికిన బట్టల్ని ఒక కోక పక్కన పంచను, పంచపక్కన తువాలును. తువాలు పక్కన దుప్పటిని ఆరవేసినట్లుంది. ఆ కయ్యల్ని చూస్తుంటే, కయ్య కయ్యకు మధ్య గనిమ వుంటుంది. అది ఉంటే మహా ఒక పట్టికాలు లావుంటుంది. ఆ గనిమ మీది నడక సర్కసులో కమ్మిమీద నడకలా వుంటుంది.

అతడు నడుస్తున్న వూపులో తడి గనిమలమింద కాళ్ళు తడబడుతున్నాయి. తలబడిన కాళ్ళు జారుతున్నాయి. కాలు జారేనరికి బోర్ల గిల వడినట్టువడి చేతులు వెూవుమీద నిలదొక్కుకుంటున్నాడు. మళ్ళీ లేస్తున్నాడు. తిరిగి మళ్లీ చూడకుండా ముందుకు సాగిపోతున్నాడు.

అతని కంట బడకుండానే నే నాతని వెంటపడ్డాను.

పరుగు దూరంలో ఒక బావి. ఆ బావి దగ్గర నిలబడ్డాడు. ఎడమకాలి చెప్పును కుడిచేతికి తీసుకొన్నాడు. నాలుగు దిక్కులు కలయచూశాడు.

మొల ఎత్తు జొన్న చేను చాటుగా నేను మాటువేశాను.

చెప్పుతో ఎంచి ఏడేట్లు కొట్టాడు.

పొంచి చూస్తున్న నేను ఆశ్చర్యంలోపడి కొట్టుమిట్టాడాను.

బలవంతుడు అనుకుంటే బలహీనుణ్ణి దయాదాక్షిణ్యాలు లేకుండా కొట్టగలడు చెప్పుతో కొండిలో విషాన్ని నింపుకొన్ని తేలు కంటపడితే చెప్పు చేతికి వస్తుంది. సాగర సమానమయిన సంసారాన్ని ఈది ఈది ఈసురోమని మిగిలిన మనిషి - ఓర్పు నశించిన స్థితిలో ఎవరినీ ఏమీ అనలేకుండా తన చెప్పుతో తన్నే కొట్టుకుంటాడు. ఎవరో ఒక అశ్వమేధయాగ నిపుణుడు. పెళ్ళాం మెడలోని తాళితో సహా వోడిపోయాడట. అప్పటికి జ్ఞానోదయం కలిగినట్లుంది. చెప్పుతీసి చెడామడా కొట్టుకుంటున్నాడు. 'ఎందుకయ్యా?' అని అడిగితే 'నోరున్న మనిషిని నోరులేని జంతువులపై ఆడి వోడిపోతినే. ఇంతకంటే ప్రాయశ్చిత్తామా'' అని బోరోమని ఏడ్చాడట. బాగానే వుంది.

అయితే వీటన్నింటికీ విభిన్నంగా అతని చేతను గురించి ఆలోచిస్తూ ఒక పక్క కొరికినంత సేపు బుద్ధి వైదొలగింది. తెపురుకొని తేరపార చేసే సరికి కనుచూపును మించుతన్నాడు. పొలం గట్లమీద పడుతూ లేస్తూ పోతూనే వున్నాడు.

పొట్ట కర్ర వేసినా నా ఆశ్చర్యం వెన్నుపోయింది.

నేనాతని వెంటపడ్డాను!

రెండు పరుగుల దూరంలో కానబావి. కన్నుమూసి తెరిచేలోపుగా అతడక్కడ నిలబడ్డాడు.

కానబావి ప్రక్కన్నే ఒక పెద్ద మట్టిగడ్డ. ఎప్పుడో కానబావి త్రవ్వినప్పుడు. బావిలోని మట్టిని తీసి ఆ ప్రక్కనపోస్తే అది కానబావి గడ్డగా నిలబడింది. ఆ గడ్డ మీద కానుగ చెట్టు. ఆ చెట్టు మాటులో నిలబడ్డాను. అయితే అతని వైపు ఒక కన్ను వేసి వుంచాను.

అతడు గబుక్కున బోర్లగిల పడ్డంత పనిచేశాడు.

ఆ చీకట్లో నేను కన్నులు చించుకొని చూస్తూనే వున్నాను.

అతడు రెండు చేతులతో పాదివి పట్టుకొన్నాడు. గుండెలకు హత్తుకున్నాడు. తల వాలవేశాడు. వలవలా ఏడుస్తున్నాడు.

అతడు కౌగిలించుకుని వలవలా ఏడ్చింది. అతనిని వీడి వెళ్ళిపోతున్న మనిషిని కాదు. ఆ చీకటిలో అతని కోసం ఎదురు చూస్తూ వుండిన ప్రియురాలినీ కాదు.

ఒక బావి దగ్గర ఎగిరి తన్నాడు. అక్కడికీ తృప్తిలేక కారి ఉమ్మాడు.

మరొక్క బావి దగ్గర కాలి చెప్పును కుడిచేతికి తీసుకుని ఎంచి ఏడేట్లు కొట్టాడు.

ఇంకొక బావి దగ్గర మనసార కౌగిలించుకుని వలవలా ఏడ్చాడు.

ఎవర్ని.

ఆ బావి గట్టుల మీద బిగించిన కరెంటు మోటారుల్ని

ఇంతకూ ఇలా చేసిందెవరు?

మాదిగ రాముడు

ఎందుకు చేశాడు?

అదే అంతు దొరకలేదు.

నేను ఆలోచిస్తూనే వున్నాను. రాముడు మాత్రం పైకి లేచాడు. భుజం మీది తుండుగుడ్డతో కండ్లు వత్తుకున్నాడు. ఆకరెంటు మోటారు వైపు జాలిగా చూశాడు. అటుపై గిరుక్కున వెనక్కు తిరిగాడు. గబగబ నడిచిపోతున్నాడు మాదిగిండ్ల వైపు.

ఇంటి వైపు వెడుతున్న రాముడిని వాడి ధోరణి అర్థంకాక కాసేపు మింటిపైపు చుక్కల్ని నిలబడ్డాను.

చీకటి రక్కసి కురులు విరబోస్తే ఆమె తలలోని పువ్వులు చెదిరి అక్క డొకటి ఆ వెంట్రుకలలో తగులుకున్నట్లు మినుక్కు మినుక్కు మంటున్నాయి మింటిమీది చుక్కలు పరవ గుట్ట సమీపంలో పొట్టినక్కల వూళలు ఉదృతంగా వినిపిస్తున్నాయి.

రకరకాల ఆలోచనలు బుర్రని తొలుస్తున్నాయి.

రాముడు.

నిడుపాటి చెవుల్లో నిగనిగలాడే ఎర్రాళ్ళ అంటుజోళ్ళు. దట్టమయిన కనుబొమ్మలు కింద వెడల్పాటి కండ్లు . ఆకండ్లులో ఎప్పుడూ తొణికిసలాడే చిలిపితనము, గుబురు మీసాలు, ఆడవాళ్ళే అసూయపడేట్టుగా పిడికెట్లో ఇమడని సిగముడి, రాముడి ఆకారంలో ఏదో ప్రత్యేకత కొట్టవచ్చినట్లు కనిపించేది. వాడి నడకలో హుందాతనం అందాలు పోయేది. వాడిని చూస్తూంటే, వీడెట్లా తక్కువ కులంలో పుట్టాడా! అన్న సందేహం కలిగేది.

అలాంటి రాముడికి కొంపదీసి పిచ్చి పట్టలేదు గదా?

ఆ ప్రశాంత వాతావరణంలో పైరుగాలి సయ్యాటలాడుతున్నా నా ఆలోచనలతో చిరుచెమటలు పోశాయి.

ఆ పాయకట్టులో ఒక పది పదిహేను గ్రామాలున్నాయి. ఆ గ్రామాల్లో ఒక నాలుగు గ్రామాల సేద్యం రాముడి మీద ఆధారపడి ఉండేది.

రాయలసీమలో నదీ నదాలులేవు. పెద్ద పెద్ద నదులకు కట్టిన ఆనకట్టల నుండి నీళ్ళు తరలించే ఆలోచన అసలేలేదు. అందువలన రాయలసీమ సేద్యం బావుల మీద ఆధారపడి వుంటుంది.

తొలికోడి కూసే వేళకాడ మోటకట్టి నాలుగు బార్ల పొద్దెక్కేదాక 'రావన్న రావో?' అని మోట తోలితేనే మడికి తడి పడుతుంది. మోటకు తోలుబాన అవసరం. ఆ తోలుబానను కుట్టి దాని జీవిత కాలమంతా 'రిపేర్' బాధ్యతల్ని వహించడానికి రాముడవసరం. అందుకే ఆ నాలుగు గ్రామాల కింద సేద్యానికి రాముడికి తీయాపెట్ట లేని సంబంధముంది.

"రాముడు! తొండం అడ్డానిక సినిగిపోయిందిరా! మడికి తడిబడి రొండు నాళ్ళయ్యింది. ఈ పొద్దన్నా తడి పడుతుందనుకోని తొలి కోడి కూసే యాళకాడ లేస్తే రాళ్ళకాలవ కాడనే తెల్లారింది బతుకు. నీకు పున్నె వుంటుంది. లెయ్‌రా?" అని ఒక సన్నపాటి రైతు ఇంటిముందు నిలబడి బతిమాలుతూంటే-

"ఒరే! రావుడూ! నిన్నగాక మొన్న కుట్టివి గదరా! నీ యమ్మా బడవా! తొండం దారి తొండానిది. బాన దారి బనదయింది. లేచిరారా! ఈ పొద్దనంగానే తిరుగుడు కపిల కట్టి ఇద్దరు మణుసులు, రొండుకాండ్ల ఎద్దులు దండగైపాయ!" అని ఒక కలగినతడు ఎలుగెత్తి బావి దగ్గర నుండే అరుస్తూంటే-

"రావన్నా! ఈ పొద్దు బాయిలో వంతు పోయ్యిందంటే మళ్ళీ మూన్నాళ్ళకు, ఇప్పిటికే పైరు వరటకపోతా వుండాది. రొండు కుట్లట్లయేసిపో, నీకు దరమ్ముంటుంది" అని యింకొక్క రైతు అడుక్కుంటూంటే-

"ఇంత మంది ఇంటి చుట్టూ సేరి అరస్తావుంటే సెవల్లో పెట్లేవన్నా మొలిపినాయా! మొగోడి కింత పాలుమాలిక పనికిరాదు! పాలుమాలితివా బయిసారితివా? అంటారు పెద్దోళ్ళు లెయ్! లెయ్యా!' ' అని రాముడి పెళ్లాం లచ్చివి పోరుపెడుతూంటే-

"దినవూ సచ్చేవోడికి యేడ్చేవోళ్ళవురాసే! సాలుగానుండు?" అని కసురుతూ లేచిపోతున్న లచ్చివిని ఒక చేత్తో పొదివిపట్టుకుని మలికోడి కూసే వేళకాడ నులక మంచం మీద వత్తిగిలి పడుకునే రాముడు తొలి కోడి కూతకు ముందే ఇలా బావి బావి దగ్గర కరెంటు మోటర్లతో కలబడుతున్నాడంటే నా సందేహానికి సమాధానం దొరకలేదు.

అదే ఆలోచిస్తున్నాను!

అంతోనే కానబావి పంపుపెట్టు దగ్గర కరెంటు దీపం వెలిగింది. ఆదిరిపడ్డాను. అసలు నేను వచ్చిన పని మరిచి దారిన పోయ్యే జగడం ఇంటి దాకా అన్నట్లుగా రాముడిని గురించి ఆలోచిస్తున్నాను.

ఎవరో ఎప్పుడో ఉద్యోగం పురుష లక్షణ మన్నారు. ఇప్పుడా మాటంటే పైట కొంగు చెరగు తీసి నడుముకు బిగించి 'ఏదీ! ఇంకొక్క సారి అనండి ఆ మాట చూద్దాం' అని సవాల్ చేస్తారు సోదరీమణులు. ఆ రోజుల్లో ఈ మాత్రం ఎదిరించేవాళ్లు లేరు కాబట్టి ఈ పురుషుడికి ఉద్యోగ ప్రాప్తి జరిగింది. దాంతో పుట్టి పెరిగిన వూరు విడిచిపెట్టవలసి వచ్చింది.

ఊరుగాని వూళ్ళల్లో ఉద్యోగ బాధ్యతలు, పిల్లల చదువులు, ఆర్థిక ఇబ్బందులు, 'ఆ పల్లెటూళ్ళో పొద్దు పొమ్మన్నా పోదు' అన్న శ్రీమతిగారి ముద్దు ముద్దు మూతి విరుపులు ఏ మూడు నాలుగేళ్ళకో ఒక సారి కానీ మా వూరికి రావడానికి వలనుపడేది కాదు.

నేను వచ్చి నాలుగు రోజు లయింది.

"ఒరే అబ్బోడా! ఈ కరెంటు రానన్నా వచ్చింది. కానీ దినవూజాగారవయి పొయ్యిందిరా బతుకు. ఎప్పు డొస్తుందో. ఎప్పుడు పోతుందో? ఆ కరెంటు యిడిసిపెట్టే వోడికి కూడా తెలివి యేడ్చేటట్టుగా లేదు. ఈ పూటట్టమడికి తడేసి రార్రా?" అన్నాడు పాలుమాలిన మా అయ్య.

నిజమే! ఆపల్లెల్లో కరెంటులేని దినాల్లో రైతు జీవితం నియమబద్ధంగా కొనసాగేది. ఎప్పుడు మోట కట్టితే ఎంత పారుదల జరుగుతుందో అతడికి తెలుసు. అందుకే అనుకున్న వేళకే లేచేవాడు అంతవరకు ఆదమరిచి నిద్రపోయ్యేవాడు. అతడు నిద్రలేచేది తొలికోడి కూసే వేళకాడ కావచ్చు. మలికోడి కూతవేళ కావచ్చు. ఎండ చల్లబడినాక నాలుగు బార్ల పొద్దు కూడా కావచ్చు. కాని ఇప్పుడతనికి ఆయోమయస్థితి ఏర్పడింది. కంటికి వత్తి వేసుకుని రాత్రంతా జాగరణ చేయవలసిందే!

లేకుంటే చేతికి వచ్చిన పైరు నోటికందదు.

నిజంగా సిగ్గు పడవలసిన విషయం. రైతు దేశానికి వెన్నెముక వంటివాడు. వాడు మేడి పట్టకపోతే దేశం 'ఆకలితో' అల్లాడిపోతుంది. అయితే పెద్ద పట్టణాల్లో పెద్ద పెద్ద మనుష్యులకు ఒంటి మీద చెమట పడుతుందని, పెద్ద పెద్ద మనుషులకు ఒంటి మీద చెమటలు పట్టడం దేశానికి క్షేమకరం కాదనీ తలపోసిన ప్రభుత్వం 'ఎర్‌కండిషన్ల'ని ఎలెక్ట్రిక్ ఫ్యాన్లని ఎడతెరిపి లేకుండా పనిచేయిస్తూ ఉంది. రైతును మాత్రం చిన్న చూపు చూపింది.

ఆలోచించుకుంటూ మా బావి దగ్గరికి చేరాను.

మీటనొక్కాను. పాతాళగంగ ఉరుకులు పరుగుల మీద పంపు ద్వారా పైకి వచ్చి పడుతూ ఉంది. కాలువలో వయ్యారాలు పోతూ సాగిపోతూ ఉంది. తెల్లటి నురుగులు కక్కుతూ సన్నటి కాలువలో వయ్యారాలు పోతున్న జలకన్య కోప మొచ్చిన నాగకన్యను తలపింప చేస్తూ ఉంది. మడవ అడ్డు తిప్పి మడికి నీళ్ళు పెట్టాను. ఆ కయ్య పారేదాక చేయవలసిన పనంటూ ఉండదు.

మళ్ళీ మాదిగ రాముడిమీద ముసురుకొంటున్నాయి ఆలోచనలు.

ఆ నాలుగు పల్లెల్లో ఒక వంద కడపకు పైగా ఉంటుంది. అందులో మూడుం ముప్పాతిక అంతో ఇంతో బావుల కింది సేద్యంతో బ్రదికే వాళ్ళే వీళ్ళందరికీ రాముడు లేకుంటే దినగండం నూరేండ్లాయుస్సు!

మలికోడి కూసే వేళ కాడ మత్తుగా నిద్రలేస్తాడు. రాముడు గుక్కెడు నీళ్ళు నోట్లో పోసుకొని పుక్కిలించి ఉమ్మేస్తాడు. ముంతడు నీళ్ళతో మూతి తుడుచుకొంటాడు. సంచి భుజాన తగిలించుకొని బయలు దేరతాడు.

రాముడు ముందు పోతూంటే కనీసం ఇద్దరు ముగ్గురు రైతులు వెంట పడవలసిందే!

ఆ నాలుగు పల్లెల కింద ఉన్న నలభై బావుల దగ్గరికి విధిగా వెళ్ళతాడు రాముడు. ఒక బావి దగ్గర అడ్డానికి చినిగిన తొండానికి కుట్లువేస్తాడు. మరొక్క బావి దగ్గర చిల్లులు పడ్డ బానను సరిచేస్తాడు. ఇంకొక బావి దగ్గర తొండానికి 'ఉంగటాలు' తెగిపోతే కుట్టతాడు. అంతలో ఇంకొక్క బావి దగ్గర నుండి పిలుపు వస్తే వెళ్ళతాడు. మిట్ట మధ్యాహ్నం వరకు ఆ బావి దగ్గర నుండి ఈ బావి దగ్గరికి, ఈ బావి దగ్గరి నుండి ఆ బావి దగ్గరికి నిలిచిన చోట నిలువకుండా తిరుగుతూనే ఉంటాడు.

సద్ది వేళకు ఎక్కడో ఒక బావి దగ్గర ఎవరో ఒకరు అప్యాయంగా సద్ది పోస్తే తాగుతాడు. ఒక బావికింద మిరప తోటలో అన్ని మిరపకాయలు మరొక్క బావికింద వంగ తోటలో కాసిన్ని వంకాయలు - గీత చక్కనైన రాముడి చేతికందుతాయి. మూట భుజాన వ్రేలాడుతూంటే పొద్దు నడినెత్తి కెక్కేటప్పటికి ఇంటి ముఖం పడతాడు.

నాకు బాగా జ్ఞాపకముంది. అవి నా చిన్న నాటి రోజులు. చెప్పులు తొడుక్కుని నడవడమంటే ఏనుగు నెక్కినంత సంబరం. అముచ్చట కాస్త తీరాలంటే రాముడే శరణ్యం కాళ్ళరిగేటట్లు ఎన్ని సార్లు తిరిగానో రాముడింటి చుట్టూ!

ఒకసారి వెళ్ళితే రెండు ముద్దలు బెల్లం తెమ్మనేవాడు. బెల్లానికి మంచి ధర పలికే వరకు సాధారణంగా అంతవరకు బెల్లాన్ని నిలువ చేస్తుంటారు.వెదురు బొట్టల్లో నింపి పైన దట్టంగా

వరికసవు పరచి దానిపైన దిట్టంగా పేడతో అలుకుతారు. ఇక ఆ 'సీలు' ను విడతీయం తరము కానిపని. కానీ ఇంటివాడుక కని కొంత బెల్లాన్ని కడవల్లో దాచి దొంతరలు పెడతారు. అమ్మ కంట బడకుండా ఆ బెల్లం ముద్దలు రాముడికి చేరవేయడం- అబ్బో! తలచుకొంటే గుండెలు జలదరిస్తాయి. బెల్లం ముద్దల్ని ప్రీతిగా అందుకొన్న రాముడు 'రేపొచ్చెయ్?' అంటాడు. ఆ మరుసటి రోజు వెళ్ళితే - నా చెప్పులకు వాడబొయ్యే చర్మాన్ని దాని మన్నికను అనర్గళంగా వివరిస్తూ ఎట్లయినా ఒక వీసెడు ఎర్రగడ్డలు తెమ్మనేవాడు. అవి కూడా అందచేసి ఎంతో ఆశగా ఆ మరునాడు వెళ్ళితే - 'అబ్బ తోడు పిన్నబ్బా! పులుసులో కంత చింతపండు లేదు. ఒక్క పరుగులో వచ్చెయ్! ఇక చూసుకో, రేపొద్దున్నె నీ సెప్పులు నిగనిగలాడుతా ఉంటాయ్!'' అనేవాడు.

నిజంగా జత చెప్పులు కోసం వాడు పెట్టిన తిప్పలు తలంపుకువస్తే ఇప్పటికీ నాలో నేను నవ్వుకొంటుంటాను.

ఇక ఫలితకాలం వస్తే రాముడు వాడి పెళ్ళాం లచ్చివి ఇద్దరు కళ్ళాల మీద పడేవాళ్ళు. కళ్ళాల్లేనిగుర్రాల్లా వయ్యారమే వగలు పడుతున్నట్లు ఏ కళ్ళం దగ్గర చూచినా వాళ్ళుగానే కనుపించేవాళ్ళు. రాముడు వృత్తికి బదులుగా ఫలితకాలంలో 'మేర' ఇస్తారు. ఆ'మేర' వసూలు చిత్రంగా ఉంటుంది. దానికి కొలత లేదు. తూనిక అసలే ఉండదు. వాళ్ళు మొయ్యగలిగినంత మోసుకొని పోవచ్చు. నెత్తి మోతకుమించినట్లుగా వాళ్ళ నెత్తికెత్తి మొయ్యలేక వాళ్ళ నడ్డి నీలుగుతూంటే రైతులు ఆనందంలో వూగిపోయేవాళ్ళు.

రాముడి జీవితం ఆ పల్లీయుల జీవితాలతో ముడిపడి ఎంతో ముచ్చటగా కొనసాగుతూ ఉండేది.

అలాంటి రాముడి ప్రవర్తన ఎంతో వింతగా తోచింది.

కరెంటు మోటారు 'గీ' పెడుతూనే ఉంది. గుక్క పట్టిన ఎలుగు బంటిలా. పాతాళగంగ పైకొచ్చి పడుతూనే ఉంది. ఒక కయ్య పారితే మరో కయ్యకు మడవ తిప్పి నీళ్ళు పారిస్తూనే ఉన్నాను. వీటితో కలిపి రాముడి మీది ఆలోచనలు కూడా సాగుతూనే ఉన్నాయి.

తూర్పున పటమెగురుతూ వుంది. ఊరి ముందర చింత చెట్ల మీద కాకులు గోల చేస్తున్నాయి. కాన బావి కానుగచెట్టు మీద కొంగలు నిమ్మ ళంగా పై కెగురుతున్నాయి. పొలాల్లో అప్పటికే మడకలు కట్టిన రైతులు ఎద్దుల్ని అదిలిస్తున్న అరుపులు చెవిని పడుతున్నాయి. కడపటి కయ్యకు నీళ్ళు బెట్టి నీళ్ళు కలుసుకొన్నాయో లేదో? అవి నాలుగు మూలలు చూడడానికి గనిమల మింద నడుస్తున్నాను. 'టపీమని ఆగిపోయింది కరెంటు, మరో పది నిముషాలు కరెంటు ఉండి ఉంటే కయ్య కలకలుసుకునేది. అదెప్పుడొస్తుందో ఎప్పుడు పోతుందో తెల్సురా? అన్న మా అయ్యమాటలు నాకప్పుడు బాగా అర్థమయ్యాయి.

ఇంటికి వచ్చి అలా నడుం వాల్చానో లేదో రాత్రంతా నిద్రలేని కారణంగా బాగా నిద్రపట్టింది.

"ఒరే! అబ్బోడా! ఒక రాత్రికే యియ్యవరదాకా నిద్రబోతే యింక బతుకులు తెల్లారినట్టే! లెయ్‌రా! లెయ్!" మా అయ్య అన్న మాటలతో ఎగిరి పడి లేచాను. లేచి చూస్తే అప్పటికే నాలుగు బార్ల పొద్దెక్కింది.

గబగబ నాలుగు ముంతల నీళ్ళతో ఒళ్ళు కడుక్కొన్నాను. గడ్డ పెరుగుతో అమ్మ పెట్టిన అంత సద్దిబువ్వ తిన్నాను. నేను వచ్చి అప్పటికే నాలుగయిదు రోజులయినా కూత దూరంలో ఉన్న

నాచిన్ననాటి మిత్రుణ్ణి చూడడానికి వలనుపడలేదు. అందుకే బయలుదేరాను.

మా వూరికీ ఆ వూరికీ మధ్య దూరం మూడు కిలోమీటర్లకు మించదు.

ఒకప్పుడు అది బండి బాట!

ఎగుడు దిగుళ్ళతో మిట్టా పల్లాలతో ముండ్ల పొదలతో నిండి ఉండేది. కాలుదీసి కాలుబెట్టడమంటే మహా యాతనగా ఉండేది. ఇప్పుడా ముళ్ళపొదలన్నీ కొట్టిపారేశారు. ఈ పక్క ఆ పక్క మట్టిని కొట్టిపోసి మిట్ట పల్లాలను చదును చేశారు. ప్రభుత్వం చేపడుతున్న గ్రామాభివృద్ధి కార్యక్రమాల ఫలితం కాబోలు! అని ఆలోచిస్తూ ఆ బాటమీద నడుస్తున్నాను.

"ఏం పిన్నబ్బా?... ఎప్పుడొచ్చింది?... అంతా బాగుండారా నాయనా?"

మాట చెవిని బడడంతో నిలబడి'ఎవరా?' అని కలయజూశాను.

ఎదురుగా మాదిగ రాముడు.

నెత్తి మీద మట్టితట్ట ఉంది. వళ్ళంతా పుల్లదుమ్ము నిండుకొంది. మొగంలో మునుపటి కళ వెతికినా కనిపించడం లేదు. బుగ్గలు సొట్టబడ్డాయి. కండ్లు బాగా లోతుకుపోయి నిరాశా నిస్పృహలకు ఆశ్రయమిస్తున్నాయి.

కాసేపు కన్నార్పకుండా ఆశ్చర్యంగా వాడివైపు చూస్తూ నిలబడిపోయాను. నా ఆశ్చర్యం రాముడికి అర్థమయినట్లుంది.

"ఏం జెయ్ మంటారు సెప్పండి సావీ?.... ఈ కరెంటు రానన్నా వచ్చింది. మోట కట్టే నాధుడే లేకపాయ... మా బతుకు లిట్లా మట్టి పాలాయ. ఇంటిల్లిపాదీ సచ్చీ సెడి సందేళదాక ఈ మట్లో పొరకలాడితే పొట్ట కంత గెంజి దొరికేది గెగనవైపోతా వుండాది. పోయ్న రోజు లింగ రాబొయ్యేది లేదు నాయనా?"

రాముడి గొంతు పూడుకు పోయింది.

అప్పుడర్థమయింది నాకు - కరెంటు మోటార్ల మీద వాడి అక్కసు!!

కడపదాటి కాలట్లా పెట్టని రాముడి పెళ్ళాం లచ్చివి పారతో మట్టిని తట్టల కెత్తుతూ ఉంది. పెండ్లికి ఎదిగిన ఒక కుర్రవాడు గడ్డపారతో మట్టిని పెళ్ళగిస్తున్నాడు. వాడికంటె ఒకటి రెండేళ్ళు చిన్నదిగా ఉండవచ్చు. ఇంకొక అమ్మాయి రాముడితో కలిసి మట్టి మోస్తూ ఉంది. బహుశా వాడి బిడ్డలేమో?

సముదాయింపుగా రాముడితో రెండు మాటలు పలకదామనుకున్నాను.

"ఎవుర్రా అక్కడ మీటింగి పెట్టింది?... మాదిగ రావుడేనా? నాకు దెల్సు? వాడెప్పుడూ అంతే?' పనికి ఆహార పథకంలో ఆ మట్టి బాటను వేయిస్తున్న కాంట్రాక్టరు గోలపెడుతున్నాడు.

"గెంటల తరబడి యింటి ముందర నిలబెట్టి రైతుల్ని అవ్వి ఆ రోజులు. ఇప్పుడు నిమిశం నిలబడితే ఆ అయ్య కసురుకుంటుంటాడు ఇవి ఆరోజులు ఏంజేద్దాం బాబూ ! వస్తా" అంటూ రాముడు తన పనిలో తాను లీనమయ్యాడు.

"ఎవురక్కడ మీటింగు పెట్టింది? మాదిగ రావుడేనా?" అన్న కాంట్రాక్టరు మాటలు సూటిగా

నా గుండెల్లో దిగాయి. అడుగు మందకొడిగా ముందుకు పడింది.

రాముడి వృత్తి మారింది.

అయినా వాడు యింకనూ మాదిగ రావుడే!

ఒకప్పుడు వృత్తులకోసం కులాలు ఏర్పడ్డాయి. మారుతున్న సమాజంలో మీరిపోతున్న నాగరికతలో వృత్తులు అడుగంటి పోతున్నాయి అయినా కులాలు మాత్రం నిలబడిపోయాయి.

ఆలోచిస్తూ వూరి ముందరికి వచ్చాను.

ఊరి వెల్లువ పారి సారవంత మయిన పొలాలు సస్యలక్ష్మి సయ్యాటలో కనుల పండువగా ఉన్నాయి. ఆ పొలాల మధ్య నిటారుగా నిలబడి ఉన్నాయి. సర్వే రాళ్ళు ఈ సర్వే రాళ్ళనే 'నెంబర్రాళ్ల' అంటాడు ఇది నా పొలం అది నీ పొలం!!" అని హద్దులు నిర్ణయించేదీ నెంబర్రాళ్ళే.

ఈ నెంబర్రాళ్ళు పొలాలను వేరు చేస్తున్నాయి.

కులాలు మనుష్యులను వేరు చేస్తున్నాయి!!!

"ఈ నెంబర్రాళ్ళే లేకపోతే" నా మనస్సులో పొడసూపిన సందేహానికి సమాధానంగా యేమో నెంబర్రాళ్ళు విరగబడి నవ్వుతున్నట్లున్నాయి.

- ఆంధ్ర ప్రభ (11-6-80)

# 16 చీకటి నాడీ - వెలుగు నెత్తురూ

## కేతు విశ్వనాథరెడ్డి

రామిరెడ్డి సాయంత్రం తన పొలాలవైపు బయలుదేరాడు. మధ్యలో యెవడి పొలమూ అడ్డూ ఆపూలేని, తన తొంభై యెకరాల మాగాణిని అటూ ఇటూ కలయచూస్తూ వరిమళ్ళ మధ్యగా వెలుతున్నాడు.

సారవంతమైన మట్టీ, నీళ్లూ, యూరియా కలిసిన వాసనను మోస్తున్న సాయంత్రం గాలి. ఆ గాలిలో పచ్చని కొత్త పట్టుచీరలు ఆరేసినట్టు కయ్యల్లో వరిపైరు.

గాలి వాసన ఎట్లున్నా, పైరుగాలి శబ్దం మాత్రం రామిరెడ్డికి కొత్తనోట్ల కట్టల్లోని నోట్ల రెపరెపల్లాగ వుంది. వరిపైరు కాపురానికి వచ్చిననాటి తన భార్యలాగా మోహనంగా కన్పించింది. నిండుగా యే వెలితీ లేకుండా సాగిపోతున్న తన కాపురంలా తోచింది.

మడవ కడుతున్న పుల్లన్న దగ్గరకు వచ్చి రామిరెడ్డి నిల్చున్నాడు. యాభైయేళ్ళ నుంచి అలవాటయిన చేతులతో పుల్లన్న యాంత్రికంగా మడవకడుతున్నాడు. పుల్లన్న పని హుషారునూ, సేవాధర్మాన్ని రామిరెడ్డి మెచ్చుకోకుండా వుండలేకపోయాడు.

"అందరూ నీలాగా వొళ్లొంచి న్యాయంగా పనిచేసేవాళ్లయితే బాగుండురా. యీ రోజుల్లో నీతిగా కట్టుబడి పనిచేసే వాళ్ళు తక్కువైపోతున్నారు".

పుల్లన్న తన పనిలో మునిగి బదులుపలకలేదు.

"సరేగానీ, అకుతోట దగ్గర యెవరున్నారు?" రామిరెడ్డి అడిగాడు.

"తలారి వెంకయ్య కొడుకు తిరుపతయ్య వుంటాడనుకొంటా సామీ!"

"వాడు పరవాలేదురా. పదో తరగతి దాకా చదువుకున్నా, వాళ్ల నాయన మాదిరే మంచి విశ్వాసం వానికి."

రామిరెడ్డి తన యింట్లో, పొలంలో పనిచేసే విశ్వాస జీవులందరినీ తలుచుకొంటూ ఆకుతోటవైపు నడిచాడు.

తన కింద పనిచేసే వాళ్లెవరూ తన ముందు నోరెత్తరు. నమ్మకంగా పనిచేస్తారు. తను యెంత చెపితే అంత, కూలి విషయంలో కూడా అంతే. అంతెందుకూ, యాభైయేళ్ళ నుంచీ పుల్లిగాడు మడవకట్టుకూలీగా తన దగ్గర పడివున్నాడు. తన పెత్తనానికి వచ్చినప్పటినుంచీ వాడికి

తిండీతిప్పలు పోను మొదటి పంటకు పెట్టుడు. రెండు పంటకు యిరవై అయిదు శేర్లు వడ్లు యిస్తున్నాడు. పుల్లిగాడు 'లెక్క చూసి నాకు రావాల్సిదేదో యియ్యండి' అని వొక్క మాటు అనలేదు. వాడికి అవసరమైనపుడు బేడా పరకా తనిస్తున్నాడు. వాడు పని చేస్తున్నాడు. పుల్లిగాడు కాదు. అందరూ అంతే.

రామిరెడ్డి ఆకుతోటకు అనుకున్న సత్రం - తండ్రి సమాధి మిద్దె - దగ్గరకు వచ్చాడు పైకి చూస్తూ అనుకున్నాడు :

'ఇంకా గంటన్నర పొద్దుదాకా వున్నట్లుంది - నాయన సమాధి మీద దీపం ముట్టించడానికి చమురుందో లేదో జ్ఞాపకం లేదు. లేకుంటే తిరుపతి గాణ్ని పంపించవచ్చు...'

తండ్రి స్మృతులతో రామిరెడ్డి సత్రంలోకి వెళ్లబోతున్నాడు. సమాధి వున్న చోటు నుంచీ గాజుల చప్పుడూ, ఆడా మగా నవ్వులూ విన్పించాయి.

ఆ క్షనాల్లో తన విశ్వాసాలూ, నీతీ, ధర్మదృష్టీ ఒక్కసారి నేలమట్టమయినట్లు రామిరెడ్డికి అన్పించింది. తన కళ్ళ యెదుటే తన జీవిత కాలంలో యెన్నడూ జరగని ఘోరం, తన తండ్రి సమాధి దగ్గర జరిగి పోతోందని అనిపించింది. రక్తపు పోటు హెచ్చింది.

మనసు లోంచి కేక బయటకు వచ్చేలోగా, తిరుపతయ్యా, వెంటమరెవరో పిల్లా బయటకు వచ్చారు. ఆ పిల్ల జుట్టు ముడి వేసుకుంటోంది. చీరె మడతలు సరిచేసుకుంటోంది. బయట రామిరెడ్డిని చూస్తూనే తిరుపతయ్య గుండెకాయ గొంతులోకి వచ్చింది. అంతే ! అక్కడ వొక్క క్షణం నిలువలేదు. పొలాల్లో అడ్డంపడి పరుగు లంకించుకున్నాడు.

" థూ! పిరికి నా కొడుకు..."

విన్పించీ విన్పించనట్టు అన్న ఆ పిల్లను రామిరెడ్డి చూశాడు. ఆ పిల్ల ఎర్రగా, సన్నగా, పొడుగ్గా వుంది. మాసిన బూడిదరంగు చీరలో నిప్పులా వుంది. రామిరెడ్డి కళ్లల్లోకి చూసింది. ...రెడ్డి కళ్ళు దించుకున్నాడు. ఏమీ జరగనట్లే నెమ్మదిగా వెళ్లిపోతోంది.

రామిరెడ్డిలో అసహ్యం, కట్టలు తెంచుకోబోతున్న కోపం, దాష్టీకం!

"ఆగు."

ఎర్రపిల్ల ఆగింది. వెనక్కి తిరిగి 'యేం'? అన్నట్లు రామిరెడ్డిని చూసింది. రామిరెడ్డికి ఆడవాళ్ళను కొట్టే అలవాటే వుంటే ఆ యెర్రపిల్ల అక్కడ చచ్చివుండేది. పురుగును చూసినట్లు చూస్తూ -

"యెవరు నువ్వు?" అన్నాడు.

"మల్లమ్మ కూతుర్ని" సుబ్బుల్ని.

'యే మల్లమ్మ?' అని రామిరెడ్డి అడగబోయేంతలో యెవరో అటువైపు వెళుతూ కన్పించారు. రామిరెడ్డి సుబ్బులుతో మాట్లాడటానికి జంకాడు. సుబ్బులు సాగిపోయింది.

సత్రం అరుగుమీద కూచుని జరిగినదానికి రామిరెడ్డి తల్లడిల్లిపోయాడు. మంచివాడనుకున్న తిరుపతయ్యగాడు బరితెగించి, అదీ సత్రంలో ....

రామిరెడ్డి ఆలోచించలేకపోయాడు. అదే యిరవైయేళ్ళ కిందట అయి నట్లయితే వాడి వెంటబడి తరిమి తరిమి పట్టుకొని కాళ్ళు విరగగొట్టి ఉండేవాడు.

"యిప్పటి రోజులంత మంచివి కావు. యిప్పుడు పంచాయితీ పెట్టించి తప్పు వెయ్యాలి నా కొడుక్కు. జీతం బత్తెం లేకుండా తనింట్లో రెండేండ్ల చాకిరీ చెయ్యించుకోవాల. నీతిలేని లంజకొడుకు అనుకున్నాడు.

ఈ చిల్లర జనం వల్ల తనకు తిట్లు అలవాటవుతున్నాయి. నోటిని అదుపులో పెట్టుకోవాల. మనసు దాదాపు తన అదుపులో వుంది. నోరు, మనసు మనిషి శత్రువులు అని 'బాబా' అంటాడు.

రామిరెడ్డి తన కోటలాంటి తన యిల్లు చేరుకున్నాడు.

ఆ రాత్రి వెంకయ్యను పిలిచి చుట్టుపట్ల యెవరూ ఉండవద్దని శాసించాడు. తలారి వెంకయ్య గుండె భయంతో పీచుపీచు మంటోంది. మనిషిని వొంటరిగా పిలిచాడంటే యేదే కొంప మునిగిందన్న మాటే! సాయంత్రం కొడుకు తిరుపతయ్య అన్న మాటలు వెంకయ్యకు జ్ఞాపకం వచ్చాయి.

'నాయనా! నేను పేటకు బోతున్నా.. యిప్పట్లో వస్తానో రానో! పెద్దరెడ్డి నన్నిప్పుడు చూస్తే యేం జేస్తాడో యేమో!' అని వెళ్ళిపోయాడు.

వాడు చేసిన తప్పేమిటో తనకు చెప్పలేదు.

వెంకయ్య భయం భయంగా రామిరెడ్డి ముందు నిల్చున్నాడు. రామిరెడ్డి. గ్రామ మునసబు ధర్మపీఠం దగ్గర బాచికంపట్టు వేసుకొని నెమ్మదిగా చెప్పాడు.

"వోరే వెంకడూ! యిన్నేండ్ల నుంచీ నువ్వున్నావు, నేను వూరికి రెడ్డిని నువ్వ తలారోడివి. నా సంగతి నీకు తెలుసు. పెండ్లి కాకముందు నేనెన్నడన్నా వొక్క ఆడదాని జోలికి పోయినానా? యింత ఆస్తి వుంది. యీ ఆస్తి నాలుగు తరాల తిన్నా తరగదు. నేను మనసు పడితే యెవరూ దొరకరా? కానీ అది నీతి కాదు. మా రెడ్డోరి కుటుంబం నీతి కాదు. మా నాయన శ్రీరామచంద్రుని మాదిరి వొకే మాట, వొకే ఆడది. నేనూ అంతే. పెండ్లి అయినాక కూడా రెడ్డెమ్మను తప్ప పరాయి ఆడదాని మొగం చూసినానా? యిప్పుడంటే రోజులు మారిపోయి గానీ, మొన్న మొన్నటి దాకా వరినాట్లప్పుడు, కోతలప్పుడు, ఆకుకోతలప్పుడు, నా యెదురుగ్గా ఆడా మొగా యిక యికలూ పకపకలూ యెప్పుడన్నా చూసినావా? మనూళ్లో పాతకాలం పెద్దోళ్ళు చెప్పినట్లు నేను యీ కాలంలో తప్పపుట్టినోన్నే. నాకు తగుడంటే రోత, యింతవరకు యీ వూళ్ళో తాగి, నా ముందు వచ్చినిలబడినవాణ్ణి చూసినావా? అంత పెద్ద వుద్యోగాల్లో వున్నారు నా కొడుకులు. 'పెద్దోడు మెడికల్ కాలేజిలో ప్రొఫెసరు, రెండో వాడు డి.యి.వొ మూడో వాడు దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు. నాలుగో వాడు డాక్టరు.. అందరికీ పెండ్లిండ్లు అయినాయి. పిల్లా జెల్లా వున్నారు. యేనాడన్నా నా యెదురుగ్గా సిగరెట్లు తాగినారా? పోనీ, వాళ్లెప్పుడన్నా కాలేజీ రోజుల్లో యింటికి వచ్చినప్పుడు కూడా చిల్లర మల్లర పనులు చేసినారా?.. యీ పొద్దు నీ కొడుకు నా కళ్ళ ముందరే అది సత్రంలో ... మా నాయన సమాధి వున్న సత్రంలో వొక పిల్లతో... వాడి పాపాన వాడుపోతాడు. కానీ, యీ తప్పకు నేనూరుకోను... పెద్ద పంచాయితీని నిన్ను చూసి పెట్టటం లేదు. వాడికి రెండేండ్లు జీతం లేకుండా తప్పువేస్తున్నా.. యేమంటావు?. నలుగుర్లో పంచాయితీ పెట్టమంటావా?'

రెడ్డి చెప్పిన వాక్యం విని తలారి వెంకయ్య యేడుస్తున్న ధోరిణిలో విన్నవించాడు :

"ఆ తప్పుడు నా కొడుకు సేసింది అదా? యేమో అనుకున్నా. బయపడి వూరిడిసి పోయినాడు.'

వెంకడు మాట విని రామిరెడ్డి గర్వించాడు. తిరుపతయ్య తప్పు తప్పించుకున్నందుకు చింతిచాడు. :

'సరే, అయిందేదో అయింది. వాడెక్కడున్నా పిలిపించు. తప్పు మాత్రం తప్పదు. ఆ పోరంబోకుది యెవరు? మల్లమ్మ కూతురంట! యే మల్లమ్మ?"

"పేట మల్లమ్మ, మాదిగిండ్లలో వుండే, మనకూ కూలికి వస్తుంది - అది."

"ఆ కంపు నోరుదా? యెంత తోస్తే అంత మాట్లాడేది? దాంతో యేమిలే. మగనా కొడుకు నీతి మంతుడైతే అడదేం చేస్తుంది? నువ్వు యింటికి పో.."

తలారి వెంకయ్య "యిప్పటికి బతికినాంరా సామీ,' అనుకుంటూ బయటికి నడిచాడు.

రామిరెడ్డి మనసులో పేట మల్లమ్మ మెదిలింది.

వొకమారు తన తమ్ముడి పొలాల దగ్గర తమ్ముడితో యేదో మాట్లాడుతున్నాడు. కూలోళ్లంతా వరినాట్లకు వంగినారు. పేట మల్లమ్మ ఆలస్యంగా వచ్చింది. తమ్ముడు తన మామూలు ధోరణిలో 'నీయమ్మ.. ' అంటూ తిట్టాడు. తనకా తిట్లు రావు. ఆ తిట్లు వినటం యిష్టం లేక తను తిరిగి వస్తున్నాడు. వెనక ఆ పేట మల్లమ్మ మాట విన్పించింది - మా అమ్మెదుకూ నేనున్నే' అని... ఛీ ఛీ... అట్లాంటి నీతి జాతి లేని దాని కూతురు.. యెర్రమూతి అదీ... దారి జోలికి పోవటం పనికిమాలిన పని. కానీ సమయం దొరికినప్పుడు యిరికించు కోవాలి. మరీ యిటీవల యీ మాదిగోళ్ళు పెట్రేగిపోతున్నారు - పుల్లిగాడులాంటి వాళ్ళు వొకరో యిద్దరో తప్ప.....

రామిరెడ్డి సుబ్బుల్ని ఆరోజు క్షమించటానికి ప్రయత్నించాడు.

రెండు నెలలు మించి రోజులు గడిచిపోయాయి. తిరుపతయ్య యెక్కడికి వెళ్ళాడో జాడ తెలియలేదు. తలారి వెంకని దగ్గర ఆ తప్పు యే విధంగా వసూలు చేయాలో అర్థంకాక, వెంకయ్య తన దగ్గర తీసుకున్న బాకీ బాపతు వడ్డీని రామిరెడ్డి పెంచాడు. వెంకయ్య కిమ్మనలేదు.

ఆ రోజు వెన్నెల రాత్రి. వెన్నెల్లో రెడ్డేరి రామిరెడ్డి యిల్లు సముద్ర మధ్యంలో రతనాల దీవిలాగా వుంది. వరండాలో జగితిమీద రామిరెడ్డి వుల్లాసంగా కూచొని మనసులో వడ్డీవాసీ, లెక్క పత్రం, పూరువాడా, పిల్లాజెల్లా, కలగాపులంగా రంగురంగుల బొమ్మల్లో వూహాచిత్రాలు గీస్తున్నాడు. రెడ్డికి కాసింత దూరంగా నేలమీద పుల్లన్న గొంతుకూచొని రెడ్డి పలకరింపుకోసం అరగంటనుంచీ ఆరాటంతో యెదురు చూస్తున్నాడు.

రామిరెడ్డి బొమ్మల లోకంనుంచీ బయటపడి పుల్లన్ననుచూశాడు :

"యేరా? అన్నాలూ అవీ అయినాయా?"

"అయినాయి సామీ..."

"మరింకేం?"

"వొక అయిదునూర్లు లెగ్గ కావాల సామీ!" యేదో తప్పిదం చేస్తున్న వాడిలా పుల్లన్న పస్తాయిస్తూ అడిగాడు.

"యెందుకూ?" అంటూ రామిరెడ్డి బోధ మొదలు పెట్టాడు.

"వొరేయి యెప్పుడూ డబ్బు డబ్బేనా? మీకు యెద్దులకు పుటిక మేత అందించినట్లు రూపాయలు అందివ్వాలంటార్రా. యెప్పుడూ డబ్బాకలే. అయినా యిప్పడేమొచ్చింది?"

"పిల్లకూ, పిల్లోనికీ పెండ్లి సామీ!"

"సమ్మందాలు కుదిరినాయా?"

'పిల్లను మన పక్కూరి నర్సిమ్ములు గాని కొడుక్కు యిస్తున్నాం సామీ. పిల్లోనికి మల్లమ్మ కూతురు యెఱ్ఱసుబ్బుల్ని నిచ్చితం సేసుకున్నాం."

మల్లమ్మ కూతురు యెఱ్ఱసుబ్బులంటూనే రామిరెడ్డి కళ్ళల్లో ఆకుతోట సత్రం దృశ్యం మెదిలింది. కాస్త కటువుగానే అన్నాడు :

"మంచీ చెడ్డా తిలసేనా?"

పుల్లన్న సూటిగా సమాధానం చెప్పకుండా అన్నాడు :

"మా యిండ్లల్లో యేవో జరుగుతుంటాయిలే సామీ. పిల్లోడు మనసుపడి మొండికి కూచున్నాడు."

పుల్లన్న సమాధానం విని రామిరెడ్డి - 'చిల్లర జనం. యెట్లాన్నా చావనీ, తనకు అక్కరకొస్తే చాలు' అనుకున్నాడు.

"సామీ!"

"యేరా?"

'అదే సామీ.. లెక్క వొక అయిదునూర్లు..."

"నా దగ్గర నీ బాపతు లెఖ్ఖేమీ లేదు కదరా. నువ్వు యింకా వెయ్యి పైన యివ్వాల్సి వుంటుంది. యేదో నన్ను నమ్ముకొని వున్నందుకు దాని సంగతి యెత్తడం లేదు. యింకెక్కడ నుంచీ తెచ్చేదీ? వూర్లో చిన్న చిన్న రైతులంతా నన్నే చంపుతారు, డబ్బు డబ్బా అని. మీదే సుఖంరా. మిమ్మల్ని అడిగే వాడుండడు."

ఆ మాటలు వింటూంటే పుల్లన్నకు కడుపు మీద కుమ్మినట్లయింది. కాబోయే కోడలు లెక్కలన్నీ కట్టి రెడ్డి తనకే వెయ్యిదాకా బాకీ వున్నట్లు సెప్పిందే అనుకున్నాడు. పుల్లన్న రెక్కల పరిజ్ఞానానికి జమలూ, తీసుకోవడాలూ నిలువ మొత్తాతా తేలలేదు. ' ఆ లెక్కలేవో సెప్పండి సామీ' అని నోటిదాకా పచ్చింది. కాని అడగలేకపోయాడు. నీరసంగా పుల్లన్న ప్రాథేయపడ్డాడు :

"లెక్కలెప్పుడన్నా అడిగినానా సామీ నిన్ను? నీ కాళ్లకింద బతుకుతున్నోళ్ళం. నువ్వు లేదంటే పిల్ల పెండ్లి తప్పిపోతుంది. మా పెద్దరెడ్డి సలవ వల్ల పెండ్లిండ్లు జరిగిపోతాయి అని నలుగురికీ సెప్పుకున్నా సామీ."

"నా సలవ సరేరా. మా తమ్మునింట్లో నీ కొడుకు పనిచేస్తున్నాడు కదా? మా వాడి దగ్గరా యిదే కూతలు కూసీ యెంత గుంజినారు?"

"సిన్నరెడ్డి మున్నూరిస్తా నన్నాడంట సామీ.."

అందరి దగ్గర ముందే అడ్వాన్సులు గుంజేది. పైనుండే వాళ్లెవరో వెట్టిచాకి చేయించుకుంటున్నారనీ కూసేది!"

రెడ్డి కోసం యెవరిమీదో పుల్లన్నకు అర్థం కాలేదు.

"మా బతుకులిట్లా మీ కాళ్ళ దగ్గర గడిసిపోవాల్సిందే సామీ" అన్నాడు.

"నీ లెక్కలో రాసుకుంటాలే. రేపు పొద్దున వచ్చి తీసుకపో."

పుల్లన్న లేచి యింటి ముఖం పట్టాడు. వెళుతూ వెళుతూ అనుకున్నాడు :

ఛ. అనుకున్న దొకటి, జరిగిందొకటి. మూడేండ్లుగా తన మడవ కట్టు కూలీ బాపతు లెక్కలు తేలలేదు. తను అడగలేకపోయినాడు. యెదవ జనమ...

వెళ్ళి పోతున్న పుల్లన్నను చూసి రామిరెడ్డి అనుకున్నాడు :

-తమ్ముడు డబ్బివ్వకుండా వుంటే మెల్లిగా పుల్లిగాని కొడుకును తన పని లోకి లాక్కొంటే సరిపోయేది. మంచి నమ్మకమున్న ముండాకొడుకులు... వీడు మూడు నాలుగేండ్ల కంటే యేం బతుకుతాడు? వీడున్నప్పుడే వాణ్ణి లాక్కొని వుంటే సరిపోయేది.. పడి వుంటారు.

అంతలోనే వాడు లెక్క లడిగి చెప్పమంటే అన్న ఆలోచన, రామిరెడ్డికి కలిగింది. యేం లెక్కలున్నాయి. అంతా నోటిలెక్కలే కదా అని నవ్వుకున్నాడు.

పుల్లన్న యింటికి వెళుతూనే 'ఏమైంది?' అని అడిగేడు పుల్లన్న కొడుకు. పుల్లన్న 'దరమరాజు. . యిస్తానన్నాడు' అని మొదలు పెట్టి జరిగిన విషయం వివరంగా చెప్పాడు.

'సరేలే' అన్నా పుల్లన్న కొడుకు. పక్కన్నే పుల్లన్న చెల్లెలుకు పేలు చూస్తున్న సుబ్బులు 'థూ' అంది.

అబ్బా కొడుకులు సుబ్బులు వైపు చూశారు.

'మీ రాత బాగుంది మూడేండ్ల లెక్కల్లోనే వున్నారు. అయితే బాకీ యెంత తేల్చినాడు? యిప్పుడిచ్చే డబ్బుతో యెంత బాకీ నిలుస్తాది?'

'నేనడగలేదు'

సుబ్బులు మళ్ళీ 'థూ' అబ్బా కొడుకుల కిద్దరికీ సుబ్బులు 'థూ' చెడ్డ అవమానంగా కన్పించింది.

పుల్లన్న కొడుకు - సుబ్బులు కాబోయే మొగుడు - విసురుగా అన్నాడు :

'పేలు చూస్తూ నేనూ 'థూ' అంటాను, రెడ్డేరి ముందు మాట్లాడితే తెలుస్తుంది'.

యెర్ర సుబ్బులు ఫక్కున నవ్వింది. మరదలి తలలో పేను తీసి గోళ్ళతో చంపుతూ :

'అడిగితే యేం, తల దీస్తారా?' అని సాగదీసింది.

'రైతులంతా ఆయన తట్టే తెలుసా?' అన్నాడు సుబ్బులు కాబోయే మొగుడు.

'మరి మనమంతా యెవతట్టు?' సుబ్బులు ప్రశ్నించింది.

'అయితే రేపు పొద్దుననే నడుగుతాను. లెక్కలు సరిగా సూసి యియ్యాల్సిదేందో తేల్చమని,అటు తరువాత పైలెక్క వుంటేరా ాకోమని."

కాబోయే మొగుని ధైర్యాన్ని సుబ్బులుకళ్ళతో మెచ్చుకుంది.

కాబోయే మామనూ, మొగుణ్ణీ సుబ్బులు చెణికింది.

'ఇంత వరకూ గుర్తు కాయితా లేమీ మీ దగ్గర లేవు. అన్నీ నోటిలెక్కలే. వూళ్ళో వాళ్ళు రెడ్డేరి మాటలు వింటారా? మన యేడుపు గుంటి మాటలు వింటారా?'

'అయితే మరేం సెయ్యాల? నువ్వే సెప్పు, పేటలో వుండి వచ్చిందానివి.'

'ముందు మూడేండ్ల నుంచి మనకు రావాల్సిన గింజలను లెక్కగట్టుకోమని అడగండి. ఆ లెక్కలో మనం యెప్పు డెప్పుడెంత తీసుకున్నామో సెప్పి మరీ తీసేయమనండి. యీలోగా యింక కుదరని రేపో మాపో కోత లప్పుడు కూలీ పెంచమని ఆడోళ్ళంతా అడగాలనుకున్నాం. మీలాంటోళ్లందరికీ మీరు సెప్పండి. ఊళ్ళో అన్నిటికీ అడ్డ ముండేది యీయనే. దరమాత్ముడు! యీయన వొప్పుకుంటే వూళ్ళో రైతులంతా వొప్పుకుంటారు. కానీ యీయన సులభంగా వొప్పుకోడంట, వొప్పుకోనని సెప్పడంట. మెత్తగానే కాలికేస్తే మెడకు, మొడకేస్తే కాలికి బందాలు యేస్తాడంట! మొన్న నాగమ్మ సెప్పింది. యెప్పుడన్నా వొక పావలా కూలీ పెంచమంటే అంటాడంటనే : 'వొరేయ్ మీ రడిగేది న్యాయమే. నేనో, వూళ్ళో వుండే పెద్ద అసాములో, వొక పావలా పట్టురూపాయి పెంచినా యిబ్బంది లేదనుకో! కానీ వూళ్ళో యిన్ని రయితులిండ్లు వున్నాయి. వాళ్ళందరికీ కూలి పెంచే స్తోమత వుందని చెప్పమను - అట్లాగే. అయినా మీకిప్పుడేమైంది? మీ పెళ్ళిళ్ళకో, పెటాకులకో, సావులకో పాతికో పరకో ఆదుకుంటూనే వున్నాం, పోనీ మీరడిగినట్లే పెంచుతాం. కూలీ తప్ప వొక్క బొట్టుపైన అడక్కండి. సామి సంగతి పూజారి కెరిక అని మన సంగతి బాగా తెల్సురెడ్డికి... ముందు రేపు మీ అబ్బా కొడుకుల సంగతి తేలనీ."

సుబ్బులు లేచిపోయింది. వెన్నెల్లో, యెర్రకోకతో నడచిపోతున్న సుబ్బుల్ని చూస్తూ "యిన్నాళ్ళ నుంచీ సెపుతూనే వుంది" అన్నాడు కాబోయే మొగుడు.

"సానా తెలివిగల పిల్ల. యెంతయినా టౌనులో వుండి వచ్చింది". అని మెచ్చుకున్నాడు కాబోయే మామ.

ఆ రాత్రంతా కలల్లో కూడా పుల్లన్న, పుల్లన్న కొడుకూ ధైర్యాన్ని కూడగట్టుకోడానికి ప్రయత్నించారు.

ఉదయాన్నే యిద్దరూ రామిరెడ్డి ఇంటికి వెళ్ళారు. కొడుకు తండ్రివైపు చూశాడు. తండ్రి కొడుకు వైపు చూశాడు.

రామిరెడ్డి యిచ్చిన డబ్బు అందుకున్నాక, కొడుకు నేలచూపులతో అడిగాడు :

"లెక్కంతా గుర్తుయేసి యియ్యండి. సోమీ...! మూడేండ్లదీ, యిప్పుడిదీ", రామిరెడ్డి క్షణం నిశ్చేష్టుడయ్యాడు. తర్వాత తీక్షణంగా అన్నాడు :

'అయితే యిన్నాళ్ళకు లెక్కలు గుర్తుయేసి యిమ్మంటున్నారన్నమాట. యే నా కొడుకు నేర్పినాడురా మీకు. అయినా నా దగ్గర పని చేసేది నువ్వా! మీ నాయనా?"

"నేనే సోమీ, మా కెవరు నేర్పుతారు సోమీ!" అని గొణిగాడు పుల్లన్న.

'యెందుకైనా గుర్తుండేది మంచిది గదా సోమీ" అన్నాడు పుల్లన్న కొడుకు ఓబులేశు.

'మంచిదేరా. అయితే ఇప్పుడే లెక్కలు గుర్తురాయిస్తా గానీ వూరందరికీ చూపించుకోని రండి..

ముందా డబ్బు యివ్వు."

పుల్లన్న తటాలున చేతిలో డబ్బు రామిరెడ్డికి యిచ్చాడు.

యిప్పుడే అన్న మాటకు గంట గడిచింది. ఒక పొడుగాటి కాగితం రాసి రామిరెడ్డి వాళ్ళ చేతుల్లో వుంచుతూ అన్నాడు :

'పద్దైదు నూర్లు బాకీ తేలింది. అది అక్కడ పెట్టి, పని మానుకోమను మీ నాయన్ను. మా తమ్మునికి కియ్యాల్సింది యిచ్చి నువ్వూ అక్కడ మానుకో. యింకేవన్నా అతి కూతలు కూస్తే యెముక లిరుగుతాయి..."

కోపంతో రామిరెడ్డి యింటోకి వెళ్ళిపోయాడు.

అబ్బా కొడుకులకు యేంచేయాలో తోచలేదు. పుల్లన్న గొణిగాడు :

"ఆడోళ్ళ మాటలు యింటే యిట్లాగే వుంటుంది."

ఓబులేశు తండ్రి వైపు కొరకొర చూస్తూ అన్నాడు :

"సిన్నప్పటినుంచీ నీ మాటే యింటున్నాం. రూపాయలు తలకు పోసుకున్నామా? యీ కాగితమేందో సుబ్బులే్న సూడమందాం."

సుబ్బుల కొచ్చిన చదువుకు రామిరెడ్డి బ్రహ్మరాత అంత సులభంగా అర్థం కాలేదు. నెమ్మదిగా చదివింది. తీసుకున్న మొత్తాలు యెప్పుడు తీసుకున్నారో అర్థం కాలేదు. యెందుకు తీసుకున్నారో వివరం లేదు.

సుబ్బులు నిర్వికారంగా పుల్లన్నతో అంది :

"మామా! యింతకంటే సెడిపొయ్యేది లేదు. పని మానుకో ముందు, సెపుతా, యీ కాయితం టౌన్లో మనోళ్ళకు సూపించి తెస్తా. ఆ తర్వాత జరిగే సంగతి జరుగుతుంది".

రామిరెడ్డి యింట్లో పుల్లన్న పని మానుకోవడం ఊరంతా తెలిసిపోయింది. పుల్లన్న కూతురు పెళ్లిని యెలాగో సుబ్బులే జరిపింది. సుబ్బులు ఓబులేసు పెళ్ళామయింది. రామిరెడ్డి తమ్ముడు పుల్లన్న కొడుక్కు ఉద్వాసన చెప్పాడు. యీలోపే 'వరికోతలకు కూళ్ళు యెక్కిస్తే తప్పు కొడవళ్ళు పట్టం అని కూలీలు బిగుసుకు కూర్చున్నారు.

ఆకాశంలో యెడతెరిపిలేని చినుకులు, క్రింద పండి విరిగి చేలో పడ్డ వరి పైరు.. వర్షాలొస్తే? అని రైతులంతా ఆందోళన పడ్డారు. పెద్ద రైతులు రామిరెడ్డిని కలుసుకొని మాట్లాడారు.

రామిరెడ్డి, ఊరి పెద్దలు కూలీ నాలీ జనాన్ని గ్రామ సావిడివగ్గరకు పిలిపించారు.

యఱ్ఱ సుబ్బులు నాయకత్వమని, దానికి వెనుక యేదో తతంగముందని తెలిసిపోయింది.

రామిరెడ్డి గుండె కుతకుతలాడుతోంది. సుబ్బులును చూస్తూనే రామిరెడ్డి రక్తపు పోటు హెచ్చింది. బిగ్గరగా అరిచాడు :

"నువ్వు చెడింది చాలక ఊరందరినీ చెడగొడుతున్నావు. లని లంజముండా... మొన్న తిరుపతయ్య గాణ్ణి తగులుకున్నావు. యిప్పుడు హోబులుగాణ్ణి తగులుకున్నావు. నీతి, జాతి లేకుండా బతికేదానికి నీ కెందుకీ యీ గొడవలన్నీ..

రామిరెడ్డికి అంత కోపం రావటం యిటీవలి కాలంలో వూళ్ళో పెద్దలు చూడలేదు. ఆశ్చర్యంతో రామిరెడ్డి వైపు వాళ్ళుచూస్తున్నారు. కూలీ లంతా సుబ్బులు వైపు చూశారు. కొందరు బిక్కు బిక్కు మంటూ, కొందరు 'యేం కతో?' అనుకుంటూ, మరి కొందరు రామిరెడ్డి మీద కోపంతో వుడికిపోతూ.

యెర్ర సుబ్బులుకట్టె విరిచినట్లు అంది :

"నేను సెడినదాన్నే అనుకో. నన్ను చూసి రెడ్డమ్మను సెడిపోమను. ఊర్లో రైతమ్మ గార్లందరినీ సెడిపోమను. వీళ్ళందరినీ సెడిపోమను. నేను సెడిపోతే నాకే నష్టం యవ్వరికీ యేమీకాదు. నువ్వు మరి సానా మంచోడివి. పరాయి ఆడదాన్ని కన్నెత్తి సూడవు. సారాయి తాగవు. బీడీలు తాగవు. కానీ అందరినీ ముంచుతావు - మంచి మాటల్తో, దొంగ లెక్కల్తో, నిన్ను సూసి రైతులంతా నీ మాదిరి తయారయినారు. మాకు పుట్టగతులు లేకుండా సేస్తున్నారు. మూడేండ్లు మా పుల్లన్న మామతో గొడ్డు సాకిరి సెయించుకున్నావు. పిల్లపెండ్లికి వుంటుంది. లెమ్మని యిన్నాళ్ళూ నిన్నడగలేదు. ఒక్క వొడ్లగింజ యింటికివ్వకుండా, పావలా, రూపాయి, సేతిలో పెట్టి పదైదు నూర్లు బాకీ తేల్చినావు. అదేమంటే అడిగేవాండ్లు లేరు. పదేండ్ల నుంచి కులీ వొక్క పావలా అన్నా పెంచి యిచ్చినావా? మీ ఆదాయం యేమన్నా తగ్గిందా? పెంచకపోవడానికి?....

రామిరెడ్డికి చీకటి నాడుల్లో రక్తపుపోటు పెరుగుతోంది. చిన్నా పెద్దా రైతులంతా తామూ రామిరెడ్లమే అని ఆ క్షణంలో అనుకుంటున్నారు. పెద్ద రైతుల రక్తంలో దట్టమైన చీకటి. చిన్నరైతుల రక్తంలో పలుచని చీకటి. కానీ అందరిలో రామిరెడ్డి ! గ్రామ సావిడిలో చీకటి అవాహన!

యెర్రసుబ్బులు వెంటవచ్చిన ఆడకూలీ నాలీ జనం, తోడువచ్చిన మగ జనమంతా ఇన్నాళ్ళూ చెప్పాలనుకున్న మాటల్నే సుబ్బులు చెపుతున్నందున సంతోష పడుతున్నారు. ఓబులేసు అన్నింటికీ సిద్ధంగా వున్నాడు. కానీ యేం జరుగుతుందో అని బెదురు. అంతలో వాళ్ళ నెత్తురులో యేదో వెలుగు ... వెలుగు నెమ్మదిగా ఆక్రమించబోతోంది. కూలీ నాలీ అందరిలోనూ యెర్రసుబ్బులు! సావిడి ముందు చీకటి ఉచ్చాటన!

**17**

# ఎండు చేపలు

కొట్రుగడ్డ దయానంద్

"ఈ రాత్రిక తెల్లారేట్టు లేదు. మళ్ళీ పగల్నిచూసే జాతకం మనకుందో లేదో!"

అక్కడున్న అందర్లోనూ ఇదే భయం. ఇదే వణుకు.

ఇల్లు కూలిపోతే మళ్ళీ కట్టుకోవచ్చు. పంట కొట్టుకుపోతే మళ్ళీ ఏడాది పండించుకోవచ్చు. ఆస్తులూ, అంతస్తులూ, గొడ్డూ, గోదా.. సర్వం నాశనమైనా మనిషనేవాడు బతికుంటే మళ్ళీ పోయినవి సంపాదించొచ్చు.

అలా అనుకుని బతుకు మీది తీపితో ఇల్లూ వాకిలీ వదిలిపెట్టి అందరూ ఆ ఇంట్లో చేరేరు.

గురవయ్య తాత తన ముఖమ్మీదున్న గజ నిమ్మకాయంత కణితి బుడిపెను ఒకసారి తడుముకుని, భుజాల మీది దుప్పటిని చెవుల చుట్టూ మరింత గట్టిగా బిగించుకుని ముడుచుక్కూర్చున్నాడు. తలుపు తట్టిన శబ్దం విని ఆయన "తలుపులు తియ్యండెహే! ఎవుల్లో వచ్చినట్లుంది" అని అరిచేడు.

తలుపులు తియ్యడానికెడుతున్న చాకలి కోటి లింగాన్ని "దిన్నగారో! గాలిని లోనికి జొరబడనియ్యమాక" హెచ్చరించేరు గుంపులోంచి ఎవరో.

తలుపులుకొద్దిగా తెరచుకోగానే 'బొయ్యి' మని గాలిని మిద్దెలోకి తోసుకుంటూ ఒక ముసిలోడు, ఒక ఆడమనిషి, ఇద్దరు పిల్లలూ తడిసి ముద్దయి లోనికొచ్చేరు. పెద్ద వత్తితో వెలుగుతున్న ఆముదం దీపం ఆరిపోయేట్టుగా వణికింది. మూసుకున్నతలుపులు వెనుక చెట్లన్నీ సగ్గంగా కొమ్మలు విరబోసుకుని గజగజమని వణుకుతూ గడగడమని ఊగుతూ ఫెళఫెళమని విరుగుతూ భీభత్సం సృష్టిస్తున్నాయి.

"ఒరే రాముడూ! ఊరంతా ఇక్కడున్నట్టేనా?" అడిగేడు గురవయ్య తాత.

తండ్రి మంచం దగ్గర నుంచున్న వెంకట్రాయుడు అందర్నీ ఒకసారిచూచి "ఆ ఉన్నట్టే" అన్నాడు. "ఎప్పుడూ కరువులూ కాటకాలే గాని ఇంత గాలోనను ఎప్పుడన్నా ఎరుగుదుమా" స్వగతంలో అనుకున్నాడు గురవయ్య తాత, కొత్తగా వచ్చినవాళ్ళు తడిబట్టలతోనే కింద కూర్చున్నారు.

ఇప్పుడా గదిలో ఇరవై కుటుంబాల వాళ్ళు ముసలీ ముతకా, పిల్లాపెల్లాతో సహా అందరూవణుకుతూ కూర్చున్నారు. వాళ్ళకు పదడుగుల దూరంలో వెంకట్రాయుడి తండ్రిసీతయ్య

రెండుమూడు దుప్పట్లు కప్పుకున్నా చలికి ఆగలేక వణుకుతున్నాడు. ఆయనమంచం పక్కనే ఆయన భార్య సుబ్బమ్మ పైట చెంగును నెత్తిమీది నుంచి ముసుగేసుకుని కూర్చుంది. ఆ గుడ్డి వెలుతుల్లో కూడా ఆమె నుదుటి మీది అర్థరూపాయంత కుంకుమ బొట్టు మిలమిలమని మెరుస్తూంది. మంచానికీ, కింద కూర్చున్నవాళ్లకు మధ్య నాలుగైదు పొగాకు బేళ్ళు బరువుగా పడున్నాయి.

ఆ గదంతా రొచ్చురొచ్చుగా తయారై చాలా సేయింది. ఎవరి చంటిపిల్ల గుడ్డలు పాడుచేసిందో గాని చుట్టవాసన. కంపువాసన కలగలిసిపోయింది. ఎటునుంచో చోరబడుతున్న గాలి చెట్టంత మనుషుల్ని మంచుకొండల్నిచెయ్యాలన్న తపనతో వుంది.

బయట వాన తగ్గే సూచనేమీ లేదు. రాత్రి ఏ జామైందో తెలీడం లేదు. గాలి అంతకంతకూ పెరుగుతోంది. చిన్నపిల్లలు భయం భయంగా తల్లుల ఒళ్ళోనో, తాతల తండ్రుల తొడల మీదనో గువ్వలా ఒదిగికూర్చున్నారు.

"ఈ గండం గడిచి గట్టెక్కి,అవతల పడితే అంతే చాలన్నట్లుంది" అక్కడి అందరి పరిస్థితి. సీతయ్య మంచంలో చలికి వణుకుతూనే వున్నారు. గురవయ్య చిన్నగా లేచి సీతయ్య మంచం దగ్గరకు వచ్చాడు. సీతయ్య పెద నాయన కొడుకే గురవయ్య. సీతయ్య ముఖమ్మీది నుంచి దుప్పటి తొలగించి చూసేడు. ఆయన ముఖమ్మీద పాయలు పాయలైన ముడుతలు ఆయనవృద్ధాప్యాన్ని సూచిస్తున్నాయి. కళ్ళ కింద నల్లనిగోతులు ఆయన వారం రోజుల అనారోగ్యాన్ని గుర్తు తెస్తుంది. గురవయ్య ఆయన మీదకు వంగి "అన్నా! అన్నా" అని రెండుసార్లుకేకేశాడు. మొదటి కేకకు ఆయన ఒళ్ళు కదిలింది రెండోకేకకు ఆయనకళ్ళు ఒదులై తెరుచుకున్నాయి. ఏమిటన్నట్టు ఆయన కళ్ళు చూసేయి.

"చలి పుట్టడంలా! అసలే నీ ఒంట్లో బాగోలేదు. ఇక్కడంతా నేల తడిసిపోయింది. పడమటింట్లో పడుకుందువుగాని లేచి నిలబడగలవా?" అడిగేడు.

సీతయ్య తల అడ్డంగా ఊపి గురవయ్యకు తన పక్కనే మంచమ్మీద చోటుచూపించికూర్చోమన్నాడు. "వాన తగ్గిందా!" అడిగేడు సీతయ్య లోగొంతుకతో.

"ఇది తగ్గేవాన గాదు. గాలోన!" అరిచేడు గురవయ్య. ఆ ఇంట్లో ఇప్పుడెంత అరిచినా ఆ అరుపులు గాలివాన హోరులో గుసగుసలా వినిపిస్తోంది.

సీతయ్య కుడిపక్కకు తిరిగి అందర్నీ ఒకసారి చూచి "మనోల్లందరున్నారు గాని వందనంగాడు లేడేందిరా గురవయ్యా!" అడిగేడు.

ఉలిక్కిపడ్డాడు గురవయ్య.

"అవును వందనంగాడి కుటుంబం గాలోనలో ఇరుక్కుపోయింది" చిన్నగా అన్న మాటలు సీతయ్య చెవినపడనేలేదు.

గురవయ్య ఆలోచనలో పడ్డాడు.

ఊరి చివరి తాటాకుల ఇల్లు. అదేమంత గట్టేది కాదు.

పాపం వందనమూ. వాడి కొడుకు తిరుపాలూ బాలింత కోడలు సరస్వతీ, నెలల పసికందూ, ఎలా వునారో ఏమో?

బయటేమో భయంకరంగా గాలోన.

గురవయ్యా మనసు మనస్సులో లేదు.

......

పాతికేళ్ల వెనుక....

ఒంగోలు చుట్టుపక్కల ఊళ్ళల్లో కరువొచ్చి జనం తిండికి మాడతా వుంటే అర్ధరాత్రి దొంగల బండెక్కి బిట్రగుంటలో దిగేరు సీతయ్యా, గురవయ్యా, సీతయ్య జతగాడు మాదిగ వందనమూ! రైలు వ్యాగన్లు దోచుకున్న సెటిల్మెంటోళ్ళు అక్కడకు జొన్నలు తెచ్చి చవగ్గా అమ్ముతారని విన్నారు వాళ్ళు. తెల్లారి జొన్నలు కొని స్టేషనకు తెచ్చేరు. స్టేషన్ నిండా ఎటుచూసినా తెల్లగుడ్డల చెక్కింగోళ్ళున్నారు. వీళ్ళ దగ్గర ఛార్జీలకు డబ్బుల్లేవు. అప్పుడే ఎవరో చెప్పేరు వాళ్ళకు కావలిదాకా వెళ్ళగలిగితే చెకింగు అక్కడ నుంచి వుండదని.

అంతే! ముగ్గురూ నెత్తిన జొన్నల బస్తాలుంచుకుని అడవికి అడ్డంబడి వాగులూ వంకలూ చెట్లూ పుట్టలూ దాటేరు.

సగం దూరం నడవగానే అలవాటు లేనిపనిగావడాన సీతయ్య అన్నాడు.

"ఒరేవందనమా! నాలుక పిడచగట్టకపోతుంది. నడిచే ఓపిక లేకుండా పోయింది. ఏమీ తినకుండా ఇక మీద నేనొక అడుగు కూడా కదపలేనురా!"

చుట్టూ అనంతంగా పరుచుకున్న జపాన్ తుమ్మచెట్లు దూరదూరంగా ఊరిస్తున్న ఎండమావుల జలలు. ఎండాకాలం మిట్ట మధ్యాహ్నం సైనికుల్లా మోరలెత్తి కదులుతున్న వలసొచ్చిన ఆవులమంద..

"కాపా! ఇక్కడ ఆవుల మంద తిరుగుడుతుందంటే ఏడనో నీళ్ళ కుంట వుండి వుండాల. దాని జాడ తెలిస్తే నీళ్ళు తాగైనా ప్రాణం నిలుపుకోవచ్చు" అన్నాడు వందనం.

వెతగ్గా వెతగ్గా మంచినీళ్ళ కుంట కనపడింది వాళ్ళకు తేలిపోతున్న ప్రాణం తిరిగొచ్చినట్టయింది. ముగ్గురూ కడుపారా నీళ్ళు తాగేరు. ఆనందంగా ఆ నీళ్ళల్లో మునిగేరు. వందనం ఆ కుంటలో దొరికినన్ని బురద మట్టలు పట్టేడు. చిదుగులు పోగేసి మంటలో కాల్చేడు. ఆవురావురుమంటూ తిని బ్రేవ్‌మని తేన్చేరు వాళ్లు.

అదుగో అప్పుడు చూచేడు సీతయ్య సాగులో లేకుండా పడున్న భూముల్ని మట్టిని అరాగా పిసికి చూచేడు. సాగులోకి తెస్తే ఈ నల్లమట్టిలో మణులూ మాన్యాలు తీయొచ్చనుకున్నాడు. దగ్గర్లోని ఊళ్ళో ధర విచారం చేసేడు. ఉత్తరాదిన నాలుగెకరాలు అమ్మితే ఇక్కడ ఇరవై ఎకరాలు కొనొచ్చనని లెక్కలు కట్టేడు. తనకున్న నాలుగు గొర్ల పొలమూ అమ్మి అక్కడ పొలం తీసికున్నాడు. తనతోపాటు తోబుట్టువుల్నీ, చిన్నాన, పెదనాయన కుటుంబాల్ని వెంట తెచ్చుకున్నాడు గుడ్డలుతకడానికి దిక్కులేని చాకలి కోటల్లింగాన్ని చాకిరీ చేయడానికి మాదిగ వందనాన్ని రమ్మన్నాడు.

ఆ నీళ్ళ కుంటకు కాస్త ఎగదాల్న ఇరవై కుటుంబాల వాళ్ళు గుడిసెలువేసుకున్నారు. చాలా ఏండ్లదాకా ఎవరూ గట్టి ఇల్లు కట్టుకోలేదు. తరువాత పదిహేనేండ్లకు పుగాకుబాగా పండి విపరీతమైన లాభాలు రాగానే సీతయ్య తెంపుచేసి ఆ ఏడారిలో మిద్దె ఇల్లు కట్టేడు. ఆయన్ని చూచి మిగతావాళ్ళు ఆలోచనలో పడ్డారు.

"దిక్కుమాలినూరు దిక్కుమాలిన సంత ఒక గూడా, ఒక బడా? ఏముందని ఈడ? ఈ అడవిలో ఏ అపరాత్రో నలుగురొచ్చి నాలుగు బాది వున్నది కాస్తా లాక్కొని పోతే దిక్కేముంది? ఎవుడికన్నా పాణమ్మీదికొచ్చి చావుబతుకుల్లో వుంటే ఒక డాక్టరా? ఒక రోడ్డా? అడవిలో దీపం బెట్టినట్టు ఈ ఎడారిలో అంతంత ఖర్చు పెట్టి ఇల్లెందుకు " అన్నారు కొందరు.

"ఊరు ఎల్లకాలం ఇట్టానే ఉండుద్దా? మనం ఇండ్లుకట్టుకున్నాక ఎవల్లో ఒకళ్ళు రాకుండా వుంటారా? మనకున్న ఆస్తులన్నీ ఈడనే వున్నప్పుడుఇంక ఎటు పోతాం? ఉత్తరాది నుంచి పత్తి ఎయ్యడానికిపొలాలు కావాలని నిరుడు నలుగురైదుగురు తిరిగిపోలేదూ? మరికొందరు ఇలా వాదించేరు.

చివరకు ఎవరితాహతుకు తగ్గట్టు వాళ్లు గుడిసెలు తీసేసి వాటిస్థానంలో గట్టి ఇండ్లు కట్టుకున్నారు. ఆఖరుకు ఒంటరోడు సాకలి కోట్లింగంకూడా! అక్కడ ఇల్లు లేంది ఒక్క మాదిగ వందనానికే.

వాడు కట్టబట్టల్తో పెళ్ళాం పురుట్లోనే పోతేమూడేళ్ళ కొడుకుని సంకనేసుకుని సీతయ్యతోపాటు దిగేడు. వాడు గంజే తాగేడో. పాయసమే తిన్నాడోగాని చాకిరి మాత్రం కాడెడ్ల బలంతో చేసేడు. సీతయ్యకు ఆ ఊళ్ళో అందరికంటే నాలుగెకరాలు ఎక్కువ ఉండడానికి నాలుగురోడ్లు ఎక్కువ కావడానికి ఇంతెందుకు? మిగతా అందరికంటే సీతయ్య ఉన్నతంగా వుండడానికి వాడి కండలూ, శ్రమా, చెమట, నెత్తురూ సమస్తం ఊపిరిగా పోసేడు. వాడెప్పుడూ ఒళ్ళు దాచుకుని ఎరగడు.

కొడుకు చేతికంది పెద్దోడయ్యేకొద్దీ వాడ్నీ తనతో సమానంగా చాకిరీ చేయించేడు. వందనం. తిరుపాలు మనసు ఎదిగి అందరికీ ఇల్లుంటే మనకెందుకు లేదు. మనమీ గొడ్లకొట్టంలో ఎందుకుండాలి" అనడిగితే.

"ఒరే తిరుపాలూ మనం మాదిగోళ్ళంరా! మనకు మడులూ మాన్యాలు వుండవు. ఎప్పుడైనా ఎక్కడైనా మనం కాస్త భూమి,బలమూ వున్న కాపును కనిపెట్టుకు వుండాల్సిందే" అనేవాడు వందనం.

చిన్నప్పుడు ఎప్పుడైనా సీతయ్య కొడుకు వెంట్రాముడూ మిగతా పిల్లలూ కోతి కొమ్మచ్చో. బచ్చాలాటో ఆడేటప్పుడు తిరుపాలు వెడితే వాడిని ఒక పురుగుని, అదీ గొంగళి పురుగుని చూచినట్టు చూచేవాళ్ళు. ఒకసారి వెంకట్రాముడు మిగతా పిల్లల్తో నడిచి పక్కూరికి బడికి వెళుతుంటే వీడూ బడికెడతానని వందనాన్ని అడిగితే.

ఒరేయ్ మేము నీకు కాపులంరా! అయినా జీతగాడి కొడుకు ఎద్దుముడ్డి పొడుచుకొనాలేగాని చదూకొమ్మని ఎవుడ్రా నీకుచెప్పింది? అన్నాడు వెంకట్రాముడు. తిరుపాలు కోపంగా 'ఒరేయ్! నువ్వేరా ఒరే!' అనివెంట్రాముడి చెయ్యిని గట్టిగా కొరికి తాటిచెట్ల తోపులోకి పరిగెత్తాడు.

ఇదంతా చూచిన వందనం "ఆ అయ్యో, నేను ఎంత ఒద్దికగా వున్నామో! పిల్లనాయాలు పిల్ల చేష్టలూ" అంటూ తిరుపాలు వెంట కోపంగా పరిగెత్తేడు.

వెంకట్రాముడికి చదువబ్బక పది ఫెయిలవగానే స్కూలు మానిపించేడు సీతయ్య.

"వాడేమన్నా చదివి ఊళ్ళేలాల్నా ఏంది? నాకున్నది వాడొక్కడే నలుసు.నేను సంపాదించింది కాలుమీద కాలేసుకుని కూకుని తిన్నావాడి తరువాత మూడు తరాలు బతకొచ్చు!" అనేవాడాయన.

ఇప్పుడు పొలమంతా వెంకట్రాముడేదగ్గరుండి చేయిస్తున్నాడు. వందనం రెక్కలు విప్పుకుని చాకిరీ చెయ్యలేని స్థితికొచ్చేడు. ఊరి బయట పోరంబోకులో వాడికో తాటాకుల గుడిసె వేయించి ఇచ్చేడుసీతయ్య. వందనం స్థానాన్ని తిరుపాలు తీసుకున్నాడు. అదే సంవత్సరం ఉత్తరాదినున్న మేనకోడలు సమర్తాడిందని తెలిసి వందనం తన కొడుక్కి పెళ్ళాంగా తెచ్చుకున్నాడు. వాళ్ళిద్దరూ మొగుడూ పెళ్ళాలని ఎప్పుడో చిన్నప్పుడే ఆ పిల్ల పుట్టకముందే అనుకున్నారట.

మరుసటి ఏడు వానలు బాగా కురిసి పచ్చజొన్నలురాశులు రాశులుపండేయి. ఎవ్వరి ఇంటిముందు వాళ్ళు పాతర్లలో జొన్నలు నిలువబోసేరు. మెట్టవరి విపరీతంగా పండి కోతలప్పుడు వరికంకులు బరువుగా భూమ్మీదికి వాలేయి. వెంకటరాముడు కలగన్నట్టుగా ఆ ఏడు పది ఎకరాలుబుడమ వడ్లు నారుపోసేడు. కోతలుపూర్తయి కుప్పలవాటికి కల్లంలో చేరిన వరిమోపుల్నిచూస్తుంటే అంతా కళ్ళు తిప్పుకోలేకపోయారు. అదుగో సరిగ్గా అప్పుడే అక్కడే వచ్చింది పేచీ వెంకటరాముడికీ, తిరుపాలుకీ.

ఆ రోజు కల్లం దగ్గర కాపలా పండుకోవాలన్నాడు వెంకటరాముడు తిరుపాలుని.

"వీలు కాదు బాబూ! ఇంటికాడ నా ఆడిది ఒక్కతే వుండుద్ది. దానికప్పుడు నిండునెలలు. ఏ నిమిషాన ఏం జరుగుద్దో? రాత్రిపూట అవసరమైతే నలుగురాడోళ్లని పిలవడానికిమనిషి వుండాల. అంతగా అయితేనూ అయ్యొచ్చి కల్లం దగ్గర పడుకుంటాడు" అన్నాడు తిరుపాలు.

"మీ అయ్యకా చూపుసరిగ్గా ఆనదు. అంత పంటను కల్లంలో వదిలిపెట్టి నువ్వు పెళ్ళాంతో కులకడానికి వీలుకాద"న్నాడు వెంకటరాముడు.

మాటలు మర్యాదగా రానియ్యండే! మీక్కావలసింది కావలి పడుకోవడమే అయినే నేనైతే ఏంది? మా అయ్యయితే ఏంది? అన్నాడు తిరుపాలు.

మాటా మాటా పెరిగింది. నువ్వెంతంటే నువ్వెంతనుకున్నారు. అనుకుని ఆ పయిటాలుపూట ఇంటి దారి పట్టేరు. చీకటి పడింది. పుచ్చపువ్వులా మిడిసి పడటానికి చంద్రుడు ముస్తాబవుతున్నాడు.

వందనం కొడుక్కి ఏం నచ్చచెప్పేడో ఎంత బతిమాలాడాడో కాని కల్లం కాడికి తిరుపాలే చేరుకున్నాడు. తిరుపాలు రాడేమోనని అంతకుముందే వెంకటరాముడు అక్కడకుచేరేడు. ఇద్దరూ ముఖాముఖాలు చూచుకున్నారు. వెంకటరాముడుతన మాటే నెగ్గినందుకు లోలోనసంతోషించేడు. తిరుపాలు చుట్ట కాల్చుకుని ఎద్దులకు ఎండుగడ్డి వేసొచ్చాడు. నీళ్ళు పుక్కిలించి ఊసి గొంతుతడుపుకున్నాడు. మంచం కల్లం మధ్యలో వేసుకుపడుకునికాస్సేపు బిగ్గరగా డ్రామా పజ్జాలు పాడి అలాగేనిద్రలోకిజారిపోయేడు.

బుర్రుపిట్ట బుర్రుబుర్రుమని కూస్తూ ఆకాశంలో కలియతిరుగుతోంది. రాత్రంతా అదమరిచి నిద్రలోఊగుతోంది. పైన మేఘాలు ఎగిరేకొంగల నృత్యంలా కదులుతున్నాయి. అమృతమంత స్వచ్ఛమైన చల్లగాలి శరీరాన్ని ఆప్యాయంగా పెనవేసుకుంటోంది. గలగలమని పారుతున్నసెలయేటి నీటిలోపామొకటి అతి సునాయాసంగా ప్రవాహం వాలులో జారుతోంది. ఆ వాగొడ్డున ఎర్రగా పండిన టమాటో తోటలో రెండే రెండు నక్కలు సయ్యాటలాడుకుంటున్నాయి.

సరిగ్గా అప్పుడు జరిగిందది.

తిరుపాలుమంచానికి తూర్పు పక్కన కల్లంలోని వరిమోపుల్లోంచి హఠాత్తుగా భగ్గున మంట

లేచింది. ఆ మంట ఆలవోకగా అలా అలా నాలుగు వైపులా వ్యాపిస్తూ తిరుపాలు నిద్రని తినేసింది.

"అయ్యయ్యో!! మంటలు మంటలు" అని అరిచేడు తిరుపాలు. మంచం దిగి కొంచెం ముందుకు పరుగెత్తాడు. ఆ మంటలు ఆ ప్రశాంత వాతావరణంలో కడుపుతో నిండిన వరికుప్పల కల్లాన్నితనలోకి రారమ్మని ఆహ్వానించింది. కొట్టాలకాడినుంచి జీతగాళ్ళు. ఊళ్ళోనుంచిజనమూ పరుగెత్తుకొచ్చేరు. వెంకటరాముడూ లేచేడు.

"మంటలు, మంటలు" అని అప్పటికీ కళ్ళం చుట్టూ వెర్రిగా అయోమయంగా తిరుగుతున్నాడు. తిరుపాలు. వెంకటరాముడి నిద్ర దిగిపోయే సరికి పది ఎకరాల నిండైన పంట మసి అయింది.

అప్పుడు అరిచేడు వెంకటరాముడు ఆ ఎర్రికేక "అమ్మ లంజకొడకా! ఎంత పని చేసేవురా" అంటూ. తిరుపాలు పరుగెత్తడం ఆపేడు. వాడికేమీ అర్థం కాలేదు. అర్థం అయ్యేసరికి నీ కళ్ళ నిండా విషమేరా! అంటూ వెంకట్రాముడు ముల్లుగర్ర అందుకునినుంచున్నాడు. కాస్సేపటికి తిరుపాలు తల చిట్లిపోయి ఒళ్ళంతా గాయాల చీకటైపోయాడు. ఆ ఏడే తిరుపాలుసీతయ్య కమతంలోంచితప్పుకున్నాడు.

రావాల్సిన డబ్బులుగాని కొలవాల్సిన ఒడ్లుగాని వీళ్ళడగాలేదు. వాళ్ళియ్యాలేదు. అంతటితో సీతయ్యకూ వందనానికీ వున్న ఏభై ఏళ్ళ బంధం తెగిపోయింది

తిరుపాలిప్పుడు వాళ్ళ పొలంలోనూ వీళ్ళ పొలంలోనూ ఊళ్ళోనే కూలిపని చేసుకుంటున్నారు. మళ్ళీ ఏరువాక నాటికి ఈ ఊరిడిచి పెట్టి వేరే ఊళ్ళో జీతానికుండాలని నిశ్చయించుకున్నాడు వాడు. ఇది జరిగి మూడునెల్లయింది.

వాన జోరు తగ్గిందీ లేనిదీ అంతుబట్టడం లేదు. గాలి మాత్రం గుండెల్ని హడలెత్తిస్తూంది. ఎక్కడ్నో 'ధడేల్ ధడేల్ అన్న రేకుల శబ్దం గాల్లో వినపడింది. అందరూ తల్లడిల్లిపోయారు.

"కాపా! ఏడనో పుగాకుబ్యాటర్నీల రేకులుగాల్లోకి లేచినట్టుంది" అన్నాడు సాకలి కోటిలింగం.

"ఒరేయ్! ఏమీ భయపడమాకండి. ఎన్ని కూలిపోయని ఈ ఇంటికేమీ కాదు" అరిచేడు గురవయ్య.

ఇంకెవరో గురవయ్యను అడిగేరు.

"ఎగదాల ఊళ్ళల్లో పంట చెర్వులు తెగి మనూరిమీదకుఎల్లవొచ్చి పడితే ఎట్టా?

"ఎవుడ్రా ఆ ఎర్రిగొడ్డు? చుట్టూ వున్న ఊళ్ళకన్నా మనూరే మిట్టమీదుంది. ఊళ్ళన్నిట్నీ ముంచిగాని మనూర్ని ముంచదు వరద గురవయ్య కంఠం వణికింది.

ఇ ంట్లో వాళ్ళందరికీ ప్రాణాల మీద ఆశపోయింది. సీతయ్య వణకడం కూడా ఎక్కువైంది. వెంకటరాముడు లాంతరు తీసుకొచ్చి తండ్రి ముఖమ్మీద వెలుర్గుతు పడేట్లుపెట్టేడు. ఆ వెలుతురికి సీతయ్య కళ్ళు తెరవకుండానే వెంకటరాముడు అని పిలిచేడు. పిలిచి జవాబు కోసం చూడకుండా

"ఈ సలి నన్ను బతకనిచ్చేట్టు లేదురా! ఇదే ఆఖరు గాలోన కావాల నా జీవితానికి. ఈ కట్టెనుంచి జీవి ఎగిరిపోయే సమయం వచ్చినట్టుంది. అని ఆగి మీ అమ్మయాడుందిరా అడిగేడు. సుబ్బమ్మ నీళ్ళు నిండిన కళ్ళతో సీతయ్యమంచమ్మీదకు వంగింది.

"ఏమేవ్! నాదో కోరికుంది తీరుస్తావా? నాకిప్పుడు బాగా నిప్పుల్లో కాల్చిన ఎండు చేపముక్కలు

తినాలనుందే" అన్నాడు సీతయ్య. ఆ మాట చెప్పినప్పుడు ఎందుకనో దెయ్యపుగాలి కూడా కాసేపు ఆగి వింది. సుబ్బమ్మ నిర్ఘాంతపోయి మంగళసూత్రాన్ని మరోసారి కళ్ళకద్దుకుంది.

"వీడికి చిన్నప్పటి నుంచి నీసంటే ఎంతిష్టమో! చావబోతూ కూడా దాన్నే కోరుతున్నాడు' అని తలచేడుగురవయ్య.

'అవిప్పుడు ఎక్కడ దొరకుతాయే నాయనా?' అడిగేడు వెంకట్రాముడు. సీతయ్య నోరిప్పలేదు. కింద కూర్చున్న జనంలోంచి ఎవరో ఎవర్నో అడిగేరు. వాళ్ళు ఇంకెవర్నో అడిగేరు.

అడిగి "లాభం లేదు ఇక్కడ ఎవరింట్లోనూ దొరక"దని తేల్చేరు. తర్వాత చాలాసేపటికి సాకలి కోట్లింగం అన్నాడు.

"చినకాపా! మాదిగోడు వందనం లేడ! వాడైతే నీసు లేందే ఒక్కపూట గూడా గొంతులోకి వెళ్ళ పోనియ్యడు. వాడికి ఎండు చేపలంటే అంత పిచ్చి. వాడి దగ్గర దొరుకుతాయి'

అంత భయంలోనూ సుబ్బమ్మ కళ్ళు మిలమిలా మెరిసేయి. 'విన్నావా'! అన్నట్టు కొడుకును చూచింది. వెంకట్రాముడు తల దించుకున్నాడు.

తిరుపాలు కమతం మానేసిన దగ్గర్నుంచీ వాళ్ళెప్పుడూ ఒకరికొకరు ఎదురుపడి ఎరుగరు. వందనం కూడా రావడం మానుకున్నాడు. ఇప్పుడేమో ఎప్పుడూ నోరు తెరిచి నాకిది కావాలని అడగని తండ్రి కోరిన కోరిక.

'బయట మళ్ళీ ఏదో కూలిన శబ్దం.

'అంబా' అన్న పశువు కేక...

మళ్ళీ అందరూ ఉలిక్కిపడ్డారు.

అప్పుడు అనుకున్నాడు వెంకట్రాముడు. ఈ రాత్రి ఎలాగూ సవ్యంగా తెల్లారేట్టు లేదు. ఈ మిద్దె ఉండేదీ తెలవదు. కూలేదీ తెలవదు. తెల్లారిందాకా ఎవరు బతికేదీ ఎవరు పోయేదీ అనలే తెలీడం లేదు. దీనికంటే తండ్రి కోరిక తీర్చడం సబవుగా తోచిందతడికి.

"నాతో ఎవరన్నా వస్తారా?" అడిగేడు వెంకట్రాముడు. గొడ్ల మెద తాళ్ళు విప్పడం మర్చిపోయి వచ్చిన రాఘవులు నేనూ వస్తానన్నాడు.

నేను కూడా అన్నాడు గురవయ్య మనవడు.

ముగ్గురూ గోనె సంచులు చుట్టుకున్నారు. "జాగ్రత్తరా రాముడూ"! అని "మీతో పాటు వాళ్ళనూ ఇక్కడికి తీసుకురండి" అంది సుబ్బమ్మ.

మళ్ళీ బొయ్యిమని పెనుగాలి ఆ ఇంట్లో బీభత్సం చేసింది.

గాలోన వాళ్ళను ముందుకు నడవనీయకుండా వెనక్కి తోస్తూంది. వాన చినుకులు పెద్ద పెద్ద రాళ్ళతో బాదినట్టు బాదుతున్నాయి. చెరువు కట్టమీది గంగిరేగు చెట్టు ఎప్పుడో నీళ్ళలోకి వాలింది. రెండు మూడు బ్యార్నీలు కూలిపోయాయి. చెరువు కట్ట ఇప్పుడో ఇంకాస్సేపట్లోనో తెగేట్టుంది.

రాఘవులు కాలికేదో చుట్టుకుంది. కెవ్వుమని అరిచేడు. ఎవరూ చూడకముందే పెద్ద పామొకటి జరజరా జారిపోయింది. ఏమీ లేదులే" అనుకున్నారు వాళ్ళు. రాఘవులు ఇంటి ముందాగేరు.

గొడ్లన్నీ ఎప్పుడో కట్టుగొయ్యల్ని తెంపుకున్నాయి. నాలుగు నెలల దూడ మాత్రం కట్టుమట్లోనే వుంది. దాని తల్లి బర్రె కాబోలు భీతావహంగా దూడ చుట్టూ తిరుగుతోంది. రాఘవులు దూడ మెడతాడు విప్పేడు. బర్రె దూడ చింగున చీకట్లో కలిసేయి.

వందనం గుడిసె ముందాగేరు వాళ్ళు. వెంకట్రాముడు రెండు మూడు సార్లు తలుపు తట్టగానే కొద్దిగా తెరుచుకుంది. ఏవో మునక ముఖాలు మెరుపు వెల్తుర్లోమెరిసేయి. ఒక్కొక్కరే లోపలికెళ్ళగానే మళ్ళీ మూసుకున్నాయి తలుపులు.

లోపలంతా చీకటిగా వుంది. వెంకట్రాముడు చేతిలోని టార్చిలైటు వేసేడు.

అప్పటికే గుడిసెలోకి నీళ్ళొచ్చాయి. ఉన్న ఒకే మంచాన్ని వాల్చుకుని తండ్రీ కొడుకుల్దిరూ తలుపు పక్కన కూర్చుని దాన్ని గాలికి తెరుచుకోనీయకుండా గట్టిగా పట్టుకున్నారు. తలుపు ఊడిన మరుక్షణం ఆ గుడిసె గాలి నిండిన బెలూన్లా ఎప్పుడో లేచిపోయేది. నిట్రాడుకు కట్టుకున్న గుడ్డ ఉయ్యాల్లో నెలల పసికందు కదలక మెదలక పడుకుంది. వందనం కోడలు సరస్వతి ఆ ఉయ్యాల్ని గట్టిగా పెనవేసుకుని నుంచునుంది.

"ఏం బాబూ! ఇటొచ్చేరు?" అన్నాడు వందనం తేరుకుని.

ఈ గాలోన నుంచి వాళ్ళను తీసుకెళ్ళడానికి వచ్చేరని తలచేడు అతను. వెంకట్రాముడు ఏమీ మాట్టాడలేదు.

"సీతయ్య పెదబాబు వంట్లో ఏమీ బాగోలేదు" అన్నాడు గురవయ్య మనవడు.

"ఏమైంది బాబూ!" అతృతపడ్డాడు వందనం.

"ఏమో వందనమూ! నేనిక బతకనని గిలిగిలిగా మాట్లాడుతూ ఏవేవో కలవరిస్తున్నాడు. నీ దగ్గరుంటే రెండు ఎండు చేపలు కావాలని కోరేడు" వెంకట్రాముడు కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

"ఉన్నాయో లేవో! నేను కమతం చేసేటప్పుడు మాదిగోన్నని కూడా చూడకుండా ఎండుచేపలు నాతో కాల్పించుకుని ఎవరికీ తెలవకుండా తినేవాడో" అని పైకి లేచేడు వందనం.

ఆయన లేవగానే తలుపును మరింత గట్టిగా పట్టుకున్నాడు తిరుపాలు.

సరస్వతి తడిసి ముద్దై ఉరుము ఉరిమినప్పుడూ మెరుపు మెరిసినప్పుడూ ఉయ్యాల్లోని పసికందును ఆందోళనగా చేతుల్తో పొదువుకుంటోంది.

వందనం మూలన ఒకదాని మీదొకటి నిలబెట్టిన మట్టి కుండల్ని ఒక్కొక్కటే దించి అడుగు కుండలో నుంచి ఏదో బయటకు తీసేడు. అది పాములాగా చుట్ట చుట్టుకుని సన్నగా మెలికలు తిరిగి ఉంది. అంత చలిలోనూ వెచ్చటి ఎండుచేప వాసన ఆ గుడిసెలో రహస్యంగా అల్లుకుంది.

"ఇదుగో బాబూ! ఒక్కటంటే ఒక్కటుంది. తీసుకెళ్ళు" అన్నాడు వందనం తీసుకున్నాడు వెంకట్రాముడు. దాన్ని బనీను లోపల దాచిపెట్టేడు.

"వందనమూ! అందరం మా ఇంటికి పోదాం పదండి. ఊరంతా అద్నే ఉన్నారు. గాలికి ఈ గుడిసె ఆగేట్టు లేదు" అన్నాడు వెంకట్రాముడు.

వణుకుతూ నుంచున్న సరస్వతిలో బతుకు మీద ఆశతొలిసారిగా విచ్చుకుంది. వందనం తిరుపాలుని చూచేడు. వాడు విసురుగా తల పక్కకు తిప్పుకున్నాడు.

వందనం ఆలోచనలో పడ్డాడు.

ఎప్పుడో ఈ ఎడారిలో బియ్యపు బస్తాలు మొయ్యడం.. సీతయ్య పొలాలు కొనడం... ఆయన మిద్దె కట్టడానికి తనే ఒక్కొక్క ఇటుకబెడ్డ పేర్చడం... పొద్దస్తమానం చాకిరీ..

కోడలు రావడం, కొడుకు తల పగలడం...

ఆ ఒక్క నిమిషంలోనే అన్నీ గుర్తొచ్చేయి. అతడికి ఒక్కసారిగా ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"వందనమా! నీ కోడలేమో పచ్చి బాలింత. ఉయ్యాల్లో పసికందును చూసైనా నువ్వు రావాల్సిందే. ఇది పంతాలకూ పట్టింపులకూ పోవాల్సిన సమయం కాదు" అన్నాడు రాఘవులు.

వందనం మనిషి నిలువెల్లా ఊగుతూ పూనకం వచ్చినట్టు "వద్దు బాబూ! మమ్మల్నిలా సావనీయ్యండి నాయన్లారా! ఇది ఊరు కావడానికీ మీరు పెద్ద మదుసులు కావడానికీ నా నెత్తురూ నా కొడుకు నెత్తురూ మీ దోసిల్లలోనే పోసేం బాబూ! దిక్కు లేనోల్లం కదా మీరే దిక్కని మా రెక్కల్ని మీకే నరికిచ్చే నాయనా! ఆకరుకు నాకు మనుసుల మీదే కాదు బాబూ! ఈ పెపంచికం మీదే బెమలు సచ్చేయి నాయనా! నువ్వే నాడైతే నా ఒక్కగానొక్క కొడుకు తల పగలగొట్టేవో అయాలే దేవుడు నన్ను కళ్ళు తెరిచి చూడమన్నాడయ్యా! కానీ బాబూ!"...

ఎక్కడో ఫెళఫెళమని ఉరుము ఉరిమింది. దాని వెనకే! "ఛళుక్" మన్న మెరుపు. సరస్వతి కళ్ళల్లోనూ, వందనం కళ్ళల్లోనూ నీటి జల....

"కాని బాబూ! మేము పంటలు పండిచ్చి నలుగురి పాణాలు నిలబెట్టే వాళ్లమే కాని గొడ్డలితో చెయ్యి నరికి నోటికాడి బువ్వ ఎగరగొట్టే వాళ్ళం కాదయ్యా! మాకు మనసులుంటాయి నాయనా! సచ్చేటప్పుడైనా అందరం కల్సిసావో బతుకో ఈ గుడిసెలోనే తేల్చుకుంటాంకాని మీరెల్లిపొండి బాబుల్లారా!!" అని వందనం కొడుకునూ కోడల్నీ గుడ్డల ఉయ్యాల్నీ చూచేడు.

కొద్దిసేపటి తర్వాత ఇందాకటి ముగ్గురూ ఎండుచేపతో గాలివానలో తేలుతూ ఊళ్ళోకి నడుస్తున్నారు. ఎవరి ప్రాణాలుంచేదీ ఎవరి ప్రాణాలు తీసేదీ తెలీకుండా గాలోన మరింత ఎక్కువవుతోంది.

*(ఆంధ్రజ్యోతి వీక్లీ, 26-1-1990)*

18

# చావుకూడు

డా॥ వి.ఆర్. రాసాని

"ఇంత పెద్ద పట్నంలో పది రోజుల్నుంచి వొగ నా కొడుకూ సావలేదే!

"యట్లబ్బా జీవనం గడిసేది!!

"సాలీ సాలని బతుకులాయ! ఇంట్లో బాశాలి కుండే వొగ సీరా సినిగిపోయుండాది. రయికా అసలే నేదు. తెత్తా మంటేనా సేతిలో కాసు లేకపాయ.

"బిడ్డని సూత్తే పదిమంది!

"ఆరు మంది ఆడముండలు, నలుగురు మొగ పిలకాయలు. గంపెడు సంసారం!

" ఆద్నాలక ఆ బాశాలి (భార్య) మళ్ళీ నీళ్ళు బోసుకునింది. మూడో నెల!

"ఆ ప్రేసను జేసుకుందామంటే యిందు, అవత్తేలు మన ముండలేము. కనీసం ఆర్నెల్లయినా పనీ పాటా సేయకూడదంట. ఏఁవైనా జరిగితే ఈ గంపడు సంసారఁవూ ఎవురు సూత్తారయ్యా" అంటుంది.

"అది సెప్పేది గూడా నిజఁవే!

"బుద్ధీ గ్యానమూ వుండే వోడెవుడూ గా దనడు.

"పెద్ద బిడ్డె లిద్దరూ అబ్బుడే ఎదిగి ఎదమింద కూసిన్నారు. వోళ్ళకు పెండిండ్లు జేయాల. యింకా తాస్కారం జేత్తో వోళ్లెవుర్నయినా ఎత్తుకోని వూడిస్తే అనేక బర ముండదు.

"సంక బిడ్డెకుజోరం.

"దానికంటే. పెద్దదానికి వొగిటే దగ్గు. కరక్కాయ దగ్గు. మూడోదానికి పోలీయాడివోళ్ళ మానానికి గుడ్డ పిలికే నేదు. ఇంకేడ సూపెట్టేది?

"అది సాలక రేపో, మాపో అన్నట్టు వొగిటే, దగ్గుతో అర్నెల్ల పడవతో మంచమ్మీద బడుండే నాయన.

"యట్లబ్బా ఈ సంసారఁవేగేదీ?"

ఉదయాన తన గుడిసెముందు కూర్చుని ఆలోచిస్తున్నాడు మునిదానప్ప.

అదే సమయంలో అతని ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ ఇంట్లో పెద్ద గందరగోళం జరిగింది.

అటువైపు చూశాడతను.

ఇంచుమించుగా ఒకే పొడవున్న ముగ్గురు మగ పిల్లలు ఒకే బొక్కా కోసం పోట్లాడుకుంటున్నారు.

వెళ్లి విడిపించాడు.

ఇంతలో చేతిలో ఏదో ఎత్తుకుని పరుగెత్తుకుంటూ వచ్చాడు అతని కొడుకుల్లో ఒకడైన శివదానప్ప.

తండ్రిని చూసి అక్కడే ఆగిపోయాడు.

"ఏందిరా, శివదాసా, అది?" అడిగాడు అనుమానంగా మునిదానప్ప.

"ఏమీ లేదు, ఏమీ లేదు."

భయం భయంగా తన రెండుచేతులూ వెనక్కి దాచుకున్నాడు. కనుక్కుంటే ఎక్కడ కొడతాడో నన్న భయం అతని ముఖంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"అదీ.. అదీ" అంటూ రెండడుగులువెనక్కివేశాడు శివదానప్ప.

'వొరే,నా కొడకా! సెప్తావుంటే నీక్కాదంట్రా! ఇట్టియ్యి."

అతని చేతుల్లోంచి ఇలాక్కున్నాడు.

దాన్ని చూసిన అతని కళ్ళు క్షణం సేపు చెమర్చాయి.

"ఏందిరా, ఇది?" ఆ దేమిటో తెలుసున్నా అప్రయత్నంగానే అనేశాడు.

"నిన్నెవరో సచ్చిపోయుంటే ఈ దినం పిండం బెట్నారు. నిన్నట్నుంచీ సెల్లి బువ్వేదిన్లా. ఆ యమ్మికిద్దామని దెచ్చినా" వణికిపోతూ చెప్పాడు శివదానప్ప.

ఆ మాట వినగానే అతని కళ్ళ వెంట రెండు కన్నీటి బొట్లు రాలాయి. తన పిల్లలకు పిడికెడు అన్నం పెట్టలేని తనపరిస్థితికి తానే జాలిపడ్డాడు. ఇంతలో అతని చేతిలోని పిండాన్నాన్ని చూసే సరికి పిల్లలంతా కాకుల్లా ఎగబడ్డారు.

దేవుడి ప్రసాదంలా దాన్నేతలా కొంచెం పంచాడు.

అనంతమైన కోరికల పుట్ట అయిన మానవుడు మరణిస్తే తీరని కోరికలతో ఉత్తమ గతులకు పోడని కొడుకులు పెట్టే పిండాన్నాన్ని కాకిరూపంలో వచ్చి తిని స్వర్గానికి పోతాడని మన నమ్మకం.

కానీ ఆ పిండాన్నానీ ఆశించే మానవ జీవాలు కూడా వున్నాయంటే సిగ్గుచేటుకదా!

మునిదానప్ప అక్కడే కూర్చుని ఆలోచిస్తున్నాడు.

సంక బిడ్డ పాలకోసం ఏడుస్తోంది.

మరో బిడ్డ నల్లగా సొట్టలు పడి మురికిపట్టిపోయి వున్న సత్తుగిన్నె తీసుకుని, "అమ్మా! బువ్వే!" అంటూ శోకరాగం తీస్తోంది. "అమ్మా! పక్కింటి సుబ్బక్క కొడుకు ఇస్కూలుకు బోతావుండాడే. నాన్నూ బొగానే!" మరో పిల్లాడడిగాడు.

"తిండి లేకపోయినా ముక్కు కోబులాకీ అని.. నీకు బడొకటి కరువొచ్చిందిరా? నోరు మూసుకుని పడుండు!" సంకబిడ్డకు పాలిస్తూ కసురుకుంది ఆ ఇంటి ఇల్లాలు చుక్కమ్మ.

"ఏందయ్యో! నిన్నటి నుంచీ సెప్తా ఉండా. నీ మొనుమకెక్కలా! ఇంట్లో నూకలైపొయ్యి మూడు దినాలయింది. నిన్నా, ఈ పూటా అడుగూబొడుగూ ఊడ్సి సేరడు నూకలు దీసి గంజిగాసింత బోసినా. మద్దినాల నుంచీ పోస్తులే. ఇద్సాలక దా ముసిలోడు ఇబ్బుడో, ఎబ్బుడో అన్నట్టుండాడు. మంచం మీ్మదున్న ముసలాయన్ను చూసి ఆయాసపడిపోతూ చెప్పింది చుక్కమ్మ.

ఖళ్ళు ఖళ్ళున వినిపస్తున్న తండ్రి దగ్గు వింటూ నిస్సహాయంగా శూన్యంలోకి చూస్తున్నాడు మునిదానప్ప.

అతనికి ఒక్క చావుకర్మలు తప్ప మరేపనీ చేతకాదు. పైగా కూలికిపోదామన్నా ఎక్కడా కూలీ ల్లేవు.

కరువు నేల! కరువుకాలం!!

ఏం చేయాలో అర్థం గాక మనసులోనే రోదిస్తున్నాడు మునిదానప్ప.

ఇంతలో ఆ గతుకుల రోడ్డు గుండా సారా తాగిన వ్యక్తిలా ఊగుతూ ఓ కారొచ్చి ఆ గుడిసె ముందాగింది.

ఆ శబ్దం విని పిల్లలంతా కేరింతలు కొడుతూ దాన్నిచూడడానికి ఎగబడ్డారు.

ఆగిన కారులోంచి ఇద్దరు వ్యక్తులు దిగారు. అందులో ఒక వ్యక్తి అతన్ని సమీపించి, "ఏమయ్యా, దానప్ప ఇల్లిదేనా?" అని అడిగాడు. నాగరికులు తనింటికెందుకొస్తారో అతనికి బాగా తెలుసు. అందుకే ఎంతో వినయంగా వంగి ఏదో బేరం తగిలిందనుకుంటూ "నేనేసాఁవీ!" అన్నాడు.

"ఏం లేదయ్యా. మా ఇంట్లో ఒక పెద్దాయన కాలమైపోయినాడు కర్మజేయాల. ఆయన పెద్ద ఆఫీసరుగా ఉండేవాడులే."

"అట్టే సాఁవీ!"

"ఏం తడగతావ్?"

"ఏం తడగాలన్న సందిగ్ధంలో పడ్డాడు మునిదానప్ప.

"య్యోవ్! గుంత గూడా నువ్వే తొవ్వించాల. దాని కింకొర్ని యాడ అడిగేది అంతా కలిపి వొగేసారి అడుగు. అంతవరకూ చూస్తున్న రెండో వ్యక్తి కల్పించుకుంటూ చెప్పాడు. "ఆయనకు తమరేమవుతారుసాఁవీ" అడిగాడు మునిదానప్ప.

"అయినావాళ్ళంలే." చెప్పాడు రెండో వ్యక్తి. "తవఁరు మోఁడికార్లా? నామదార్లా?" తిరిగీ ప్రశ్నించాడు మునిదానప్ప.

"నాందార్లే!"

"నామదార్లయితే శానా పనుంటుంది, సాఁవీ! గోర్ని కోసి తునకలు వండాల. అందరికీ వడ్డించాల. శానాపనుంది,సాఁవీ!"

"అదే! అయ్యన్నీ సూసుకోని అడుగు." మొదటి వ్యక్తి చెప్పాడు.

మళ్ళీ ఆలోచనలోపడ్డాడు. మునిదానప్ప.

సమయం వచ్చింది కాబట్టి ఎక్కువడగాలనుకున్నా ఎక్కువని తోస్తే వద్దులే అని మరొకరి దగ్గరకు వెడతారేమో నన్న అనుమానంలో కూడాపడ్డాడు.

రాయలసీమ జిల్లాల్లో శవాన్ని సాగనంపే పద్ధతులు రెండున్నాయి. మనిషి చనిపోగానే స్నానం చేయించి, పాడె కట్టించి, కొబ్బరికాయ కొట్టి మోసుకెళ్ళి ఖననం చేయడం ఒక పద్ధతి. ఈ పద్ధతి ప్రకారం. చేసేవాళ్లను మోడికార్లు అంటారు. ఇది అందరూ సాధారణంగా పాటించే పద్ధతి.

అలా గాక కొన్ని వైశ్య బ్రాహ్మణేతల కులాల వ్యక్తి మరణించగానే దానప్పను పిలిపించి శవంతోపాటు తామూ నామాలు వేసుకుని మాంసం వండిస్తారు. ఆ తరువాత దానప్ప చేత శంఖం ఊదించి, ఆ శవం చేతిని ఆ కూరలో అద్దించి, ఒక మాంసపు ముక్కనే శవం నోట్లో ఉంచి,ఆ కూరను ఆ తరువాత అందరూ వడ్డించుకుని భోజనాలు చేస్తారు. ఈతంతు అయిన తరువాత శవాన్ని పాడెపైన తీసుకెళ్లి పూడ్చి, అక్కడ కోడిని గాలిస్తారు. ఈ పద్ధతిలో శవాన్ని ఖననం చేసేవాళ్ళను నామదార్లు లేదా తిరుమదార్లు అంటారు.

ఇది కర్ణాటక దేశంలో కూడా ఉంది. ఇది వైష్ణవ మత ప్రభావంతో వచ్చిన ఆచారం. నామదార్లు అన్ని శూద్రకులాల్లోనూ ఉంటారు. అయితే మోడికార్లకు నామదార్లకు మధ్య సామాన్యంగా వివాహ విషయాల్లో ఇచ్చిపుచ్చుకోవడాలు వుండవు. ఈ నామదార్లకు అన్నీ ఆచారాలే. శవదహన విషయాల్లోనూఅంతే.

దానప్ప ఈ విషయంలో ప్రధానపాత్ర వహిస్తాడు. అందుకే వాళ్ళు అతని దగ్గరకొచ్చారు. ముని దానప్ప ఈసారి నిక్కచ్చిగా చెప్పాడు.

"నైటేభైయియ్యండి. సాఁవీ!"

"ఇదేం దయ్యోవ్! అట్టడుగుతున్నావ్? మొదటి వ్యక్తి బేరమాడే దృష్టిలో వున్నాడు. "అంత కష్టముండాదిలే!"

"సరే, ఈసారి సెప్పు!" అన్నాడు రెండో వ్యక్తి "ఈ తడవ మీరే ఏదో సెప్పండి, సాఁవీ!" "ఇది సావు. బాధల్లో ఉండాము. డెబ్బయ్యిస్తాములేవయ్యా!"

"గిట్టదు,సాఁవీ, గుంత తొవించాల కర్మాంతరం జేయించాల. ఇవన్నీ కడుపులో కూసింత మందుబడంది సెయ్యలేము. మందు గుర్తుకు వచ్చి నోరుచప్పరిస్తూ చెప్పాడు. "మరెంతియ్యమంటావ్?" "నూట ముప్పయ్ యియ్యండి సాఁవీ!" "అదీ ఇదీ వద్దు గానీ, నూరు మట్టసంగా సేసుకో ఫో! ఇంకేం మాట్లాడొద్దు" తెగేసి చెప్పాడు రెండో వ్యక్తి.

"నేను తఁవరు ఆ ట్టేనేసినాక ఇంకేముండాది!"

అసంతృప్తిగానే ఒప్పుకున్నాడు మునిదానప్ప. దాంతో మొదటి వ్యక్తి జేబులో నుంచి కొంత డబ్బులు తీసి అడ్వాన్సు ఇచ్చి "మిగిలింది మళ్ళీ ఇస్తాములే" అన్నాడు.

"సారాయి కేదయినా ఇంత కొట్టండి.సాఁవీ నసుగంతా దోసిలు ముందుకు చాపి అన్నాడు మునిదానప్ప. తన జేబులో నుంచి అయిదు రూపాయలు తీసి అతని చేతులో పెట్టి తాగుబో అన్నాడు.

"తాగేసి యాడన్నా ఎగ్గొట్టేవు!" హెచ్చరించాడు మొదటి వ్యక్తి.

"ఏంది సాఁవీ అట్టంటారు. నేను శానా నికార్సయిన మడిసిని, సావీ! డబ్బులు బొడ్లో దోపుకుంటూ అన్నాడు. అలా వారి మధ్య బేరం కుదిరాక ఏవేం కావాలో అడిగాడు మొదటి వ్యక్తి.

"ఏమయ్యా దానప్పా! ఏమేమి తెచ్చుకోవాలోసెప్పయ్యా!"

"ఆరు మీటర్లు తెల్లగుడ్డా..."

"ఏమయ్యోయ్! అంతెందుకు? మధ్యలోనే ప్రశ్నించాడు రెండో వ్యక్తి.

"సరే ఎంతో వొగంత తవరే తెచ్చుకోండి ఒక బిడ్డకు చొక్క గుడ్డ తగ్గిపోతనే అనకున్నాడు మనసులోనే మునిదానప్ప.

తిరిగి చెప్పసాగాడు. మూడు టెంకాయలు, కడ్డీలు, కర్పూరం, శవంపైన చల్లేదానికి అయిదు శేర్లు బొరుగులు. అందులోకి ఒక శేరు సిల్లర కాసులు, తాంబూలం, గుంతకాడ గావుకు ఒక కోడి పుంజు, ఇవి కావాల గొర్రె గిర్రె అది మీరే సూసుకోండి."

సరే, గుంత తవ్వే వోల్లను మాతో పంపించు" అని మొదటి వ్యక్తి అనగానే పక్క గుడిసెలోకి వెళ్ళి ఇద్దరు మనుషులను వారి వెంట పంపించాడు మునిదానప్ప.

"మూడు గంటలకంతా వచ్చేయ్!" అని చెప్పి, చిరునామా ఇచ్చి వారిని పిలుచుకుని వెళ్ళిపోయారు వాళ్లు.

తన తరువాత కులవృత్తి అయిన దానప్ప ఆచారాన్ని నిలబెట్టేందుకు ఇప్పటి నుంచే శిక్షణ ఇస్తున్న పదహారేళ్ళ తన కొడుకైన శివదానప్పను పిలిచి, ఒకచురకత్తిని ఒక పాత్రను ఒక చేతి సంచిలో ఉంచి దాన్ని అతని చేతికిచ్చి తన వెంట తీసుకుని అనుకున్న సమయానికి అక్కడికి చేరుకున్నాడు మునిదానప్ప.

అప్పటికే గుంత తవ్వడానికి వెళ్ళిన వారి సహాయంతో మాంసం వండారు వాళ్ళు. ఆ వండిన మాంసంలో శవం కుడిచేతికి అద్ది, శవం నోట్లో ఒక మాంసపుముక్క పెట్టి ఆ వండిన మాంసాన్ని వచ్చిన బంధువర్గానికందరికీ వడ్డించాడు. చివర కొడుకుతోబాటు తానూ ఆ చావుకూడు కడుపార తిన్నాడు.

మిగిలిన అన్నాన్ని మూటగట్టి ఓ మూల పెట్టి, మిగిలిన కూరను వెంట తెచ్చుకున్న పాత్రలో పోయించుకుని దాన్ని కొడుకు చేతికిఇచ్చాడు. నామదార్లు కాని ఇతరులు ఆ శవాన్ని చూడటానికివస్తే శవం చుట్టూ తెరకట్టి ముఖం మాత్రమే చూపిస్తారు. ఆ తంతు కూడా మునిదానప్పే నిర్వహించాడు. అతరువాత అక్కడ యింటి ముందర వీధిలో శవాన్ని పెట్టించిస్నానం చేయిస్తున్నాడు. ఆ పక్కనే శవం తలవైపుగా పిండాన్నాన్ని వండుతున్నారు. కొందరు పాడే కడుతున్నారు. దానప్ప ఆ విషయాల్లో వారిసాయం చేస్తూ కూర్చున్నాడు. శివదానప్ప మాత్రం దూరంగా వెళ్ళి తను తెచ్చుకున్న చావుకూటిని పట్టుకుని కూర్చున్నాడు.

డప్పులుచావు దరువులో ప్రాణం పోయే ముందుకొట్టుకునే హృదయంలా మెల్లగా, లయబద్ధంగా మోగుతున్నాయి. అక్కడ అందరి హృదయాల్లోనూ స్మశాన వైరాగ్యం చోటుచేసుకుంది. అక్కడ చేరినఅడంగులు "ఏం బిడ్డెలో, ఏం పాపలో!" అనుకుంటూ ముక్కులు చీదుకుంటూన్నారు.

తయారైన పాడెపైన శవాన్ని పెట్టించి చేతులకు, కాళ్ళకు బందిలి వేశాడు ముని దానప్ప గుంత తవ్విన వెంకటయ్య, నాగయ్యల సాయంతో శవానికి తెల్లగుడ్డ చుట్టించి వరిగడ్డితో పేనిన తాటితో శవాన్ని పాడెతో బిగగట్టించాడు. అలా అన్నీ సిద్ధమైన తరువాత కొబ్బరికాయ కొట్టి, వప్పుల్ని కొడుకును పిలిచి అతని చేతికిచ్చాడు. అతను వాటిని చేతి సంచిలో వేసుకున్నాడు. మునిదానప్ప ఒక చేత్తో గంట వాయిస్తూ, మరో చేత్తో శంఖం ఊదాడు.

అంతే! అక్కడ గోవిందా! గోవిందా!" అన్న మాటలు మిన్నుముట్టి, మరుక్షణం నేలపై వున్న పాడె మనుషుల భుజాలపైకొచ్చింది. డప్పుల మధ్య గంట కొడుతూ శంఖం ఊదుతూ దానప్ప ముందు వెళుతుంటే డప్పుల వారి వెంట శవం ఊరేగింపు స్మశానం వైపు సాగింది. దారి పొడుగునా శవంపైన చల్లుతున్నపూలు, బొరుగులు, కాసులు కింద పడుతున్నాయి.

కిందపడిన కాసుల్నిశివదానప్ప ఏరుకుంటూ వస్తున్నాడు. స్మశానికి కల్లంత దూరంలో దింపుడు కళ్ళెం సాగింది.అక్కడ కర్పూరం వెలిగించి మరో కొబ్బరికాయ కొట్టాడు మునిదానప్ప. వాటిని ఏరి శివదానప్ప సంచిలో వేసుకున్నాడు. దింపుడు కళ్ళెం నుంచి గుంత దగ్గరకు చేర్చారు శవాన్ని. అక్కడ వెంకటయ్య నాగయ్యల సాయంతో శవాన్ని గుంతలో పెట్టించాడు మునిదానప్ప.

చేతి సంచిలో వున్న చురకత్తి తీసిచ్చి బందిలి కోయించాడు.

"వొరే, యంగటా! గుడ్డ సించరా!" పురమాయించాడు శవం పక్కన నిలబడి వున్న వెంకటయ్యకు..

వెంకటయ్య శవానికి చుట్టిన గుడ్డలో కొంతభాగాన్ని పైకి లాగి చించబోయాడు.

"వొరే ఉండు! ఏమి చించతావుండావురా, నాకొండె, ఇంకొంచెం ఎక్కువగా వచ్చేటట్లు కొంచెం దిగువకు సించరా! అని మునిదానప్ప సూచనతో సరుదున చించాడు వెంకటయ్య.

ఏం జించినావురా! మొగబిడ్డెకు బాడీ కూడా గాదే!'" చించిన తెల్లగుడ్డను అందుకుని పరిశీలిస్తూ తనలో తానే గొణుక్కున్నాడు మునిదానప్ప.

అందులో నుంచి ఒక అంగుళం పీలికను తిరిగి వేరు చేసి, దాన్ని తల కొరికి పెట్టేవాడి మొలకు చుట్టాడు. "నాయనా, ఇది భద్రంగా ఉండాల సాంవీ! మళ్ళా ఇంట్లో దీపం కింద పెట్టాల" అని వెంట వెంటనే పనులన్నీ చకచకా చేసుకుపోతున్నాడు. "వాత బియ్యం!" అని కేకేశాడు. వెంటనే పక్కనే వున్న శవం తాలూకు మనిషి ఇంటి నుంచి తెచ్చిన బియ్యాన్ని ఒక పాత చేటలో అందించాడు.

వాత బియ్యం ఎయ్యి సాంవీ! అని తలకొరివిపెట్టే వాడి చేతికి కొన్ని బియ్యాన్ని పిడికిలితో ఇచ్చి శవంపైన వేయించాడు. "వొగగరే వచ్చి వాత బియ్య మేయండి, సాంములూ! కడయాత్ర పుణ్ణెమొస్తుంది" బిగ్గరగా అరిచాడు.

ఆ మాటతో ఒక్కక్కరే వచ్చి అతని చేతిలోని వాత బియ్యాన్ని తీసుకుని అక్షంతల్లా శవంపైన చల్లి పక్కకు తప్పుకున్నారు.

"వొరే అబ్బోడా! యాడుండావురా!" అని కొడుకునుకేకేయగానే,అంతవరకూ ఆ తంతంతా చూస్తున్న శివదానప్ప ముందుకొచ్చి "ఏమప్పా" అన్నాడు.

"సంచిపట్రా!" అని అతని చేతిలోని సంచిలో మిగిలిన బియ్యాన్ని పోసుకున్నాడు.

వండిన పిండాన్నాన్ని తలకొరివి పెట్టేవాడి చేతి కిచ్చి "మెతుకులెయ్యి,సాఁవీ!" అని అతని చేత ఆ శవం పైన మెతుకులు వేయించి ఆ చట్టిని అక్కడే తలవైపుకు గుంతలో వేయించాడు. అలాగే మొలలో గుడ్డ చుట్టిన వ్యక్తి చేత మట్టి వేయించి తల కొరివి పెట్టించి బంధువులచేత కూడా మట్టి వేయించాడు.

"ఎవరైనా మట్టెయ్యొచ్చు, సాఁవీ! మనం నచ్చినప్పుడు మట్టి ఏసేవోళ్ళు వుంటారో, వుండరో, యెయ్యండి!" అని కేకేశాడు దానప్ప.

అలా ఆ శవాన్ని పూడ్చడం పూర్తయ్యాక వెంట తెచ్చిన కోడి పుంజుకు కాళ్ళు కట్టేవేసి, ఆ గుంతపైన అటువైపు నుంచి ఇటువైపుకు మూడుసార్లు విసిరేసి, ఆ కోడిని కొడుకు చేతికిచ్చాడు. శివదానప్ప దాన్ని చేతపట్టుకున్నాడు. దాంతో ఒక మనిషికి ఆఖరి వీడ్కోలిచ్చిన అక్కడి వారంతా స్మశాన వైరాగ్యం వదులుకుని తిరుగుముఖం పట్టారు. "వొరే, అబ్బా! నువ్వు ఇంటికి పో! నేను మల్లొత్తా!" అని చెప్పి శివదానప్పను ఇంటికి పంపేశాడు మునిదానప్ప. తన తండ్రి తరువాత ఎందుకొస్తానన్నాడో శివదానప్పకు తెలిసినా, ఏమీ అనలేక ఇంటిముఖం పట్టాడు.

అది అతనికి మామూలే.

రావాల్సిన డబ్బులు తీసుకుని, గుంత తవ్విన వెంకటయ్యకు నాగయ్యకు వారి వాటా లిచ్చి పంపించేశాడు.

"ఇంక వారం దాకా బయంవులా. యట్టోవొగొట్టా కడుపాత్రం తీరుతుంది. అంతలోపల ఇంత పెద్ద పట్నంలో ఏ మారాజో ఓ మారాజు సావకపోతాడా. మన పొట్ట గడవకపోతుందా'అనకుంటూ అక్కడినుంచి బయలుదేరాడు మునిదానప్ప.

"నీ ఇంటి మొదలు పడిపోనానీ! మీ యప్ప (నాయన) సచ్చిపొయ్యి అందరూ యాడత్తా వుంటే నువ్వు సారాయి దాగొచ్చినావా?" గుంపుగా చేరి వున్న మనుషుల్లో నుంచి వచ్చిన పక్కింటి చెంగమ్మతాగొచ్చిన మునిదానప్పను తిట్టుకుంటూ వెళ్లిపోయింది.

"వొసే నీ యబ్బదాలా! అని నత్తి నత్తిగా గొణుకున్నాడు మునిదానప్ప.

"వొరే, దానప్పా! మళ్ళా తాగేసొచ్చినావా? సిగ్గులేదంట్రా నీకు! ఆడయాడనో ఎవురికో కర్మాంతరం చేయను బొయ్యొనియావు. బిడ్డలు పస్తులుంటే ఆ దుడ్డుతో తాగేసొచ్చినావు. ఇక మీ యప్పకు కర్మాంతరం చెయ్. తుఫ్!" మరో అతను ముఖాన ఉమ్మినట్లు అనడంతో మత్తంతా దిగిపోయినట్లనిపించిదతనికి.

గుడిసె ముందర పాత నులక మంచం మీదున్న తండ్రిని చూసి అంత మత్తులోనూ అతనికి కళ్ళ నీళ్ళు గిర్రున తిరిగాయి.

అంతకుమించి....

'కర్మాంతరానికి వందకుపైగా అవుతుందే! ఎవుర్నడగాలబ్బా!" అనుకుంటూ తన తప్పుకు తానే పశ్చాత్తాపపడిపోతూ అక్కడే కూలబడిపోయాడు మునిదానప్ప.

*(జూన్, 1992)*

19

# దేవుడు

ఎమ్. సుగుణరావు

వారంతా గుంపులుగా కదులుతున్నారు. గూడెం దాటి మామిడిపల్లి నుంచి టౌన్‌లోకి అడుగువేస్తున్నారు. వర్షపుచినుకులు టప్‌టప్‌మని లయబద్ధంగా పడుతూ ప్రశాంతతని చెడగొడుతున్నాయి. నీలం, ఎరుపు సిరాలో ముంచినట్టుగా వుంది ఆకాశం. క్షణ క్షణానికి మెరుపులతో ఉరుముతోంది.

ముందు నడుస్తున్న నందయ్య గిరుక్కున వెనక్కి తిరిగేడు. తడవకుండా వుండడానికి తువాలు నెత్తికి చుట్టుకొని, నడుస్తున్న గుంపును ఓసారి పరికిస్తూ.

"ఏందిర ఇంత పెండ్లి నడుత్తన్లు, మబ్బుల లేచిన గూడ మనం పొయెటట్లు లేదేమోరా, నడువుండ్లహె. జల్ది.. జల్ది నడివుండ్లి.. లేకుంటే యాడబోతము. .అన్నాడు.

నందయ్య అతుకులేసిన తెల్లచొక్కా వేసుకున్నాడు. తొడుక్కున్న ఖాకీ నిక్కరు గంజితో బరువుగా వుంది. జులపాలుగా వున్న జుట్టుకు కొబ్బరినూనె దట్టంగా పట్టించేడు. మొహం జిడ్డుకారుతోంది. చంకలో మూట వేళ్ళాడుతోంది.

నందయ్య మాటలకు నడుస్తున్న గుంపు వేగం పెంచిగబగబా అడుగులే వేయసాగేరు. వర్షంతో నేల తడిసివుండడం చేత అడుగులు కష్టంగా పడుతున్నాయి. నందయ్య పక్కగా నడుస్తున్న లచ్చయ్య "ఒరే, రామోలోరిని ఎన్నడైనా చూసిన్నావురా" అన్నాడు. ఆ హోరుగాలిలో ఆ మాటలు నందయ్యకు వినిపంచలేదు. చుట్ట తీసి వెలిగించి గుప్పు గుప్పు మంటూ రైలింజనులా పొగవదులుంతే "ఏందిరా నీకింత పరాకాయె,రామలోరిని చూసినావా, అంటే పలకవాయే" అన్నాడు లచ్చయ్య కోపంగా

"ఓ పాలి దూరంనించెలి చూసి ఉరికొచ్చినాను, మా అవ్వ శానా బయపడి, పోవద్దు బిడ్డా ఆళ్ళు మనలసంపుతరు, మన కులపోల్లు రాములోరి దగ్గరకుపోవద్దు. పోతే లొల్లి అవుద్ది, మనకు పోశమ్మ, ఉప్పలమ్మ ఉన్నదిరో అందిరా మా అవ్వ ఆ దినం" తనగోడు వెళ్ళబోసుకున్నాడు నందయ్య.

"ఏమో, ఇయాల ఏమైతరో" కుంటుతూ వస్తున్న ముసలోడు పెదవి దించేడు. "ఇంకా మీ జమానా కాదులే, మన సర్కారు అందర్నీ ఒకే తీరుగా సూత్తాంది" ఆవేశంగా అన్నాడు లచ్చయ్య.

దూరంగా స్పీకర్‌లో వినవస్తున్న పాటలకు నందయ్యలో సంతోషం ఎక్కువయింది.

"రాములోరికి ఏమేంతెత్తన్నావురా'' అన్నాడు లచ్చయ్య వంక తిరిగి హుషారుగా. ఆ మాటలకు తన చంకలో వేళ్ళాడే మూట చూపిస్తూ "కేలపండ్లు, ఊదిబత్తీలు, కొబ్బరికాయలుతెత్తన్నా, ఇవి కొనుక్కొస్తనీకే మస్తు పైసలయినయ్. బావి ద వ్వపోయిన పైసలతోని ఇవ్వన్నీ కొనుక్కోత్తనరా. మల్లబోయినంక మాపటికే లేదురా. ఏం దేవుడో గాని, దేవునికిన్నిత్తనాంగాని మన కట్టాలుఎపుడు బాపుతాడో?'' అన్నాడు నిర్లిప్తంగా లచ్చయ్య.

గుడి దగ్గరకంటూ వచ్చేశారు. గుడికెదురుగా సర్వేబాదులతో పందిరి వేసుంది. గుడికి డిస్టెంబరు రంగు వేయబడి ఉంది. చాలా పురాతనమైన గుడి అది. కొన్ని సంవత్సరాలుగా ఎవరి ఆలనా పాలనా లేక అనాథలా మిగిలవున్న ఆ గుడి పరిస్థితి చూసి ఆ వూరి పెద్దలుచందాలు పోగుచేసి బాగుచేయించారు. శ్రీరామనవమి పండుగను పురస్కరించుకుని ఉత్సవాలు జరుపుతున్నారు. ఏం బాగో ఏమిటో అని ఆ గుడిని చూసి విమర్శించినవారు లేకపోలేదు. కారణం అది కూలిపోవడానికి సిద్ధంగా వున్నట్లే కనిపిస్తుంది. పెచ్చులూడిపోయిన గోడలతో శిథిలాలయంలా ఉంది.

నందయ్య గబగబ అడుగులేస్తూ గుడి పక్కనే వున్న గిలకబావి దగ్గరకువెళ్లి కాళ్లూ,చేతులూ కడుక్కొని ముఖద్వారం వద్ద వచ్చి ఆగి తన వెనుక వచ్చిన మిగిలిన పాతిక మందిని ఉద్దేశించి...

"జల్ది జల్ది కాళ్లు గడుక్కొని , గుళ్ళేకు పోదాము. ఒకల్లెనక ఒకలు రాండి'' అన్నాడు. గబగబా వస్తున్న నందయ్యను, అతడిని అనుసరిస్తున్న పాతికమందిని చూసి ఒక వ్యక్తి ఉగ్రరూపంతో చేతిలో వున్నబాణాకర్రను అడ్డు పెట్టేడు, అతను పొడుగ్గా బలంగా వున్నాడు. మీసాలు వంపు తిరిగివున్నాయి. బనీను వేసుకుని పంచె కట్టుకున్నాడు. మెడలో తాయెత్తు, మొరటుచూపులు. కళ్ళు క్రూరంగా తిప్పుతున్నాడు.

వారంతా అతన్ని చూసి ఆగిపోయారు. నందయ్య ఏదో చెపుదామని ప్రయత్నించే సరికి బాణాకర్ర అడ్డుపెట్టిన అతని వెనుకగా ఇంకో అతనొచ్చి నుంచున్నాడు.అతను పొట్టిగా వున్నాడు. మొహం గుండ్రంగా వుంది. నెత్తిమీద వున్న కొద్ది జుట్టు ముడివేసి ఉంది. బాగా పెరిగిన పొట్ట, నుదుటిమీద నామాలు, పొట్టమీది విభూతి రేఖలు.

వాళ్ళందరిని చూసి అతను కోపంగా.

"ఎవ్రల మీరు మాల మాదిగలం.. దిగున్రా వెనుకకు దిగన్రా.. '' అన్నాడు. ఆ మాటలకు నందయ్య రెండడుగులు వెనక్కి వేసి " ఏంది బాంచెన్ గట్లంటన్లు? మేమురాములోర్ని చూసెతందుకు వచ్చినం జర జూడనీ'' అన్నాడు బాణా కర్ర వ్యక్తి నందయ్యను కర్రతో పక్కకునెట్టి "అరేరేఎక్కకంద్రి ముట్టుడైపోతది. ఎవరైనా వూరివారు జూస్తే నన్నుతిడుతరు - ఎందుకు రానిచ్చినావని?'' అన్నాడు. ఆమాటలకుహతాశుడై లచ్చయ్య.. వేసుకున్న పూజారివంక తిరిగి "అయ్యా వార్లూ, మేము శానా దూరం నుంచేలి వచ్చినం. మల్ల ఎట్లొత్తం దొర జర మొక్కనియ్యండి అన్నాడు ప్రాధేయపడుతూ.

"ఏందిర సచ్చిన.. ఊరిబైట బడుండెటోళ్ళు మీకు రాములోరు కావల్నరా? ఊరి బయట ఉప్పలమ్మ, పోశమ్మ వున్నదిగా నడువుండ్లి ఇక్కణ్ణుంచెలి మీరిండ్లకొస్తే మనమల్లయ్య నన్ను తిడతడు. అసలు మీకెవడు చెప్పిన్రా, ఇక్కడకు రమ్మని? చల్ ఎల్లిపొన్రి మల్లన్న కానొస్తే బొక్కలు ఇరగ్గొడతడు'' అన్నాడుపూజారి కోపంగా అతను అలా తన తిట్ల ప్రహసనం కొనసాగిస్తుండగానే

నందయ్య తల పైకెత్తి గర్భగుడిలోని దేవుణ్ణి చూద్దామని ఒక అడుగు ముందుకు వేశాడు. వెంటనే బాణాకర్ర వ్యక్తి కర్రతోనందయ్య నెత్తి మీద కొట్టేడు. ''అబ్బా'' అని నందయ్య తలపట్టుకుని వెనుకకు తిరిగేడు.

నందయ్య వెనుకకు తిరిగిన తరువాత ఇంకో నలుగురుద్వారానికి అడ్డంగా నిలబడ్డారు పూజారి పొట్ట సవరించుకొంటూ.

"కుక్కకు సందిస్తే మూతి నాకినట్లు, ఏదో గుడిసెలేస్తే ఇంక దేవుని చూసెతందుకు వచ్చినార్రా? పాపమని బతకనిస్తే మీకు దేవుడు కావాల్రా? ఎవరైనా జూస్తే నా నోట్లో మన్ను పడతది, మీ ఇల్లు బూడిదైతది. పొండి" అంటూ అరిచాడు. ఆ మాటలు పూర్తిగా వినకుండానే నిట్టూర్పు విడుస్తూ అంతా వెనుతిరిగారు. దెబ్బ తగిలిన నెత్తిమీద చేయి ఆనించి నీరసంగా నడవడం ప్రారంభించేడు నందయ్య. అతనితోపాటుమిగతావారంతా ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా వడి వడిగా అడుగులు వేయసాగేరు. వాన చినుకులు క్రమేపీ పెద్దవై గాలివాన దశకుచేరుకున్నాయి. వున్నట్టుండి ఆకాశం ఉరిమింది. క్షణంలో వాతావరణంలో మార్పు. అంతా పరుగులాంటి నడక ప్రారంభించేరు. ఈదుడుగాలి ఎక్కువయింది. చూస్తుండగానే రోడ్డు పక్కనే వున్న చింత చెట్టు పెళపెళమంటూ విరిగిపడి నేలకూలింది. దగ్గరలో కనిపించే రైల్వేస్టేషన్‌లో తలదాచుకోవచ్చని అంతా పరిగెత్తేరు. ఫ్లాట్‌ఫారమ్మీద తలోచోట చతికిలా పడ్డారు. నందయ్యలో నీరసం ఆవరించింది. నెత్తిమీద తగిలిన గాయం మంట పెడుతోంది. కళ్ళు మూతలు పడుతుండగా నిద్రకు ఉపక్రమించేడు, బయట వర్షం తగ్గేట్లు లేదని.

కుక్క పిల్లిని తరుముతోంది, చూస్తుండగానే నాలుగువైపుల నించీ పిల్లి పిల్లలుచేరాయి. ఆ పిల్లుల గుంపును చూసికుక్కతోక ముడిచేసరికి పిల్లులన్నీ దాన్ని చుట్టుముట్టాయి. నందయ్య దిగ్గున లేచాడు. "ఏమిటీ కల?!" అనుకుంటూ కళ్ళు నులుముకొని చూశాడు. ఫ్లాట్‌ఫామ్మీది తన మనుషులంతా కునికిపాట్లు పడుతున్నారు. తువాలు నెత్తికి చుట్టుకొని బైటకొచ్చిచూశాడు. వాతావరణం ప్రశాంతంగా ఉంది. తుఫాను వెలిసింది.మబ్బుల్లోని సూర్యుడు బైటకొచ్చాడు. "అరె, లెగుర్రి, జల్దీ లెగుర్రి" అంటూ అరిచాడు. అతని మాటలకు అంతా లేచి గబగబా రైలుకట్ట వెంబడి నడవడం ప్రారంభించేరు.

నందయ్య మనసులో ఎన్నో చిక్కు ప్రశ్నలు. తనొకొచ్చిన పగటి కలలోని అంతర్యం ఏమిటా అనే ఆలోచనలతో నడుస్తున్నాడు.

"నాకు తొల్తె సమజయ్యింది, మనల గుల్లోనికి తోల్రని, ఛీధూత్" అంటూ ఛీత్కారంగా ఉమ్మేశాడు. ఆ మాటలు విని లచ్చయ్య "అరే, కూలిపైసలు పాయె, బగ్గ పైసలయినయ్ రామలోరికి ముడుపుకట్టె తందుకు" అంటూ నిట్టూర్పు విడిచాడు మిగతా వారంతా మౌనంగా నడుస్తున్నారు. వాతావరణం పొడిగా ఉంది. మధ్యాహ్నపు ఎండ వల్చగా వున్నా చురుక్కుమనిపిస్తోంది. మళ్ళీ వస్తాను సుమా అనే హెచ్చరికతో వాన చినుకులు విరామం చూస్తూ పడుతున్నాయి. అంతా రైలు కట్టదాటి మామిడిపల్లి వైపు తిరిగేరు. చేలగట్ల బురదలో కాళ్ళు జారుతున్నాయి. గూడెంకు చేర్చే అడ్డరోడ్డుకుసమీపంగా వచ్చి అటుతిరగబోయేటంతలో, "ఒరే అగురొరే. మీతో పనిబడినాది. అయ్యగారు కబురంపిన్రు." ఆయాసపడుతూ వచ్చి చెప్పేడు బాణాకర్రతో వారిని ఆపిన వ్యక్తి. అతని వంక ప్రశ్నార్థకంగా చూసి, మాతో ఏం పని?" అన్నాడు నందయ్య కోపంగా "నాకు దెల్వదు. వున్న పట్నే మిమ్మల్ని తోలుకు రమ్మన్నరు అయ్యావారు.

పోదాంప'' అన్నాడు బాణాకర్ర. "ఏందిరా లచ్చిగా, ఏం జేద్దాము?'' అన్నాడు నందయ్య. లచ్చయ్య కొద్ది క్షణాలసేపు ఆలోచించి, ''ఇద్దరం బోయి సంగతి తెల్సుకుందాం'' అన్నాడు మిగతా వారిని అక్కడే వుండమని ఇద్దరూ బయలుదేరేరు. గుడి దగ్గరయ్యేకొద్దీ వారిలో ఉత్సాహం ఎక్కువైంది. గుడినించి పాటలు వినపడడం లేదు.బాణాకర్ర భయం భయంగా చూస్తూ వీరివెనకే వస్తున్నాడు.

తలొంచుకొంటూ వస్తున్న నందయ్య, లచ్చయ్యలకు గుడి సమీపించేసరికి ఆశ్చర్యం కలిగింది. తాము చూసేది కలో, నిజమో అర్థం కాలేదు. గుడి ఒక మూలకు ఒరిగిపోయింది. ఎడమ భాగపు గోడ కూలిపోయి ఉంది. వారు ఆశ్చర్యం నించి తేరుకునేటంతలో పూజారి గబగబా వచ్చి, "అరే ఆరే, దేవుని గుడి కూలిపోయింది. తుఫానుకి, గాలివానకి గోడలు పడిపోయినయిరా, మళ్లీ కట్టాల. గోడ పనికి ఒస్తార్రా, దేవుణ్ణి వెంటనే నిలబెట్టకపోతే మన ఊరికిగత్తర ఒస్తాదట, మన పొలాలు పండ వంట, చెరువు కట్ట తెగిపోతాదట! మీరు వెంటనేకూలిపనికి రాండి, మీ వాండ్లను తోలుకుని జల్దీ పని చెయ్యాలిరా,'' అన్నాడు.

నందయ్య ముఖం ఆ మాటలతో మ్లానమయింది. రెండు చేతులు బిగుసుకున్నాయి. లచ్చయ్య భుజం మీద చెయ్యి వేసి, ''అపుడుగుళ్ళో కొచ్చినప్పుడు ముట్టుడుంది గానీ గుడి కట్టెతందుకు లేదా సామీ ముట్టుడు? ఈ గుడి కట్టెతందుకు మేమె దొరికినామా? అవును సామీ, పుట్టినకాణ్ణించేరి, సచ్చేదాకా మేమే మీగతి. నువ్వుపుట్టనప్పుడు నీ ఇల్లు కడిగింది మేమే నీ ఇంట్ల బావి తవ్వింది మేమే. నువ్వు తొడుక్కున్న చెప్పులు కుట్టింది మేమే. నువ్వు పాలు తాగనీకి పెంచే గొడ్లను సాదేది మేమే. ఇన్నిటికాడ లేని ముట్టుడు మట్టిబొమ్మకాడ ఒచ్చినాదా సామీ, ఆ బొమ్మవున్న గుడి కూలిపోతే కూలిపని చెయ్యనీకి మేమే దొరికినామా సామీ? ఛీ ధుత్....' అంటూ ఛీత్కారంగా ఉమ్మేసి నిలబడ్డాడు నందయ్య.

ఆ మాటలు విని ఏమనాలో తెలీక నిశ్చేష్టుడై నిలుచుండిపోయాడు పూజారి. లచ్చయ్య తన చెయ్యి నందయ్య భుజం మీద వేసి, పూజారి వంక తిరిగి "'ఏం దొరా గత్తర ఒస్తాదా, రానీండీ మాకు పనికిరాని దేవుడు మాకెందుకు? మా వోడు తన్నుల బడ్డపుడు ఏ దేవుడు అడ్డం వచ్చిండు? ఆడి మనుషులు మావోడి రక్తం చూసినప్పుడు ఏ దేవుడురచ్చించ్చిండు? ఆడి గుడి పడిపోతుంటే చూసెటోడు, మడుసుల రక్తాలు చూసెటోడు, ఆ దేవునికోసం మేమెందుకు తిప్పలుబడేది!? మీ దేవుణ్ణి మీ కాడనే వుండనీండి సామీ; మా రెక్కలే మాకు దేవుడు, మా కట్టమే మాకు దేవుడు' 'అని నందయ్యను తీసుకొని అక్కడి నుంచి నిష్క్రమించాడు వెళుతున్న వారిద్దరినీ చూసి పూజారి, బాణాకర్ర, కూలిపోయిన ఆ గుడి విస్తుబోతూ, స్తబ్దుగా వెళ్ళినదిక్కే చూస్తుండగా వారు అదృశ్యమయ్యేరు.

*(మయూరి వీక్లీ, ఫిబ్రవరి 5, 1993)*

20

# జలగ

బమ్మిడి జగదీశ్వరరావు

నిప్పుల పుటం పెట్టినట్లు అప్పటి దాకా ఎర్రగా కాచిన ఎండ మరుక్షణంలోనే మంచు కురిసినట్లు మబ్బులు కమ్ముకొని చల్లబడింది. అంత దాకా బందీ అయిన గాలి స్వేచ్ఛగా తిరుగాడుతూ వాతావరణం మార్పిడికి దోహదపడుతోంది. సమయం సాయంత్రమే అయినా చీకటి పడినట్లుగాన అనిపిస్తోంది. అందుకేనేమో వీధి లాంతర్లు వెలిగాయి.

ఎంకడు ఎదనిండా ఊపిరి పీల్చుకున్నాడు. చెమటతో తడిసిన ఖద్దరు బనీనూ, పంచె ఆరిపోయాయి.

అసలు ఎంకడికి ఆ వాతావరణం చూస్తుంటే సలిదన్నం కడుపు నిండా పెరుగు మిరపకాయలతో తిన్నట్టుగా ఉంది. చుట్టూ చూశాడు. బేరాలేమీ రాలేదు. రిక్షా వెనుక చక్రాలకు రాళ్ళు పెట్టి రిక్షాలోనే కూర్చుని అలాగే వెనక్కి చేరగిలబడిపోయాడు.

"ఏటో పగలంతా ఎండ కాసేసి మా పేనాలు తోడేత్తాది. రిక్షా ఏత్తే ఒళ్ళు సర్రున కాల్తాది బుర్రియతే ఏడికి పొగలు బయలుదేరతాయి. కనకాలు బుర్ర మీద నువ్వుల నూనేసి రుద్దితే ఎంత పొంగు ఎక్కింది? వంటికీ ఏడిసేసి పోనాది... అయితే ఇప్పుడు ఎండ వానయినట్టుగా వుంది. దీనికి ఎగతాళే గా వల్ల..." ఆలోచనలు సాగుతున్నాయి ఎంకడి నిండా.

"ఏయ్.. రిక్షా.. చాపల మార్కెట్‌కి వస్తావా?" ఎవరో ఆసామి మామూలుగా అడగలేదు; రిక్షా బెల్లు కొట్టి మరీ అడిగాడు. అందుకే అంత తొందరగా ఆలోచన కివతల పడ్డాడు ఎంకడు.

"ఆ...." అన్నాడు ఎంకడు.

"ఎంత తీసుకుంటావు?" అడిగాడాసామి.

"నాల్రూపాయలివ్వండి బాబూ!" ఎంకడు రిక్షా దిగుతూ అడిగాడు.

"నాల్రూపాయలే..." గుండా గిపోయినట్లుందాసామికి.

"రెండ్రూపాయలు తీస్కో..."

"కుదర్దండీ..."

"పోనీ, రెండుంపావలా."

"కిట్టదండీ!"

"కిట్టకపోడానికేమన్నా యాపారమా ఏటయా..."

"మీరు బేరమాడుతుంటే ఎవులయినా అలాగే అనుకుంతారు..."

"చాల్చాల్లే.. ఆటోకే అయిదు రూపాయలు.. అరగంటలో పోవచ్చు."

"నాకు గంట పడతాదండి.. అలాగయితే నే పది రూపాయలన్నా తీసుకోవాలి. మల్ల నా ఒంట్లున్నది ఎక్కడోయించుకొనే డీజిలు పెట్రోలు కాదు.. రక్తం..."

"కూలి ముండకొడుకు" ఏదో నోట్లోనే గొణుక్కుని "మరో పావలా.. నీ ఇష్టం" అంటూ వెళ్ళిపోయాడాసామి.

వాడు తిట్టిన తిట్టుఎంకడికి వినిపించలేదు. వినిపస్తే ఏమనేవాడో? మళ్ళీ రిక్షా ఎక్కి కూర్చున్నాడు ఎంకడు. ఆలోచిస్తున్నాడు.

"తను .. ఎన్ని మాట్లాడేసాడు? పెట్రోలు - రక్తమూ.. ఆహా... అయినా అని ఏళ్ళా ఒకటే బేరమా? వానొటచ్చీటట్టుంది.. ఎదురుగాలి. కష్టమాలోసించరు. అయినా పిల్లలిద్దరూ వచ్చే ఏలయ్యింది. మరెటూ కదల్ను. ఈలొస్తే వర్షము రాకుండానే ఇల్లు సేరుకోవచ్చు..."

తరువాత ఎంకడు బనీను లోజోబులోని డబ్బులు తీసి లెక్క పెట్టుకున్నాడు.

ఇరవయ్యేడు రూపాయలు.. అయినా ఈ నెల్లో ఎలాగయినా సేసి అల పుస్తకాలు కొనెయ్యాల... కనకం పట్టీలు తాకట్టుకు పడ్డీ తరువాత కట్టుకోవాల.. ముందు సదువు."అయినా సదువుకుంటే పుజ్జోగం వస్తాది. ఆలూ రిచ్చాహోళ్ళు కాకూడదు" ఎన్నో మార్లు లాగే ఆసారీ నిర్ధారించుకున్నాడు.

ఎంకడికి భవిష్యత్తు మీద ఆశలున్నాయి. అవి తీర్చుకోడానికి కాయకష్టం పడతాడు. కానీ ఎటొచ్చి జానెడు పొట్ట, జీవితాన్నంతా మింగేస్తోంది.

ఎంకడు రిక్షా దిగి చూశాడు.

పిల్లలు ఇంకా రాలేదు చిన్నగా వర్షం మొదలయింది. బేరమొచ్చినా కాదని బడివేపు రిక్షాను పోనిచ్చాడు దారిలోనే పిల్లలు ఎదురయ్యారు.

"తడుసుకొని ఎవుడు రమ్మన్నాడు? జలుబూ.. జొరమూచేస్తే ఒకదానికొకటి' కోప్పడ్డాడు ఎంకడు.

పిల్లలిద్దరూ రిక్షా ఎక్కారు. ఎంకడు అంత వర్షంలోనూ గూడు వేగిరం చేరుకోవాలని బలంగానే తొక్కాలని ప్రయత్నిస్తున్నాడు. "పెద్దోడా, పాటాలు సెప్పినారా?" ఆ రోజంతటికీ ఒకే మేష్టు చెప్పాడు. మిగిలినోళ్ళు ప్రజెంటు ఏసీసి బాతాఖానీ కబుర్లాడుకున్నారు.'" చెప్పాడు కొడుకు వాడికి పదిహేనేళ్లుంటాయి. తొమ్మిటో తరగతి చదువుతున్నాడు. అంత పెద్ద చదువులెవరూ మా గూడెంలోనే చదవలేదని ఎంకడు మురిసిపోతుంటాడు. పాఠాలు చెప్పనందుకు "దొంగనాకొడుకులని మనసులోనే తిట్టుకుని, "మరి సీకమ్మా సచ్చిమీ.." కూతుర్ని అడిగాడు ఎంకడు. "ఆ అయినాయి' ' అందా పిల్ల. "ఏటయినాయి. ఇదిప్పుడే రొండుకి వచ్చింది. దీనికి పాటాలుండవు.." తనకే పాటాలుంటాయనే గర్వం కొడుకు సూరి గొంతులో కన్పిస్తోంది. వర్షం పడుతూనే ఉంది. ఎంకడు రిక్షా తొక్కుతూనే వున్నాడు. రిక్షా మాత్రం ఇంకా ఆ వూరు మాత్రమే దాటింది. ఎంకడు కాపురం చేసే ఊరుకీ - రిక్షా వేసే ఈ ఊరికీ దూరం ఏడు కిలోమీటర్లు వుంటాది.

మధ్యలో అంతా మట్టిరోడ్డే బండి జాడ మీదుగా రిక్షా పోతోంది. నలిగిన దారి అవడం,

అలవాటు కావడం వల్ల ఎంకడికి అంత కష్టంగా లేకపోయినా కాళ్ళు తోడేస్తున్నాయి. ముడుకులు సలుపు పెడుతున్నాయి. రిక్షా అందుకే నెమ్మదిగా పోతోంది. ఇందాకటి స్పీడు లేదు.

"అయ్యా.. నువ్వు దిగరా నేను తొక్కుతాను.." కొడుకు సూరి అడిగాడు.

"నువ్వు కూకోరా! సినుకులు కదా.. నానే తొక్కుతాను" సర్ది చెప్పబోయాడు ఎంకడు.

"దిగమంటే ... దిగురా అయ్యా" ఆ అదగడం ఓ అలకా, అభ్యర్థన చిరుకోపం మిళితమై వున్నాయి.

ఎంకడు రిక్షా ఆపుచేసి దిగాడు సూరి తండ్రి రిక్షాలో కూచున్నాక తొక్కడం అరంభించేడు.

సూరిగాడు వయసుకి చిన్నోడయినా కష్టపడ్డానికి పెద్దోడే అది ఆళ్ళకి వరంలా ప్రసాదించిదీ వ్యవస్థ.అసలు ఎంకడి అయ్యా, ఆల్ల తాతలు కూడా పాకీలుగా, పాలేరులుగానే బ్రతుకుతూ వచ్చారు. ఎంకడి బాగార్లు ఇప్పుడు చెప్పలు కుట్టుకుంటారు. ఎంకటొక్కడే రిక్షా ఎయ్యడం చేస్తాడు.

"ఒరే ఎంకడూ.. ఎంకా.. సెవుడ్రా? సెవిట్ల సెట్లు బలిసినాయేటి?" ఆ మాట విని ఎంకడు ఆపమన్న మీదట రిక్షా ఆపాడు సూరి.

"ఏటి బాబూ, వర్షంలా నడిసొచ్చిస్తున్నారా?" రిక్షా దిగుతూ అడిగాడు ఎంకడు.

ఎంకడి మాటకు సమాధానమీయకుండానే అప్పటిదాకా తడుస్తూ నడుస్తున్న ఆ వ్యక్తి రిక్షాలో ఎక్కి కూర్చున్నాడు. లచ్చిమి వేపు చూసి "ఆటేక జరుగే గుంటా" అంటూనే పొనిమ్మన్నట్లు చూశాడు సూరివేపు. సూరి రిక్షా దిగి నడిపిస్తున్నాడు. తొక్కడం ఆ వానలో సాధ్యం కావడం లేదు. అసలు నడిపించడం కూడా ఆ వయసుకి కష్టంగా ఉంది. రిక్షా దిగిన ఎంకడు రిక్షా వెనుకే తడుస్తూ నడుస్తున్నాడు. అసలే రిక్షా ఎక్కింది పెద్ద రైతు రామగోపాలం గోరు. ఆరి పక్కన కూకోడానికి 'దవిర్యం' ఎంకడిలో లేదు. ఎందుకంటే గోపాలంగారి అన్నల వద్దే ఎంకటి తండ్రీ, తాతలు కంబార్లుగా చేశారు. "మా మోచేతికింద గంజి నీళ్ళు తాగేటోళ్ళు మా కాళ్ళ కింద చెప్పుల్లా గుండాల..." ఆ మాట ఎంకడి చెవిట్లో జోరీగలా ఫీ పెడుతోంది. ఆ మాట - ఆమాట ఈనాటిది కాదు, తన తండ్రి నాటిది.

ఏడాది పొడుగూ గొడ్డుల్లా కష్టపడ్డ కష్టానికి ఇచ్చే జీతం పదిహేను పుట్లు ధాన్యం. ఇంటిల్లిపాదీ ఈదుకురావడం కష్టమైపోయింది. ఎన్నాళ్ళని భరిస్తాడు? సహిస్తాడు? ఎన్నాళ్ళు తలవంచుతాడు? అందుకే ఎంకడి తండ్రి బుగతోరుని జీతం పెంచమని అడిగాడు. కిక్కురుమనని కంబారిగోడు నోరిప్పడంతో బుగతకు తల తిరిగిపోయింది. అప్పుడన్నాయ మాటది. తలబిరుసుతనమనుకున్నాడు గాని 'తిరుగుబాటు' అనుకోలేదు బుగత.

అందుకే ఎంకడు 'తలవంచలేదు'. రిక్షా స్వతంత్రంగా ఏసుకుంటున్నాడు. అయినా అనాదిగా వస్తున్నకట్టుబాట్లు మెడని కట్టి పడేశాయి. అందుకే ఎంకడు ధైర్యంగా రామగోపాలం పక్కన కూర్చోకుండా వర్షంలో తడుస్తూ అడుగులు వేస్తున్నాడు.

ఆ చీకటిలో.. చినుకులలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రిక్షా ముందుకుపోతూ పోతూ ఆగింది.

రిక్షా మధ్యలో ఆపేయడంతో ఆశ్చర్యంగా చూశాడు రామగోపాలం "ఏటయింది రయ్యా?" రిక్షా వెనుకనుంచి పరుగున ముందుకువచ్చాడు ఎంకడు.

"అయ్యా, నువ్వు రిక్షా ఎక్కి కూకో. పల్లమే కదా, లాక్కెల్లి పోతాను.." సూరి తండ్రితో అన్నాడు.

రామగోపాలం ఆశ్చర్యంగా చూస్తున్నాడు సూరిని.

"పరవాలేదు.. పోనీరా.."ఎంకడు అన్నాడు.

"నాను పోనివ్వనంటే పోనివ్వను. నువ్వు ముందెక్కు. సెల్లీ ఒడిలో ఎట్టుకో... రిక్షా సరిపోతుంది...." సూరి మొండికేశాడు.

"అది కాదురా...." అనబోయాడు ఎంకడు.

"నువ్వు ముందల ఎక్కంతే..." సూరిగాడు మాట కసిరినట్టుగా వుంది. మొండికేస్తున్నట్లుగా సూరిగాడి ప్రతి చర్యాతెలుపుతోంది. కచ్చా కెత్తుకుంటే వదలడనీ. సూరిగాడిది ఉడుము పట్టనీ ఎంకడికి తెలుసు. అందుకే మారు మాటాడకుండా రిక్షా ఎక్కాడు. కూతుర్ని ఒడిలో పెట్టుకొని రామగోపాలం పక్కనే ధైర్యం తెచ్చుకొని మరీ కూర్చున్నాడు. 'నా రిక్షాలో నాను కూకుంతాను" అని గుండె దిటవు చేసుకుంటున్నాడు ఎంకడు లోలోపల.

"ఎంత పోత్రం..? ఏటీడి పోయే కాలం.. నా పక్కనే కూకున్నాడే.. ఆరే!" ఏదో అనాదిగా పాతుకుపోయిన దర్పం రామగోపాలానికి అడ్డం పడుతోంది.

వురిమురిమి చూస్తున్న గోపాలం గారి చూపుసూరిగాడ్ని భయపెట్టలేకపోయింది. రిక్షా నెమ్మదిగా కదిలింది.

రామగోపాలానికి ఒళ్ళంతా కారం పూసినట్లుంది. గుండు గీసి గాడిద మీద ఊరేగున్నట్లుంది. తట్టుకోలేక పోతున్నాడు. ఏదో.. ఏదోఅనెయ్యాలనే వుంది. తగువు తెచ్చుకోవాలనే వుంది. "ఛీ.. ఛీ.. ఈ రోజు మైయిలపోనాను. ఇంటికెళ్ళి స్నానం సెయ్యాల..."పైకే అన్నాడు. రామగోపాలం ఎంత గింజుకుని గీపెట్టినా ఎంకడూ సూరీయేమనలేదు. దాన్తో బుగత్త గోరికి మరీ మండుకొచ్చింది. అయినా, రిక్షా దిగి నడిచి వెళ్ళలేక అలాగే కూర్చుండిపోయాడు.

కొంత సేపటికల్లా సూరిగాడి రిక్షా ఇల్లు చేరింది. ఎంకడు, కూతురు లచ్చిమీ దిగారు.

"ఇయ్యాల దాకేటి సేసినారు.." కనకం ఇంట్లో అడుగుపెడుతుండడంతోనే అడిగింది.

"ముందు కూడొడ్డించు.." ఎంకడు అన్నాడు.త లలు తుడుచుకుని తడిపిన బట్టలు మార్చుకొని అంతా తిండి దగ్గర కూర్చున్నారు.

ఎంకడు తింటూనే ఆలోచిస్తున్నాడు సూరిగారికిఎంతో ఆనందంగా వుంది. లచ్చిమికి సరదాగా ఉంది. కనకంకి అయోమయంగా ఉంది.

భోజనాలయ్యాయి. అవతల వర్షం తగ్గినట్టుగా ఉంది.

కాసేపయ్యాక అంతా పడుకున్నారు.

ఎంకడికి మాత్రం నిద్ర రావడం లేదు.

"కొడుకు ఎంత పనిచేశాడు? మంచి పనే చేశాడు! కానీ గోపాలం గోరు ఇంత జరిగిన దానికి ఒగ్గుతారా?!

అయినా ఎంత మార్పు? తాత పెదవి విప్పకపోయినా తండ్రి పెదవేం కర్మ... గుండెవిప్పి

అడిగాడు. మరి తానో? "కంబారకం సెయ్యలేను సామ్మి"న్నాడు. సొతంత్రంగా బతుకుతున్నాడు. ఇప్పుడు తన కొడుకో! తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు ఎంకడు.

"రేపు రామగోపాలం ఏం చేస్తాడో?" అన్న ప్రశ్నే ఆ ఆనందం ముందు తలెత్తలేదు. కొడుకును అభినందిస్తూనే నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారింది.

వీధిలో అందరూ పరిగెడతున్నారు.

కనకం మొగుణ్ణి గాభరాగా లేపింది

"ఏటే.. ఏటయిందే?" అడిగాడు ఎంకడు కళ్ళు నులుముకుంటూ.

కొడుకు సూరిగాడు అప్పటికే లుంగీ బిగించి, చేపల సంచీ జల్లెడ పట్టుకున్నాడు.

"ఏట్రా పరుగులూ, నువ్వెక్కడికీ?" ఎంకడు అడుగుతూనే లేచి లుంగీ బిగించాడు.

"మన సెరువలో సేపలు పట్టేత్తన్నారు. రాత్రి వర్షానికి సేపలు ఎగబొడుస్తున్నాయట. గట్టు కూడా కొట్టేసింది. అయ్యా, నువ్వూ రారా" అంటూనే పరిగెత్తాడు సూరిగాడు.

చాలా రోజుల తరువాత చేపల పులుసు... నాలుక జివ్వున లాగింది. అంతే. ఎంకడు పూజి (చేపల్ని మూసే గంప) సపల (వల) పట్టుకొని పరుగుతీశాడు.

"నువ్వు ఇంటి కాడుండే నచ్చిమీ ... జాకర్త..."ంటూ తపేలా పట్టుకొని కనకం కూడా పరుగెత్తింది.

చెరువు కాడికెళ్ళేసరికి ఊరంతా చెరువులోనే వుంది. జాతరలోలా వున్నారక్కడ మనుషుల. చెరువు గట్టు తెగిన దగ్గర సలలు అడ్డం పెట్టారు. నీరేపోతోంది తప్ప, ఒక్క చేప పైకి పోవడానికి అవకాశం లేదు. చిన్నా పెద్దా.. ముసలి ముతకా.. ఆడామగా గోచీలు బిగించి మరీ చేపలు పట్టుకుంటున్నారు. వారికి ఆనందంగానూ ఆతృతగానూ ఉంది.

సూరిగాడు, ఎంకడు పక్క పక్కనే పడుతుంటే వారిచ్చిన చేపలు తపేలాలో వేస్తోంది కనకం. అసుండే ఏయే ఊర్లు పంపాలో ఆలోచిస్తోందామె.

ఎదురుగా రామగోపాలం, తండ్రి కొడుకులిద్దరి వంకాచూశాడు.

ఇంతలో ఓ సవడ రామగోపాలం వేపు నుంచి పొడుకువచ్చి ఎంకడి ఊజిలో దొరికి పోయింది. "సవడ.. సవడ" గెంతాడు సూరి. ఆనందంగా "ఇంట్లెట్టిసీ రాయే" అన్న ఎంకడి మాటతోఆ సవడను ఇంటికి తీసికెళ్లింది కనకం.

మళ్ళీ ఎంకడికీ గోపాలానికి మధ్యఏదో చేప వున్నట్లుంది. పూజులు ఆబరా గుబరాగా వేశారు. అయితే ఈసారి ఆ చేప రామగోపాలం పూజిలో చిక్కుకుతంది. పూజిలో చెయ్యి పడెతూనే "అమ్మా" అని చెయ్యి పైకి తీశాడు. అరచేతి వేళ్ళ నిండా రక్తం.. సన్నగా వస్తోంది.

"ఏమయింది?" అడిగాడు ఎంకడు.

కాస్సేపు సమాధానమీయలేదు గోపాలం. మళ్ళీ ఏమనుకున్నాడో ఏమో "ఎంకా! పట్టిమీ మార్పు లాగున్నాది" అన్నాడు.

ఎంకడు గోపాలం గోరి పూజిలో చెయ్యి పెట్టి అతి సులువగా వొడుపుతో చేపను పట్టి పైకి

తీం "మార్పు... ముదరది" అంటూ గోపాలం ఒడి సంచిలో వేశాడు.అంతలోనే "అమ్మో" అని అరిచాడు గోపాలం.

"ఎటయింది" ఆత్రంగా అడిగాడు ఎంకడు.

"మార్పు ముల్లు ఒడకాడ గుచ్చుకున్నాదిరా!" గోపాలం గొంతులో బాధవుంది. గోపాలం ఒడిలో నుండి ఆ చేపను తీసి మీసాల్లాంటి దాని ముల్లును విరిచేశాడు ఎంకడు. తర్వాత దాన్నిమళ్ళీ ఆయన ఒడిలోనే పడేశాడు. గోపాలంగారికి చేప దొరికిందన్న ఆనందం కంటే తొడ దగ్గర మంట ఎక్కువగా ఉంది. చిన్నగా రక్తం వస్తున్నా మళ్ళీ ఆశగా చేపలు పట్టడానిక కుపక్రమించేడు గోపాలం.

"అయ్యా.." ఏదో అనబోయి ఆగిపోయాడు సూరి.

అందరూ చాపలు పడుతున్నారు.

కాస్సేపు గడిచింది.

"అమోమ... బాబో.. నాయనో.. మంట.. రక్తం.. రక్తం..." అరుపులుగోపాలం గారి నోటినుండి.నలుగురూ గుమికూడారు. ఎంకడు.. సూరి కూడా.. ఇందాకరక్తం వచ్చిన తొడకాడ జలగ గోపాలం గారిని పట్టేసింది. మరింత రక్తం కారుతోంది. గోపాలం ఆ జలగను పట్టుకున్నాడు. ఒళ్ళు జలదరించింది. భయం వేసింది.ఎవరో ఆ జలగను పట్టుకుని బలంగా వెనక్కి లాగుతుంటే అది మరింత సాగుతోందే తప్ప విడవడం లేదు. పైగా మెత్తగా జారిపోతోంది. అప్పటికే తొడ దగ్గర చిన్న కన్నం పెట్టేసింది.

"అలాగే తొడలో కెలిపోగలదర్రా!" ఎవరో అన్నారు.

"అమ్మో.. బాబో... చచ్చాను" గెంతులేస్తున్నాడు గోపాలం. ఆది చూసి చిన్నపిల్లలు కొందరు పకపకా నవ్వుతున్నారు. మరి కొందరు భయంతో ఒడ్డెక్కారు.

"పొగాకుంటే కసాబిసా నమిలి తుప్పన దాని మీద వుమ్మండిరా!" ఎంకడి బాగారి జగిలిగోడు అన్నాడు. వెంటనే ఎంకడు బొడ్డున ముచ్చి కాగితంలోదోపుకున్న పొగాకు కసికసి నమిలాడు. ఆ నమిలిన పొగాకు వుమ్మి ముద్దను గోపలంగారి తొడ మీద ఊసాడు. కానీ, ఆ వుమ్మి పక్కన పడితే చేతితో తీసుకొని జలగ పట్టిన దగ్గర వేశాడు గోపాలం. జలగ ఇంకా వదిలినట్టులేదు.ఎంకడు మరింత పొగాకు వుమ్మి ముద్దను కాంఢ్రించి తుప్పన నాలుగయిద్దపాలువేసేసరికి జలగ వదిలేసింది.

గోపాలంలో అంతవరకూ వున్న బాధంతా కొట్టుకుపోయింది. వర్షమొచ్చి కుళ్ళును కడిగేసినట్లు మనసెంతో నిర్మలమైపోయింది. జలగతోపాటు జాడ్యం వదిలేసినట్లుయింది. కానీ, తలెత్తుకోలేకపోతున్నాడు.

"మీరొడ్డున కూకోండి. సూరీ.. మనకీ సేపలు సేనగాని, ఆయన గోరికి నాలుగు పట్టి ఒడెయ్యరా!" ఎంకడు మామూలుగానే అన్నాడు. సూరి తను పట్టినచేపలన్నీ గోపాలంగారి ఒడి సంచిలో వేస్తున్నాడు.కొద్ది సేపులోనే ఒడి నిండిపోయి భారమయింది. అంతకుమించిఏదో చెప్పలేని అనుభూతితో గోపాలం మనసూ బరువెక్కింది.

21

# సరీసృపాలు

## విచ చంద్రశేఖర రావు

ఆత్మ హత్యలన్నీ సామాజిక విషాదాలే! 'పిరికి వెధవ! బ్రతుక్కి వెరిచాడు!' అని నిరసన వ్యక్తం చేసి ఆ సంఘటన నుంచి పారిపోవటం ఎంతమాత్రం సాధ్యంకాదు.

సురేంద్ర పొద్దున రూముకు వచ్చి "మోహన్రావు ఉరేస్కుని చనిపోయాడంటరా!" అన్నప్పుడు మోహన్రావు ఎవరని వివరాలడగాలని పించలేదు. ఈ చనిపోయిన కుర్రాడితో నాకు బొత్తిగా ముఖ పరిచయం కూడా లేదే అని సరిపెట్టుకోలేకపోయాను.

విషాదం సమ్మెట దెబ్బలా గుండెపై దబ్బున తగిలింది. చనిపోవటం ఎంత బాధాకరమైన అనుభవం! అదీ తనను తానుచంపుకోవటం. అది మోహన్రావైనా, మరో ప్రకాశరావైనా ఎంత హృదయవిదారకమైన విషయం!

క్యాంపస్ నిండా విద్యార్థులే. లైబ్రరీ ముందున్న చెట్టుకు వేలాడుతూంది మోహన్రావు శవం. చెట్టుపై నుండి శవాన్ని దించే ఏర్పాట్లు చేస్తున్నారు. తుపాకీ గుండు తాలూకు బుల్లెట్స్ తగిలి విల విల లాడుతున్న పక్షుల్లా ఉన్నారు చుట్టూమూగిన విద్యార్థులు. నునులేత స్వప్నానికి రక్తమాంసాలు కూరినట్టుగా మృదువుగా మనోహరంగా వుందా కుర్రవాడి శరీరం. పదిహేడేళ్ళ వయసు.

మోహనా! మోహనా! ఎంతపని చేశావయ్యా!

శవాన్ని క్రిందకు దించారు. జేబులో ఏవో ఉత్తరాలున్నట్టున్నాయి. చివరి ఉత్తరమేమో?

"నాయనా!" అంటూ మొదలైంది ఉత్తరం.

"నేను వెళ్ళిపోతున్నాను. చాలా దూరం. బహుశా మీకు అందనంత దూరం. ధైర్యాన్ని పోగుచేసుకొని, ఈ ప్రపంచాన్ని వదిలి, హఠాత్తుగా బాట ఆగిపోయిన ప్రయాణికుడిలా వెళ్ళిపోతున్నాను.

ఇది వీడ్కోలు కాదు. నిరసనగా మీ నుంచి నిష్క్రమిస్తున్నాను.

మూడు నెలలుగా చెబుతున్నాను. నేను పడుతున్న నరక యాతన. అది నీ చెవికెక్కలేదు. 'కొడుకు డాక్టరైనాడట్రే!' అనే విస్మయానందకరమైన పలకరింపులు చెవుల్లో గింగురు మంటూండగా కలల్లో తేలిపోయే నీకు నా గొంతులోని దుఃఖపు కేకలు వినబడనే లేదు.

పల్లె నుంచి పట్నానికి చేరినంత మాత్రాన నా స్థాయి ఏం పెరగలేదు. మెడికల్ కాలేజీలో చేరి భుజం పై తెల్లకోటు వేసినంత మాత్రాన నా నెత్తిన కిరీటం, నా భుజాలకు రెక్కలూ మొలవలేదు. అక్కడా యిక్కడా నేను దళితుణ్ణే. అన్‌టచ్‌బుల్నే.

"ఒరేయి! కోటాగాడురా! ఏంబాసు! థర్టీ పర్సెంట్ బ్యాచా!"

"మోహన్రావా పేరు? ఏ మోహన్రావు? మోహన్రావు షెకునా? మోహన్రావు షెజానా?"

విన్నావా? ఈ మాటలు చెవిన బడకుండా నా చెవుల్లో సీసం కరిగించి పొయ్యటం మరచిపొయ్యావు! మాటలకు కొంత ఎనర్జీ ఫాక్టర్ వుంటుందనీ అది పెను నిప్పులా గుండెల్ని భగభగ లాడించగలదని నీకు తెలియదా?

ఎన్నో ఆశలతో యిక్కడకు వచ్చాను. ఇది నువ్వనుకున్నట్టుగా స్వర్గధామం కాదు. చిత్రహింసల కొలిమి.

ఏపాటి ధైర్యపు కవచాన్నీ, ప్రతిఘటనకు అవసరమైన కరకు గోళ్ళనూ, పంజాలనూ యివ్వకుండా నన్నీ అరణ్యంలోకి త్రోశావు!

హాస్టల్ టెర్రస్ మీద, బట్టలన్నీ విప్పదీసి మెడలో చెప్పుల దండ వేసి "మీ బాంచన్ దొర కాల్మొక్త! కోటాగాణ్ణి! దయచూపండి!" అని ఎలుగెత్తి అరవటం, ఎట్లావుంటుందా అనుభవం!

xxx

అసెంబ్లీ హాలు. ఉక్కపోతగా వుంది. సంతాప సభకోసం విద్యార్థులందరూ వచ్చారు. స్వర పంజరాల్లోంచి విడుదలైన నిట్టూర్పులు, దిగులు కబుర్లు, నిశ్శబ్ద విషాదం వాతావరణం బరువుగా వుంది. ఒక మూలన గోడకు అనుకోని నిలబడ్డాను. నుదుటికి పట్టిన చెమటను తుడుచుకుంటూ సురేంద్ర వచ్చాడు.

"మోహన్రావు చనిపోయి కొద్ది గంటలైనా కాలేదు. అప్పుడే వాతావరణంలోకి రాజకీయపు వైరస్ చొరబడింది. ఎపిడిమిక్ కన్నా వేగంగా ప్రయాణించగల ప్రమాదకరమైనదీ వైరస్. ఎస్.సి., బి.సి., లను పోగు చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు దయానిధి. ప్రాణానికి ప్రాణం అని హింస రచన చేస్తున్నాడు. రాఘవరావు గ్రూపు ప్రస్తుతం మౌనంగా వున్నారు. కానీ అది తుఫాను ముందరి నిశ్శబ్దం అని అనుమానంగా వుంది" ఎప్పుడూ ఉల్లాసంగా వుండే సురేంద్ర ముఖంలో కల్లోల మేఘాలు ముసిరాయి.

కళ్ళల్లో బోలెడంత దిగులును విషాదాన్ని నింపుకొని గొప్ప కేరెక్టర్ ఏక్టర్‌లా ప్రిన్సిపాల్ మైకు దగ్గరకు వచ్చాడు.

"ఎంతో భవిష్యత్తు వున్నవాడు. పసివాడు. ఇలాంటి దుర్మరణం పాలవటం గుండె తరుక్కుపోతుంది. ఎంచేతనో ఈ తరం యువకుల ఆలోచనా వ్యవస్థే సజావుగా లేదనిపిస్తుంది. మెదళ్ళనిండా భయం.

మోహన్రావు యిలా చెయ్యకుండా వుండాల్సింది. తల్లిదండ్రులకు ఎంత గుండెకోత...?"

"సానుభూతి సరే. ముందు హంతకులపై మీరు తీసుకోబోయే చర్య గురించి చెప్పండి!" ప్రిన్సిపాల్ మాటల్ని ఆపివేస్తూ దయానిధి అరిచాడు. సన్నగా పొడుగ్గా రివటలా వుంటాడు.

కోలముఖం. ఎప్పుడూ ఏదో భావావేశంతో రగులుతున్నట్టు వుంటుందా ముఖం. దయానిధి కాలేజి స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీ కూడా.

దయానిధి మాటలకు ప్రిన్సిపాల్ కాస్త విసుగు ముఖం పెట్టి "ఇది సంతాప సభ" అన్నాడు. "అయితే ఏమిటి." దయానిధితోపాటు మరో పది కంఠాలు తీవ్రస్వరంతో అరిచాయి.

ప్రిన్సిపాల్ కాస్త తగ్గి "ఎవర్నని శిక్షించటము? తననెవరు ఏడిపించారో స్పష్టంగా రాయలేదు మోహన్రావు. వాళ్ళ పేర్లుగానీ ఆ ఉత్తరంలో వుండి వుంటే ఈ పాటికి వాళ్ళని డిస్మిస్ చేసేవాళ్ళి. ఆ దురదృష్టకరమైన రాత్రి ఆకాశము, మబ్బులు, చుక్కలు, ఎక్సెట్రా ఇనానిమేట్ ఆబ్జెక్ట్స్ తప్ప ఎవరూలేరు. అవి సాక్ష్యం చెప్పలేవు" అన్నాడు నాటకీయంగా.

"సర్! ఆ రాత్రి ఆకాశము, మబ్బులు, చుక్కలతో పాటు మరో అయిదుగురు విద్యార్థులు కూడా ఉన్నారు ఆ రాగింగ్‌లో. శ్రీవారికి యిలాంటి ధర్మసందేహం వస్తుందనే వాళ్ళు రిటన్ కంప్లైంట్ ఇచ్చారు. నిందితుల పేర్లు ఉన్నాయి. వెంటనే చర్యతీసుకోండి!" దయానిధి అరిచాడు.

"ఆ కంప్లైంట్‌లను నమ్మేదెట్లా? గిట్టని వాళ్ళని ఇరికించడానికి ఎవరో సృష్టించి వుండవచ్చు కదా!" రాఘవరావు రంగప్రవేశం చేశాడు. రాఘవరావు లాజిక్‌తో క్షణంపాటు అందరం దిమ్మెరపోయాము.

ప్రిన్సిపాల్, ముఖంపై విషాదపు రంగు తుడిపేసుకొని అసహనాన్ని కోపాన్ని అభినయించటము మొదలుపెట్టాడు. "ఎంక్వైరీ కమిటీని వెయ్యండి!" పరిష్కారాన్ని సూచించాడు దయానిధి. ఆ సూచనను తిరస్కరిస్తున్నట్టుగా ప్రన్సిపాల్ వేదిక దిగి వెళ్ళిపోయాడు. కాలేజీకి సెలవు ప్రకటిస్తూ వైస్ ప్రిన్సిపాల్ సభను ముగించాడు.

"ప్రిన్సిపాల్ డౌన్ డౌన్!" "హంతకులను శిక్షించాలి!' నినాదాలతో అసెంబ్లీ హాలు మారుమోగింది. రాఘవరావు యాభైకి పైగా ఉన్న తన పరివారంతో బయటకు వెళ్ళిపోయాడు. విద్యార్థులతో మాట్లాడాలని వేదికపైకి వచ్చాడు దయానిధి.

"పూర్వం దళితులు సంస్కృతం నేర్చుకొన్నారని రాళ్ళతో కొట్టి చంపేవారట. స్వతంత్రం వచ్చిన నలభైయేళ్ళ తరువాత మళ్ళీ అదే పరిస్థితి. ఉన్నత విద్యలకు దళితులు పనికిరారు. పల్లెల్లో రైతుకూలీలుగానో, పట్టణాల్లో కార్మికులుగానో ఆఫీసుల్లో చప్రాసీలుగానో బ్రతకాలి. తెలివిగలిగిన ఒకరిద్దరు మోహన్రావులను ఇలా నిర్దయగా చంపి మిగిలిన వాళ్ళకు హెచ్చరిక చేసే కుట్రయిది. ఈ కుట్రను భగ్నం చెయ్యాలి."

దయానిధి ఉపన్యాసం కొనసాగుతుండగా హాలు వదిలి బయటికొచ్చాను. సురేంద్ర దయానిధి ఉపన్యాసాన్ని సీరియస్‌గా వింటున్నట్టున్నాడు. అక్కడే వుండిపోయాడు.

కొలిమి నిప్పులా వుంది ఆకాశం. చెట్లు కదలటం మానివేశాయి. "అయ్యో! మా మోహన్రావు ఎక్కడయ్యా! మా బంగారు నాయన ఎక్కడయ్యా! మా అయ్యనేం చేసేరో చెప్పండయ్యా! నాతండ్రి పుస్తకాలు తప్ప వేరే లోకం తెలియదు. మా నాయన్ని నాకు చూపించండయ్యా! అయ్యా! డాక్టరునై వచ్చి మనోళ్ళందరికి ఫ్రీగా నయం చేస్తానే అనే వోడయ్యా! మాయదారి చదువు నా బిడ్డను పొట్టబెట్టుకుందయ్యా! దేవుడా! నాకెందుకింత కడుపుకోత పెట్టావయ్యా! మోహనా! అయ్యా మోహనా!" శోకతప్తమైన మాతృమూర్తి రోదన గుండెల్ని పిండిచేస్తూంది. అప్పుడే వాళ్ళవూరు నుంచి వచ్చినట్లున్నారు. గేటు దగ్గర పార్వతి ఎదురైంది. "మార్చ్యురీకి వెలుతున్నాను వస్తావా?'

' అంది. "ఎందుకో మనసంతా దిగులుగా, పచ్చి పుండులా వుంది. రూమ్‌కెళతాను" అన్నాను. "అంత బేలవైతే ఎలా" పార్వతి ఓదార్పుగా అంది. గేటు దాటినాక యిద్దరం రెండు మార్గాల్లోకి చీలిపోయాము.

xxx

సాయంకాలం సుమారు ఏడు గంటలకు పార్వతి నా రూమ్‌కొచ్చింది. బరువెక్కిన గుండెల్ని తేలిక పరుచుకొందామని నేనే పార్వతిని రమ్మన్నాను. పార్వతితో కాసేపు మాట్లాడితే పరిమళించే విరిదండ మన పరిసరాల్లో గుప్పుమన్న హాయి కలుగుతుంది. గొప్ప సెన్సాప్ హ్యూమరుంది తనకు. ఎంచేతనో ఈ సాయంకాలం పార్వతి కూడా మూగబోయింది. "కొన్ని విషాదాలకు నిశ్శబ్దమే గొప్ప ఓదార్పు" అంది. ఎందుకు మాట్లాడటం లేదని అడిగితే.

కుల మతాల సరిహద్దుల్ని చెరిపివేసిన స్నేహం మా యిద్దరిది. కొత్తలో చాలా ప్రతిఘటనని ఎదుర్కోవలసి వచ్చింది. "మా అమ్మాయితో స్నేహం చేస్తావా?" అంటూ కాలర్ పట్టుకొన్నాడో సీనియర్. మా అమ్మాయి అంటే మా కులపు అమ్మాయి అని అర్థం. "స్నేహం టూలే ప్రాసెస్ కదా! కావాలంటే పార్వతిని నిరోధించు!" అన్నాను. వాళ్ళతో పెద్దగా గొడవ పెట్టుకోకుండా. పార్వతి చాలా ఇబ్బందుల్ని ఎదుర్కొంది. తండ్రి పరమేశ్వర రావు పరమ చాందసుడు. హిట్లర్ రావుగా సుప్రసిద్ధుడు. ముస్లిం కుర్రవాడితో స్నేహమా అంటూ హుంకరించాడు. "ఛాందసుడైన తండ్రి కన్నా సహృదయుడైన స్నేహితుడే ఎక్కువ నాకు. నాకీ కులాలపై బొత్తిగా నమ్మకం లేదు. కాదు కూడదంటే ఇస్లాం పుచ్చుకుంటాను" అంటూ బాంబు పేల్చింది. ఈ మొండిది ఎంతకైనా తగునంటూ తల్లిదండ్రులు పట్టుబట్టటం మానివేశారు.

ఎనిమిది గంటలకు సురేంద్ర వచ్చాడు "మెస్ కెళ్ళి భోజనం చేద్దాంరండం"టూ వరండా బద్ధకంగా ఆవులిస్తున్న పులినోరులా వుంది. వరండా మధ్యలోంచి మెస్ వైపుకు వెళ్ళడానికో కాలిబాట వుంది. కాలి బాటకు దగ్గరగా వున్న రూమ్ ముందు కర్టెన్ తొలగి నాలుగైదు అపరిచితమైన ముఖాలు తళుక్కుమన్నాయి. మొరటుగా, అనాగరికంగా వున్నాయి ఆ ముఖాలు. "లోకల్ గూండాల్ని ఎంగేజ్ చేశాడు రాఘవరావు" సురేంద్ర క్లూ అందించాడు.

డైనింగ్ టేబుళ్ళపై అందంగా పరిచిన టేబుల్ క్లాత్. దానిపైని వంటకాలు ఆహ్వానపత్రికల్లా వున్నాయి. పది బల్లలు ఈవైపుకు, పది బల్లలు ఆ వైపు సర్ది వున్నాయి.

"ఒక్క రోజులోనే కలిసి తినడానికి ఇష్టపడనంత శతృత్వం పెరిగిందా? ఎంత దిగజారుతున్నాము మనం" పార్వతి తనదైన నిర్మోహమాటపు ధోరణిలో అంది. అప్పుడే లోపలికి వచ్చిన రాఘవరావు కరకుగా చూశాడు పార్వతి వైపు. రాఘవరావుతో పాటు మరో ఐదుగురు ఖల్‌నాయక్‌లు కూడా మెస్‌లో కొచ్చారు. మా పక్కనున్న టేబుల్‌పైనే వాళ్ళూ కూర్చున్నారు.

పార్వతి వాక్ప్రవాహం ఆగలేదు. "స్టీఫెన్‌స్పీల్‌బర్గ్ సినిమా 'జ్యూరాసిక్ పార్క్'" అని కొత్తగా వచ్చింది. వేలయేళ్ళ క్రితం చనిపోయిన సరీసృపాల్ని క్లోనింగ్ పరిశోధనలతో తిరిగి పుట్టించగలుగుతారు. జెనిటిక్ ఇంజనీరింగ్ శాస్త్రజ్ఞులు. వాటిని జ్యూరాసిక్ పార్కు అనే ప్రత్యేక ప్రాంతంలో పెంచుతుంటారు. ఆ ప్రమత్తంగా వున్నక్షణాల్లో జీన్ బాంక్‌లో వున్న అండాలన్నీ నేల పాలవుతాయి. అసంఖ్యాకంగా రాక్షస బల్లులు పుట్టుకొస్తాయి. అవి చూస్తుండగానే రాక్షసాకారానికి పెరుగుతాయి. పార్కును ధ్వంసం చేస్తాయి. శాస్త్రజ్ఞుల్ని చిటికెలో పొట్టన పెట్టుకుంటాయి.

అవి ఏ ఆయుధానికి చావవు. మరెలా అవి ఆలోచిస్తే ఈ సరీసృపాలను తమ సంతతిని తామే చంపుకునే లక్షణం వుంది. వాటినలాగే వదిలేస్తే కొన్నాళ్ళకు ఒకదాన్ని ఒకటి చంపుకొంటూ అన్నీ సర్వనాశనం అవుతాయని తేలుస్తారు.

ఈ విద్వేషాలు, హింస చూస్తుంటే మనక్కూడా ఆ లక్షణాలు అబ్బినట్టున్నాయనిపిస్తుంది. భూమిపై మానవ సరీసృపాలు అంతరించిపోవడానికి అట్టే కాలం పట్టదేమో ననిపిస్తుంది." వైరాగ్య ధోరణిలో పార్వతి చెప్పుకుపోతూంది.

అసంకల్పితంగానే జేబులోని పెన్ తీసి టేబుల్ క్లాత్‌పై సరీసృపాలు బొమ్మలు గీయటం ప్రారంభించాను. ఒక సరీసృపానికి రాఘవరావు పోలికలు, మరో సరీసృపానికి దయానిధి పోలికలు. 'సరీసృపాల యుగం మళ్ళీ వచ్చేసింది' అంటూ కాప్షన్ రాశాను. టేబుల్ క్లాత్‌పైని కారికేచర్‌ని పార్వతి కూడా ఎంజాయ్‌చేస్తోంది.

"బల్లలపై ఇష్టమైన చెత్త రాతలు రాయడానికి ఇది నీ రూమ్‌కాదు. మెస్ హాలు" రాఘవరావు గొంతు ఖంగుమంది.

"గోటు హెల్!" అంది పార్వతి నిర్లక్ష్యంగా. పెనుకోపంతో ముందుకు వంగి రెండుచేతుల్తో టేబుల్‌క్లాత్‌ని లాగివేశాడు రాఘవరావు. ప్లేట్లు, గ్లాసులు చిందరవందరగా నేలపై పడ్డాయి.

'రాఘవరావు డోంట్‌బిహేవ్‌లైకే రౌడీషీటర్" అన్నాను కోపాన్ని అణుచుకుంటూ. అప్పటిదాకా టేబుల్‌పై మౌనంగా కూర్చున్న అపరిచితులు రంగంలోకి వచ్చారు. వాళ్ళల్లో ఒకడు రెండు చేతుల్తో నా చొక్కా కాలర్‌తో సహా నన్ను లేవదీసి బలంగా బయటకు తోశాడు. మరొకడు పార్వతిని రెక్క బుచ్చుకొనిలాగాడు. నిగ్రహించుకోలేని ఆవేశం నాలో పొంగింది. విరిగిన కుర్చీ చెక్క నొకదాన్ని తీసుకొని వాళ్ళపైకి ఉరికాను.

అలసట వచ్చే దాకా నన్ను పిడిగుద్దులు గుద్ది, నేను నేలపై జారిపడగానే ఇనుపరాడ్ బయటకు తీశాడు వాళ్ళలో ఒకడు. నన్ను కాపాడాలని సురేంద్ర పరిగెత్తుకుంటూ వచ్చాడు. సురేంద్ర నుదుటిపై రాడ్ దెబ్బ 'ఫట్' మంది రక్తం ధారలు కట్టింది. "లంజకొడకా! ఆడు మనవాడురా!' ' రాఘవ కంగారుగా అరిచాడు.

"రౌడీల్ని దెచ్చారు. మన వాళ్ళని చంపేస్తున్నారు" అంటూ కేకలు పెట్టుకుంటూ దయానిధి రూమువైపుకు పరిగెత్తాడు ఒక ఫస్టియర్ కుర్రాడు. యుద్ధ కాహళితో హాస్టల్ మారు మ్రోగింది. పార్వతి చెప్పిన సరీసృపాల యగం వచ్చేసినట్లే వుంది. పదఘట్టనలు మెస్ హాలు దాకా వచ్చాయి. ఈ జీవితానికిక చివరి క్షనాలు కాబోలు అనుకున్నాను. కానీ వచ్చింది పోలీసులు. లాఠీలు ఝళిపిస్తూ మెస్ హాలును, వరండాను చుట్టుముట్టారు. ఎవరో పుణ్యాత్ముడు ఫోనుచేసినట్టుంది. దొరికిన వాళ్ళందర్నీ వ్యానల్లోకి కుక్కుతున్నారు పోలీసులు. ముసలి పోలీసు ఒకడు నన్నూ వేన్‌లోకి తోశాడు. వేన్లో కూర్చున్న నాకు పార్వతి గొంతు వినపడి ఉలిక్కిపడ్డాను.

"మీరతన్ని తీసుకువెళ్లడానికి వీల్లేదు. తల పగిలి రక్తస్రావం అయ్యి ప్రాణాపాయ స్థితిలో వున్నాడు. అతనికిప్పుడు అర్జంటుగా ట్రీట్‌మెంట్ యిప్పించాలి. అతన్ని వదిలేయండి.

"డోంట్ డిస్టబ్ అజ్! ట్రీట్‌మెంటు ఎక్స్‌ట్రా స్టేషనకు వెళ్ళినాక చూసుకుంటాం. ఎక్కువగా వాగావంటే నిన్నూ లోపలికి తోస్తాను. గెట్‌లాస్ట్!" ఎస్.ఐ. గొంతులావుంది.

"ఇంపాజిబుల్! నా ప్రాణాల్నితీశాకే అతన్ని మీరు అరెస్ట్ చెయ్యగలిగేది. ఐడోంట్ కేర్ యువర్ లా అండ్ ఆర్డర్!' పార్వతి గొంతు రీసౌండింగ్ ఎఫెక్ట్‌తో హాస్టలంతా మార్మోగింది.

"ఓ.కే. ఓ.కే.! అతనికి ట్రీట్‌మెంట్ యిప్పించినాకే మాకు హాండోవర్ చేయండి!" యస్.ఐ. రాజీపడినట్టున్నాడు. పార్వతి. సురేంద్రను తన భుజంపై పడుకోబెట్టుకుని, మోసుకువెళ్తున్న దృశ్యాన్ని వాన్‌లోంచి చూడగలిగాను.

ముక్క వాసనతో, ఉచ్చకంపుతో వమనం తెచ్చేలా వున్న విశాలమైన గదిలో మా అందరినీ వుంచారు. రౌడీషీటర్స్‌ను మాత్రం వేరేచోటకు తీసుకువెళ్ళారు. ఎవ్వరమూ పెద్దగా మాట్లాడుకోలేదు. ఒక మూలకువెళ్ళి నేలపై చతికిలబడ్డాను. ఎందుకో చెప్పలేనంత దిగులు వేసింది.

మాలో ఒకడి మరణానికి మేము స్పందించిన తీరు తలచుకుంటే జుగుప్సాకరంగా వుంది. రెండు కన్నీటి చుక్కలు, ఒక నిముషం మౌనం, ఏదీ లేదు. పశ్చాత్తాపం అసలే లేదు. కుల విద్వేషాల్తో ఒకళ్ళ నొకళ్ళు నరుక్కుని రక్తంతోనే మృతునికి సంతాపం చెప్పాలనే ఈ రాక్షస ప్రవృత్తి మాకెక్కడినుంచి వచ్చింది?

దీపపు వెలుగులో జైలు గోడలపై మసి బొగ్గుతో గొగ్గిరి గొగ్గిరిగా రాసిన మాటలు నా దృష్టిన పడ్డాయి. "భగవంతుడా! నన్ను రక్షించు" రామయ్య వ్రాలు', అని రాసి వుంది గోడపై.

సరీసృపాలం అయి మమ్మల్ని మేము భకించుకోకుండా కాపాడే శక్తికోసం ఎలుగెత్తి అరవాలనిపించింది.

హఠాత్తుగా నా దృష్టిపథంలో పార్వతి తళుక్కుమంది. క్షతగాత్రుడైన మిత్రుడికోసం పార్వతి పోరాడిన తీరు గుర్తుకొచ్చింది. ఒక అభౌతికమైన ఓదార్పు ఏదో నన్ను చుట్టుముట్టసాగింది.

*(ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1993)*

22

# కులం

తోలేటి జగన్మోహనరావు

'తవర్నెక్కడా సూసినట్లులేదు...'

సాయంత్రం వేళ రైలు వంతెన మీద కూర్చుని - పొలాల్లోంచీ, కొబ్బరితోటల్లోంచీ వంపు తిరిగిపోతున్న రైలు రోడ్డూ, పంట పొలాలు, కాలువ చూస్తూ, పైరుగాలి ఆస్వాదిస్తూ మైమరచి పోయిన నేను, హఠాత్తుగా నా ఎదురుగా ప్రత్యక్షమై ప్రశ్నిస్తున్న ముసిలాడికేసి ఉలిక్కిపడి చూశాను.

అతని వయసెంతో చెప్పడం కష్టం - అరవైనుంచి ఎనభై దాకా ఎంతేనా ఉండొచ్చు. జీవితమంతా కాయకష్టం చేసిన వాడి శరీరంలా అతని శరీరం నల్లగా కమిలిపోయి ఎండిపోయింది. పొట్టదగ్గర చర్మంలా దళసరెక్కి ముడతలు పడివుంది. నల్లటి గుండులాంటి అతని తలమీద అక్కడక్కడ తెల్లవెంట్రుకలు వెండితీగల్లా మెరుస్తున్నాయి. అతను నడుంకి ఎర్రటవలొకటి చుట్టుకున్నాడు. అతని కాళ్ళకు టైరుచెప్పులున్నాయి. అతని చేతిలో తాటాకు ఈనె చివరచేప ఒకటి వేలాడుతోంది.

'తవరి దీవూరు కాదనుకుంటా,' అన్నాడు ముసిలాడు మళ్ళీ.

'ఈ ఊరుకాదు - పండగకి అత్తారింటికి వచ్చాను'

'తవరి మావగారి పేరు'

'అప్పలసామి అని - రైలు గేటు దగ్గర ఫాన్సీషాపు....'

'అప్పలసామి అల్లుడిగారా - మీ మావతెలీకేం - నెత్తిమీద జీళ్ళ తట్టెత్తుకుని, ఇత్తడి -కీ, రాగి -కీ, డబ్బుల-కీ... జీళ్ళు, అని జీళ్ళమ్ముకుంటేండేవోడు - అసాధ్యుడు - అప్పలసామి అల్లుడి గారా...'

మా మావ గురించి అలా అనడంతో నేను చిన్న బుచ్చుకున్నాననుకున్నాడు కాబోలు - 'మీ మావ గోలీకాయలాడేప్పట్నుంచీ తెల్సు - ఏదో సనువు కొద్దీ అలా అన్నాను గాని ఏవనుకోకు - అప్పలసామి అల్లుడిగారన్నమాట.....'

ముసిలాడు చేపకింద పెట్టి నా ఎదురుగా చతికిలపడి, రొంటి నుంచి పొగాకు కాడలాగి ఈనె తీసి చుట్టచుట్టడం మొదలు పెట్టాడు. నేను జేబులోంచి సిగరెట్ పేకెట్ తీసి సిగరెట్టు అంటించాను. నా దగ్గర సిగరెట్టు పేకెట్ కనుపించగానే ముసిలాడు చుట్టచుట్టే ప్రయత్నం విరమించి, పొగాకు కాడ మళ్ళీ రొంటిలోకి దోపి, ' ఓ సిగరెట్టివ్వండి,' అన్నాడు.

నేను సిగరెట్టిచ్చాను అతను సిగరెట్టు, చుట్టపట్టుకున్నట్టు బొటనవేలు, చూపుడు వేళ్ళతో

నొక్కి పట్టుకుని గుప్పుగుప్పుమనిపించసాగాడు.

కాలవపక్కన కలపమిల్లులో కలపకోస్తున్న శబ్దం అప్పుడప్పుడు గాలివాలుకి కర్ణకఠోరంగా వినిపిస్తోంది. ఆ శబ్దం తప్ప అంతా దాదాపు నిశ్శబ్దంగానే ఉంది.

ముసిలోడు సిగరెట్టు మరోసారి గుప్పుమనిపించి, 'ఏం జేస్తుంటారు?' అనడిగాడు.

'గవర్నమెంటుద్యోగం - హైద్రాబాద్‌లో'

'మా యబ్బాయికూడా ఐద్రాబాదులోనే - గవర్నమెంట్లో పెద్ద ఆఫీసరు - సొంతమేడ, కారు - మంచి పొజిషన్లో వున్నాడు.

'మరైతే నువ్వెళ్ళిహాయిగా మీ అబ్బాయి దగ్గరేవుండొచ్చు కదా,' అన్నాను నేను

'ఏం - ఇప్పుడు మాయిగా లేనా?'

'అదికాదు - ఈ వయసులో మనవలతో హాయిగా ఉండొచ్చుకదా అని'

'ఇప్పుడు మనవలతో ఉంటల్లేదా - నా కూతురు, కూతురి బిడ్డల దగ్గరే వుంటున్నాను'

'ఏం - కొడుకు చూడడా?'

'ఎందుకు చూడడు - పువ్వుల్లో పెట్టి సూసుకుంటాడు - ఆడు రమ్మనే అంటాడు - నేనే ఎళ్ళను, 'అన్నాడు ముసిలాడు.

'అదేం?'

'ఏ గూటి పిట్ట ఆ గూట్లోనే సుకంగా వుంటది'.

ముసిలాడు ఆఖరు సారి సిగరెట్టు గుప్పుగుప్పుమనిపించి పీకవిసిరేస్తూ అన్నాడు - 'ఆడిగూడు, కులం వేరు - మా గూడెం, కులం వేరు - ఆడితో కల్సుండడం ఎలా పడతది?'

'అదేంటి - సొంత కొడుకుకాదా',

'సొంత కొడుకే,'

'మరి కులం వేరెలా అయింది - నాకు అర్థం కావటంలేదు,' అన్నాను తల పట్టుకుని.

'మొదట్లో సొంత బిడ్డల్లోనే ఏరు ఏరు కులాలుంటాయని నాకూ తెలీదు - అది తెల్సింతర్వాత నా కులవేదో తెల్సుకుని, మంచైనా, చెడైనా కులపోళ్ళతోనే వుండాలనుకుని నావోళ్ళ దగ్గరకు వచ్చేశాను,' అంటూ మొదలు పెట్టాడు ముసిలాడు.

'నా కొడుకు తెలివైనోడు - సదువులో సురుగ్గా వుండే వోడు - చిన్నప్పట్నుంచీ ఆడికి అగ్రకులాలోళ్ళతో పోటీపడి, ఆళ్ళని ఓడించి, ఆళ్ళచేత నమస్కారాలు పెట్టించుకునేంత ఎత్తుకు ఎదిగిపోవాలని మహాయిదిగా వుండేది. ఆశీర్వాదం మేష్టారు, ఈణ్ణి ఇంతవాణ్ణి చేసింది ఆయనే - ఆయన మా వోడంటే సాలా అభిమానంగా వుండేవోరు - సివరకు మతవిప్పించి ఆరమ్మాయినిచ్చి పెళ్ళికూడా చేసేరు.

నా కోడలు కూడా సాలా తెలివైంది, చాలా ముందు సూపున్నది - సదువుల్లో, ఉజ్జోగాల్లో రిజర్వేషన్లుంటాయని పిల్లలకి తండ్రికులం రాయించింది. పరలోకానికి ఏసుప్రభువు, ఇహలోకానికి ఈశ్వరుడు - ఆళ్ళకి డబుల్ గారంటీ ఇంకదేనికీ దిగుల్లేదు, అన్నాడు ముసిలాడు పకపకనవ్వుతూ.

ముసిలోడి మాటతీరు చూస్తుంటే కొద్దోగొప్పో చదువుకున్నట్టే కనిపించింది.

'నా కొడుకుతో అయిదారేళ్ళు కల్సున్నా నా కులమేంటో నాకు తెలవనేలేదు - నా కళ్ళు తెరిపించింది బొడ్డూడని ఎంకడు - కూతురి కొడుకు.

'పెద్దోణ్ణి నీతోపాటు తీసుకెళ్ళి సదివించి పైకి తీసుకురారా అన్నయ్యా - ఇక్కడుంటే అడుపాడైపోతున్నాడు, అంటూ నా కూతురు ఎంకడిని అళ్ళన్నయ్య దగ్గరకు పంపించింది. అడికప్పుడు ఎనిమిదేళ్ళు - అడు అయిదారేళ్ళు మేనమావ దగ్గరేవున్నాడు.

అడి సదువు వానాకాలం సదువైంది స్కూల్లో చెప్పేది అడికర్ధమయ్యేదిగాదు. ఎనక బడిపోయేవాడు. 'ఈణ్ణి ప్రైవేటుగా సదివిద్దాలే' అంటూ అణ్ణి ఇంట్లోవుంచి తనే సదువు చెప్పేవోడు నా కొడుకు. అడు ఇంట్లో చిల్లరమల్లర పన్లు చేస్తూ మేనమావకి చేదోడువాదోడుగా వుండేవోడు - అలానే అనుకున్నాను సాలాకాలం వరకూ.

ఓ రోజు పెరట్లో మొక్కల్లో తిరుగుతుంటే ఎవరో మెల్లిగా ఏడుస్తున్నట్టు ఏడుపు విన్పించింది. ఎవరా అని సూస్తే కోళ్ళ గూడు దగ్గర నా మనవడు మోకాళ్ళ మధ్య తలెట్టుకుని కూర్చుని ఎక్కిఎక్కి ఏడుస్తున్నాడు.

'ఏంట్రా ఎంకా - ఏమైంది?' అన్నాను నేను కంగారుపడుతూ.

'ఓరే తాతా - నాకిక్కడేం బావూలేదు - ఇక్కడ కోళ్ళూ, కుక్కలూ సూస్తూ పడుండడం కంటె ఈ కూలి అక్కడే చేసుకుని బతుకుతా - మనూరెల్లిపోదాంరా', అన్నాడు అడు ఏడుస్తూ.

'కూలి' అనేమాట ఇనబడగానే చళ్ళున చరిచినట్టైంది. అణ్ణి అంతకుముందుఎన్నడూ సూడనట్లు పరిశీలనగా సూశాను. కాకీ నిక్కరు మీద చిరుగుల బనీను వేసుకున్నాడు. అడి ఒళ్ళు దుమ్ముకొట్టుకుపోయివుంది. అడితల చింపిరి చింపిరిగా వుంది. నిజంగా అడు ఇంట్లో పనోడిలా కనిపిస్తున్నాడు గాని ఇంట్లో వాడిలా కనుపించడం లేదు.

'ఒరే తాతా - మా అయ్యకూలోడు - మా యమ్మ కూలిది నేనూ కూలోణ్ణే - కూలోడికి నీటుగా ఉండడం ఎలా ఈలు పడతదిరా - అళ్ళలా నేను తెల్లబట్టలేసుకుని, అయిదేసి నిమిషా లకోసారి సబ్బుతో సేతులు కడుక్కుంటుంటే నా కూలంతా సబ్బులకే అయిపోదా...' - ఎంకడు ఏడుస్తూ అంటున్నాడు.

అడికి పదమూడు నిండి పద్నాలుగొచ్చింది. అడింకా నా కళ్ళకు పిల్లాడిలానే కన్పిస్తున్నా అడి వయసుతోపాటు అడి మనసుకూడా ఎదుగుతోందనీ, ఇక్కడ అణ్ణి తక్కువ సూపు సూస్తున్నందుకు అడు మనసులో అంతబాదపడుతున్నాడని నేనంతవరకూ గుర్తించనేలేదు.

'అదేపోల్లేరా ఎంకా - మనూరెల్లిపోదాం,' అన్నాను నేను అడితల నివురుతూ.

ఇంతలో నా కొడుకూ, కోడలూ పిల్లల్ని స్కూల్నుంచి తీసుకునొచ్చారు - స్కూలునుంచొచ్చిన నా మనవరాలు నీర్సంగా, సోఫాలో కూలబడిపోయింది.

'బేబీ - షూవిప్పేసి కాళ్ళూ, చేతులూ వాష్ చేసుకురా, అన్నాడు నా కొడుకు. అది నీర్సంగా బూట్లిప్పి అక్కడేవదిలి వాష్ బేసిను దగ్గర కెళ్ళింది.

'ఏరా ఎధవా - ఇవ్వాల స్కూల్లో ఏం సదివావురా?'

అనడిగాడు నా కొడుకు - నాలుగేళ్ళ కొడుకుని ముద్దుగా.

'జానీ - జానీ యస్ పాపా! అంటూ అడు డాన్సు చేస్తూ పాటమొదలెట్టాడు.

'ఓ పెన్ మౌత్.. హ్హా..హ్హా....హ్హా.... అంటూ ఆణ్ణి ఎత్తుకుని కితకితలు పెట్టాడు నవ్వుతూ.

ఇదంతా రోజూ మామూలుగానే సూసేది అయినా నా మనవడి మనసు తెల్సింతర్వాత ఇదంతా కొత్తగా కనుపించసాగింది నా కళ్ళకు.

'ఒరే అల్లుడూ - చిరంజీవి పిచ్చరు - బ్రహ్మాండమైన కెసెట్టు తీసుకొచ్చాను- టిపినిచేసి సరదాగా చూద్దాం - అందరికీ అమ్లెట్లేసి తీసుకురా - ముందా షూలు..' నా మనవరాలు వదిలిన బూట్లు సూపిస్తూ అన్నాడు,.. నీటుగా స్టాండులో సర్దేసే - కిచన్లోకి ఎళ్లేముందు సోపుతో చెయ్యికడుక్కోరోయ్ - మర్చిపోకు ఎదవా, అన్నాడు నా కొడుకు మేనల్లుడి బుజం మీద ఏలా కోలంగా చరిచి నవ్వుతూ.

చిరంజీవి పిచ్చరనగానే దీపంలా ఎలిగిన ఆడిమొహం చెప్పులు తియ్యమనగానే మాడిపోయింది. నా కొడుకు అది గమనించక పోయినా నేను గమనించాను. నా గుండె బగ్గుమంది.

'నీ పెళ్ళాం చెప్పులు నువ్వు మొయ్యడంలో తప్పులేదురా ఎంకా - స్టాండులో పెట్టు ' అన్నాను నేను కలగ జేసుకుంటూ

పెళ్ళాం అనేమాట ఇనబడగానే 'ఛీ' అంది నా మనవరాలు.

'ఛీ..ఛీ.'' అన్నాడు నా కొడుకు

'ఛీ.ఛీ..ఛీ..' అంది నా కోడలు

'ఏంటా ఛా ఛా.. లకర్థం - ఆడుదాని మేనత్తకొడుకుకాదా - ఒరసకి అది పెల్లాం అవదా', అన్నాను నేను.

'పిల్లలముందు ఆ మాటలేంటీ', అంది నా కోడలు ఇసుర్రుగా.

'చిన్నవయసులో ఆళ్ళముందు అలాంటిమాటలంటే, ఆళ్ళ మనస్సుల్లో అదే ముద్రపడుతుంది - ఏలాకోలాలకి కూడా ఓ హద్దుంది? అన్నాడు నా కొడుకు చికాగ్గా.

అదే నా మనవడు కూడా దొరబిడ్డలా కాన్వెంట్లో సదువుతూ, క్లాసులో ఫస్టొస్తుంటే, మా కోడలే ' మా అల్లుడు.. మా అల్లుడు....' అంటూ మురిసిపోతూ, ఆణ్ణి నిజంగానే అల్లుణ్ణి సేసేది. ఆడుకూలోడవడం వలన ఈ తప్పొప్పులు ఆళ్ళకి గుర్తొచ్చాయి కాని లేకపోతే గుర్తుకొచ్చేవే కావు.

'ఆణ్ణి సెప్పులెత్తమనడం, ప్లేట్లు కడగమనడం ఏలాకోలవేనా.. అడికేదో ఆనాలుగు ముక్కలు సెప్పించి ఆన్ని పైకి తీసుకొస్తావని కొండంత ఆశతో నీ సెల్లెలు నీ ఇంటికి పంపిస్తే అణ్ణిక్కడ జీతంలేని పనికుర్రాడిలా చాకిరీ చేయించడం ఏలాకోలవేనా?' అన్నాను నేను తీవ్రంగా.

'అక్కడి సదువంటటంలేదు - ఏంచెయ్యమంటావు - ఆడుకొంచెం పెద్దయ్యాకా ఏ వ్యాపారవో, ఉద్యోగవో చూస్తానని చెప్పారుగా - అంతవరకు కాళీగా వున్నాడు కాబట్టి కొంచెం ఇంటి పనుల్లో సాయం చెయ్యమనడంలో తప్పేవుంది?' అంది నా కోడలు కలుగజేసుకుంటూ.

'తప్పేం లేదనే నేనూ అంటన్నాను - ఆడిదంతా మేనమావపోలిక - పెళ్ళాం సెప్పులుమొయ్యం ఇప్పట్నుంచీ అలవాటు కాకపోతే ఎలా?' అన్నాను నా కోడలితో.

నేను అలా అంటాననుకోలేదు కాబోలు - నా కొడుకు నోటమాటరాలేదు.

'చూశారా - ఎంతలేసి మాటలంటున్నాడో ఈ ముసిలాయన,' అంది నా కోడలు రోసంగా.

నా కొడుకు అప్పటికి తేరుకున్నాడు - 'నేనన్నమాటలో తప్పుందంటే క్షమించు - ఏదో

కుర్రాడుకదా అని ఏలాకోలవా డేను - దానికింత రబస చేస్తున్నావు, అన్నాడు.

'రబసేంలేదు - ఈ ఇంట్లో ఆడిపొజిషనేంటా అని తెలొచ్చి అలా అన్నాను - ఇప్పుడు అది పొజిషను ఆడికీ, నాకూ అర్థమైంది.

ఈ ముసిలాయన మట్టాడేది ఒక్కముక్కకూడా అంతపుస్టాంచుకావడంలేదు,' అంది నా కోడలు చికాగ్గా.

'నీ కిప్పుడర్థం కాదులే - సిల్కు చీరలు కట్టి స్కూటరెక్కి షికార్లు కాకుండా, సింకికోక కట్టుకుని నెత్తిమీద పేడ తట్టెట్టు కుని గేదెలెనకాల పరిగెడుతుంటే అర్థమయ్యేదిగాని, అన్నాను నేను.

చూడండి - ఎలాంటిమాటలంటున్నాడో - ఈయాల ఈయన పెద్ద దెబ్బలాటెట్టయ్యడానికి సిద్ధవై కూర్చున్నాడు, అంది నా కోడలు కన్నీళ్ళతో.

బహుషా ఆ రోజు నిజంగానే నేను అవసరమైనదానికంటే కటువుగా మాట్లాడాననుకుంటాను - దెబ్బలాటేం లేదు - నేను ఎంకడూ రేపెల్లిపోతున్నాం, అన్నాను. మర్నాడే నా మనవణ్ణి తీసుకుని వచ్చేశాను. వచ్చేస్తుంటే నా కొడుకు చాలా బాధపడ్డాడు.

'నువ్వెన్ని కష్టాలుపడి నన్ను సదివించావో నాకు తెల్సు నీకేదైనా లోపంచేస్తే క్షమించు - నీ కోడలు ఏదైనా తప్పు మాటంటే అదీ క్షమార్పణ చెబుతుంటి. నువ్వెళ్ళిపోతే లోకం నన్ను తండ్రిని చూడని దుర్మార్గుడనుకుంటుంది - నా మనసూ బాద పడుతుంటి. నా తోబుట్టువు కీ, దాని బిడ్డలకీ నేను చెయ్యగలిగిందంతా చేస్తాను - ఇంక ఆపైన ఆళ్ళ అదృష్టం నువ్వు నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించు, నన్నాడు.

ముసిలాడు ఆలోచిస్తూ కొంచెం సేపు మౌనంగా ఉండిపోయాడు.

ఆడు నా కర్థంకాడు - నేను ఆడికి ఆర్థంకాను.

సింకిపాతలవారు - సీడవాళ్ళువారు - తెలివి తక్కువ వారలంటూ మమ్మెకింక పెట్టకండి కించిత్తు డబ్బుంటే ఇంకిపోతాయండి యివ్వన్నీ అంటూ నా చిన్నప్పుడు గాంధీపంతులుగారు మావొళ్ళ గురించి పాడుతుండేవోరు. కించిత్తు డబ్బుంటే హరిజనుడెంత పైకెదగగలడో నా కొడుకు సూపించాడు. ఈణ్ణి హరిజనుడని ఎవరూ ఈసడించడు. ఈడింటికి బ్రామ్మలు, రెడ్లూ, కమ్మోళ్ళు - అన్ని కులాల్లోళ్ళు డిన్నర్లకొస్తారు. అళ్ళింటికి ఈడు పార్టీలకెడతాడు. సరదాగా మాట్లాడుకుంటారు. కలిసి మెలిసి తిరుగుతారు. ఆళ్ళలో ఆళ్ళకి కులం పట్టింపుండదు.

కాని నా కూతురు, కూతురి బిడ్డలూ ఇంకా కిందున్నోళ్ళే గదా! ఆడు పైకి ఒప్పుకోకపోయినా ఆడికి కిందున్న తనోళ్ళకంటే ఆళ్ళే దగ్గరగా అనిపిస్తారు.

'పిల్లల్ని సూడ్డానికి అప్పుడప్పుడొస్తాడు - రెండ్రోజులుంటాడు ఆడికి, ఆడిపిల్లలకి ఇక్కడ ఈ ఇరుకుకొంపలో, మురికివాడలో ఉండాలని ఉండదు. ముక్కు మూసుకుని ఎప్పుడెల్లిపోదావా అన్నట్లుంటారు.

'ఇల్లు ఇరుకు కదా - మీకిబ్బందౌతుందేమోనని', అంటూ ఆడుహోటల్లో దిగుతాడు.

ఆడిపిల్లలు నా కూతురింట్లో పచ్చి మంచి నీళ్ళు గూడా ముట్టరు. సిల్సు బాగా లేవు గ్లాసులు బాగా లేవు - ప్లేట్లు డర్టీగా వున్నాయి, అని మెల్లిగా ఇంగ్లీషులో ఆళ్ళలో ఆళ్ళు మాట్లాడుకుంటారు. ఆళ్ళ సూట్లు, బూట్లు ఏనుకుని బొమ్మల్లా తిరుగుతుంటే ఆళ్ళనే కన్నార్పకుండా సూస్తూదూరందూరంగా తప్పించుకు తిరుగుతారు నా కూతిరి బిడ్డలు.

'ఏం బావగారు - ఎలా వున్నారంటాడు నా కొడుకు.

'అయ్ - ఏదో - ఇలాగేవున్నాం' అంటాడు నా అల్లుడు సిగ్గుపడుతూ - బీడీ ఆర్పేసి చెవిలో దాస్తూ.

'మా అన్నొచ్చాడు - మా వొదినొచ్చింది' అంటూ సంబరపడి పోతుంది నా కూతురు. సంకిపాపలతోఆళ్ళకి మర్యాదలు సెయ్యలేక సతమతవైపోతుంది. ఎప్పుడెల్లిపోతారా అని దానికుంటుంది. ఎప్పుడెల్లిపోదావా అని ఆళ్ళకుంటుంది. అభిమానాల్లేక గాదు - అంత రవలాంటిది.

ఇప్పుడు ఆడికి ఆస్తుంది - పెద్దమేడుంది - కారుంది, హోదా, పరపతీ అన్నీ వున్నాయి. ఆడివేషం, బాషా అన్నీ మారిపోయాయి.

నా చిన్నప్పుడు బ్రామ్మలు స్వచ్ఛంగా మాట్టాడతావని సాలా గొప్పపడిపోయేవాళ్ళు. మీకు నోరు తిరగదురా - అని తక్కువ కులాలోళ్ళని సూసి నవ్వేవారు. కాలం మారింది. ఈడిప్పుడు పెళ్లాం పిల్లలతోటి, కుక్కలతోటి ఇంగ్లీషులోనే మాట్టాడతాడు. అలా ఇంగ్లీషు మాట్లాడలేని వోళ్లందర్నీ ఈసడింపుగా చూస్తూ, 'మీకంటే నేను ఓ మెట్టు పైనే ఉన్నానురోయ్', అని గుర్తుచేస్తుంటాడు. ఆడు బ్రామ్మలతో పోటీపడి పైకెదిగి ఎదిగి సివరకు ఆళ్లలో కుపోయాడు. ఇప్పుడాడు హరిజనుడుకాదు - హరిజనబ్రామ్మడు, అన్నాడు ముసిలోడు.

సాయంత్రం ఆరయింది. రంపం మిల్లు హఠాత్తుగా ఆడిపోయి నిశ్శబ్దమైంది. మిల్లులోంచి కూలీలు ఒక్కొక్కళ్లే వచ్చి కాలవగట్టుదిగి, కాలవలో కాళ్ళూ చేతులూ కడుక్కోడం మొదలు పెట్టారు. వాళ్ళలో ఒకతను అతనికి పాతికో, ముప్పయ్యేళ్లుంటాయి.- పైగుడ్డతో మొహం తుడుచుకుంటూ, తలెత్తి ముసిలాడికేసి చూసి, ఒరే ముసిలాడా - నెలరోజుల్నుంచీ కనిపించకపోతే సచ్చిపోయాననుకున్నాను - ఇంకా బతికే వున్నావంట్రా -ఏదీ ఓ పొగాకు కాడ పడేయ్, అంటూ రైలుకట్టమీదికి పరిగెత్తుకొచ్చాడు.

'నా దగ్గర పొగాకెక్కడిదయ్యా - ఇదిగో - ఈయన సిగరెట్టిస్తే తీసుకున్నాను, అన్నాడు రొంటికి వేళ్లాడుతున్న పొగాకు కాడ సంగతి మర్చిపోయి సిగరెట్టు పీక చూపిస్తూ.

'ఇదేంటిరా?' అన్నాడు ఆ కుర్రాడు పొగాకు కాడ పట్టుకుని లాగుతూ, ఆ లాగడంలో ముసిలాడు కట్టుకున్న టవలూడిపోయింది.

'నీ కంట పడిందిరా నాయనా, అన్నాడు ముసిలాడు నవ్వుతూ లేచి టవలు చుట్టుకుంటూ,

'ఒరే ముసిలాడా - సచ్చేప్పుడు కూడా ఈ పొగాకు కాడ తీసుకుపోతావేంట్రా - నీ కొడుకొచ్చి నీ తలకి కొరివెడతాడనుకుంటున్నావేంట్రోయ్ - నిన్ను నేనే తగలెయ్యాలి - అప్పడీ పొగాకు కాడ కూడా పడేసి తగలేస్తాలే....'

వయసు అంతరం కూడా చూడకుండా, మోటు సరసాలాడుతూ, జుగుప్స కలిగించేలా ఆ కుర్రాడు అలా మాట్లాడుతుంటే ముసిలాడు ముసిముసి నవ్వులు నవ్వేడుకాని ఓ మాట అనలేదు.

'రెండు సుట్టలు సుట్టి ఓటి నాకిచ్చిర నువ్వోటి తీసుకో,' అని మాత్రం అన్నాడు. ఆ కుర్రాడు ముసిలోడికి ఓ చుట్టిచ్చి, తను చుట్ట అంటిస్తుంటే, తాటాకు ఈనె చివరున్న చేప కనిపించింది.

ఈయాల చేపల పులుసేంట్రా - రాత్రికి బోజనానికొస్తున్నానురోయ్' అన్నాడు.

'రా.. రా....' అన్నాడు ముసిలాడు.

అతను వెళ్లిపోయాకా మళ్లీ నిశ్శబ్దవేలింది. అతను వెళ్లినవైపే చూస్తూ చుట్ట గుప్పించడం మొదలు పెట్టాడు ముసిలోడు.

×××

'ఇందాకా పాటేదోపాడావు - ఆ పంతులుగారెవరూ?' అనడిగాను.

'గాంధీపంతులుగారని - ఆయన 'మాకొద్దీ తెల్లదొరతనము' అని గరిమెళ్ళోరి పాట అందుకుంటే జనాలూగి పోయేవారు. ఆయనెనకాల నేనూ కాంగ్రెసులో ఓ పదేళ్ళు తిరిగానులే ఆయన చాదస్తం, తలతిక్క నాకొచ్చిందని మా వోళ్ళంతా అంటుంటారు. ఆయనే మా అయ్యతో దెబ్బలాడి, పట్టుదలపట్టి నాకు సదువూసంధ్యా నేర్పించారు.

అరివే ఈ పొలాలన్నీ - ఇదిగో - ఈ రైలొంతెన దగ్గర్నుంచి పంచదార ఫాక్టరీదాకా, ఆ ఔటరు సిగ్నలు దగ్గర్నుంచి కాలవగట్టుదాకా, ఈ పొలాలు, కొబ్బరి తోటలూ అరివే. ఆయన్ని సూస్తే గాంధీగార్ని సూసినట్లే. గాంధీ పేరెట్టుకుని, దేసేన్ని దిబ్బచేసిన దొంగ నా కొడుకుల్లాంటాడు కాదాయన - నిప్పులాంటోడు - మంచో, చెడో తనోటి నమ్మాడు - నమ్మింది సెప్పాడు - సెప్పింది సేశాడు - సివరకి సర్వనాశనమైపోయాడు. దర్మాత్ముడు సెయ్యెత్తి నమస్కారం పెట్టలనిపించేది ఆయన్ని సూస్తే దర్మాత్ముడి దగ్గర లచ్చిదేవి ఎంతకాలం వుంటుంది. దరమదేవత, దరిద్రదేవత సెట్టాపట్టాలేసుకుని తిరుగుతుంటారు కదా!

ఇప్పుడు 'నేను' అనేమాట తప్ప 'మనం' అనే మాట ఇనిపించదుకదా! నాలుగు కొంపలు కూల్చి నాలుగుమేడలు లేపేనోడికి జై... జై..... అంటోంది ఈకాలం. మరి ఇక్కడ నిలబడి ఆయన గురించి ఒక్కముక్కలో సెప్పాలంటే ఆయన లోకం తెలీని ఎర్రోడు. కాంగ్రెసెనీ, దేసెవనీ ఉన్న ఆస్తంతా తగిలేసాడు. అంత ఆస్తి ఎలా కరిగిపోయిందంటే ఆరతి కర్పూరంలా ఇగిరిపోయింది.

'పంతులుగారూ - జాగ్రత్తండి', ఎవరైనా హెచ్చరిస్తే, నాశనమైపోవాలిరా - కొందరు' సర్వనాశనమైపోవాలి - అప్పుడు కాని దేసెం బాగుపడదురా', అనేవాడు నవ్వుతూ. తెల్లదొర అమ్మమొగుడిలాంటి నల్లదొరల రాజ్యం వొచ్చిందిగాని దేసెం బాగుపడిందా ఆయన మాత్రం నిజంగానే సర్వనాశనమైపోయాడు.

ఆయన పెద్దకొడుకు - అయబ్బాయి సన్నగా, పీలగా ఉండేవోడు - సెమ్కీ కోటేసుకుని, సెమ్కీ టోపీ ఎట్టుకుని, రోజూ గుర్రబ్బండి మీద స్కూలుకి ఒస్తుండేవోడు. అయబ్బాయిగారితోపాటే నన్నూ స్కూల్లో చేర్పించారు. పంతులు గారు స్కూలు మొత్తానికి నేనొక్కణ్ణే హరిజనుణ్ణి. కుర్రోళ్ళంతా 'అసింటా.. అసింటా...' అని నన్ను దూరంగా వుంచితే - కృష్ణమాచారి మాస్టారు - ఆయనమంచోడే గాని పెళ్ళావంటే సచ్చేబయం, స్కూలు ముంచొచ్చాకా స్నానం చేసి ఆ బట్టలు తడిపితేగాని ఇంట్లోకి రానిచ్చేదికాదు - ఆయన ఈడి పక్కన ఎవరు కూచుంటారంటే ఒక్కడూ రాలేదు. అప్పుడీయాబ్బాయి సిగ్గుపడుతూ లేచొచ్చి నా పక్కన కూచున్నాడు - ఆయబ్బాయి స్ఫోటకంవొచ్చి పది హేనేళ్ళప్పుడే పోయాడు.

రెండో కుర్రాడు చాకులాంటాడు - క్లాసులో ఫస్టొస్తుండే వోడు 'బావా - ఈణ్ణి బాగా సదివించు - ఈడు ఇసీయెస్ కలెక్టరవుతాడు, అని పోరేవాడు ఆయన బావమర్ది. అల్లాంటోణ్ణి ఇంగ్లీషు సదువులొద్దని, స్కూలు మాన్పించి - జాతీయ విద్యని తెలుగు, హిందీ నేర్పించాడు. సివరికి ఆ కుర్రాడు ఎందుకూ పనికి రాకుండా పోయి ఓ రోజు ఇంట్లోంచి పారిపోయాడు. ఏమైపోయాడో

ఎవరికీ తెలీదు.

।తవరు తప్పుపట్టకుండా వుంటే ఓ మాటంటాను. నెహ్రూ గారు గాందీగారి కుడిబుజంగదా. మరి ఆయన ఇందిరమ్మని ఇంగ్లీషు సదువులు సదవొద్దన్నాడా? అహింస, అహింసంటూ ఆయనెనకాల ఈయనా గొంతు సించుకు అరిచేవోడుగదా.. ఆయన ప్రదానమంత్రయ్యాక పోలీసులు, తుపాకులు వొద్దన్నాడా? అసలు తుపాకీ పేలకుండా దేసంలో ఎప్పుడైనా తెల్లారిందా? మరింక అహింసేంటి - జాతీయవిద్రోయంటి - జనాలని ఎర్రోళ్ళని సెయ్యడానికి కాకపోతే. నెహ్రూ గారిలా లౌక్యం తెలీక గుడ్డిగా గాందీగార్ని నమ్మిన పంతులుగారి లాంటోళ్ళు నాశనవైపోయారులే నాశనవైపోరా?

-పోయినోళ్ళు పోగా సివరికి లచ్చమ్మ గారని ఆరమ్మాయి మిగిలింది. ఆవిడగారి ఆకరి కొడుకు - అంటే గాందీ పంతులుగారి మనవడు - ఇప్పుడొచ్చిన ఈ కుర్రాడు.

లచ్చమ్మగారు వయసులో వుండగా కుందనపు బొమ్మలా వుండేది. సాక్షాత్తూ లచ్చీదేవిలా ఒంటినిండా నగలతో కలకలలాడుతుండేది మహారాణిల మసిలింది. సివరి రోజుల్లో మహాదరిద్రం అనుభవించింది. వానలో, సలిలో, పాక అరుగు ముందు, గోనెప్టామీద వణుకుతూ పడుకునేందేది - సివరికి సస్తే మోసేవోళ్ళులేరు - తగిలే సేందుకు కట్టేల్లేవు. ఆయమ్మ సెవం అలా పడుంటే అంతా దూరంనుంచి చూసెళ్ళిపోయే వోళ్ళేగాని, సెయ్యందించేవోళ్ళు లేరు - ఎవరికి ఏ కర్చు తగులుతుందోనని అందరికీ బయవే!

ఆయమ్మకి ఒరసకి తమ్ముడు - ఈడికి మేనమామ ఎమర్జన్సీ పంతులని ఒకడున్నాడులే. అడింటికి ఈడు పరిగెడితే, ఆడు పొద్దుటే సావు కబురు మోసుకొచ్చావు, అంటూ చికాకు పడ్డాడు ఈడిమీద, ఆయన రాలేరు నాయనా.. ఆయన కసలే బీపీ పెరిగిపోయింది, అంది ఆళ్ళత్త సన్నాయి నొక్కులు నొక్కుతూ, ఈయమ్మ రోజులు బాగున్నప్పుడు ఈళ్ళంతా గాదె కింద పదికొక్కుల్లా పడితిన్నోళ్ళే. ఆదుకుండా అలా అనేప్పటికి ఈడికి మతిపోయింది. పిచ్చోడిలా రోడ్డుమీద నడిచొస్తుంటే నేనేఎదురయ్యాను నన్ను సూడగానే ఆడు, మా యమ్మ సచ్చిపోయిందిరా ముసిలాడా - ఏంచెయ్యాలో తెలీడం లేదు - చేతిలో కాలీలేదు, అన్నాడు. ఆడికళ్ళల్లో సెవం ఎక్కడ తగలెయ్యాలో అనే కంగారు తప్పఅమ్మ సచ్చిపోయినందుకు కన్నీళ్ళు లేవు.

నా కొడుకు దగ్గర్నుంచి అంతకు ముందు రోజే మనియార్డరొచ్చింది. ఆ అయిదొందలూ ఆడిచేతిలో పెట్టాను సెవదహనం సెయ్యమని. అప్పుడు వరద గట్లు తెంచుకుపడ్డట్లు ఆడి కళ్ళల్లో నీరు పొంగుకొచ్చింది. ఒరే ముసిలాడా - నీరుణం తీర్చుకోలేనురా, అంటూ గొల్లుమన్నాడు.

రుణం లేదు గిణం లేదు - మీ తాతగారి ఋణం నేనే తీర్చుకున్నాననుకో, అన్నాను నేను ఓదార్పుగా.

గుడిదగ్గర్నుంచి కిరాయి మనుషుల్ని తీసుకొచ్చి శవం లేపి దహనం చేశాడు. ఎలాగోలా పన్నెండు రోజుల కర్మకాండ అయిందనిపించాడు - ఒరే ముసిలాడా సమయానికి దేవుడిలా ఆదుకున్నావు - అందరికంటె ముందు పీటేసి నిన్ను కూర్చోబెట్టాలిరా - కాని బ్రాహ్మల మధ్య నిన్ను పిలవలేనురా - ఏవనుకోకు, అన్నాడు ఆడుపదమూడోరోజున

అదే పోల్లే - అంతా సవ్యంగా జరిగింది గదా, అన్నాను.

'ఎలాగోలా ఆ పన్నెండు రోజులైందని పించాను - మా యమ్మ కర్మమంచిదైతే మంచి లోకానికి పోతుందిగాని ఇంకనూ సికాలూ, తద్దినాలు పెట్టడం నా వల్ల కాదురా...' అన్నాడు ఆడుబాదపడుతూ.

ముసిలాడు చుట్టగుప్పిస్తూ అలా వుండిపోయాడు చాలా సేపు. నాలుగు నిమిషాల తర్వాత మళ్ళీ అన్నాడు - 'ఒక కాకి సచ్చిపోతే ఎయ్యి కాకులొచ్చి గోలచేస్తాయే - అలాంటిది తోటి బాపనోడింట్లో అవాంతరవొస్తే బాపనోళ్ళు ఆడికి సెయ్యందించారా?' ఉన్న బాపనోడింటి ఈడెడితే ఆడు ఈడ్ని సమంగా చూసి ఇంట్లోకి రమ్మంటాడా ఏరా బావున్నావా. అంటూ ఈదిలో నిలబెట్టి మాట్లాడిపంపించేస్తాడు గాని, నా కులం వోడిని నెత్తికెక్కించుకుంటాడేంటి - మరి కష్టానికి కల్సిరాని కులవెందుకు?

ముసిలాడు హఠాత్తుగా నాకేసి తిరిగి, 'అసలు కులవంటే ఏంటి?' అనడిగాడు నన్ను.

'కులవంటే.. కులవే,' అన్నాను ముసిలాడు అనుకోకుండా అలా అడగడంతో తడబడి.

'కులవంటే కులవూగాదు, గాడిదగుడ్డూకాదు - కులవంటే డబ్బు - కులంలేనోడంటే డబ్బు లేనోడు - ఈడు సేతిలో కానీ లేని దరిద్రుడు కులం పోయినోడు బ్రామ్మల్లో అంటరానోడు అందుకే తోటి బామ్మలంతా ఈడ్ని అసింటా.. అసింటా.... అంటూ దూరంగా వుంచి తప్పుకు తిరుగుతారు - ఈడిప్పుడు, బ్రామ్మడు కాదు - బ్రామ్మణ హరిజనుడు అదీ అసలు సంగతి, అన్నాడు ముసిలాడు. ఆఖరుసారి చుట్టగుప్పుమనిపించి, పీకవిసిరేస్తూ.

'అంటే కులాలేవీ లేవనా నువ్వనేది?

'కులాలులేవని ఎప్పుడు సెప్పాను - కులవంటే ఏంటో సెప్పానుగాని కులాలెందుకులేవు? ఉన్నోడదో కులం, లేనోడిదో కులం గదా,' అన్నాడు ముసిలాడు తికమకగా.

'అయితే డబ్బేగాని కులాలేవీ లేవంటావా? నాకలా అన్పించడం లేదు - పేదలేంటి, దనికులేంటి కులం పేరుతో ఎన్ని పార్టీలు, ఎన్ని ముఠాలు, ఎన్ని కొట్లాటలు చూడ్డం లేదు? కులవంటే డబ్బే అయితే నువ్వు చెప్పినట్లు రెండు కులాలు - లేకపోతే ఉండీ లేనోడిదోకులం అనుకుంటే - మూడు కులాలుండాలి - అలా ఏవీ జరగడంలేదు...

' ఈ తెగులుకి మొదలెక్కడో నే సూపినంత మటుక్కి, నా కర్థమైనంత మటుక్కి సెప్పాను - కాదంటావా - అదేపోల్లే కాలం సెల్లిపోయిన ముసిల్లోణ్ణి - నా మాటలకేంగాని - బాగా సదుకున్నోడివి కదా - నువ్వు ఆలోచించు - కులవంటే ఏంటో నాకు ఇడమరచిచెప్పు,' - అన్నాడు ముసిలోడు బోసినోటితోపెద్దగానవ్వి - ఆ చిక్కుముడి నన్నే విప్పమంటూ.

*(ఆహ్వానం, నవంబర్ 1994)*

23

# చెప్పులు

- జింబో

"అరే పోశాలు, ఈ చెప్పులు దొరింట్ల ఇచ్చుగుంట బడికిపోరా!" కొడుకు పోచయ్యతో చెప్పాడు భూమయ్య.

భూమయ్య మోచీ. నలుబై ఏళ్ళుంటాయి. పూర్వం చెప్పులు తయారుచేసేవాడు. ఇప్పుడు మానేశాడు. మానేశాడు అనే బదులు తక్కువ చేశాడు అంటే బాగుంటుందేమో. హైదరాబాద్ నుంచి చెప్పులు తెచ్చి అమ్ముతున్నాడు. కొందరికి మాత్రం చెప్పులు తయారుచేసి ఇస్తూ వుంటాడు. చెప్పులు తయారు చేసి చేసి అతని చేతులు వాడాల్లాగా మారిపోయినవి. నాలుగెకరాల తరి పొలం. బజార్లో చెప్పుల దుకాణం. ఇద్దరు బిడ్డలు. ఒక కొడుకు. తన కొడుకు తనలాగా మోచీ కాకుండా బాగా చదువుకోవాలని పోచయ్యని చదివిపిస్తున్నాడు.

పోచయ్యకి పదమూడు సంవత్సరాలుంటాయి. చురుకైన కళ్ళు. బక్క పల్చగా వుంటాడు. ఎనిమిదవ తరగతి చదువుతున్నాడు. ఎవరికైనా ఎందుకు లొంగి వుండాలనే మనస్తత్వం. చదువులో బాగానే వున్నాడు. స్కూలుకి పోయే తొందరలో వున్నాడు. గూట్లో నుంచి పుస్తకాలు తీసుకుంటూ తండ్రి మాట విని అతని వైపు చూశాడు. భూమయ్య చెప్పులని కాగితంలో చుడ్తున్నాడు.

"ఏంది నాయననేను స్కూలుకి పొయ్యేటప్పుడు పని చెప్పుతవు. నువ్వు దుకాణమే పెడ్తివి. అవసరం వున్న వాళ్ళు దుకాణానికి వచ్చి తీసుకొని పోరా? మనమెందుకు వాళ్లింటికిపొయ్యి ఇవ్వాలి" ప్రశ్నించాడు తండ్రిని.

కొడుకు ప్రశ్నకి ఆశ్చర్యపోయాడు భూమయ్య. అప్పుడప్పుడు కొడుకు ప్రశ్నలు అతన్ని ఆశ్చర్యపరుస్తుంటాయి. ఆలోచింపచేస్తుంటాయి. కొడుకు ప్రశ్నలో నిజముంది. దుకాణానికి వచ్చి వాళ్ళు తీసుకపోవచ్చు. తన తండ్రి కాలం నుంచి వూళ్ళ దొరలందరి ఇండ్లకు వెళ్ళి చెప్పులు ఇవ్వడం అలవాటైపోయింది. ఇవ్వకపోతే ఏమిటి? ఆలోచిస్తేనే భయమేసింది.

"తొవ్వలనే గదరా! ఈ చెప్పులు దొరింట్లో ఇచ్చుకుంట పోరాదు" మళ్ళీ చెప్పాడు.

"ఇయ్యకపోతే ఏమైతది నాయన. నువ్వు అన్నిటికి బుగులు పడతవు" అన్నాడు పోచయ్య పుస్తకాలని చేతిలోకి తీసుకుంటూ.

"పోశాలూ! నాలుగక్షరాలురాంగనే నువ్వు గిట్ల మాట్లాడుతున్నావ గానీ, నీకు తెలియదురా దొరల సంగతి. అన్నీ మనసుల పెట్టుకుంటరు. ఎక్కన్నో చూసి తొక్కుతారు. నా మాట విని

ఇచ్చుకుంటపోరా! నువ్వియ్యకపోతే దుకానం బంద్‌చేసి నేనే ఇచ్చివస్తాను".

"ఏం జేస్తరు నాయినా?"

"ఏమైనా జేస్తరు. భూముల కాగితాలన్నీ గాళ్ళ దగ్గర వుంటాయి బిడ్డా. మన భూముల్ల ఎవలిదన్నా ఖబ్జా రాస్తే సరిపోదా! నీకివ్వన్ని సమజుగాదురా నా మాట విను" భూమయ్యకి లక్ష్మీనారాయణ గుర్తుకొచ్చాడు. అతని భూమి గుర్తుకొచ్చింది. అతను ఎట్లా భూమి నుంచి బయటకు నెట్టివేయబడ్డాడో గుర్తొచ్చి భయమేసింది.

తండ్రి మాటలు పోచయ్యకి అర్థంకాలేదు. తండ్రి భయంలో ఏదో నిజముందనిపించింది. ఏమీ మాట్లాడకుండా చెప్పుల్ని కుడి చేతిలోకి తీసుకొని, ఎడమ చేతిలో పుస్తకాలు పట్టుకొని బయటికి నడిచాడు.

పాముని కూడా చూసి భయపడని తండ్రి దొరకి అంత భయపడ్డం అతనికి ఆశ్చర్యం వేసింది. ఆలోచిస్తూ మూల మలుపు దాటి దొర ఇంటి వైపు దారితీశాడు పోచయ్య. దొర ఇల్లు దాటే బడికి వెళ్ళాలి. దొర ఇంటి ముందు నుంచి వెళ్తున్నప్పుడల్లా అక్కడి వాతావరణం వింతగా అన్పిస్తుంది. దొర పేరు రాంకిషన్‌రావు. అతను పట్వారీ. అతని అన్న జగన్మోహనరావు. అతను పటేల్. ఊరికి ఏ అధికారి వచ్చినా వాళ్లింటికి వెళ్ళాల్సిందే. గిరిదావర్ నుంచి ఆర్డీవో వరకి, మోరీల్ సాబ్ నుంచి డియస్పీ దాక అందరూ అక్కడే మకాం. సర్పంచ్ కూడా వాళ్ళ మనిషే ఆలోచిస్తూ మెయిన్ రోడ్డు మీదికొచ్చాడు. పోచయ్య. తన క్లాస్ పిల్లలందరూ స్కూలుకి పోతున్నారు. చెప్పులిచ్చి స్కూలుకి వెళ్ళేసరికి రెండో బెల్ అయిపోతుందేమో. తండ్రి మీద కోపమొచ్చింది పోచయ్యకి.

ఊళ్ళో ముందటి పరిస్థితులు లేవు. హరిజనులు వెనకబడ్డ తరగతుల వాళ్ళు అందరూ చదువుకుంటున్నారు. అయినా వూరి మీద రాంకిషన్‌రావు కుటుంబం పట్టు ఇంకా పోలేదు.

దొర ఇంటి వద్దకొచ్చాడు పోచయ్య. ముందు పెద్ద పాటకు. లోపల ఇల్లు. ఇంటి ముందు గూర్ఖాల్లాగా ఇద్దరు సుంకర్లు కూర్చొని వున్నారు. బీడీలు కాలుస్తూ ఏదో ముచ్చట్లు పెట్టుకుంటున్నారు. పోచయ్య అక్కడికి వచ్చి కోర్టు ముందు ఖైదీలా నిల్చున్నాడు.

"ఏమిరా పిల్లగా ఏటో వచ్చినవు" అన్నాడు ఓ సుంకరి బరిసె లాంటి ఆయుధం అతని పక్కన వున్నది.

"దొరకి చెప్పులు ఇయ్యమన్నడు మా అయ్య" అని సమాధానమిచ్చాడు పోచయ్య, చేతిలోని చెప్పులను చూపిస్తూ.

"ఉండు, దొర ఏం జేస్తున్నడో చూసివస్తా" లేస్తూ అన్నాడు సుంకరి.

"నువ్వు ఇచ్చెయ్యరాదు. నేను స్కూలుకి పోవాలే" చెప్పులు అతని కివ్వబోతూ పోచయ్య అన్నాడు.

"ఏమిరా పోరగా, నీకు పైత్యమున్నట్టుంది దొరకి చెప్పులు ఇవ్వకుండనే పోతవా! సదివినవుతీ వుండుండు" అంటూ లోపలికి పోయిండు సుంకరి.

ఏం చెయ్యాలో తోచలేదు పోచయ్యకి. అట్లాగే నిల్చున్నాడు. లోపలికి వెళ్ళిన సుంకరి ఐదు నిముషాల తర్వాత వచ్చాడు.

"దొర పూజలున్నాడు, నిలబడు గొద్దిసేపు" పోచయ్యకి చెప్పాడు సుంకరి. పోచయ్య అట్లాగే నిల్చున్నాడు కాళ్ళు పీకుతున్నాయి. ఆ రోజు క్లాసు పోతుందని బాధగా వుంది. తండ్రి మీద, దొర మీద కోపమొచ్చింది ఏమీ చెయ్యలేక అట్లాగే నిల్చున్నాడు.

అరగంట గడిచింది.

"కొంచం చూసి రారాదు. నేను బడికి బోవాలే "సుంకరితో అన్నాడు పోచయ్య".

సుంకరి లోపలికి వెళ్ళి ఐదు నిముషాల తర్వాత వచ్చాడు. అతని వైపు ఆత్రుతగా చూశాడుపోచయ్య.

"రా! రా! పొల్లగా, దొర కచేరిల కొచ్చిండు" అంటూ లోపలికి దారితీసిండు సుంకరి. అతని వెంట నడిచాడు పోచయ్య పుస్తకాలని చెప్పులని పట్టుకొని ఒక చేత్తో నిక్కరును సవరించుకున్నాడు. గుబులు గుబులుగా అన్పించింది. హోమ్ వర్క్ చేయనప్పుడు కూడా అన్పించ లేదు.

పాటకు దాటి లోపలికి పోయినారు. పడగలాగా కన్పించింది లోపల బంగ్లా. పెద్ద దర్వాజా దాటి కచేరి దగ్గరికి పోయినారు. మడత కుర్చీలో కూర్చొని వున్నాడు రాంకిషన్ రావు. ముప్పై అయయిదు దాటి వుంటాయి. మనిషి సాత్వికంగానే వున్నాడు.

"ఏంరా పొల్లగా మీ అయ్య రాలేదా? నీతోని పంపిండు" అన్నాడు దొర.

"రాలేదయ్యా" అంటూ చెప్పులు దొర కాళ్ళ దగ్గర పెట్టిండు పోచయ్య.

దొర కుర్చీ నుంచి లేచి చెప్పులు వేసుకున్నాడు అటూ ఇటూ నడిచి చూశాడు.

"కొంచెం కుత్తైమైయినమిరా పొల్లగా తీస్కపోయి వొదలు చెయించుక రా"

పోచయ్య దొర దగ్గరి నుంచి చెప్పులు తీసుకున్నాడు . కాగితంలో చుట్టుకొని సుంకరితో పాటు బయటకి వచ్చాడు. బడికి పోలేడు. తండ్రి మీద కోపమొచ్చింది. చెప్పులతో భాటూ ఇంటి మొఖం పట్టాడు.

xxx

పది సంవత్సరాలు గడిచిపోయ్యాయి. ఈ పదేళ్ళ కాలంలో ఊళ్ళలోకి అన్న లొచ్చింద్రు. రాంకిషన్‌రావు పట్వారీతనం పోయింది. దొరతనం పోయింది. ఆయన భూములన్నీ పడావు పడ్డాయి. అమ్ముకోవడానికి అవకాశం లేదు. వూళ్ళో వుండే పరిస్థితి అంత కన్నా లేదు. ఊరు వదిలి కరీంనగర్ జేరిండు.

ఈ పదేళ్ళ కాలంలో పోచయ్య డిగ్రీ చదువైపోయింది. కాంపిటీటివ్ పరీక్షలు రాశాడు ఎమ్మార్వో అయ్యాడు.

xxx

క్లాక్ టవర్ పక్కన ఓ పెద్ద చెప్పుల షాప్. దాన్నిండా రకరకాల చెప్పులు. సాయంత్రం ఏడవుతుంది. రష్‌గా ముగ్గురు సేల్స్‌మెన్స్ కస్టమర్లకి హాజరవుతున్నా, ఇంకా కొంత మంది యజమానిని ఏదో అడుగుతున్నాడు. అతను వచ్చి వాళ్ళకు చెప్పులు చూపిస్తున్నాడు. అవి నచ్చకపోతే వేరే మాడల్స్ చూపిస్తున్నాడు.

అప్పుడే పోచయ్య జీపులో క్లాక్ టవర్ వద్దకొచ్చాడు. చెప్పులు కొనుక్కోవడానికి రోడ్డు పక్కన జీప్ ఆపి షాపు లోకి వచ్చాడు. ఖాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. ఎవరో కస్టమర్‌కి చెప్పులు తొడుతున్న యజమాని పోచయ్యని గుర్తు పట్టి కౌంటర్ వద్దకి వెళ్ళి పోయాడు. పోచయ్య కూడా అతన్ని గుర్తు పట్టాడు. ఆశ్చర్యపోయాడు. అతను రాంకిషన్‌రావు ఎలాంటి మనిషి ఎలా అయిపోయ్యాడు. అనుకున్నాడు.

పోచయ్య చెప్పులు సెలక్టు చేసుకొని కౌంటర్ దగ్గరకొచ్చాడు బిల్ కట్టడానికి.

"ఏం రా పోచయ్య ఇప్పుడు ఇక్కడే ఎమ్మార్వోగా పని చేస్తున్నావట కదా!" అన్నాడు రాంకిషన్ రావు పోచయ్య దగ్గరి నుంచి డబ్బులు తీసుకుంటూ. రాంకిషన్‌రావు పలకరింపుతో పోచయ్య గుండె కలుక్కుమంది. తను రాగానే కస్టమర్‌కి చెప్పులు చూపిస్తున్న రాంకిషన్ రావు కౌంటర్ దగ్గరికి వెళ్ళి పోవడం యాదృచ్ఛికంగా జరిగింది కాదు. అప్పటి వరకు మర్చిపోయిన తన కులం గుర్తుకు వచ్చింది పోచయ్యకి. వృత్తులు మారిపోయినవి. తమ వృత్తి రాంకిషన్ రావు చేస్తున్నాడు. అతని వృత్తి తను చుస్తున్నాడు. ముప్పై గ్రామాలకు తను అధికారి. అయినప్పటికీ రాంకిషన్ రావు ప్రవర్తన తన పట్ల మారలేదు. అతని వృత్తి మారింది. ప్రవృత్తి మారలేదు. చెప్పులు తీసుకొని బయటకు నడిచాడు పోచయ్య.

24

# బతుకుబడి

-దార్ల రామచంద్ర

ఖమ్మం బస్టాండు జనంతో సందడిగా కిటకిటలాడుతుంది.

రాము''మీ ఊరి లోకల్ బస్ ప్లాట్‌ఫాం మీద రెడీగా ఉంది'' అంటూ, రాము మిత్రుడు సారయ్య బస్సువైపు చూపించాడు.

రాము ఖమ్మం పట్టణంలోని డిగ్రీ కాలేజీలో బి.ఏ. ఫైనల్ పూర్తిచేసుకొని తన మొత్తం లగేజీతో యింటి మొకానబయలుదేరాడు. ఒక చవకబారు సూట్‌కేసు, ఒక ప్రక్క బట్టల ప్యాకేజీ పట్టుకొని సారయ్య, రాము బయలుదేరారు. తోవలో, వారికి వారి క్లాస్‌మేట్ శ్రీనివాస్ కలిసాడు. ముగ్గురు మిత్రులు కల్సి బస్టాండుకు చేరారు.

బస్సుకదలడంతో, రాము ఆలోచనలు కదలడం ఆరంభమైంది. డిగ్రా కాలేజీలో మూడేళ్ళ చదువు ఊసులతో అందరూ హాయి హాయిగా స్నేహితులై మెలిగారు. కులబేదాలు మరచి, అన్నదమ్ములవలె పట్టనంలో ఆ చదువు ఆనందంగా సాగింది. సామాజిక అంతరాలు మరచి, జీవితం సాఫీగా సాగింది. జీవితంలో మరో ఘట్టం గడిచింది.

కాలేజీ సమస్యలు ఆర్థికబాధలైనా, జీవిత సమస్యలు దుఃఖదాయకమైనవి. జీవితంతో పోల్చితే, కాలేజీలో అనుభవించిన సమస్యల్లో బాధల్లో ఒక ఆనందం కూడా ఉంది. తన జీవితంలో సమస్యల చీకటి విషాదం తప్ప, ఆనందం ఎక్కడిది. ఆనందాలనుభవించే కాలేజీ బాదల జీవితం పూర్తిచేసుకొని, తాను తిరిగి జీవిత బాదల్లోకి ప్రవేశించడానికి ఇంటికి బయలుదేరాడు. నిజ జీవితంలో మర్చిపోయిన ఆనందం కాలేజీ జీవితంలో ఎంతో కొంత రుచి చూసాడు. ఇకపై తన జీవితలోకి గతమనే ఒక భూతం రాబోతున్నది. మర్చిపోని జ్ఞాపకాలు, స్నేహాలు,.. ఎందుకో రాము కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

బస్సు వేగం పుంజుకుంది. కాలేజీ జ్ఞాపకాల స్థానంలో, ఇంటి జ్ఞాపకాలు పొరలు పొరలుగా ఆక్రమించాయి. ఊరి జ్ఞాపకాల కుల భూతం, ఇంటి దయనీయ పరిస్థితులు, సినిమా హాల్ ఒక్కొక్కటీ తిరిగి జ్ఞాపకానికి వస్తున్నాయి.

మట్టి రోడ్డుపై కుదుపులతో బస్సు అదిరిపోతుంది. బస్సులోని జనం అతలాకుతలం అవుతున్నారు. రాము ఆలోచనలు తెగిపడుతున్నాయి. హారన్ సౌండ్, ఎదురుగా ఎడ్లబండి స్లో, స్పీడు, అన్నీ రొటీన్‌గా బస్సు ముందుకుపోతుంది. చిన్ననాటి ఆ ఊరు, అక్కడి పరిస్థితులు

గుర్తుకొస్తున్నాయి. దుఃఖం ముంచుకొస్తుంది. ఎవ్వరూ చూడకుండా, ముఖం తుడుచుకున్నట్లుగా చేసి, దస్తీతో కళ్ళనీళ్ళు తుడుచుకున్నాడు.

రాముది ఒక పల్లెటూరు. పల్లెటూరి జీవితాలు కొందరికి ఆనందంగా కన్పిస్తాయి. రాము పల్లె జీవితాన్ని ద్వేషించే పరిస్థితులో పుట్టి పెరిగినాడు. పల్లెల్లో కొందరి ఆనందం, అధికారం కోసం ఎందరి జీవితాలో బలి పశువులై బానిస బతుకులయ్యాయో రాములాంటి వాళ్ళకే తెలుసు.

పల్లె మొదటి పౌరుడు పెద్దారెడ్డి. గ్రామ పెత్తందారు. ఆ ఊరికి సర్వం, సమస్తం అతడే. అతని అభివృద్ధే దేశాభివృద్ధి క్రింద ఫైళ్ళు నమోదవుతాయి. అతని ఆనందమే, పల్లె జీవితాలు స్వర్గదామాలుగా కీర్తించబడ్డాయి. అతనికి ఎదురులేదు. అతడు ఆడింది ఆట, పాడింది పాట. అతని పేరు వింటే, రాము రక్తం సలసలా మరుగుతుంది.

పెద్దారెడ్డికి రెండువందల ఎకరాల జమీనుంది. పెద్దారెడ్డికి పెద్ద గడే ఉంది. గడే ఏడెనిమిదికి ఎకరాలు వెడల్పుతో ఉంటుంది. తరతరాలుగా, ఆ వంశం ఆ ఊరిని, ఆ గడీని పరిపాలిస్తున్నారు గ్రామ పంచాయితీలు రావడంతో అతని పెత్తనం సర్పంచు అనే పదవి దూపంలోకి ఒదిగిపోయింది.

రాము ఊరిలో ఎన్నో వాడలున్నాయి. ఊరికి రెండు కిలోమీటర్ల దూరంలో మాలవాడ, మాదిగవాడ ఒకదాని తర్వాత ఒకటి కలిసి ఉన్నాయి. ఊరి నుండి వెలివేసినట్లుగా, విసిరి పారేసినట్లుగా ఉండే ఆ వాడల్లో, చిన్న చిన్న గుడిసెలు. కొన్ని గుడిసెల పై కప్పులు లేచిపోయాయి. కొన్ని పై కప్పులు లేక పెండెలు, వాసాలు పిల్లల ప్రక్కటెముకల్లా కనబడుతున్నాయి. కొన్ని తాటాకుల గుడిసెలు, కొన్ని గడ్డితో కప్పినవి.కొన్ని తడకల గుడిసెలు, కొన్ని గోడల ఇండ్లు, గోడలు పడిపోయినవి కొన్ని, పడిపోయేవి కొన్ని.

తిట్టడానికి తప్ప, ఆ వాడకు వేరే వాళ్ళు రారు. పనికోసం, పాలేర్ల కోసం మాత్రం వస్తూనే ఉంటారు. ఆ వాడలకు అరే, తొరే, అనే పేర్లు తప్ప అసలు పేర్లతో పిలవడం కులవివక్షతకు నిదర్శనం.

ఆ ఊళ్లో నూటికి డెబ్బయి మంది వ్యవసాయ కూలీలు. నూటికి పదిమంది, యితర వృత్తుల వాళ్ళు, మిగతా వాళ్ళు 20 శాతం మంది వ్యవసాయదారులు.

రెక్కాడితే గాని, డొక్కాడని ప్రజలే ఎక్కువ. ఆ ఊర్లో రోగం, నొప్పికి ఒక చిన్న ఆర్.ఎం.పి. అయినా లేని గ్రామసీమ అది. ఆ ఊరి వెలివాడలోనే రాము పుట్టి పెరిగింది.

దేవయ్య, ఎల్లమ్మల దంపతులకు ఆరుగురు సంతానం. ముగ్గురు ఆడపిల్లలు, పెద్దవారు. మగపిల్లల్లోపెద్దవాడు భద్రయ్య. రెండోవాడు రాము. ఆడపిల్లలకు పెండ్లి అయి, అత్తవారి యింటికి వెళ్లిపోయారు. ముగ్గురు మగపిల్లలు తండ్రికి పనిలో చేదోడు వాదోడుగా, పెద్దోడు వ్యవసాయకూలీగా ఉంటున్నాడు.

ఆడుకొని, దుమ్ముకొట్టుకొనే యింటికి వచ్చిన రామును ఎల్లమ్మ ప్రేమ పెసరుకాయలు చేతిలో పెట్టింది. అవి గబగబా ఒలుచుకొని తినేసి కాళ్ళు చేతులు ఆదరాబాదరగా కడుక్కొన్నాడు.

"అమ్మా" బువ్వపెట్టే" అంటూ మారం చేశాడు. ఆరేళ్ళ రాము. ఎల్లమ్మ శరీరం జ్వరం రాబోతున్నట్లుగా వేడిగా ఉంది. ఈ పూట పెసరు కాయలే బువ్వరా - గడుక ఏద్దామంటే జొన్నలు లేవు. ఏం చేయ్యాలిరా? వేదనగా, లాలనగా బుజ్జగించింది ఎల్లమ్మ. రాము కుండలన్నీ గడుక కోసం దేవుతాడు గడుకలేదు (సంకటి) కానీ గడుక మాడు చెక్కలు అడుగును కాసేసికతో దాన్ని గీకి యివ్వమని తల్లిని అడిగాడు. గీచి ఇచ్చింది తల్లి. దాన్ని రొట్టెముక్కల్లా తిన్నాడు రాము.

దేవయ్య, భద్రయ్య, ఇద్దరూ పని నుండి ఇంటికి వచ్చేదారికి ఎదురెళ్ళాడు. ఏదైనా పెడ్తారేమోనని, వాళ్ళు వట్టిచేతులతో పాటు మట్టి చేతులతో వచ్చారు. తండ్రి ముఖం చూసి, కట్టుకొన్న పంచేలోగానీ, ఏమైనా కాయలు ఉన్నాయోమోనని వెతికాడు. ఏమీ దొకలేదు.

అంపుల కాడ కాళ్ళు, చేతులూ కడుక్కొని గుడిసెలో కూలబడ్డాడు దేవయ్య. గత వారం రోజులుగా మనస్సులో ఒకే విషయం కదలాడుతుంది. కానీ, ఊల్లో వాళ్ల ఊరుకుంటారా, అని తల్లడిల్లిపోతున్నాడు. బడిపిల్లలకు పగటిపూట పాలు, ఉప్మా యిస్తున్నారట. రాముని బడికి పంపితే వానికి ఒక పూటైనా కమ్మని తిండి దొరుకుతది ఎల్లమ్మతో అదే విషయం చెప్పాడు. బడికిపోవుట అనగానే రాముకు సంతోషం కలిగింది. బడిలో సారు ఉండరంట. చదువు చెప్తరంట. మంచిగా ఇంత కమ్మగా పాలు, ఉప్మా, పెడ్తరట.

మన మాల, మాదిగోళ్ళు చదువుకొనేటోళ్ళు ఎవ్వరూ లేరు బిడ్డా అంది ఎల్లమ్మ ఆవేదనగా. రామును బడికి రానిస్తారో, లేదోనని ఆమె భయం ఒంట్లోని చలికన్నా దొరభయం ఆమెను వణికిస్తుంది.

మన కులపోల్ల పోరగాళ్లు ఎవ్వరూ లేరుగదా. రాముని బడికి రానిస్తరా మరి అనుమానంగా అడిగింది ఎల్లమ్మ.

"కులమా. అదోలా చూసాడు రాము".

అది సర్కార్ బడి, ఎందుకు రానియ్యరు. అమాయకంగా అడిగాడు రాము. అట్ల గాదు బిడ్డా, ఇక్కడ దొర అన్నట్లు జరుగుద్ది. ఒద్దంటే ఒద్దు, ఔనంటే ఔను. బడిలో యిచ్చేపాలు, ఉక్మా ముందు దొర పెత్తనం ఏపాటివి అన్నట్లుగా రాము పరిస్థితి, రాము వాడి చిన్న బుర్రలో పాలు, ఉక్మా తప్ప ఎదురే కన్పించడంలేదు. అమ్మా, ఆకలి అనే మాటలు మరచి పాలు, ఉక్మా, అంటూ మనస్సులో జపించడం ప్రారంభించాడు రాము.

రేపు పోయి బడి ఎట్ల ఉంటుందో చూడాలే. రేపే ఉక్మ తినాలే. పాలు తాగాలే, ఆ పూటకు 'కలీ లేదు, గంజి లేదు'. అందరూ ఆకలితో నిద్రకుపక్రమించారు.

రాముకు ఆకలితో నిద్ర రావడం లేదు. ఉక్మా, పాలు, పలక, బలపం, సార్, చప్రాసి, పిల్లలు, అందర్ని చూసి ఆనందం పొందాలి. ఎప్పుడు తెల్లరుద్దో అని ఎదురు చూస్తున్నాడు.

కొక్కోరోకో... అని కోడి కూసింది. పిట్టలు కిచకిచమని అరుపులు ప్రారంభించలేదు. రెండో కోడి కూసేసరికి లేచి కూర్చున్నాడు రాము. ఆ వాడవాళ్లు అప్పటికే లేచి పనుల్లో పడ్డారు. ఇంకా తెల్లవారనేలేదు. ముసిముసి చీకటిగా ఉంది. ఎల్లమ్మ రాత్రంతా జ్వరం నొప్పులతో అటూ ఇటూ పొర్లుతూనే ఉంది. రాత్రి తిండిలేకపోవడంతో నిసత్తువుగా ఉంది. లేద్దామన్నా లేవలేక అలాగే పడుకొంది. కర్రబొగ్గుతో నోరు తోముకుని, ముఖం, స్నానం

అయిపోయిందనిపించాడు రాము.

రాము పలక కోసం మారాం చేస్తే ఎప్పుడో అన్నకోసం కొన్న పలక చూరులోంచి తీసి యిచ్చింది ఎల్లమ్మ. ఆ పలక బాగా పొగసూరింది. నల్లగా పరైబాసింది. పీచుపెట్టి దాన్ని తోముకొన్నాడు రాము. భద్రయ్య కోసం దేవయ్య పలక కొనిచ్చినా, వారం రోజులైనా పోకముందే దొర పనికోసం భద్రయ్యను పంపుమని హెచ్చరించే ఉన్నాడు.

విధిలేక కొడుకు మీద ఆశలు అలా చెల్లాచెదురయ్యాయి. వీడైనా చదువుకొంటే బాగుండును అనుకున్నాడు. రాము ఆరాటం చూసి దేవయ్యలో ఆశలు చిగురించాయి.

గబగబా ముఖం కడుక్కొని, జీవితం పనిలోకి వెళ్లాడు దేవయ్య. ఆ వెనకే తండ్రిని అనుసరించాడు భద్రయ్య.

ఇంకా పొద్దెక్కడం లేదనుకొని, రాముకు తొందర ఉంది. ఇరుగు, పొరుగు వాళ్లకు ఏదో పని ఉన్నట్లుగా పరుగులు పెట్టడం మళ్ల పొద్దు చూసి ఇంటికి రావడం ఇదే ఆరాటం ఆత్రుత రాముకు.

ఒక్కసారిగా ఆ వాడ కుక్కలు బౌ బౌ మన్నాయి. అందరూ అటుకేసి చూసారు. ఏదో అల్లరని ఎల్లమ్మ దబ్బున లేచింది. గుడిసెలోంచి తొంగి చూడగా, సంటి పిల్లవాడు భయంతో ఏడుపందుకున్నాడు.

పెద్దారెడ్డి తల్లి ముసలి దొరసాని ఛత్రం (గొడుగు) పట్టుకొని, కాళ్ల కడియాలు, గాజులు గల్లర, గల్లర అనగా లయగా కర్రతో ఆడపులిలా ఆ వాడమీద పడింది.

ఓరి.. ఎల్లిగా... యింకా తెల్లవారలేదురా? నీతల్లిని గాడిదలు దె...గా.. అంటూ బండభూతులు తిట్టడం మొదలెట్టింది పెద్ద దొరసాని.

ఎల్లయ్యది రాము ప్రక్క గడిసెనే. ఎల్లయ్య, రాము పెద్దయ్యే. ఆ గొంతు అధికారం చూసి రాము నివ్వెరపోయాడు. పెద్ద దొరసాని ఎప్పుడోగానీ, యిలా ఆ వాడకు రాదు. వచ్చిందంటే ఎవ్వరికో మూడిందన్నమాటే. ఆ వాడంతా గజగజలాడుతుంది. గుసగుసలు పోతుంది.

"బాంచెన్ దొరసానమ్మగారు" మీరే వచ్చింద్రా? పెద్ద దొరసానీ, పిలిపిస్తే మేమే వస్తుంటిమి గదా' బాంచెన్ అని వంగి వంగి కొందరు దండాలు పెడ్తుంద్రు. ఆవేవి వినపడనట్లుగా ఎల్లయ్య గుడిసె ముందుదాకా వచ్చి నిలబడింది.

ఒరేయ్.. ఎల్లిగా.. ఇంత పొద్దెక్కిందా నిద్రమత్తు దిగలేదురా? లంజాకొడుకా.. అంటూ గద్దించింది. ఆ అరుపు తో పాటు ఎల్లయ్య ఇల్లు తో పాటు ఎల్లమ్మ ఇల్లు అదిరిపోయింది. పాలేరు ఎల్లయ్యకు జ్వరం, మూసిన కన్ను తెరవడం లేదు. దొరసాని గొంతువిని ముక్కుతూ, మూల్గుతూ, గుడిసెలోంచి వణుక్కొంటూ బయటకు వచ్చాడు ఎల్లయ్య.

బాంచెన్ దొరసాని, అంటూ జ్వరంతో, వణికే చేతులతో దండం పెడ్తున్నాడు ఎల్లయ్య భార్య పాపమ్మ దొరసానికి రెండు చేతులూ జోడించి దండం పెట్టింది.

దొరసాని నీ బాంచెన్ కాలుమొక్కుతా, చందవాటు నుంచి పెయ్యి పచ్చిపుండులా ఒకటే చలి జ్వరం.

నీకు జ్వరం వస్తే మరి నీ పెండ్లాంను పంపలేదేందిరా. పనిలోకి నీవైనా రావొద్దే? అంటూ బండ బూతులు విప్పింది. ఆ తిట్లు భరించలేక, కిక్కురుమనని పేనులా, ఏడ్చి పిల్లల్ని బావా దొరసాని ముందే పనిలోకిని వెళ్ళింది పాపమ్మ, రాము పెద్దమ్మ.

దొరల, దొరసానుల తీరే అంత అని గునిగింది ఎల్లమ్మ మనస్సులో.. పంచాంగం విప్పిన దొరసాని తిట్టుకుంటూ వెల్లిపోతుంటే ఎల్లమ్మకు హమ్మయ్య హమ్మయ్య అని మనస్సు కుదిటపడింది. గాలివాన వెలిచినట్టయింది. బొడ్లో పెట్టిన చిల్లర పైసలతో బలపం కొనుక్కొందామని జ్వరంతోనే భయలుదేరింది ఎల్లమ్మ. ఊరి ప్రక్కనున్న గార్లకు బయలుదేరింది. సరుకులు, సామానులు గార్ల అనే చిన్న వ్యాపార కేంద్రంకు పోతుంటారు. గార్ల దాశరథి రచయిత, కవి సోదరులు పెరిగిన ఊరు అది. ఆ గార్ల లో బలపం కొనుక్కొని ఇల్లు చేరింది ఎల్లమ్మ కాలినడకన. నాలుగు కిలోమీటర్ల ప్రయాణం కేవలం బలపం కొనుక్కోవడానికి వెల్లింది ఎల్లమ్మ.

తల్లి కోసం ఆశగా పెరట్లలోంచి అమ్మరావడం చూసి పరిగెత్తాడు రాము. రాముని పలక తీసుకొని ఎల్లమ్మ బడివైపు నడిచింది. చినిగిన నిక్కరు మాసిపోయిన బనీను లాంటి అంగీ, చీముడు ముక్కు, జారిపోయే నెక్కరు, మొలదారంతో జారకుండా పైకెక్కిస్తూ, తల్లి వెంటపరుగు నడకతో గబగబా నడిచాడు రాము. రాము చేతులు పట్టుకొని ముందుకు నడుస్తుంది ఎల్లమ్మ.

ఎల్లమ్మకు 'బడి దగ్గరపడుతున్న కొద్ది, సంకోచం ఎక్కువ కాసాగింది. తాను బలపమైతే కొనుక్కువచ్చింది కానీ, సారు బడిలో తీసుకుంటాడో లేదో దొరసాని తీరు తిట్టే పంపిస్తాడో, బలపం ఎందుకు కొన్నావు - బలపం కూడా మైలపడ్తుందంటాడో - ఏమో. ఊరి పిల్లగాండ్లు ఎంత వెక్కిరిస్తారో.

బడి దగ్గరవుతున్నా కొద్ది ఎల్లమ్మ కాల్లు వనుకుతున్నాయి. గొంతులో ఏదో దిగబడ్డట్టూ బారమైంది మాట. పెద్దోన్ని బడికి తీసుకుపోయినప్పుడెదురైన సంఘటనలు గుర్తొచ్చి అడుగులు ముందుకు పడడం లేదు. స్పృహ తప్పి పడిపోతున్నట్లుగా అన్పిస్తుంది. జ్వరంతో, ఆకలితో శరీరం ఊగుతుంది. పాత జ్ఞాపకాలు మరింత వణుకు తెస్తున్నాయి. ఏం అడుగుతాడో ఏం మాట్లాడాలో నాకేం మాట్లాడవస్తది. ఇంటికి వాపసు పోతే ఎంత మంచిగుండునని ఆలోచనలో పడింది ఎల్లమ్మ. చెట్టు నీడకు కాసేపు ఆగి పైట చెంగుతో ముఖం తుడుచుకుంది. చదువు కుంటే, పాలు, ఉక్మా, అందరితో అడుకోవచ్చు. సారులు, బడి చదువు, పుస్తకాలు, పలక ,బలపం, ఏదేదో ఆలోచిస్తున్నాడు రాము.

రాముకు తల్లి ఆలోచనలు తెలియవు. ఆ చెట్టు నీడన ఎందుకు ఆగిందో అర్థం కాలేదు. కొంగు గుంజుతూ పోదాం రావ్మూ అంటూ తొందర పెట్టాడు రాము. చదివితే తెలివి వచ్చి పెద్దోల్లు అవవచ్చుట. బతుకులు మారొచ్చుట. రాము ఆరేళ్ళ చిన్న బుర్రలో ఆలోచన.

చదువు రాకపోతే, సారు కొడతాడా? కొడితెమాయె గానీ, పాలు, ఉక్మా, ఇవ్వరా. చదువు బాగా చదువు కోవాలే. ఆందోళన మొదలైంది రాములో.

అమ్మా, అమ్మా మరి బడికి పోకపోతే, చదువు రాకపోనోల్లకు ఉక్మా పెట్టరా? బడికోస్తేనే పెద్తరా. అడిగిండు రాము. తల్లికి మాత్రం ఏం తెలును. ఏమోరా, ఒర్రియ్యకు, జరకాంగుండు. నా పానం బాగాలేదు అంది ఎల్లమ్మ.

బడికి దగ్గరైనది. పిల్లలు ఏదో యక్కాలు వల్లిస్తున్నారు. అ... ఆ... లు కొందరు చదువుతున్నారు. చప్రాసి బెత్తం పెట్టుకొని పహరా తిరుగుతున్నాడు. సార్ చేతిలో బెత్తం నిగనిగలాడుతుంది. పిల్లవాళ్లని ప్రశ్నలడిగి బెత్తంతో సార్ కొడుతున్నాడు. అదంతా చూసి ఉచ్చపడినంతపనయ్యింది ఆందోళన పెరిగింది రాముకి.

ఏందన్నట్లుగా బెత్తంతో చప్రాసి ఎల్లమ్మ దగ్గరకు వచ్చాడు తల్లీ పిల్లలిద్దరూ బెదిరిపోయారు.

ఏంది? ఏంకావాలే? అన్ని మర్యాదగానే అడిగాడు చప్రాసి.

ఎల్లమ్మ కొంచెం ధైర్యం చేసుకొని, గీన్ని బడికి తొలిస్తమనుకుంటున్నా, బాంచెన్.. అంటూ దండం పెట్టింది. చప్రాసి వెల్లి సారుకు చెప్పిండు.

దండాలు బాంచెన్ దొరా.. గీన్ని మా పోరన్ని బడిలో చెర్చుకోండి బాంచెన్ అని దండం పెట్టింది. పాలు, ఉక్మా పెత్తరంట బాంచెన్ - వణుకుతూన్న నోటితో అంది ఎల్లమ్మ.

ఏ ఊరు, ఎవరు మీరు?

ఈ ఊరే బాంచెన్, మాలమాదిగ గూడెం, కాల్మొక్కుతా.. మా రాముని బడిలోకి తీసుకోండ్రి అంటూ రాముని చూపించింది ఎల్లమ్మ.

ఆ బడి ఇద్దరు సార్లు. 5వ తరగతి వరకూ ఉన్న పాఠశాల అది. అడ్మిషన్ ఫాం నింపి, రిజిష్టరులో పేరు వ్రాయించి ఎల్లమ్మ వేలి ముద్ర సంతకం చేయించాడు పెద్దసారు.

చప్రాసిని పిలిచి రాముని ఆ క్లాసులో కూచోపెట్టు అన్నాడు పెద్ద సారు కృతజ్ఞతాపూర్వకంగా ఎల్లమ్మ సారుకు రెండు చేతులు జోడించి దండం పెట్టి, సారు కాళ్లు పట్టుకోబోయింది. వద్దంటూ, మర్యాదగా వారించాడు పెద్దసారు.

రాముకు అంతా కొత్తకొత్తగా ఉంది. ఐనా ఆసక్తిగా పరిశీలిస్తున్నాడు. రాముని నర్సింహులు (చప్రాసి) క్లాస్ టీచర్‌కు అప్పగించాడు. నాకొడుకే సార్ అన్నట్లుగా దండం పెట్టింది. ఆయన ప్రతి నమస్కారం చేశాడు. ఆ ప్రతి నమస్కారానికి తబ్బిబ్బయిపోయింది. అమ్మకు సార్ పెట్టిన ప్రతి నమస్కారం రాముని సంభ్రమంలో పడేసింది. ఇటు ప్రక్కన కూర్చో అంటూ ఆ సారు తన ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు. బెదిరిపోకుండా.

జ్వరంతో ఎల్లమ్మ ఇంటి ముఖం పట్టింది. తను భయపడ్డట్లుగా జరుగలేదు. సాఫీగా జరిగిపోయింది. కొత్తసారు వచ్చిండ్రు. ఆళ్ల కడుపు చల్లగుండ. అంటూ ఆ సంతోషంలో సగం జ్వరం మరిచిపోయింది ఎల్లమ్మ.

రాముకు లక్ష్మయ్య సార్, అ. ఆ.. లు ఎలా దిద్దాలో, ఎలా బలపం పట్టాలో నేర్పాడు. చెయ్యి పట్టుకొని దిద్ది మరి మరీ నేర్పుగా ఓపిగ్గా అలవాటు చేసాడు.

రాముకు జ్ఞాపక శక్తితోవెంటనే అర్థం కాసాగింది. టీచర్ చెప్పిందంతా విని సరేనన్నట్లు తలాడిస్తూ దిద్దుకుంటున్నాడు. సార్... ప్రేమగా బాగా చూసుకుంటున్నాడు.

కొందరు పిల్లలకు సారంటే భయం లేదు. రాముకు సారంటే భయంపోలేదు. బెత్తం దెబ్బలకు ఉచ్చపోసుకున్న పిల్లవాడే గుర్తుకొస్తున్నాడు. తనకు ఒత్తుగా ఒంటేలుకు వచ్చినట్లు అనిపిస్తుంది. అడిగితే తన్నూ కొడ్తాడేమోనని భయం.

అంతలో ఒకబ్బాయి చెయ్యిచూపాడు. టూ ఫింగర్కై. రాముకు ధైర్యం వచ్చింది. తనూ వేలు చూపాడు. సార్ నవ్వుకొని, వెల్లమన్నాడు. తుర్రున పరిగెత్తాడు రాము. ఒంటేలు పోతే కొద్దిగానే వచ్చింది. రాము మనస్సు అక్షరాలు దిద్దేకంటే ఎప్పుడు బెల్ కొడ్తారా, ఎప్పుడు ఉక్మా, పాలు యిస్తారా. అని ఎదురుచూస్తున్నాడు. రాత్రి నుండి బువ్వ లేదు బాగా ఆకలిగా ఉంది. దాహం అని చెప్తే సారు మళ్లీ నవ్వుకుంటూ కుండవైపు చూపాడు చెయ్యికొత్తగా చేరే పిల్లలు అలవాటు పడేదాకా ఇలాగేచేస్తారని ఆ లక్ష్మయ్య సార్ ఆలోచన. అందుకే కుర్రాడి చేష్టలకు తనలో నవ్వుకుంటుంన్నాడు. కానీ, రాము ఆకలి గురించి, ఆలోచనల గురించి లక్ష్మయ్యకు తెలియదు.

మధ్యాహ్నాం వంట్రేల్ బెల్ కొట్టారు. పిల్లల్లో ఎక్కడా లేసి హుషారు వచ్చింది. చెంగు చెంగున గంతూలేస్తూ, పరిగెత్తే వాల్లు కొందరు, ఒంటేలుకు పోయేవాల్లు కొందరు. కొందరు మంచినీళ్లకు దారితీసేవాళ్లు. కొందరు ఆసక్తిగా రాముచుట్టూ మూగారు.

నీపేరేంది?... అని అడిగారు.

నా పేరు రాము.

ఎవ్వరు మీరు? ఏ వాడ?

మాల, మాదిగోల్లవాడ, మాదిగోల్లం.

ఆ మాటతో ఎవరో గొల్లున నవ్వాడు. ర్యాగింగ్ కాలేజీల్లో లాగా ఇక్కడకూడ ర్యాగింగ్. మన పల్లెల్లో మాల మాదిగలు పుట్టుకనుండీ ర్యాగింగ్కు గురౌతుంటారని చాలా మందికి తెలియదు. రాము అన్న ఈ కుల వివక్షత ర్యాగింగ్కు విధానాలకు భయపడి చదువు మానేసాడు. ఆనాటి పల్లెల్లో కుల విష సంస్కృతిలో భాగంగా పెద్దలు తన తల్లిదంఢ్రులు అనుసరించిన విధానంతో ఈ పిల్లలు ఇలా ర్యాగింగ్ చేస్తున్నారు.

మీరు మాదిగోల్లా.. అని తిరిగి రెట్టించాడు దొరకొడుకు

ఊ.. అవును.

ఆ మాటకు మళ్లీ ఎవరో నవ్వారు పక.. పకమని. రాము భిక్కదచ్చిపోయాడు.

మీ నాయన పేరేంది?

"దేవయ్య"

మళ్లీ ఎవరో అడిగారు. ఏం పని చేస్తాడు?

పెద్ద దొరదగ్గర పాలేరుగా.

అంతలో రాము చుట్టూ మూగి మరికొందరు జమయ్యారు

మాదిగోడు దేవిగాని కొడుకు., అంటూ అదేదో పెద్ద హాస్యం అయినట్టుగా నవ్వాడు దొర కొడుకు.

రాముకు అంతా అదోలా ఉంది. తన జీవిత విధానాలు వారికి ఎందుకు నవ్వు తెప్పిస్తున్నాయో అర్థం కావడం లేదు. రాముకు ఇంటికి పారిపోవాలనిపించింది. కానీ, ఆకలి

బాధ, ఉక్మా, పాలు, కోసం ఎదిరు చూస్తున్నాడు. ఆకలి దహించుకుపోతుంది. రైళ్ళలా ఆకలి పరుగుతో పాటు అవమానం పరుగు సాగించి. పెద్దసార్ అటుగా వచ్చాడు పిల్లలందరూ చెల్లా చెదురాయ్యరు.

ఏం కావాలి బాబూ? అంటూ ఆప్యాయంగా అడిగాడు పెద్దసార్. రాముని. ఆ ఆప్యాయతని కళ్లల్లో నీళ్ల తిరిగాయి రాముకు ఉక్మా, పాలు. కన్నీళ్లతో, భయంతో ఆకలితో దుఃఖ సముద్రమైన నోటితో సగం -సగం పలికాడు రాము.

రాము ఆవేదనకు పెద్దసారు చలించిపోయాడు. పాలు ఉక్మా ఆశ కోసం ఈ పిల్లవాడు బడికొచ్చాడన్నమాట. ఉక్మా, పాలు పథకం ఎంత గొప్పది. ఈ అహార పథకం వల్ల ఎంత అనాధలకు ఆసక్తి, చదువు పట్ల శ్రద్ధ పెరిగింది. ఆలోచనలో పడ్డాడు సార్. ఎందరో అట్టడుగు వర్గాల పిల్లల్ని బడికి ఆకర్షిస్తుందో ఈ పథకం.

ఈ ఊర్లో తొలి మాదిగ విద్యార్థిని సంపాదించి ఈ పథకం అందుకు నా అంగీకారమే ప్రధాన కారణం మనస్సులో అనుకున్నాడు.

పెద్దసార్ చంద్రారెడ్డి. ఆదర్శ భావాలు గలవాడు. పెద్దారెడ్డికి సవాలుగా జవాబుదారీ కావాలని పట్టుదలకలవాడు. పెద్దారెడ్డి విధానాలకు వ్యతిరేకి. రాముని బడిలో చేర్చుకోవద్దని హెచ్చరించాడు కూడా. చంద్రారెడ్డికి అది అవమానం అనిపించింది. స్కూల్లో ఆయన పెత్తనం ఏంటో. ధీమా గా మనస్సులోనే అనుకున్నాడు చంద్రారెడ్డి. పెద్దసారు ఎంత దొర ఐతే మాత్రం మా బడిమీద జులుం సాగిస్తాడా? దేనికైనా అంతూ, పంతూ ఉండాలి మరి. గులిగిందు పెద్దసారు. అందుకని పట్టుదలతో ఎల్లమ్మ కొడుకుని రాగానే వెంటనే బళ్లో చేర్చుకున్నాడు తాను. పెద్దరెడ్డొక్కడు ఇసుకున్నాడు పెద్దసార్.

ఉక్మా పాలు యివ్వడానికి ఇంకా నలుగైదు రోజులు పట్టుద్ది. అప్పట్నుంచీ రోజూ పెడ్తాం సరేనా. అని సముదాయించాడు సార్.

రాముకు ఒక్కసారిగా నిస్సత్తువ ఆక్రమించింది. ఆ అవమానం, ఆకలి, రెండూ కలిసి స్పృహ తప్పి పడిపోయాడు. అనుకొని పరిణామానికి చంద్రారెడ్డి అవాక్కయ్యాడు. పిల్లవాడిని బడిలోకి తీసుకొంటూ 'నర్సింహులు' అంటూ అటెండర్ కోసం కేకేశాడు.

అటెండర్ పరుగు పరుగున ప్లాస్టిక్ గ్లాసతో నీల్లు తెచ్చి రాముపై చిలకరించాడు. కొంత సేపటికి నిద్రలోలాగా కళ్లు తెరిచాడు రాము.

లక్ష్మయ్య సార్ సద్ది తెచ్చుకున్నావా? అంటూ పెద్దసార్ అడిగాడు. అవున్నట్లుగా తలాడించాడు లక్ష్మయ్య సార్.

కొంచెం వాడికి పెడ్తావా? నర్సింహులు తినిపిస్తాడు అంటూ, రాము.. రాము నీకు అన్నం తినవస్తుందా? అని అడిగాడు సార్.

ఔను అన్నట్లు తలాడించాడు పిల్లవాడు రాము.

చప్రాసి ఆకుండమీది చిప్ప కడుక్కుని తీసుకురా. అని అన్నాడు చంద్రారెడ్డి. లక్ష్మయ్య సార్ టిఫిన్ బాక్స్‌లోంచి అన్నం పెట్టాడు. రామును లేపినడిపిస్తూ స్కూల్ వరండా పైకి కూర్చోబెట్టాడు సారు.

రాము నీళ్లకుండ మీది మట్టి చిప్పలో మామిడి తొక్కల అన్నం కలుపుకుని తింటున్నాడు. చప్రాసి ఆ చిప్పను రాముతోనే కడిగించి ఆ కుండమీద పెట్టించాడు. ఆ చిన్న ఘటన ఆ ఊళ్లో ఎంతో అల్లకల్లోలం రేపిందో?

మాదిగోడు బడికి పోతే ఆ పెద్దసారు చేర్చుకోవడమా? ఎట్లా జరిగిందబ్బా అంటూ పేరెంట్స్ కమిటి ప్రెసిడెంట్ దొర సార్‌పై కోపగించాడు. బల్లో నీళ్లు నా దొరల పిల్లలు ఎట్లా తాగుతారు. కుండమూత చిప్పలో అన్నం తినటమా? అంటూ, ముట్టూ, ఏమీ లేదా. కారాలు, మిరాలు నూరాడు పెద్దసారుపై పెద్దారెడ్డి. పండ్లు పటపట కొరికి సూద్దాం వీడితడాకా, నా తడాకా. పందెం వేసికొన్నట్లుగా మనస్సులోనే తీర్మానించుకున్నాడు పెద్దారెడ్డి ఊరి దొర.

రాము కుండ మీది మూత మట్టి చిప్పలో అన్నం తిన్న ఘటన దళితుల్లో - ఊరి ప్రజల్లో గొప్ప ధైర్యం పెంచింది. ఆ ఊరి మెదటి దళిత విద్యార్థి చదువు అంబేద్కర్ చూపుడు వేలైసాగింది. చదివించు, సమీకరించు, పోరాడు, ఆశయం అంకురమైనిలిచింది.

తరతరాలుగా అణచివేతను బరిస్తున్న కుల వివక్షత రక్కసి పడగ నీడలోంచి బైటపడాలన్నా! ఓ చిన్నారి చిరుత ఏటికి ఎదురీది పెద్ద చదువు చదివి, దళిత అనుభవమై మనుస్మృతిని మట్టి కరిపించనిలిచిన చైతన్య కారదీపిక, భావిభారత దళిత ఉద్యమా బాటసారి ఆరాము కులం గాళమై సాగే వారదిగా సారధి ఆ విద్యార్థి.

*(గబ్బిలం మంత్లీ, సెప్టెంబర్, 1995)*

25

# ఇది కతా?

## బోయ జంగయ్య

అది జిల్లా కేంద్రం కాబట్టి జనం రాకపోకల రద్దీ, రోజుకు నాలుగు ఆటల సినిమాల సందడి, హోటళ్ళ హోరు, పోలీసుల హడావిడి, ఇంకా ప్రభుత్వ కార్యాలయాలకు వచ్చిపోయే జనం. వీటన్నిటినీ చూసిన మల్లయ్యకు "ఇరత మంది బతికే ఈ పట్టణంలో తాను గూడ తప్పక బతకొచ్చు' ' అన్న నమ్మకం కుదిరింది.

ఓ చౌరస్తా కార్నర్‌లోని పెట్రోల్ బంక్ పక్కమ్మటే తన అడ్డా జమాయించి కూర్చున్నాడు. అతని చుట్టూరా అతని పనిముట్లు ఓ పాత రేకు డబ్బాలో చెప్పులకు కొట్టే మొలలు. దాని పక్కన్నే మూత తీసేసిన నల్లని పాత బ్యాటరీ డబ్బాలో నీళ్ళు రిపేర్ల కోసమని కొన్ని తోలు పేలికలు, పాలిష్ డబ్బాలు, దారం, మైనం వగైరాలని సరిపెట్టుకున్నాడు. పాలిష్ చేయడం ఇక్కడి కొచ్చినాకనే నేర్చుకున్నాడు.

దసరా పండుగ రెండు రోజులుందనంగా స్కూళ్ళకు సెలవులిచ్చారు. కార్యాలయాలు గూడా సరిగా నడుస్తున్నట్టు లేవు. అందువల్ల ఇద్దరో, ముగ్గురో వస్తున్నారు.

మిట్టమధ్యాహ్నం గోడ నుండి గుంజికట్టిన బస్తా నీడలో కూర్చున్న మల్లయ్యకు రేపు పండుగనాడు పస్తు ఉండాల్సి వచ్చేట్టుగా ఉందనిపించేసరికి ఒళ్ళంతా తేలిపోయినట్టనిపించింది. చుట్టూ చూసి అంతకుముందెప్పుడో సగం కాల్చి చల్లార్చి దాచుకున్న చుట్టముక్కను తీసి వెలిగించుకున్నాడు. ఈ పీల్చిన పొగైనా కడుపులో ఉండిపోతే బాగుండు, కాస్త ఆకలి కాకుండా ఉండేది. ఇది మళ్ళీ బయటకెళ్ళిపోద్ది అనుకుంటూ ఎడమచేత చుట్టను పట్టుకొని దాన్నే చూస్తూ ఉండిపోయాడు. అలా చూస్తున్న మల్లయ్యకు తన ఊరు జ్ఞప్తికొచ్చింది. ఊరితోపాటు తన తల్లి, తండ్రి అప్పటి తన బతుకు అతని కళ్ళముందుకొచ్చింది. తనకు తెలివి వచ్చినప్పటి నుంచి.

తండ్రి ఎగసాయువు పనులు చేస్తూ ఆ సాముల తొండాలు, చెప్పులుకుట్టేటోడు, తన తల్లి కలవడం, కోయడం, కల్లాలు ఊడ్చడం, వొచ్చే కూలిగింజలతో పూట గడిసేది. తానుఎదిగినంక తాను తన పెండ్లం ఆ పనులే. అవే కూలిగింజలు, చావులకు, పెళ్ళిళ్ళకు, పండుగలకు పబ్బాలకు డప్పు వాయించేది. ఇంత బత్తెమో, సత్తెమో యిచ్చేటోల్లు. దేవుని సేవలు, సర్కారోళ్ళ సాటింపులు ఉత్తగనె! ఎట్టిసాకిరీ సెయ్యొద్దని సీకటోల్లు ఊరూరా సభలు చేసి సెప్పబట్టిరి. అంతల్నే మందల తోడేండ్లు పడ్డట్టు రజాకార్లు ఊర్లమీద పడి కూరకోత కోసిరి, కాల్చి సంపిరి. దొరలు, జాగీరుదారులుఅల్ల కాల్లకాడ కుక్కలైరి.

దున్నేవాడికే భూమి అనిరి. బంచరాయి, పోరంబోకు భూములను మాల, మాదిగల పేర్లు గూర్చి "హరిజనులని" తలా యింత పట్టాలిచ్చిరి. అటిల్ల తవ్వితే బాయి పడదాయే, దున్నితే సాలు రాదాయే అయినా ఎకరం, అరెకరం ఎగసాయానికి ఎడ్లు, నాగళ్ళు ఎక్కన్నించొస్తాయి? అవన్నీ మల్లా బంజర్లు అయి ఊర పనుల పాలాయే!

కాయకస్టం సేసి సేసి రెక్కలుడిగిపోయి, అమ్మ అయ్య రోగాల నొప్పులతో కాలంసేసి మంటకల్సిరి.

తల్లీ-తండ్రీ గుర్తు రాగానే మల్లయ్య కళ్ళల్లో నీటి పొర కప్పుకుంది. ఎదురుగా వొచ్చిపోయే వాహనాలు మసక మసకగా కనిపించాయి. ఒకసారి అటు, ఇటు కదిలికూర్చుని కళ్ళనీళ్ళొత్తుకున్నాడు.

దరిద్రులను ఉద్ధరిస్తం అని సర్కారోళ్ళు అప్పులిచ్చి తోల్లయాపారం చేయమనిరి. అమ్మ యిగ బతుకులు మారిపోతయని ఆశపడి, సేసే పనులొదిలిపెట్టి తోల్లు తెచ్చి పోతం జేస్తే ఆ రోజుల్లో ఆటిని కొనే దిక్కేలేదాయే.

రబ్బరు సెప్పులొచ్చి తోలు సెప్పులు తొలిగేఇంజన్లు, మోటార్లొచ్చి తొండాల పని తీరిపోయే తోల్లబేరం సాగకపోయే. మా నోల్లల్లో మున్నుపడే,మద్దెన కర్నపోడు తీసుకన్న అప్పు తిరిగి యియ్యక తప్పదని, ఆ అరెకరాన్ని అమ్మిచ్చె ఆ తరువాత తెలిసింది కాలంగాక కరువచ్చిందని, యిచ్చిన అప్పులు మాపైనవని. సర్కారోడు సాయం జేసినా, మధ్యోడు మాయజేసే. మల్లా ఎలచ్చన్లొచ్చె.

వద్దన్న పార్టీకి వోటెసింద్రని పగలుపెరిగి, ఎప్పుడో పటేలు కొడుకు మా కులపు పిల్లను గుంజితే కట్టేసి కొట్టినందుకు మనసుల పెట్టుకున్న పటేలు ఊరందర్ని ఉసికొల్పి మా పాకలకునిప్పుపెట్టిచ్చె. పోలీసోల్లు వాల్ల పాటే పాడిరి. ఇంతల మావోడే ముఖ్యమంత్రై ఊరికొచ్చి, కాలిన మా పాకలు నూసి, ఊరమ్మటే తలా ఓ ఇల్లు కట్టిస్తే, గాలికి కప్పులేసిపాయె, ఆనలకు గోడలు కూలిపాయె, మల్లా చెట్టుకింద బతుకులేనాయె.

xxx

"జర ఈ చెప్పుల సంగతి చూడు. అంటూ చెప్పులను మల్లయ్య ముందు వదిలాడు ఓ వ్యక్తి.

వదిలిన చెప్పును చేతుల్లోకి తీసుకున్నాడు మల్లయ్య.

"నిన్నెక్కడో చూసినట్టుంది" సిగిరెట్ ముట్టించుకుని కాలుతున్న పుల్లను పారేస్తూ అన్నాడు!

"నన్నా?" చెప్పు మీద మొలను ఉంచి ఆ వచ్చిన పెద్దమనిషి వైపు చూశాడు.

"నీది రాంపల్లి అనుకుంటా" అడిగాడుపీల్చిన పొగను ముక్కుల ద్వారా వొదులుతూ.

"అవునయ్యా."

"నన్ను గుర్తుపట్టలే, నీకు ఓ జర్సి ఆవును ఇప్పిస్తిని గదయ్యా! అప్పుడక్కడ నేను వి.డి.వోగ ఉంటిని."

"ఆఁఆఁ అంటూ నోరు తెరచి చూస్తూ గతాన్ని గుర్తుకు తెచ్చుకోసాగాడు.

"అప్పుడు నీ ఫోటోపేపర్లో వేసిరి. నీ పేరు రేడియోలో చెప్పిరి. నీ పేరు మల్లయ్య గదు?

"ఆఁ అంటున్నప్పుడు అవును ఇచ్చిన రోజు కళ్ళల్లో కదిలింది.

"ఇక్కడొచ్చిఎన్నాళ్ళైంది?"

"మూడేండ్లు అయిపాయె" అంటూ చెప్పుమీది మొలను గూటంతో గుద్దాడు.

"మరి ఆ అవును ఏం చేసినవ్?"

"అవు సచ్చె, దూడ సచ్చె" అప్పుడు ఆయన గుండెలో నుండి బాధతో కూడిన గొణుగు ఒకటి వచ్చింది.

"అరె సచ్చిందా? ఎట్లా?" కాలిన సిగరెట్టు. నుసిని పక్కకు దులుపుతూ అడిగాడు.

"ఎందుకు సచ్చిందని పసుల డాక్టర్ని అడిగితే మూతి యిరిసెందు గానీ ఏం సెప్పలేదు' ' అంటూ చెప్పుకు బ్రష్‌కొట్టి ఆయన ముందుంచాడు.

"అట్లనా, అది బతికితే నీవు బాగుపడెటోనివే" అంటూ ఓరూపాయి ఇవ్వబోయాడు.

"వొద్దు సారు, గింత పనికి గూడ పైసలా? తమరెంత సాయం జెయ్యలేదు గప్పుడు2' అంటూచేతులు జోడించాడు.

లేని నవ్వును తెచ్చిపెట్టుకుంటూ ముఖంలో మారిన రంగును కనపడకుండా దస్తిని మూతికి అడ్డుపెట్టుకుంటూఅక్కడి నుండి కదులుతూ ఇవ్వడానికి తీసిన రూపాయని తిరిగి జేబులో వేసుకున్నాడు.

ఒక్కసారి గతం కళ్ళముందు కదలాడింది.

ఈయనకు సహాయం చేశానా!

అసలు ఆ అవు, ధర ఎంత?

"నాలుగు వేలు"

రసీదుఎంతకు తెచ్చాము?

"ఆరు వేలకు."

"మిగతా రెండు వేలు?

"మా కమీషన్" సిగరెట్‌పూర్తిగా కాలడం వల్ల వేళ్ళకు సెగ తగలగానే దాన్నిపక్కకు విసిరాడు.

అయితే, ఈయకేమి చేసినట్టు?

"సహాయం కాదు, మోసం"

ఆ మోసం నేను చేయలేదు. సర్పంచ్ చేయించాడు. అందరం కలిసి పంచుకున్నాం.

మల్లయ్య సహాయం చేశారు అని చేతులు జోడించినప్పుడు చెంపమీద కొట్టినట్టు అనిపించింది.

అందుకే జేబులోని దస్తి ముఖం మీదొకొచ్చింది. అంతేకాదు, ఆ రోజు అవును ఇంట్లో కట్టేసుకుని చేతికి అంది. ఛిన రెండుకోడిపుంజులు గుర్తొచ్చినవి. "పేదోనికి మేలు చేస్తే అది

పెరటి తోట అయిపోతుంది. అయినా వాళ్లని తిప్పుకుంటాం. అప్పుడు చేసే పనిని ఆరు నెలలు సాగతీస్తాం!''

"అన్యాయం అన్యాయం'' అంటూ నడుస్తున్నాడు. ఆ మాటలు బైటికి వినపడక రిక్షా వాడొచ్చి పక్కన్నె ఆపుతూ "రిక్షా కావాల్నసార్" అనగానే, "అఁ" అంటూ అందులో కూర్చుని "జిల్లా పరిషత్‌కుపోని అన్నాడు.

మల్లయ్య బుర్రలో ఆవును గూర్చిన ఆలోచనలు కదిలాయి. అది ఈ దేశపు ఆవుకాదు. పెద్ద రకపు ఆవు. పూటకిపదిసేర్ల పాలిచ్చే ఆవు. ఆ రోజు మంత్రిగారు ఆ ఆవు తగులు నా చేతికిస్తున్నఫోటోను తెల్లారి పత్రికల్లోఏసింగ్రు తన పేరునురేడియోలో చెప్పింగ్రు. ఆవు వచ్చినందుకు సంతోషం, పేరుఅందర్కి ఎర్కైనందుకు సంతోషం గానీ, దానికేమి రోగమో ఇంటికొచ్చినంక రోజు ఇన్నిపాలు తక్కువియ్యటం మొదలుపెట్టే నెల దాటేవరకు పూటకు పదిసేర్ల పోయి రెండోనెలలో ఐదుసేర్లకొచ్చే మూడవ నెలలో దూడకు పుర్రుబెట్టె. ఆవు సగమాయే. ఇట్లెందుకైందని పసుల డాకటర్ని అడిగితే.

"ఈ అవుకుఎండి తగులొద్దు, మేత బాగుండాలె" అని.

మరి చెల్కలల్లకుకొట్టుకుపోయి మేపుకు రాకపోతే ఎక్కడ మేపను. అది ఉండడానికి నల్లగ ఉండాలంటే వున్న రెండు మేకపిల్లలు అమ్మి ఓ కొట్టం గూడ ఏయిస్తి. తనకు బాయా? కింద పొలమూ పచ్చగడ్డీ ఎక్కడినుంచి వొస్తది. ఇంటిది కూలి మాని గడ్డి చెక్కుకొచ్చి పెడితే దాన్నిసరిగ తినదాయె!

రోజూ పెండి పెట్వాలనిరి

ఆ ఆవులనుసాదాలంటే మాటలు కాదు. పేదోడు సాదలేడు.

మరి పేదరికం పోగొడతందుకే దాన్ని ఇస్తున్నాం అని ఆయాల్ల మీటింగుల సెప్పిరి. కాని దాన్ని సాదటంలోవున్న బాధలు ఎవరికి తెలుసు? ఆఖరికి ఇద్దరం కూలి మాని గడ్డి గాదం తెచ్చి కాపల కాసి కాపాడిన ఆవు దక్కదాయె. మొదట దూడ సచ్చె. అది సావంగానే దూడ లేంది ఆవు పాలు ఇయ్యదంటె, సచ్చిన దూడను అమాంతం తిత్తి తీసి దాంట్లోఇంత పొట్టు నింపి, ఎదురుగా నిలబెడితే పాలు ఎన్ని రోజులిస్తది? రెండు, మూడు రోజులిచ్చె వూకెనె. ఆ తరువాత అదీ సచ్చె. అది బతికి నన్ను బతికిస్తదేమో అనుకుంటే అదట్లాయే. అది ఎట్లా సచ్చిందని అడిగితే ఏం సెప్పు. ఏమేమో రాసుకున్నరు. ఆవు దూడ బాపతు రకం కట్టమన్నరు. అప్పు అప్పే అన్నరు. ఎన్నాళ్ల రెక్కలిరుసుకుంటే ఆరు ఎయిలు తీర్తయి. ఆవు వొచ్చిన్నాడు ఏడ్చిన కులపోల్లు వున్నది బాయె, కొన్నది బాయని నవ్వసాగిరి కూలికి బోకుండ గడవదాయె. అందుకనే తెల్లారి పల్లెనిడిపి పట్నమొస్తి

చేతిలో చెప్పులు

చుట్టూర పనిముట్లు.

అదే కులవృత్తి

అప్పుడేమో పొకముందట, ఇప్పుడేమోరోడ్ము పక్కన ఇక్కడ సంపాదన తక్కువ ఖర్చు ఎక్కువ, పొంగ సేతి నింద పనేది? మామూలోల్లు రబ్బర్‌చెప్పులా, ఉన్నోళ్ళు కంపెనీ చెప్పులా! ఇంకా కొందరు బూట్లా? వాటిని తొడిగినన్నిరోజులు తొడిగి పారెయ్యడమేనా, ఆటికి రిపేరెక్కడిది?

రిపేరు లేకుంటెను నాకు ఇక్కడపనెక్కడిది? పని లేకుంటే రూపాయెక్కడిది. రూపాయి లేకుంటే పొట్టెట్ట గడుసుతది? ఇగ పోలీసు పనంటర, బడి ఎగ్గొట్టిన పోరగాల్లు సంకల సంచి, సేతిల బుర్సాయే. హోటల్ కాడ, రైల్లల్ల, సినిమాలకాడ అంతట ఆల్లేనాయె. అదికాక ఇప్పుడొస్తున్న కొన్ని బూట్లకు పాలీసు గూడ అక్కరేలేదు. తుడుసుకుంటెసాలు. ఎంతున్న ఈ పన్ల పూట గడవదు. అప్పు తీరదు. అంతటా ఇంతేనేమో తెల్వదు గాని మన దేశంల మాత్రం, సందాలంటేవందలిస్తిరు. లంచాలంటే ఎయిలిస్తరు. కష్టం సేస్తోన్ని కనిపెట్టరు - కష్టం సేస్తోనికి అన్ని కష్టాలే. మొన్ననే అస్టల్లో చెరిపించిన కొడుకున్నా ఈ పనినుంచితప్పించుకుంటాడో?

ఇదిగో ఈ చెప్పులను కుట్టిస్తావా? అంటూ తన ఎదురుగా నిలుచున్న ఓ పెద్ద మనిషి మాటలు మళ్ళీ పనిలోకి దించినయి. తలవంచుకుని చెప్పులను రిపేరుచేస్తున్నాడు. ఈ లోపు రోడ్డు మీద పోతున్న జీపుకు కట్టిన మైకులో "సోదరుల్లారా రేపు మా పార్టీ వాళ్లు బందును ప్రకటించారు. కావున మీరంతా సహకరించి బందును విజయవంతం చేయ్యాల్సిందిగా మనవి అంటూ మల్లి మల్లి ప్రకటిస్తూ జీపు వెడుతూనే ఉంది.

"రేపు మల్ల బందా? ఇగ ఉపాసమే. వారానికో బందైతే ఎట్ల బతికేది" అంటూ తనలో తానే గునుక్కున్నాడు. అది విన్న పెద్దమనిషి.

"బందునాడు వచ్చిపోయే జనం ఉండరు. మీకుపని కూడా ఉండదు కదా!" రోడ్డున పోయే జీపు వైపు, ఆ తరువాత మల్లయ్యవైపు చూపులుంచుతూ అన్నాడు.

"ఏ పూట వచ్చినయి ఆ పూటేనాయె. ఏంరాకుంటే ఏం లేదు. మా బతుకుల్లో పస్తులే ఎక్కువ సారు." కుట్టిన చెప్పును అయన ముందేస్తూ, రెండవ చెప్పుకోసంచెయ్యి చాపుతూ "వున్న మారాజుకు ఏ బాధలూ లేవు. మాబోటోల్లకే తిప్పలు, కూలి లేకుంటే కూడు గడవదు. ఈ నెల నాలుగైదు బందులుబడిపిల్లల బందు, నౌకరుదార్ల బంద్, పార్టోల్ల బందు, దుకాన్‌దార్ల బందు, వస్తే బందు, కొట్టుకుంటేబందు, తిట్టుకుంటే బందు, ఈ బందులతో బతకలేకపోతున్నాం సారు" అంటూ రెండవ చెప్పును చేతిలోకి తీసుకుని చూస్తున్నాడు మల్లయ్య.

ఓ మాదిరి నవ్వు ముఖంతో పెద్దమనిషి

"మనది ప్రజాస్వామ్యము బాబు, భరించక తప్పదు" అన్నాడు.

"అంటే?"

"మన కోసం, మనప్రభుత్వాన్ని మనమే ఎన్నుకోవటం"

"గ వొట్లేసేదా?"

"అఁ అదే అదే"

"వొట్లేసినొల్లకే కూలి బందైతదని పార్టోల్లకు తెలవకుండొచ్చునా?"

తెలిస్తే బందెందుకు చేయిస్తరు. అసలు ఆ విషయాన్ని వాళ్ళెప్పుడైనా ఆలోచిస్తే గదా?

అదేందో రాను రాను బరిసెలోడు పోయి, తుపాకులోడు, ఈ యిద్దరు పోగ మద్దెన బాంబులోడు ఎవరొచ్చిన అల్లాల్లు బాగానే ఉంటరు. జనాన్ని సంపుతుండ్రు. ఇట్లైతే ఈ లోకం ఉంటదా సారూ."

పెద్ద మనిషి చిన్నగ నవ్వి చెప్పులను తొడుక్కుంటూ "పత్రికవాడో, టీవీ వాడో నిన్ను పలకరిస్తే బాగుండు" అని జేబులో నుండి డబ్బు తీసి ఇచ్చాడు. "అయ్యా ఏమనుకోవద్దు, కడుపుల కాలి ఏదేదో అన్నాను అంటూ చేతులుజోడించాడు.

"మాట్లాడే హక్కు అందరికీ ఉంది. అందులో వున్న మాటే అన్నావు" అంటూ అదే నవ్వుముఖంతో అక్కడి నుండి కదులుతున్నప్పుడు ఇంతకు ముందు చదవని ఓ కొత్త పుస్తకం చదివినట్టు ఫీలయ్యాడు.

"నాయి మాటలు కాదు తండ్రీ బాధలు" అంటూ పెద్ద మనిషి వెళుతున్న వైపు కనపడకుండా వెళ్లే వరకు చూస్తుండిపోయాడు. ఆ తరువాత అంత దూరం నుండి కోతిని పట్టుకునివస్తున్న ఓ ముదుసలి వైపు మల్లయ్య చూపులను మళ్లించాడు.

కోతి మెడలోనిగొలుసుమనిషి చేతిలో ఉంది. మనిషి చేతికర్ర కోతి భుజమ్మీద ఉంది.

మనిషికి కోతి ఆసరా? కోతికి మనిషి ఆసరా?

ఈలోపల కోతి మల్లయ్య ఎదటికొచ్చి గంతులేసింది. ఆ తరువాత చేయి చాపింది. దాని చేతలు చూస్తూ అన్నీ మరిచిపోయిన మల్లయ్య తానుకూర్చున్న గోనెసంచి మడతల్లోనుండి ఓ పావల తీసి కోతి చేతిలో పెట్టాడు.

కోతి సలాం కొట్టి ముందకు నడిచింది వెనకాల మనిషి! అప్పుడు ఎందుకో మల్లయ్య ముఖాన ఓమాదిరి నవ్వు పూసింది. అది ఎలాంటి నవ్వోఆయన లాంటి మనుషులు తప్ప మరెవరు చెప్పగలరు?

*(ఇండియాటుడే, మార్చి 6-20, 1996)*

26

# నేనూ ! నా బొద్దింక

-పైడి తెరేష్‌బాబు

ఉండడం సమస్య

లేకపోవడం పరిష్కారం

ఈ రెంటికీ మధ్య విస్తరించుకున్న సంక్షోభానికి చర్మం తొడిగి నిల్చోబెడితే అది - నేను. నేను రోజుకెన్నిసార్లు చచ్చిపోయినా మర్నాటి పొద్దున్నే కొత్తగా పుట్టుకొస్తుంటాను. నన్ను పీక్కుతినడం కోసమేనన్నట్టు నీతోబాటు, నాలోంచి ఆరాబాదరా పుట్టుకొస్తుంది నా బొద్దింక.

బొద్దింక యీపాటికే రావలసి వుంది. ఇంత ఆలస్యం ఎప్పుడూ కాలేదు. ప్రియురాలికోసం కూడా ఇంతగా ఎదురుచూసిన జ్ఞాపకం లేదు. నా బొద్దింకని ఎప్పుడెప్పుడు చూస్తానా అని మనసు ఉవ్విళ్ళూరుతోంది.

త్వరగా వస్తే బావుణ్ణు

×××

నా పలుగూ పారా, దుక్కి నాగలి, చదువూ ఉద్యోగాలు, దేహమూ, నేనూ నా సంతతీ అన్నీ బొద్దింక కోసమే పుట్టాయేమో ననిపిస్తుంటుంది. అది నన్ను పీక్కు తినేటప్పుడు కలిగే ఆనందమే జీవితానికి పరమావధి అనుకుంటాను. నిజం సుమా. బొద్దింక పళ్ళు భలే వుంటాయి. అవి పళ్ళుకాదు -

పారలు!

రంపాలు!

వేదాలు!

ఉపనిషత్తులు!

మనుధర్మ శాస్త్రాలు!

బ్రాహ్మణాలు!

నా బొడ్డు నేను తెగ్గోసుకుని అమ్మ కడుపులోంచి యివతల పడ్డం ఆలస్యం బొద్దింక ప్రేమగా కోరలు చాపుతుంది.

"మాలోళ్ల పిల్లోడు కదూ!"

"మాదిగోళ్లమ్మాయి కదూ!"

"అసింటా అసింటా..."

"ఏమేవ్! యిక్కడ కాసిని పసుపునీళ్లు చల్లు!!

కోరల్తో చూపుల్తో రక్కి కొరికి చీల్చి వేపుకుని చల్లార్చుకుని పరపరా కరకరా నన్నింత చులాగ్గా విందారగిస్తుందో బొద్దింక.

నాకు స్పష్టంగా తెలుసు. నా చేతులేనా కూడు నా చేతులే నా గుడ్డ. నా చేతులే నా గుడిసె. నా చేతులే నా చేతేలే నా..

అవునూ యివి నా చేతులేనా?!!

బొద్దింక భలే సందేహం రేపుతుంది.

అంతే!

ఉత్తర దక్షిణ ధృవాల మధ్య నేనో ఉయ్యాలనౌతాను.

బొద్దింక భలే కథల్చెబుతుంది. బోలెడు కవిత్వాలు రాస్తుంది. అవి వింటూ అయిష్టంగా దాని ఒళ్ళో ఒదిగిపోయి గతజల సేతుబంధనాన్నవుతాను. తాత్కాలికంగా పరిశుద్ధున్నవుతాను. అప్పుడే... సరిగ్గా ఆ క్షణం లోనే అమ్మా అబ్బల్నీ, పల్లెన్నీ, గతాన్నీ, కులాన్నీ అమ్మనాబూతులు తిట్టుకుంటూ నేను నేనంతా ఒక్క కన్నీటి చుక్కలోయిమిడిపోయి ఒక అక్షరాల్లేని ఏడుప్పాటనౌతాను. నక్కబొరియల్లో నాకలోకాలను, ఆవిష్కరించుకుని వాయువేగ మనోవేగాలతో నా పాత రాతియుగాలకు వలస వెళ్తాను.

నన్ను వర్తమానం నుంచి వెళ్లగొట్టడమే బొద్దింక ప్రధానోద్దేశం. ఒకవేళ అలా వెళ్ళకుండా "నేనూ మనిషినే కదా!" అన్నాననుకోండి, నాలుగు తలలు నా ఉరి శిక్ష గురించి తర్జన భర్జన పడుతున్నప్పుడు నా అయిదో తలను ఎత్తాననుకోండి, ముళ్ల కిరీటాలతో, మంత్రోచ్ఛారణల్తో ఒత్తేస్తూ బొద్దింకనా తలను ఎత్తనివ్వదు.

నాకు తెలీదనిగాదు - నా కళ్లే నా పుస్తకాలు, నా కళ్లే నా మెరిట్ సర్టిఫికెట్లు నా కళ్ళే నా ఉద్యోగ నియామకాలు. నా కళ్ళే నా కళ్ళే నాక...

అవునూ యింతకూ యివి నా కళ్ళేనా?

నన్ను తినడంలో బొద్దింక మాటి మాటికీ తన శైలి మార్చేస్తూ వుంటుంది. పాఠ్యపుస్తకాల్ని కిరోసిన్ దీపాల్లో తడిపి, చెరువు గట్లంబడి ఆరేసి, నిద్రల్లో సైతం నెమరేసి నా సొంతం చేసుకున్న యీ నాలుగక్షరం ముక్కలు నావేనని బొద్దింకకి తెగేసి చెప్పాలనుకుంటాను.

"మీ అమ్మ అబ్బలకు చదువుందా?"

"మీ తాత ముత్తాతలకు చదువుందా"

"వుంటే గింటే అది మా దయాభిక్ష"

'అసలు మీకు చదువులెందుకూ అంట"

బొద్దింక డేగలాగ వచ్చి ముచ్చెనగుంట మీద వాలుతుంది. నా నరాల్లో మళ్ళీ ఓ మురుక్కాలవ పారడం మొదలౌతుంది.

మనిషికి బియ్యపు గింజల్లా, ప్రజాస్వామ్యానికి ఖజానాల్లా, అగ్రవర్ణానికి మాల మాదిగ పల్లెల్లా బొద్దింక పీక్కు తినటం కోసం నేను!

చొక్కా పట్టుకు నిలేద్దామంటే కళ్ళుక్కనపడదు. పీలకుచ్చుకుని చితగ్గొడదామంటే చేతులు కందదు. అంగోస్త్రాల్ని లాగి, అంగాంగాల్ని కోసి పరిగెత్తించి మరీ ప్రానాలు తీద్దామంటే దీంతప్పాగొయ్య - బొద్దింక అవాఙ్మానప గోచరం!

నాకు నేనుగా గొంతు విప్పాలనుకున్నప్పుడో, జనంలోకెళ్ళి పదం కదపాలనుకున్నప్పుడో నన్ను అనుభవాల వెనక్కి లాక్కెళ్ళి ఊరవతల నిల్చోబెడుతుంది.

బొద్దింకకి బోల్డన్ని కామరూప విద్యలు తెలుసు.

నోట్లోంచొకటి, భుజాల్లోంచొకటి, తొడ ల్లోంచి, పాదాల్లోంచి మొత్తం నాలుగు గంథకపు గాజుకుప్పెలు సృష్టిస్తుంది.

చకితుణ్ణయి పోతాను.

నాలుగో గాజుకుప్పెను పట్టుకు 'ఛూమంత్రకాళీ' అంటుంది.

చిట్టిగాజుకుప్పె బైటికొస్తుందేమోనని గుడ్లు తలేసి చూస్తుంటాను. కాని, మట్టిముంత నొకదాన్ని బైటికి తీస్తుంది. నా మెడక్కడుతుంది. మళ్ళీ ఛూమంత్రకాళీ అంటుంది. తాటాకు చీపురొస్తుంది. నా ముడ్డిక్కడుతుంది. కావాలని వేదాన్నొకసారి వాసన చూపించి పోతారెవరో!

ఇక మొదలౌతుంది సంబరం.

కొరడాలొస్తుంటాయి. నాతోళ్ళు ఒలుస్తుంటాయి. కాల్చిన కర్రు లొస్తుంటాయి. నా అసనాల్ని తొలుస్తుంటాయి. చురకత్తులొస్తుంటాయి. నా నాలికల్ని కోస్తుంటాయి. అన్నీ అయిపోయాక 'యింకేం లేవా' అంటాను అమాయకంగా.

'చూశారా చూశారా ఎంత బలుపో!'

అంటూ వేదాల మంటల్లో మరిగించిన సీసాన్ని నా చెవుల్లో పోసి శ్రవణ మనోహరంగా నవ్వుతుంది.

బొద్దింక చెప్పినట్టు నడుచుకోకపోతే నేను బతగ్గలనా?...

భూమ్మీద నేను పాదం మోపని కోణమేం మిగిలుందివాళ

కాలేజీల్లో, కోర్టుల్లో, కలెక్టరేటుల్లో, వ్యాపారాల్లో, వాణిజ్యాల్లో వర్ణాంతర వివాహాల్లో విదేశాల్లో భూమ్మీదగానీ నీళ్ళమీదగానీ గాలిమీదగానీ ఆకాశమ్మీదగానీ నేను పాదం మోపని రంగం ఏం మిగిలుందని?

నా పాదం నా పాదం అన్నింటా నా.. పా.. అదుగో మళ్ళీ వచ్చింది బొద్దింక.

బొద్దింక భావం మళ్ళీ నన్ను తొలుస్తోంది. "ఫ్రాయిడ్, జంగ్, పావలోవ్, సైకియాట్రిస్టూ.. దీన్ని మీరెలా పిల్చినా నేను బొద్దింక భావమనే పిలుస్తాను. మీరు కోస్నేపు. అవతలకు పొండి.."

రాదనుకున్న బొద్దింక మళ్ళీ రానే వచ్చింది. నా సుప్తకోణాలనూ, శప్తలోకాలనూ తట్టి తట్టి కొట్టి కొట్టి నిద్ర లేపుతుంది. పుట్టింది మొదలు వెంటాడి వేటాడి రక్కి కొరికి విరిచి చీల్చి సంహరిస్తూ సంభోగిస్తూ నిరంతరంగా నిరంతరాయంగా నన్ను జుర్రుకు తాగిన నా ప్రియమైన బొద్దింక నాకీవాళ స్పష్టంగా మహాస్పష్టంగా కనిపిస్తోంది.

నా పంచేంద్రియాలు చచ్చుబడక ముందే దాన్ని సమీపించాలి. మహర్షుల్ని, మనువుల్ని మారణహోమాల్ని అధిగమించి దాన్ని కౌగిలించుకోవాలి. అది తినెయ్యగా మిగిలిన అవయవాలను,

ముఖ్యంగా, గుండెకాయను స్వాధీనంలోకి తెచ్చుకోవాలి.

తెచ్చుకోగలనా తెచ్చుకోగలనా తెచ్చుకోగ...

తెచ్చుకోగలను!

నా బొద్దింక వచ్చేస్తోంది. దగ్గరగా మరింత దగ్గరగా వచ్చేస్తోంది. నా శరీరానికివాళ వసంతమే.

అబ్బా.. ఆహ్.. సస్స...

దొరికింది.

నా బొద్దింక నా చేతికి దొరికింది.

ఇన్ని కారంచేళ్ళ తర్వాత ఇన్ని పదిరికుప్పాల తర్వాత, ఇన్ని చుండూళ్ళ తర్వాత ఇన్ని శతాబ్దాల తర్వాత బొద్దింక నా చేతికి అందింది. బొద్దింకను నరికి పోగులు పెట్టాలన్న స్పృహ నాకు కలిగింది. అలవాటులేని యుద్ధం. నాతో నేను యుద్ధం చేసుకుంటూ, నా పరిసరాలతో యుద్ధానికి తలపడాల్సిన సంధర్భం.

నాకు స్పష్టంగా తెలుస్తూవుంది.

ఇప్పుడు బొద్దింకనన్ను తినటంలేదు. దాన్ని ముదమారగా నా చేతుల్లోకి తీసుకుని ఒక్కో కన్ను, ఒక్కో కాలు, ఒక్కో కీలు, ఒక్కో నరం, ఒక్కో కండరం చెకుముకి రాళ్ళతో నలగ్గొడుతున్నాను.

×××

ఇప్పుడు -

నాలో తక్కువతనం లేదు. ఎక్కువతనం లేదు. నా ఊపిరిలో న్యూనతాభావాల నిమ్నోన్నతాలు లేవు.

ఇప్పుడు నేనొక రజస్వలించిన వేలని. ఆకారం తొడుక్కున్న చిరకాలపు కలవి. నిజమైన మనిషిని!

*(ఆంధ్రజ్యోతి మార్చి 17, 1996)*

27

# మురికి

కొమ్మి రమేష్‌బాబు

మురిక్కాలువ.

జోరుగా ప్రవహించడం లేదు. కాలువ అడుగున నల్లని మట్టి పేరుకుంది. ఆ మట్టిపైన వలయాలుచుడుతూ నీళ్ళు ప్రవహిస్తున్నాయి. నిల్వ పదార్థాల, మురిగిపోయిన తినుబండారాల వాసన గాలిలో తేలుతుంది.కాల్వ పక్కనే ఒక కుక్క ముందరి కాళ్ళ మీద తల ఆన్చి కళ్ళు మూసుకుంది. దాని చెవుల మీద వాలడానికి రెండుమూడు ఈగలు ముసురుతున్నాయి. ఈగలతో పోటీపడుతూ దోమలు రివ్వున రెక్కలు ఆడిస్తూ ఎగురుతున్నాయి. నిశ్శబ్దంగా వుంటే దోమలు ఎగురుతున్న శబ్దం వినిపిస్తోంది. కాల్వ నీళ్ళల్లో, తేమగా వున్న బురదలో లార్వాలు కదులుతున్నాయి. మురిక్కాలవకు కొద్దిగా దూరంగా నేలంతా తడిబారి వుంది. బురద మట్టి సారంతో కసింత చెట్లు ఏపుగా పెరిగి వున్నాయి. గుబురుగా వున్న చెట్ల నీడలో ఒక పంది తల్లి తన ఎనిమిది పిల్లలకు పాలిస్తూ అరమూసిన కళ్ళతో మూలుగుతోంది. ఆ మూలుగులో తీయని ఆనందం. ఎనిమిది పిల్లల్లోనూ రెండు పిల్లలు తెల్ల చర్మంతో వున్నాయి. మిగతావి తల్లిని పోలిన నలుపుతో ముద్దుగా, బొద్దుగా వున్నాయి. గుర్రు గుర్రు మంటూ తల్లి రొమ్ముల్ని కుమ్ముతున్నాయి.

కాల్వ ఒడ్డునే నలిపేసిన న్యూస్ పేపర్ ముక్కలు కొన్నిపడున్నాయి. వాటిలో కొన్నితడిసి వున్నాయి. ఇడ్లీలు, దోశలు నంజకోడానికి చేసిన శనగ పచ్చడి, పులిసిన దోశల పిండి కాల్వలోకి ప్రవహిస్తున్నాయి. కమిలిపోయిన అరటి ఆకులు, ఎండిపోయిన అడ్డాకులు పిండిమీద నానుతున్నాయి. వాటిని తడుపుతూ టీ గ్లాసులు కడిగిన నీళ్ళు ప్రవహిస్తున్నాయి. ఆ నీళ్ళు రెండు మలుపులు తిరిగి మున్సిపాలిటీ కాల్వలోకి కలుస్తున్నాయి. ఈగల కోసం, దోమల కోసం రోజుల తరబడి సరిపోయే ఆహారం, చిరుతిళ్ళు అక్కడ నిల్వ వున్నాయి. ఈగలు, దోమల మురుగు చుట్టూ ఆహారం, చిరుతిళ్ళు అక్కడ నిల్వ వున్నాయి. ఈగలు, దోమలు మురుగుచుట్టూ ఆనందతాండవం చేస్తున్నాయి.

మురిక్కాలవ పక్కనే నాలుగు చక్రాల బండి మీద కాకాహోటల్. అది బండి రాముడి కాకా హోటల్. నాలుగు చక్రాల బండి నిండా నల్లని డాగులు. ఒక పక్కన కిరోసిన్ స్టౌ భగభగా వెలుగుతోంది. పెద్ద డెగిసాలో పాలు మరగకాగుతున్నాయి. నిత్యం పాలుకాచిన గుర్తుగా దాని అంచులు ఎర్రగా కాలిన మీగడ తొరకలతో నిండివున్నాయి. దాని పక్కనే మరుగుతున్న డికాక్షన్. బండికి కుడివైపున విశాలమైన సీవెండి పళ్ళెంలో ఇడ్లీలు. స్టౌకి చేరువలో దోశల పెనం. పెనం

తుడవడానికి కొబ్బరి ఈనెల చీపురు. పెనం పక్కనే ఇనుపరేకుల డబ్బా. అది నూనె డబ్బా. దానికి అడ్డంగా పొడవాటి అట్లకాడ. ఆ డబ్బాలో దారం చుట్టిన చిన్న వెదురు ముక్క నూనె డబ్బాని అనుకుని మరో రేకు డబ్బా. దానిలో ఎర్రగా గడ్డలు కట్టిన పంచదార. పంచదారలో మచ్చలు పడిన సీవెండి స్పూన్. బండిలో కుడిపక్కన గల్లాపెట్టి. అస్తమానం తడిచేతుల్తో ముట్టుకోవడం వల్ల కావచ్చు. పెట్టినిండా తడిమచ్చలు, నల్లని మురికి. గల్లాపెట్టిపైన అడ్డంగా చిన్న చిల్లు. చిల్లర పైసలను మూత తీయకుండానే పెట్టెలో వేయడానికి సౌకర్యంగా రూపాయి నాణమంత చిల్లు.

బండిరాముడి హోటల్‌కి ఇద్దరు రిక్షాపుల్లర్లు వచ్చారు. ఖద్దరు బనినులు, కాటన్ నిక్కరు దులపరించుకున్నారు. భుజం మీద వున్న టవల్‌తో చెమట తుడుచుకున్నారు.

రెండు టీలు అందుకో గురూ"

బండిరాముడు సన్నగా ఈల వేస్తూ టీ అందించాడు. వా [illegible] పెట్టిలో వేసుకున్నాడు.

బండి మీద ఐస్‌క్రీములు అమ్మే కుర్రాడు వచ్చాడు.

"ఇడ్లీ వేడిగా వుందా" అడిగాడుబండి రాముణ్ణి. బండి రాముడు వాడివొంక వెటకారంగా చూశాడు.

"నీ ఐస్‌క్రీములు ఎంత వేడిగా వుంటాయో నా ఇడ్లీలు అంతే వేడిగా వుంటాయి" అనన్నాడు వెక్కిరింతగా.

ఐస్ క్రీముల కుర్రాడు ఇడ్లీల ప్లేటు తీసుకున్నాడు. చట్నీలో నంజుకుని ఇడ్లీ ముక్క తింటూ "ఇంకా నయం. వేడి వేడి టీలో నంజుకోమన్నావు కాదు' అనన్నాడు నవ్వుతూ. ఇడ్లీ తరువాత టీ తాగి డబ్బులిచ్చాడు. ఆ డబ్బుల్ని బండి రాముడు జాగ్రత్తగా గల్లాపెట్టిలోవేసుకున్నాడు.

బండి రాముడి హోటల్ వెనుక పెంట కుప్ప. దానిలో చిత్తు కాగితాలు, మకిలి పట్టిన మైకా సంచులు, సిగరెట్‌పీకలు, వక్కపొడి ప్యాకెట్లు, చింకిరి గోనెసంచులు, చివికిపోయిన బట్టలు, వడకట్టిన టీపొడి, తడిసిన మినపపొట్టు, పగిలిన గాజులు, ముక్కలైన గాజు సీసాలు, ప్లాస్టిక్ డబ్బా ముక్కలు, కుండపెంకులు, గడ్డిపరకలు, పండిన ఆకులు, సిరంజీలు, రక్తపు మరకల బ్యాండేజీలు కుప్పపోసివున్నాయి. ఆ కుప్ప మీద బొద్దింక రెక్కలు, రెండు చచ్చిన పంది కొక్కులు పడున్నాయి. ఒక పక్కన వాడిపోయిన మల్లెదండ. అది నలిగి, ఎండి, చిట్లి, చెదిరిన జీవితంలా ఉంది. ఆ పెంటకుప్ప ఒంటేలుకి పోయే స్థలంగా కూడా ఉపయోగిస్తుండడంతో దాని నుంచి రొచ్చు వాసన రేగుతోంది. గాలి ఇటు మళ్ళినప్పుడల్లా ఆ వాసన ఊపిరికి అడ్డం పడుతోంది.

బండిరాముడి కొట్టుకి ఇద్దరు ముష్టివాళ్ళు వచ్చారు. ఇద్దరూ కుష్టువాళ్ళే. చేతులూ కాళ్ళూ లేని నడివయస్సు వ్యక్తి చక్రాలున్న నేలబండి మీద కూర్చున్నాడు. నడి వయసు స్త్రీ బండిని తోసుకుంటూ వచ్చింది. వాళ్ళు వారం వారం వస్తారు. వాళ్ళ కోసం మాత్రమే బండి రాముడు ఐదు పైసల బిళ్ళలు సేకరించి పెట్టుకుంటాడు. వారం మొత్తం మీద వాళ్ళకి మాత్రమే భిక్ష వేస్తాడు.

ఈ రోజు కూడా బిక్ష వేసి వాళ్ళని తరిమినట్టే పంపించాడు. లేదంటే వాళ్ళు అప్పనంగా టీ

అడుగుతారని వాడికి భయం. భిక్ష అందుకుని వెళ్ళిపోతున్న వాళ్ళని చూస్తూ "ఇలాంటి ముష్టి మాలో కాలు ఎందుకు బతుకుతారో అని వికారంగా తిట్టుకున్నాడు. పెంటకి ఇవతలగా రెండుకళాయి రేకుల బక్కెట్లు వున్నాయి. అవి కాల్వకి చేరువగా వున్నాయి. ఒక బక్కెట్‌లో మడ్డిపట్టిన నీళ్ళు. నేరుగా ఇడ్లీప్లేట్లు, టీ గ్లాసులు అందులో వేయడం వల్ల ఆ నీళ్ళు అలా తయారయ్యాయి. మొదటి బక్కెట్‌లో నీళ్ళు కాస్త తేటగా, గోధుమ రంగులో వున్నాయి. బండి కింద రెండడుగుల ఎత్తున్న మట్టిబాన. అందులో నీళ్ళు 'మంచినీళ్ళు'. ఆ బానని కడిగి చాలా రోజులయ్యింది. అందుచేత దాని అంచుల్లోనూ, లోపలా నాచుపొర కట్టింది. అయితే బానకి మూత వుండడం వల్ల లోపల పేరుకున్న నాచు బయటికి కనిపించడం లేదు. మంచినీళ్ళ బాన పక్కనే కిరోసిన్ డబ్బా. అది తాతల నాటిది కావటం చేత దాని హేండిల్ విరిగిపోయింది. మూత పగిలింది. మురికి వాసనకి తోడు కిరోసిన్ వాసన కూడా గాలిలో కలగలుస్తోంది.

మంచినీళ్ళ బాన మూత మీద సీవెండి ప్లేట్లున్నాయి. వాటిల్లోనే అందరూ ఇడ్లీలు తింటారు. బండి కింద స్టాండులో ఇరవై గాజుగ్లాసులున్నాయి. వాటిలోనే అందరూ టీ తాగుతారు. ఈ గ్లాసులన్నింటికీ దూరంగా, రెండు బక్కెట్లకు దగ్గరగా నేల మీద, బురద పక్కనే ఒక పింగాణి కప్పు. అది బాగా జిడ్డుగా, పగుళ్ళు పట్టి వుంది. ఆలనా పాలనా లేక మరకలు మరకలుగా, కాడ విరిగి వుంది. మట్టి మీద మట్టిలా నిలబడి వుంది.

ఆ కప్పు అందరి కోసం కాదు. బండి రాముడి హోటల్‌కి వచ్చే ఒకరిద్దరి కోసం మాత్రమే దాన్ని వాడతాడు. రోడ్ల మీద చెత్త కాగితాలు ఏరుకుని బతుకుని గడిపేవాళ్ళు. బస్టాండ్ నీడన నిద్రపోయి ఉదయాలు, మధ్యాహ్నాలు టీ నీళ్ళతో కడుపునింపుకునేవాళ్ళు. బండిరాముడి భాషలో వాళ్ళు మైల మనుషులు.

అలాంటి వాళ్ళు ఆకలయినప్పుడో, దాహమయినప్పుడో కాకా హోటల్‌కి వచ్చి గుక్కెడు మంచినీళ్ళు తాగుతారు. గుక్కెడు టీ నీళ్ళు తాగుతారు. మరీ ఆకలయితే కాగితంలో ఇడ్లీలు వేయించుకుని కడుపు నింపుకుంటారు.

రాజమండ్రి ఆర్టీసీ బస్టాండ్. బస్టాండ్ లోపల ఒక హోటలు, బస్టాండ్ ప్రహరీ గోడని ఆనుకుని నాలుగు కాకా హోటళ్ళు వున్నాయి. వాటిలో బండి రాముడిది కూడా ఒకటి. బస్టాండ్‌కి వచ్చే ప్రయాణీకులు అప్పుడప్పుడూ ఇక్కడ టీ తాగుతారు ఎక్కువగా రిక్షా పుల్లర్లు, అరుదుగా బస్సు డ్రైవర్లు, కండక్టర్లు టీ తాగుతారు. అందరికీ గాజు గ్లాసుల్లోనే బండిరాముడి టీ అందిస్తాడు. వాడి కళ్ళు అప్రమత్తంగా వుంటాయి. కస్టమర్లని నిగారింపుగా తనిఖీ చేస్తాయి. మనిషి ముఖాన్ని మాసిన బట్టల్ని, చింకిరి తలపాగాల్ని, దుమ్ముపట్టిన తలవెంట్రుకల్ని పట్టి పట్టి చూస్తాయి. మైల అంటించే మనుషుల దగ్గర జాగ్రత్తగా వుంటాడు. బండి మీద అలంకరించుకున్న దేవుడి పటం మైల పడకుండా వేయికళ్ళతో కాపాడుతుంటాడు. "పెద్ద పుట్టుక పుట్టినోళ్ళని కనిపెట్టుకుని వుండాలి. లేదంటే దేవుడు క్షమించడు" బండిరాముడు చిన్నపాటి ఉపన్యాసాలు ఇస్తుంటాడు. వాడికి దేవుడి పట్ల భయభక్తులెక్కువ. రోజు క్రమం తప్పకుండా ప్రసాదం సమర్పించుకుని, అగరొత్తులు వెలిగిస్తాడు. అందువల్ల బండి మీది దేవుడిపటం అగరొత్తుల మసిపట్టి నల్లగా మాడిపోయింది. బండి రాముడి హోటల్‌కి పెద్ద గంగారావి చెట్టు నీడపడుతోంది. దానికి కొద్ది దూరంలో గానుగ చెట్టు. దాని చుట్టూ పూర్వం ఎప్పుడోకట్టిన సిమెంట్ చప్టా. దాని మీద మరియు నిద్దరోతోంది. మరియు బస్టాండ్‌ని నమ్ముకుని బతుకుతోంది. రాత్రంతా మేలుకుని బస్టాండ్‌లో

శరీరంతో కాపుగాస్తుంది. ఎవరైనా ఆశగా, కోరిక గా దగ్గరకొస్తే బేరం కుదుర్చుకుంటుంది.కొంచెం మరుగులో, కొంచెం చీకటిలో స్తంభాల చాటున సిమెంట్ బెంచీల మీద రాత్రులు గడిచిపోతాయి. రాత్రంతా జాగారం,పగలంతా నిద్ర మరియు నిద్దరోతోంది. మాసిన చీరని సగం గుండెలకే కప్పుకొని, మిగతా సగం గాలికి వదిలేసి.

"జబ్బులముండ! ఒళ్ళంతా సిగ్గిడిసి ఎలా పడుకుందో?" బండి రాముడు మరియు గుండెల మీద నుంచి చూపుని తిప్పుకోలేక బయటికే తిట్టుకున్నాడు. ఖాకీ నిక్కరుకి అడ్డంగా చుట్టుకున్న ఎర్రటవల్ పై నుంచి కాళ్ళ మధ్య చేతులతో కసిగా వొత్తుకున్నాడు. కసిగా బీడీ వెలిగించి గుప్పుగుప్పున పొగవదిలాడు. పొగ వదులుతూ కళ్ళు చిట్లించాడు.

ఆ రోజు శనివారం సాయంత్రం నాలుగయింది. ఖద్దరు చొక్కాలు, ఖద్దరు ఫేంటులు ధరించిన నలుగురుయువకులు బండి దగ్గరికి వచ్చారు. నాలుగు టీలు ఆర్డరిచ్చారు. బండి రాముడు పాలమీగడ కలిపి చిక్కని టీ ఇచ్చాడు. వాళ్లు గ్లాసులుఅందుకుని చెక్కబెంచీ మీద కూర్చున్నారు. ఆవిర్లు చిమ్ముతున్న వేడి వేడి టీ తాగుతూ సినిమా వాల్‌పోస్టర్లు చూస్తున్నారు. సిగరెట్లు కూడా ముట్టించారు. ఒక గుక్కటీ, ఒక దమ్ము సిగరెట్ తాగుతూ దర్జాగా వున్నారు.

సరిగ్గా అప్పుడే కుక్కకి ఆకలయ్యింది. అప్పుడే పందికి కూడా కడుపులో దేవినట్లయింది దాని బొక్కలువిగవుపోరికి ఎగిరెగిరి పడుతున్నాయి. తన పిల్లల్ని విదిలించుకుని కాల్వ దగ్గరికి కదిలింది. శనగచట్నీ తినబోతుంటే కుక్క గట్టిగా మొరుగుతూ అడ్డొచ్చింది. పంది గుర్రు గుర్రుమంటూ దానిమీదకి ఉరికి కుమ్మింది. కుక్క కీచుగా అరుస్తూ కిందపడి, వెనక్కి బెదిరి బెంచీని గుద్దుకుని పరిగెత్తింది. ఒక్కసారిగా కుక్క, పంది మొరుగుతూ మీద పడడంతోనలుగురు యువకులు ఉలిక్కిపడ్డారు. వారిలో ఇద్దరి చేతుల్లోంచి గాజు గ్లాసులు కిందపడి ముక్కలయ్యాయి. టీ వాళ్ళ ఫేంటుల మీద వొలికింది. వాళ్ళు చిరాగ్గా చూశారు. మంచినీళ్ళు చిలకరించి ఫేంటులు తడుపుకున్నారు.

"ముండా కుక్క ఎన్నిసార్లు తగిలేసినా ఇక్కడికే చేరుద్ది. ఈ సారి రానీ, దాని తల పగలగొట్టేస్తాను" అని బండి రాముడు కుక్క మీద కోపం ప్రదర్శించాడు. పంది వొంక అసియ్యంగా చూశాడు. పంది మాత్రం ఇదేం పట్టించుకోకుండా ఇడ్లీపిండి, శనగపచ్చడి వున్న కాగితాలు, బురద మట్టితో దేవుతూ కడుపునింపుకొంటోంది.

బండి రాముడు మళ్ళీ వాళ్ళకి కడిగిన గ్లాసుల్లో వేడి వేడి టీ అందించాడు. వాళ్ళు నిర్మొహమాటంగా టీ తాగి, నాలుగు టీలకే డబ్బులు చెల్లించి వెళ్ళి పోయారు. అంటే రెండు గ్లాసులు, రెండు టీలు నష్టపోయినట్టే! బండి రాముడి ముఖం చిరాగ్గా, విసుగ్గా, కోపంగా, వికారంగా మారింది.

ఆ నలుగురి తరువాత మరి కొందరు వచ్చారు. టీ తాగి డబ్బులు ఇచ్చి వెళ్ళిపోయారు. బస్టాండ్‌లోని స్వీపరు ఇద్దరుస్త్రీలు వచ్చి ఇడ్లీలు తిని టీ తాగి వెళ్ళారు. గల్లా పెట్టె గణగణ మోగింది. అయినా వాడి కోపం చల్లారలేదు.

రెండు చక్రాల వాహనాలు, మూడు చక్రాల వాహనాలు, నాలుగు చక్రాల వాహనాలు తిరిగినప్పుడుల్లా వాటి చక్రాల వెనుక నుంచి దుమ్ము మేఘాలు రేగాయి. ఆ దుమ్ము వచ్చి మరుగుతున్న పాలలోనూ, డికాక్షన్‌లోనూ, ఇడ్లీ ప్లేటుల్లోనూ పడింది.

సాయంత్రం అరయింది. అపుడొచ్చాడు - కాకిగాడు. కాకిగాడంటే నిజంగా కాకిగాడే. నల్లగా, కారు నల్లగా ఉంటాడు. జుట్టంతా ముగ్గుబట్టలా తెల్లగా పండిపోయింది. బుగ్గలు లోపలికి పోయి పెదాలు లోపలికి లాక్కుపోయి ముఖం సొట్టలు పడ్డ చెంబులా వుంది. వాడికి సుమారు యాభయ్యేళ్ళు వుంటాయి. ఒక్కడే బస్టాండ్‌లో పడుకుంటాడు. అదే వాడి ఇల్లు. వాడి అవతారం చూసి అందరూ కాకిగాడని పిలుస్తారు. నిజానికి వాడి అసలు పేరేంటో ఎవరికీ తెలియదు.

కాకిగాడు తెల్లవారుఝామున నుంచీ కాగితాల వేటలో వుంటాడు. భుజానికి గోనె బస్తా తగిలించుకుని దానిలో రోడ్ల మీది కాగితాలను ఏరి నింపుతాడు. రోజంతా ఏరిన కాగితాలను హోల్‌సేల్‌గా అమ్మిరాత్రిళ్ళు బస్టాండ్‌కు చేరుతాడు. వాడు డబ్బులు ఎక్కువ వస్తే కాస్త మందుకొట్టి, రోడ్డు పక్కన అన్నం తిని పాటలు పాడుతూ గడుపుతాడు.

ఈ రోజు కాకిగాడు నేరుగా బండి రాముడి హోటల్‌కి వచ్చాడు. వచ్చి తన సంచినీ రోడ్డు మీద వుంచాడు. తను కూర్చున్న చోటికి దూరంగా తుపుక్కున ఉమ్మేశాడు. తలగుడ్డతో మూతి తుడుచుకున్నాడు. దుమ్ముతో నిండిన పాదాల్ని రెండు చేతులతో నిమురుకుంటూ "బాబూ సింగిల్ ఛాయ్ అందుకో' అన్నాడు.

బండి రాముడికి వాడి తీరు చిరాకనిపించింది. దూరంగా బక్కెట్ల దగ్గర పడివున్న కప్పుని కడగకుండానే అందుకుని దానిలో ముప్పాతిక టీ పోసి కాకిగాడివైపు తిరిగాడు. కప్పు అందిస్తున్నట్లు చెయ్యి చాచాడు. కాకిగాడు టీ కప్పు అందుకోవడానికి చెయ్యి చాచాడు. ఇద్దరి చేతులు చేరువ కాకుండానే బండి రాముడు కప్పు వదిలేశాడు. కప్పు జారి కాగాడి చేతిని తాకి నేలమీద పడింది. అసలే పగుళ్ళు పడివున్న కప్పు నేల మీద పడగానే రెండు చెక్కలుగా విడిపోయింది. కాకిగాడు తప్పు చేసినట్టు భయంగా చూశాడు. అదే అదనన్నట్లు బండి రాముడు కాకిగాడి చెంప మీద కొట్టాడు. "ఎంత పొగర్రా నీకు? టీ కొప్పుని షోగ్గా అందుకుంటావురా?" అని కళ్ళెర్రజేశాడు.

"కక్కరా నా కొడకా! పగిలిన కప్పుకీ, వొలికిన టీకి కూడా డబ్బులు కక్కు" అని కాకిగాడి జేబుపైన చెయ్యేసి విసురుగా లాగాడు. అలా లాగేసరికి కొంచెం చిరుగులు పట్టి వున్న కాకిగాడి చొక్కా జేబు పూర్తిగా చిరిగిపోయింది. అందులో వున్న ఆ రోజు సంపాదన బండి రాముడు లాక్కున్నాడు. "పోరా పో. మురికి నాకొడకా! మళ్ళీ ఇటు వచ్చావంటే చెమ్డాలు వొలుస్తాను" అని కసురుకున్నాడు. కాకిగాడు బెదిరినట్టు చూశాడు. అసలే పుట్టప్పుడే వాడి గొంతు పెగలదు. ఇలాంటప్పుడు అది మరింత మూగదవుతుంది. "మురికి నా కొడకా" అన్న తిట్టు వాడికి కొంచెం నొప్పిని కలిగించింది. అయినా వాడు ఒక్కమాట కూడా మాట్లాడలేదు. తన గోనె సంచిని అందుకున్నాడు. చిరిగిన చొక్కా జేబుని తడుముకున్నాడు. చింకిరి నిక్కరుకి అరిచేతుల్ని రుద్దుకున్నాడు.

తనని నిలువెల్లాచూసుకున్నాడు.

ఇందాక బండి రాముడు పంది వొంక ఎంత చిరాగ్గా చూశాడో, కాకిగాడు కూడా బండి రాముణ్ణి అంతే చిరాగ్గాచూశాడు. "మురికి నా కొడుకు నోట మురికి తిట్లు తిన్నాను" అని లోలోపలే గొణుక్కున్నాడు. తన కాళ్ళ దగ్గరే టీ గ్లాసుల స్టాండు వుంది. ఒక్క తన్ను తంతే అవన్నీ ఎగిరిపోతాయి. గ్లాసుల్ని తన్ని పారిపోగల సత్తువ తన కాళ్ళకుంది. అయినా కాకిగాడు తన్నలేదు. రోడ్డు మీదకి వచ్చేశాడు. అక్కిడి నుంచి దూరంగా దూరంగా బస్టాండ్‌లో రోజు తను పడుకునే స్థలంలోకి వెళ్ళిపోయ్యాడు.

28

# వెంటాడిన అవమానం

- కాసుల ప్రతాపరెడ్డి

"అమ్మా! ఇవాళ ఊరికి పోతానన్నావు కదనే! అని అన్నాడు ప్రశాంత్‌రెడ్డి స్నానానికి వెళ్తూ వంకాయలు తరగుతున్న తల్లి లక్ష్మమ్మతో. అంట్లు కడుగుతున్న భార్య వీణ ప్రశాంత్ మాటలు విని "ఉండుమని చెప్తుంటే వినడం లేదు. మీరైనా చెప్పండి" అని అంది ప్రశాంత్ నుద్దేశించి. అతను భార్య మాటలు విననట్లే నటించాడు. భార్య ఒత్తిడికి తల్లి ఎక్కడ ఉండిపోతుందో అనే ఆందోళన బయలుదేరింది ప్రశాంత్‌లో. "తల్లి వెళ్ళకపోతే కొంపలంటుకుంటాయి" అని అనుకున్నాడు. "ఎప్పుడెళ్తావే" అని మరో రూపంలో అదే ప్రశ్న వేశాడు. ప్రశాంత్‌కు తల్లి మీద ప్రేమలేదని కాదు. ఆమె ఈ రోజు ఉండిపోతే నానా గొడవ అవుతుంది, ఇక్కడే కాదు ఊళ్ళోకూడా. రాహుల్ ఈ రోజు రాత్రి భోజనానికి వస్తానని చెప్పాడు. రాహుల్ వచ్చేలోగా తల్లి వెళ్లిపోతే ఏ గొడవా ఉండదనేది ప్రశాంత్ ఆలోచన. రాహుల్ తమ ఇంట్లోకి రావడం లక్ష్మమ్మ కంటబడిందంటే ఇంకేమైనా ఉందా? నానా యాగీ చేస్తుంది. రాహుల్‌ను ఇంట్లో కాలు పెట్టనివ్వదు. తనను తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతుంది. అలా జరిగితే రాహుల్ ను అవమానించడమే అవుతుంది. రాహుల్‌ను అవమానించి పంపితే ప్రశాంత్‌కు తన తల కొట్టేసినట్లు ఉంటుంది.

రాహుల్ ప్రశాంత్‌ను దేవుడిలా చూస్తాడు. మాదిగ ఎల్లయ్య రాహుల్‌గా రూపాంతరం చెందడంలో ప్రశాంత్ మంచితనం, కృషి ఉన్నాయి. అట్లని ప్రశాంత్ రాహుల్ కన్నా వయస్సులో అంత పెద్దవాడేం కాదు. నాలుగైదేళ్ళు పెద్దవాడు కావచ్చు. ఎల్లయ్యతో బడిలో ఎవరూ స్నేహం చేసేవారు కాదు. గాంధీ లాంటి మహాపురుషుల జీవితాలను చిన్నప్పుడే ఒంట పట్టించుకున్న ప్రశాంత్ ఎల్లయ్యను అభిమానంతో చూసే వాడు ఇంట్లో తల్లిదండ్రుల ఆధిపత్యం చెలాయించక పోవడం వల్ల కూడా ఎల్లయ్యతో స్నేహం చేసే అవకాశం చిక్కింది. తండ్రి టీచర్ కావడమే అందుకు కారణం. ఎల్లయ్య, ప్రశాంత్ స్కూల్ దగ్గరో, ఊరవతలవున్న గుట్ట దగ్గరో గంటలు గంటలు కూర్చొని మాట్లాడుకునేవారు. ఎల్లయ్యకు అర్థంకాని పాఠాలు ప్రశాంత్ చెప్పేవాడు. "ఊళ్లో ఉన్నన్ని రోజులే కాకుండా హైదరాబాద్‌లో స్థిరపడి అప్పుడప్పుడు ఊరికెళ్ళినపుడూ కూడా ప్రశాంత్ ఎల్లయ్య వాళ్ల ఇంటికి వెళ్లలేదు. ప్రశాంత్ ఎదురయితే "దండాలు దొర"! అని ఎల్లయ్య తల్లిదండ్రులు చేతులు జోడించేవారు. ప్రశాంత్ స్నేహం లభించాకే ఎల్లయ్యలో చురుకుదనం ప్రవేశించింది. పై చదువులకు కూడా వెళ్ళాడు. డిగ్రీ చేస్తున్నపుడే తన జాతిని ఉద్ధరించాలనే దీక్షతో ఉద్యమంలో తలమునకలవడం ప్రారంభించాడు. పతితులను, భ్రష్టులను, దగా పడిన

తమ్ముళ్లను తాను పనిచేస్తున్న ప్రజాస్వామిక ఉద్యమంలోకి ఆహ్వానించడానికి, అందుకు వారిని ఉత్తేజపర్చడానికి ఎల్లయ్య కలం కూడా పట్టాడు. ఆ పరిణామ క్రమంలోనే ఎల్లయ్య రాహుల్‌గా అవతారమెత్తాడు. ప్రశాంత్, ఓ దినపత్రికలో సబ్ఎడిటర్‌గా పనిచేస్తున్నాడు. ప్రెస్ నోట్ ఇవ్వడానికి వచ్చినప్పుడల్లా ప్రశాంత్‌ను కలిసి వెళ్లేవాడు రాహుల్. తాను నిర్మిస్తున్న ఉద్యమం గురించి చెప్పేవాడు. తాను రాసిన, రాయబోతున్న కవిత్వం గురించి, ఆర్టికల్స్ గురించి చెప్పేవాడు.

రాహుల్ గురించి ఆలోచిస్తూనే ప్రశాంత్ ఆఫీసుకు రెడీ కాసాగాడు. తాను ఇంటికి రమ్మని ఎప్పుడడిగినా "పనుంది ఇపుడు వీలుకాద"ని చెప్పేవాడు. తాను అడగకుండానే 'రేపు ఇంటికి భోజనానికి వస్తా" అని నిన్న ఆఫీసులో కలిసి చెప్పాడు. తన భార్య వీణది కూడా తమ ఊరే కాబట్టి ఆమెకు రాహుల్ తెలుసు. తమ సంభాషణల్లో రాహుల్ తరుచూ వస్తూనే ఉంటాడు. అందువల్ల రాహుల్ ఇంటికి వస్తే భార్య వీణ ఎంతో సంతోషిస్తుందని ప్రశాంత్ అనుకున్నాడు. ఆఫీసుకు బయలు దేరుతూ తల్లి లక్ష్మమ్మకు వంద రూపాయల నోటిచ్చి "ఎండ ముదరక ముందే బయలు దేరు" అని చెప్పాడు ప్రశాంత్. ముందు గదిలో వాలు కుర్చీలో కళ్లు మూసుకుని కూర్చున్నాడు ప్రశాంత్. ముఖంలో దిగులు తాండవిస్తోంది. అలా ఎంతసేపు కూర్చున్నాడో ప్రశాంత్‌కే తెలియదు. కళ్లు తెరిచి వాల్‌క్లాక్‌కేసి చూశాడు. రాత్రి పదున్నరవుతోంది. మధ్యగదిలోకి తొంగి చూశాడు. మంచంపై వీణ ముసుగు తన్ని అట్లాగే పడుకుని ఉంది. రాహుల్ రాడేమో? అనిపించింది. రాకపోతే బాగుండనుకున్నాడు ప్రశాంత్.

ఆఫీస్ నుంచి వస్తూనే "అమ్మ వెళ్లిపోయిందా?" అని అడిగాడు ప్రశాంత్. తన రాకను గమనించి 'స్టౌ' మీద టీగిన్నె పెడుతున్న భార్యనుద్దేశించి. "వెళ్లింది. ఉండమని ఎంతగడిగినా ఉండలేదు. నువ్వు ఉండమనలేదని బాధపడినట్లుంది" అంది వీణ. ఆదేమీ వినిపించుకోకుండా "రాహుల్ భోజనానికి వస్తున్నాడు" అని చెప్పాడు ప్రశాంత్. వీణ విసురుగా ప్రశాంత్ వైపు చూసి " ఆ ఎల్లయ్యేనా?" అని అడిగింది. అవునన్నాడు ప్రశాంత్. "మన కొంపకే దాపురించిందా?" అని వ్యంగ్యంగా అంది. ఆ మాటల్లో హేళన కూడా ధ్వనించింది. ప్రశాంత్ మనసు చివుక్కుమంది. "అట్లాంటావేంది?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. "అడ్డమైన వాళ్లందరికీ నేను వండిపెట్ట" అంది కోపంగా. "మన వంటే రాహుల్‌కు ఎంత అభిమానమో తెలిసి కూడా ఈ విధంగా మాట్లాడ్డం బాగా లేదు" అన్నాడు చిరాకు ప్రదర్శిస్తూ. టీ వడబోసిన కప్పు ప్రశాంత్‌కు అందిస్తూ "నేను వండిపెట్ట" అని తేల్చేసి చెప్పిందామె. "భోజనానికి వస్తానని చెప్పిన మనిషిని వద్దని చెప్పడం ఏం బావుంటుంది?" అన్నాడు కాస్త తగ్గుతూ.

"అడుక్కునే బుద్ధులెటుపోతాయి. లేకి మనుషులు, లేకి బుద్ధులు" అంది ఈసడింపుగా. "నువ్వే వండనక్కర్లేదు. నేనొండుకుంటాలే!" అన్నాడు ప్రశాంత్ ఒక నిర్ణయానికి వచ్చినట్లు. "అది నే నొప్పుకోను. నువ్వొండి పెడితే నేను ఇంట్లో కూడా ఉండను" అంది మరింత కఠినంగా.

"నువ్వ మనిషివా, పశువ్వా? నీకసలు బుద్ధుందా?" అన్నాడు ఆగ్రహంగా.

"నీకు బుద్ధిలేదు కాబట్టే మాదిగోడికి మన కంచంలో తిండి పెడ్తానంటున్నావు" అంది ప్రశాంత్ చేతిలోని ఖాళీకప్పును విసురుగా లాక్కుంటూ. ప్రశాంత్‌లో సహనం చచ్చిపోయింది. ఆగ్రహం ముంచుకొచ్చింది. ఏం చేయాలో అర్థం కాలేదు. భార్య జుట్టు పట్టి లాగాడు కోపంగా. ఆమె విసురుగా ప్రశాంత్‌ను తోసేసింది. దాంతో మరింత రెచ్చిపోయాడు ప్రశాంత్. ఎడాపెడా భార్యను కొట్టాడు. వీణ ఏడుస్తూ మంచం మీద ముసుగుతన్ని పడుకుంది. ప్రశాంత్ కొద్దిసేపు మంచం

మీద భార్య పక్కన కూర్చొని ఆ తర్వాత ముందు గదిలోకి వచ్చి వాలు కుర్చీలో కూర్చున్నాడు. ఏం చేయాలో బోధ పడలేదతనికి. కళ్లు మూసుకొని తలపట్టుకొని కుర్చీలో వెనక్కి వాలిపోయాడు. రాహుల్ రాకపోతే బాగుండని పదే పదే అనుకోసాగాడు. అడుగుల చప్పుడు వినిపించి కళ్లు తెరిచాడు. ఎదురుగా రాహుల్. పలకరింపుగా నవ్వాడు ప్రశాంత్. తెచ్చి పెట్టుకున్న నవ్వు. పేలవంగా ఉంది. అది ప్రశాంత్‌కు అనుభవంలోకి వస్తూనే ఉంది. రాహుల్ పసిగట్టకూడదని లేని ఉత్సాహం తెచ్చుకుంటూ కుర్చీ చూపించి 'కూర్చో' అని చెప్పాడు. రాహుల్ కూర్చుంటూ 'అక్కేది?' అని అడిగాడు. "పొద్దుటి నుంచి ఒక్కటే జ్వరం.. పడుకుంది" అని అబద్ధమాడేశాడు ప్రశాంత్. అబద్ధమాడుతున్నపుడు ప్రశాంత్ మాట తడబడింది. ముఖానికి చెమటలు కూడా పట్టాయి. "డాక్టర్‌కు చూపించావా?" అని అడిగాడు రాహుల్ చూపించానన్నట్లు తలూపాడు ప్రశాంత్. ఎక్కువ మాట్లాడే ధైర్యం లేదు ప్రశాంత్‌కి. "హోటల్‌కెళ్దాం పద?" అని అడిగాడు ప్రశాంత్ "ఎందుకు?" అని ప్రశ్నించాడు రాహుల్. "అక్కకి జ్వరం కదా? వంట చేయలేదు. నాకు ఓపిక లేదు" అని చెప్పాడు.

"నేను తినేసి వచ్చా. మా పాత ఫ్రెండొకడు కలిసి వాళ్లింటికి లాక్కెళ్లాడు. అన్నం తినమని మరీ బలవంతం పెట్టాడు. అందుకే లేటయింది". అని వివరణ ఇచ్చాడు రాహుల్. ఎందుకో ప్రశాంత్‌కు ఈ మాటలు నమ్మాలనిపించలేదు. విషయం అర్థమయ్యే రాహుల్ అబద్ధమాడుతున్నట్లనిపించింది. హృదయాన్ని సూదులతో పొడిచినట్టనిపించింది ప్రశాంత్‌కు. ఏమీ మాట్లాడలేదు.

"సరే, ఇకవెళ్తా" అంటూ లేచాడు రాహుల్. రాహుల్ చేతిని ప్రేమగా నొక్కుతూ "సారీ" అన్నాడు ప్రశాంత్. ఆ మాట అంటున్నపుడు ప్రశాంత్ గొంతు జీరబోయింది. కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. "ఎందుకంత ఇదయిపోతావు. మరోసారి తప్పకుండా మా అక్క చేతి వంట తింటా కదా!" అని ఏమీ జరగనట్లే నవ్వుతూ చెప్పాడు రాహుల్. చెప్పులేసుకొని బయలు దేరిన రాహుల్ వెనకే బయటిదాకా వచ్చి అతను కనుమరుగయ్యే వరకు చూస్తూ ఉండిపోయాడు ప్రశాంత్. రాహుల్ రాసిన వ్యాసంలోని వాక్యాలు గుర్తువచ్చాయి ప్రశాంత్‌కు. "దళితులు మొదటి నుంచీ అవమానాలకు గురవుతూనే ఉన్నారు. ఆధిపత్య వర్గాల కన్నీళ్లు, సానుభూతి దళితులను ఉద్ధరించడానికి పనికిరావు. దళితులే ఆత్మగౌరవ పోరాటాలు చేస్తారు. తలకిందుల సమాజాన్ని సరిచేసి తమ హక్కులను తామే సాధించుకుంటారు". ఎంత అనుభవంతో అన్న మాటలివి అని అనుకున్నాడు ప్రశాంత్. అతను కనుమరుగయ్యేంతవరకు చూస్తూ ఉండిపోయాడు.

*(ఏకలవ్య, జనవరి, ఫిబ్రవరి, 1997)*

29

# కన్నీళ్ళు

-ఎస్. జయ

"ఒరే పెద్దోడా! బారెడు పొద్దెక్కినా నిద్దురేనా, లెయ్యి పన్లోకి ఎండబడి పోతే పెద్ద రెడ్డి వరుసబెట్టి అటు మూడు తరాలను, ఇటుమూడు తరాలను తిట్టిపోస్తాడులేరా" కొడుకును బతిమాలుకుంటూ లేపుతోంది బుచ్చమ్మ.

"ఒళ్ళంతా నొప్పులే. లేవ బుద్దిగాకున్నాది. రవ్వంత సేపు పడుకుంటానే" మారాం చేశాడు సుంకన్న.

"ఆ మానొద్దు. వగిసోనివి. ముసలోళ్ళు అనాల్సిన మాట అననీకి సిగ్గు లేదూ!?"

"నాకు నీతో కుశాలేమి? వీపు, నడుం పట్టేసినట్టునొప్పిన్నాది. నేను జీతం కొట్టను, పో, ఇయ్యాలసంది పన్లోకి పోను" అన్నాడు మొండిగా సుంకన్న.

బుచ్చమ్మకున్న నలుగురుసంతానంలో పెద్దకొడుకు సుంకన్న. ఇరవై ఏళ్ళనాడు కూలినాలి చేసుకొని బతికే తల్లితండ్రులకు ఏపుగా ఎదిగొచ్చిన కొడుకు ఎంతో ఆసరా. సుంకన్నది తండ్రిలా బలిష్టమైన శరీరం కాదని బాధ పడేది బుచ్చమ్మ. సుంకన్న తండ్రి ఎత్తు పొడుగైతే పెరిగాడు కా,తల్లిలా బక్కపల్చటి మనిషి. ఛామనఛాయ రంగులో నిగనిగలాడుతూ ఉన్నాడు. నూనూగు మీసకట్టు వల్ల సుంకన్నలో పెద్దరికం తొంగి చూస్తున్నది. పైగా ఇప్పుడు పెద్దరెడ్డి పొలం దున్నే జీతగాడు.

సుంకన్న పదో ఏటనే పెద్దరెడ్డి ఇంట్లో పసుల గాచే జీతగాడుగా పనికి కుదిరాడు. రెండేళ్ళ నుంచి పొలం పనిచేస్తున్న జీతగాడు. గొర్రు తోలడం, విత్తనాలు వేయడం వంటి పనులు రాకపోయినా, మిగతా పొలం పనులన్నీ చేయగలడు. గొర్రెలు తోలడంలాంటి పనులున్నప్పుడు సుంకన్న తండ్రి సుబ్బన్న వచ్చి పక్కన కొడుకుకు చెబుతూ ఆ పనులు చేసేవాడు. పలక మీద గీత గీసినంత సక్కగా ఒక్క వంకర పోనీకుండా సుబ్బన్న గొర్రెలు తోలుతాడని ఊర్లో అందరూ చెప్పుకోవడం చిన్నప్పట్నుంచి సుంకన్న వింటూనే వున్నారు. విత్తనం గొర్రు తోలడంలో తండ్రి అంతటివాడిని కావాలని సుంకన్న కలలు కనేవాడు. కొడుకుకు మేడి పట్టే వయసు వచ్చింది. ఓ ఇంటివాణ్ణి చేయాలని బుచ్చమ్మ, సుబ్బన్న ఉబలాటపడుతున్నారు. సుంకన్న పన్లోకి వెళ్ళనని చెప్పేసరికి, బుచ్చమ్మకు గుండెల్లో గుబులు, కాళ్ళ హొణుకు ఒక్కసారిగా పుట్టాయి.

"ఈ ఏడు నీ పెళ్ళి చేయాలని మేము తొందరపడుతుంటే జీతం కొట్టనని మంకు పట్టు

పడుతున్నావు. నీ పెళ్ళికి దబ్బేడ కెళ్ళి వస్తాది. పన్లోకి పోవాల్సిందే పెద్దోడా!'' ఖరాఖండిగా చెప్పింది బుచ్చమ్మ. సుంకన్న కప్పుకున్న దుప్పటి లాగేసింది.

ఓటమి అంగీకరించిన అసహనంతో ఏడుపు ముంచుకురాగా సణుక్కుంటూ పన్లోకి వెళ్ళాడు. సుంకన్నునులేపుతుండగా,సుంకన్న తరువాతి వాడు పన్నెండేళ్ళ మల్లన్న సత్తు చెంబుతో నీళ్ళు తెచ్చుకొని ఇంటి ముందుపరిచిన అరగజం వెడల్పున్న బండ మీద నిలబడి ముఖం కడుక్కున్నాడు రెండు మూడుసార్లు నోటి నిండా నీళ్ళు పోసుకొని పుక్కిలించి, నీళ్ళతో ముఖం తుడుచుకున్నాడు. మిగిలిన సగం చెంబునీళ్ళు కాళ్ళ మీద చల్లుకొని ఇంట్లోకి వెళ్ళబోయాడు.

''ఒరే చిన్నోడా! నా కన్నుగప్పి నోట్లో నీళ్ళు పోసుకొని ఊసి మొగం కడిగినావు కదరా! పండ్లు తోమినానంటావు. నీ యవ్వారమంతా జూస్తనే ఉన్నా దినాం ఇట్టా చేయబట్టే పండ్ల మీద బెత్తెడెత్తున పాచి పేరింది.బొగ్గు, ఉప్పు నమిలి బాగా పండ్లుదోమరా'' అని చిన్న కొడుకును కొప్పడింది బుచ్చమ్మ.

తల్లి అరుపులకు భయపడి గూట్లోని బొగ్గు ముక్క నోట్లో వేసుకుని కనకన నమిలాడు మల్లన్న.

''ఇంట్లోకి బోయి ఉప్పు గల్లు నోట్లో ఏస్కొనీక బరువు. ఇగో ఉప్పు బొగ్గు, ఉప్పు నమిలి... బాగా పండ్లు దోము అంటూచేతిలో ఉప్పుపోసింది.

''కోడి కూసినప్పుడు లేచినాను. పనులు తీరలేదు. అందర్నీ లేపి ఎవరి పన్లోకి వాళ్ళను సాగనంపి, కూడు వండేయాలకు బారెడు పొద్దెక్కినాది. నోట్లో నీళ్ళు పోసుకోవడానికి కూడా తీరకుండా ఒకటే పని. కడుపులో భగభగ మండుతున్నాది. మాయదారి మంట తిన్నా తినకపోయినా ఈ ఆకలి పొద్దస్తమానం ఉంటున్నాది. తనలో తనే గొణుక్కుంటూ ఇల్లు ఊడ్చింది. చెంబులు, గిన్నెలు తోమింది బొగ్గు ముక్క నోట్లో వేసుకుని పండ్ల తోముకుంటుండగా, రెడ్డి ఇంట్లోపనులు చేయడానికి ఉదయాన్నే వెళ్ళిన వాళ్ళు అన్నాలు తినడానికి ఇంటికి వచ్చారు. అందరికీ అన్నాలు కంచాల్లో పెట్టింది. పొలం పనికి వెళ్ళాల్సిన భర్తకు, జీతానికి వెళ్ళే సుంకన్నకు, పసువుల గాయవెళ్ళే మల్లన్నకు సద్దులుకట్టి ఇచ్చింది. తనూ నాలుగుముద్దలు గబగబా నోట్లో కుక్కుకొని సద్దిమూట కట్టుకొంది. ఇద్దరు చిన్న పిల్లలకు ఇంటిని కనిపెట్టుకొని ఉండమని తగువులాడుకోవద్దని సుద్దులుచెప్పి రెడ్డి సెనగ చేనులో కలుపు తీయడానికి వెళ్ళింది.

తోటి ఆడ కూలీలు ఆ మాట, ఈ మాట చెప్పుకుంటూ, పరాచకాలాడుకుంటూ కలుపు తీస్తున్నారు. బుచ్చమ్మ మనసులో పెద్దకొడుకు సుంకన్న మెదిలాడు. 'పెద్దోడిది అంతా వాడి అబ్బ పోలిక. రెక్కలు దాచుకోకుండా పని చేసే రకం. పరాచకానికైనా అబద్ధాలాడడు. అట్టాంటోడు.. ఈమధ్యన ఒళ్ళు నొప్పులని పొద్దు పొడిచినా లేవడం లేదు. ఏమైందోపెద్దోడికి. ఏం గాలి సోకెనో. అనుకుంది. ఆ ఆలోచనకు బుచ్చమ్మ మనసులో కలకలం రేగింది.

ఆమె చేతులు కలుపు మొక్కలు ఏరేస్తున్నా మనసు పరిపరి విధాల ఆలోచనలు చేసింది. 'కాలం ఎంత మారిపోవట్టే! కాపురానికొచ్చిన కొత్తలో పెద్దిరెడ్డి ఇంట్లోనే సుంకన్ననాయన జీతముండె తొలికోడి కూయగానే పన్లోకి బోతే, రాత్రి రెండు జాములప్పుడు ఇంటి కొచ్చేవోడు. అంత దూరాన్నుంచేకిర్రు చెప్పుల చప్పుడుకు మేలుకొని తలుపు తీసేదాన్ని. ఇప్పుడు పనులు బాగానే తగ్గినాయి. బువ్వలు తినేయాలకు ఇంటికొచ్చి తిని ఇంటికాడ్నే పడుకొని తెల్లారిపోతున్నారు.

దుడ్లు చేతిలో పడితే చాలు పెద్దల మాట ఇనకుండా వగిసి పిల్లగాండ్లం. కలిసి సినిమాలకు పోతున్నారు. కాని,సుంకన్న బుద్ధిమంతుడు. సినిమాకువెళ్ళమాకురా అంటే చెప్పిన మాట వింటాడు. అంత మంచోనికి ఏ మాయదారి రోగమొచ్చెనో అనుకుంది.

వేరుసెనగ చేనుల్లో వంచిన తల ఎత్తకుండా కలుపు తీసింది.బుచ్చమ్మ పొద్దు గుంకేవేళకు తలెత్తబోయిన బుచ్చమ్మకు మెడ పట్టేసినట్టయింది. 'ఇదేంది ఇట్లా అయింది. నాకు, ఏం గాలి సోకెనో? అనుకుంది. ఎల్లమ్మ దేవతకు మొక్కుకుంది. కాపురానికొచ్చిన సంది. ఈ రెడ్డోళ్ళకే పనికొచ్చినాను. ఎప్పుడూ ఇట్టా కాలే, ఏమైందో ఏమో, ఇంటికెళ్ళినాక కిరసనాయిలు, ఎల్లిపాయ పెట్టి రుద్దాల. పెద్దోనికి కూడా చేయాల అనుకుంది మనసులో.

బుచ్చమ్మ చిట్కా వైద్యం రెండు మూడు రోజులు చేసుకన్నా మెడ నొప్పి తగ్గలేదు. ఐదారురోజులకు పాత నొప్పి క్రింద పడిపోయి, బుచ్చమ్మకు అలవాటయిపోయింది. ఆమె తనకు తగ్గకపోయినా, సుంకన్నకు తగ్గిపోయి ఉంటుందనుకుంది.

"ఒరే పెద్దోడా! రెండు మూడురోజుల సంది వొళ్ళు నొప్పులు అసలా తగ్గిపోయి నాదిరా.' ' నొప్పులు తగ్గిపోయాయని కొడుకుచెప్పాలని ఆశగా అడిగింది బుచ్చమ్మ.

"ల్యా. ఎంత నొప్పులున్నా పనికి బోక తప్పదని పొద్దున్నే నీ సాధింపులు పడలేక అనలేదు. అట్లానే ఎల్తున్నాను పన్లోకి" సుంకన్న అన్నం తిని చేతులు కడుక్కుంటూ అన్నాడు.

నీళ్ళ చెంబునోటికి ఎత్తి తాగబోతూ, పెదవులకు అనించుకున్న చెంబుకింద పెట్టాడు. "అమ్మా ఎందే. చెంబులు సరిగా కడగలేదు. లోపల తెల్లగా సుద్ద అంటుకున్నాది అన్నాడు.

"బాగానే తోమినానే" అన్నదేకాని, పని తొందర్లో సరిగా కడగలేదోమోనని అనుమానం కలిగింది బుచ్చమ్మకు.

మరోచెంబుతో నీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఆ చెంబు లోపల కూడా సుద్ద అంటుకున్నట్టు కనిపించింది. వేలితో గోకి చూస్తే చెంబుకు గట్టిగా అతుక్కొని ఉంది. తరువాత చిన్న రాయి తీసుకుని గీరీ చూసింది. చిన్న చిన్న పెచ్చులుగా తెల్లగా సున్నం పలుకుల్లాంటివి ఊడిపడ్డాయి.

బుచ్చమ్మ చెంబులోపల రాయితో గీకి చూస్తుంటే, సుంకన్న పక్కనే చూస్తూ నిలబడ్డాడు. "పెద్దోడా! వళ్ళు నొప్పులుఅట్లానే ఉండాయంటున్నావు. ధర్మాసుపత్రికి పోయి డాట్టరుకు చూపించుకోరా. నీ బదులుమీ నాయన్ను పన్లోకి పొమ్మని చెబుతాను."

"ఏందే! పొద్దున్నే అమ్మా కొడుకు తీరుబాటుగా పెత్తనాలుచేస్తున్నారు. పనిలోకి పోల్యా?' ' సుంకన్న వైపుచూసి అడిగాడు సుబ్బన్న. "ల్యా, ధర్మాసుపత్రికి బోయి చూపించుకోమంటున్నది. అమ్మ ఇయ్యాల నా బదులు నీవు పనిలో కెల్లే.

తల్లీ కొడుకు కూడబల్కోని నన్నియాల జీతానికి ఎల్లమంటున్నారు. తప్పుతాదా! పోతాలేరా పెద్దోడా. కూడుపెట్టే తినిపోతా అంటూ పీట మీద కూర్చున్నాడు సుబ్బన్న.

సుంకన్న డాక్టర్ల చుట్టూ తిరుగుతూ వాళ్ళు రాసిచ్చిన మందులు, టానిక్కులు మింగుతున్నాడు. ఒళ్ళు నొప్పులు తగ్గకపోగా చేతులు, కాళ్ళు వంకర్లు పోయాయి. అడుగు ముందుకేసినప్పుడంతా ఆ పక్కకు, ఈ పక్కకు వొంగిపోతూ దారంతా తానై నడుస్తున్నాడు సుంకన్న. పేటలోని మరో ముగ్గురు పిల్లలకు ఈ జబ్బే సోకింది. బుచ్చమ్మకు మెడ పట్టేసింది. ఎవరైనా

పిలిస్తే మెడ తిప్పి చూడలేదు. మణిసంతా అటువైపు తిరగాల్సిందే. ఈ మాయదారి రోగాలు తమ పేటలోని వాళ్లకే ఎందుకొచ్చాయెూ ఏం తక్కువ చేశామో అనుకున్నారు. సుంకన్న జబ్బు నయం కావాలనే పటుట్టలతో సుబ్బన్న వారం వారం కొడుకును ఆసుపత్రికి పంపుతున్నాడు. డాక్టర్లు రాసిచ్చిన మందులు తినమంటున్నాడు.

ధర్మాసుపత్రికి బదిలీపై కొత్తగా వచ్చిన డాక్టరు సుంకన్న జబ్బు వెంటనే గుర్తించాడు. పత్రికలవాళ్ళను వెంటబెట్టుకుని సుంకన్న వాళ్ళ ఊరు రంగాపురం వెళ్ళాడు. బావిలో నీళ్ళు పరిశీలించాడు. పూరిపాకల్లోకి వెళ్ళి చెంబులు,గిన్నెలు, నీళ్ళు నిలువ ఉంచుకునే కాగులు, బాసలు పరీక్షించాడు. వాటి లోపల సున్నంలా అతుక్కొని ఉంది. కడిగితే పోదని అన్నారు. ఆ ఊరి బావుల్లోని నీళ్ళలో ఫ్లోరైడ్ ఎక్కువగా ఉందని, అందుకే ఈ జబ్బులు వస్తున్నాయని చెప్పారు. నీళ్ళు కాచి, వడగట్టి తాగమని సలహా ఇచ్చారు. విలేఖరులు సుంకన్నతోపాటు మరోనలుగురి పిల్లల ఫోటోలు తీసుకున్నారు.

డాక్టరు వచ్చి వెళ్ళిన మూడో రోజు ఊరి సర్పంచ్ వీరారెడ్డి సుబ్బన్నను పిలిపించి చెప్పారు. "పేపర్లో మనూరి నీళ్ళ గురించి రాసినారురా. మీ పిల్లల ఫోటోలు కూడా వేసినారు.

"పేపరోల్లు మా పిల్లగాండ్లు ఫోటోలు వేసి, మా కష్టాల గురించి రాసినారా రెడ్డి, గవర్నమెంటోరు మనూరికి మంచి వైద్యుగుడ్ని పంపి మా పిల్లల జబ్బు నయం చేసిస్తారా?"

"ఏమి చేస్తారో చూడాల. పుట్టలో పాముంటదనే గదా నాగులచవితి నాడు పుట్టలో పాలు పోసి భక్తిగా పూజ చేస్తాము. గవర్నమెంటు పైన ఉన్నాది. మనూరికి ఏమి మేలుచేస్తాదో చూడాల. అర్జి రాసి ఆఫీసర్లకుపంపినాను."

"పైనున్న దేవున్ని ఎంత మందిమి చూసినాము. పూజారి చెప్పినట్టే అన్ని పూజలుచేస్తాము. మా కష్టాల గురించి ఆలోచన చేసే సర్పంచ్ మాకుండగా మాకేం కొరత రాదు. నిన్ను దేవుడుచల్లగా చూడాల."

మాటలకేం లేరా సుబ్బిగా ఇదిగోరా పేపరు. మీ పెద్దోడు, నీ తమ్ముని కొడుకు పేటలోని మరి ముగ్గురు పిల్లల్ని మీ ఇంటికాడ సర్కారు తుమ్మ చెట్టు పక్కన నిలబెట్టి ఫోటో దించలా అదేసినారు పేపర్లో" అంటూ పేపరు సుబ్బన్న చేతిలో పెట్టాడు సర్పంచ్ వీరారెడ్డి.

మరో వారానికి రంగాపురం సర్పంచ్ ఇంటికి రెండు జీపులు, తెల్లని అంబాసడర్ కారు వచ్చాయి. అంతా హడావిడి. పిల్లలకు జీపుల చుట్టూ చేరి కేరింతలుకొడుతున్నారు.

అంతమంది ఆఫీసర్లు ఎందుకొచ్చినారో అని ఊరిజనం ఎక్కడి పనులు అక్కడే వదిలేసి, జీపుల వైపు చోద్యం చూస్తూ నిలబడ్డారు. కొందరు ఇళ్ళముందు గుంపులు గుంపులుగా చేరి ఎవరి ఊహకు తోచిన విషయాలు వాళ్ళు చెప్పుకున్నారు. మొన్న పేపర్లో ఫోటోలు వేసి రాసినారు. వాళ్ళను చూడ్డానికి ఆఫీసర్లు వచ్చారని క్షణాల్లో వార్త ఊళ్ళో గుప్పుమని మాదిగపేటకు పాకింది. పేటలోని పెద్ద మనుషులు ముగ్గురు నలుగురు ఆఫీసర్లను కలవడానికి ఊళ్ళోకి వెళదామని మాట్లాడుకున్నారు. పిల్లల్ని కూడా వెంటబెట్టుకుని వెళ్దామనుకుంటుండగానే దూరంగా ఊరివైపు ఎర్రగా దుమ్ము రేగింది. అనుమానంగా పేటను, ఊరిని కలిపే రోడ్డు మీదకు వచ్చి చూసిన వారికి ముందు తెల్లకారు, వెనుక జీపులు, ఆ వెనుక పెద్ద గుంపుగా మనుషులు వాడ వైపు రావటం కనిపించింది.

"దొరలు వాడ వైపు వస్తున్నారు. అంతా రావాల. ఇండ్లల్లో ఎవరూ ఉండొద్దు. అందరు పెద్దరుగు దగ్గరికి రావాల" అని సుబ్బన్న కేక వేశాడు. అంతే. క్షణాల్లో పిల్లలు పెద్దలు, ఆడ మగ అంతా అరుగు దగ్గరికి చేరారు. ఆ పక్కనే పది రోజుల క్రితం విలేఖర్లకు ఫోటోల కోసం పోజిచ్చిన పిల్లల్లు అదే వరుసలో సర్కారు తుమ్మచెట్టు పక్కన నిల్చున్నారు.

జీపుల్లోంచి దిగిన ఆఫీసర్లు మాదిగపేట పిల్లల్ని పట్టి పట్టి చూశారు. నోరు తెరవమన్నారు. దంతలు చూపించమన్నారు. నడవమన్నారు. వాళ్ళు పిల్లలతో మాట్లాడుతున్నంతసేపు కెమేరా క్లిక్‌మంటూనే ఉంది.

రంగాపురం బావుల నీళ్ళలో ఫ్లోరైడ్ ఎక్కువగా ఉందని, ఎప్పుడూ ఆకలిగా, కడుపులో మంటగా ఉంటుందని ఒళ్ళు నొప్పులుంటాయని రానురాను ఎముకలు పెళుసుబారి వంకర్లు పోతాయని పళ్లు గారపట్టి ఎగుడు దిగుడుగా అవుతాయని కొందరికి గూని వస్తుందని కొందరికి కాళ్ళు చేతులు వంకర్లు తిరిగి భూమి మీద పాకుతూ నడుస్తారని చెప్పుకున్నారు. వాళ్ళ మాటలు వింటుంటేఅంతలేసి పెద్ద జబ్బులు తమకే ఎందుకు వచ్చాయో తెలియక బాధపడ్డారు పిల్లలు. అంతమందిలో అందరిచూపులు తమ మీదనే ఉండి, అందరూ తమ గురించే మాట్లాడుతుంటే భయంభయంగా చూశారు.భయం,దుఃఖం, సిగ్గు బిడియం, ఎన్నెన్నో భావాలు ఆ అమాయక పసి హృదయాల్లో చెలరేగుతుంటే, అందరూ అడిగే ప్రశ్నలకు తడబడుతూ జవాబులిచ్చారు.

"కర్నూలుకు పోయి కలకటేరును కలిసొచ్చినావని ఆ నోట ఈ నోట ఇని వచ్చినాను". సుబ్బన్న పెద్దరెడ్డి ఇంటి ముందుచేతులు కట్టుకొని నిలబడ్డాడు. తమ పిల్లలకు మేలు జరగబోతున్నదన్న కొండంత ఆశ ఆకళ్ళలో "అవున్రా, నువ్వన్నది నిజమే" అన్నాడు జదువుతున్న దినపత్రిక మడిచి పక్కన పెడుతూ.

విశేషాలు చాలానే తెలుసుకోవాలని, సావకాశంగా సుబ్బన్న వినాలని తలకు చుట్టుకున్న తువాలు తీసి కింద వేసుకొని కూర్చున్నాడు "అవున్రా, కలెక్టరును కలిశాను. మనూరికి రక్షిత మంచినీటి పథకం మంజూరు చేశారు. కొళాయిల్లో మంచినీళ్ళు వస్తాయి. ఆఫీసర్లు వచ్చినప్పుడు చాలా ఫోటోలు తీసినారు. అవన్నీ మన గ్రామ పంచాయతీ ఆఫీసులో పెట్టమని చెప్పారు జిల్లా ఆర్. అండ్ బి ఆఫీసులో కూడా ఉంచారు. చూసి వచ్చినాను. నిజంగా మీదేరా అదృష్టం అంటే. గాంధీ తాత, ఇందిరమ్మల ఫోటోలు గవర్నమెంటోరి ఆఫీసుల్లో ఉంటాయి. దేనికైనా పెట్టి పుట్టాలిరా! నీళ్ళు తాగినందుకు జబ్బులొచ్చాయని ఫోటోలు పెట్టినందుకు లోలోపల ఏడ్చుకుంటూ తన అసూయను బయట పెట్టుకున్నాడు సర్పంచ్. "అంతా మీ దయ రెడ్డీ అని మరింత అణకువ ప్రదర్శించాడు సుబ్బన్న. తమ ఫోటోలు ఆఫీసర్లు పెట్టినా అది తమ తప్పే అయినట్టు ఒకింత నొచ్చుకున్నా... అందులో తమ ఘన కార్యం ఏమిటో బోధపడక ఆశ్చర్యపోయాడు. లోలోపల సంతోషపడిన మాట నిజం. అది మానవ నైజం.

"నాదేముందిరా... మనూరి నీళ్ళు అట్టాంటివి. మీ ఫోటోలు పేపర్లో వచ్చినాయి. అందుకు కారణం మనూరినీళ్ళు గవర్నమెంటు మనూరు యాడున్నాదో తెలియజేసినాయి మనూరి నీళ్ళేకదరా!"

"ఏమేమో రాసినారు. ఫోటోలు వేసినారు పెద్ద దొరలంతా మాదిగపేట కొచ్చి చూసి వెళ్ళినారు. అంతా బాగానే ఉంది. మా పిల్లగాండ్లను పెద్ద డాక్టర్లకు చూపించాల. ఎట్టనన్నా జేసి మా పెద్దోడి జబ్బు నయం జేసియ్యాల రెడ్డీ. నా బామ్మర్ది బిడ్డ ఎదిగొచ్చింది. మా పెద్దోనికి

చేసుకోవాలనుకుంటున్నాం రెడ్డి. గవర్నమెంటుకు తెలిస్తే చిటికెలో తమ కష్టాలన్నీ గట్టెక్కుతాయని వాళ్ళ నమ్మకం. ఎన్నేళ్ళయినా మొగ్గలుతొడుగుతూనే ఉంటుంది. ఆశలు పుష్పించి ఫలించకముందే నమ్మకాలు కసిమొగ్గలు గానే రాలిపోతున్నా, అది తమ కర్మ అనుకొని వెంటనే మరిచిపోతుంటారు.

"ఇవి డాక్టర్లు నయం చేసే జబ్బులు కావురా మనూరి నీళ్ళ సంగతి తెలిస్తే మనూరిపిల్లలకు సంబంధాలు కూడా రావని, మేమంతా భయపడి చస్తున్నాంరా ఇట్లాంటి జబ్బులు మరెవరికీ రాకుండా గవర్నమెంటు మనూరికి మంచినీళ్ళు ఇస్తానంటోంది".

"మరి మా పిల్లగాండ్లు అవిటోల్లయిపోయినారు. గవర్నమెంటు ఏమైనా సహాయం చేస్తదా?

"ఏం సహాయం చేసినా మీకేం ఒరుగుతుందిరా? ఓ పూట పూటుగా సారాయి తాగడానికే అంతా ఖర్చు చేశారు. మీకు సహాయం చేయడం దండుగ. బూడిదలో పన్నీరు పోసినట్టే. గాంధీ తాత మళ్ళీ పుట్టి వచ్చినా మీరు బాగుపడరు.

సర్పంచ్ మాటలకు తల కొట్టేసినట్టయింది. తల వంచుకొని మెల్లగా లేచి అక్కడ్నుంచి వెళ్లిపోయాడు సుబ్బన్న.

రంగాపురంలో రక్షిత మంచినీటి పథకం కోసం నాలుగు లక్షలు ఖర్చు పెట్టి ట్యాంకుకట్టి నల్లాలు వేయించింది ప్రభుత్వం ఓ మంచి రోజున ఆ నియోజకవర్గం ఎంపిగారు వచ్చి కుళాయిలకు మంచినీళ్లు వదిలారు. ఉత్సవం బ్రహ్మాండంగా జరిగింది 'అవిటివాళ్ళయిపోయిన మా పిల్లల బతుకులుఎట్లాగోలా తెల్లారకపోవు. బాగున్న పిల్లలు. పుట్టబోయే పిల్లన్నా బాగుంటారు. కడుపునిండా తిండి లేకపోయినా, మంచినీళ్ళన్నా తాగితే మా పిల్లలకుజబ్బులు రావు. మాదిగపేట పిల్లలకే ఈ జబ్బులు ఎందుకొచ్చాయంటే, బలమైన తిండి లేక అని డాక్టరు చెప్పి పోయే. బలమైన తిండి యాడ కెళ్ళి వస్తాది? గవర్నమెంటోరు మంచినీళ్ళన్నా ఇస్తా వున్నారు అనుకున్నాడు సుబ్బన్న. తమ పిల్ల వల్లనే ఊరికి మంచినీళ్ళొచ్చే అనిసంతోషపడ్డాడు. మర్నాడు తెలవారుతుండగా, మాదిగపేట కుళాయి దగ్గర కడవలు, ప్లాస్టిక్ బిందెలు పట్టుకొని పిల్లలు ఆడవాళ్లు బారులు తీరి నిలబడ్డారు. ఎంతకూ చుక్క నీరు రాలేదు. పొద్దు బారెడెక్కిపాయె అనుకుంటూ పిల్లల్ని కుళాయి దగ్గరే ఉంచి ఆడవాళ్ళు బావుల నీళ్ళతోనే వంట చేశారు. ఆ నీళ్ళే తాగారు. పన్లోకివెళ్ళారు. మర్నాడు అందే తంతు. మూడో నాడు సుబ్బన్న వాచ్‌మెన్ దగ్గరకు వెళ్లి మాదిగపేటకు చుక్క నీరు రాలేదని చెప్పాడు. "కుళాయిలకు నీళ్లు వదలడం కొత్త కదా! కొన్నాళ్ళాగితే అవే వస్తాయి అని భరోసా ఇచ్చాడు. ఈ రోజన్నా కుళాయిలో నీళ్ళు రాకపోతాయ అనుకుంటూ ప్రతిరోజూ ఉదయాన్నే ప్లాస్టిక్ బిందెలు, మట్టి కడువలు కుళాయి ముందు పెడుతూనే వున్నారు. పది రోజులు గడిచినా, మంచి నీటి చుక్క కుళాయిలోంచి రాలి పడలేదు.

సుబ్బన్న సర్పంచ్ ఇంటికి వెళ్ళి "మా కింతవరకు కుళాయి నీళ్ళు రావడం లేదు రెడ్డీ అని తలగోక్కుంటూ, నేల చూపులు చూస్తూ బెరుడుబెరుకుగా విషయాన్ని విన్నవించుకున్నాడు. తమ వల్లనే అన్ని లక్షలు ఖర్చు పెట్టి సర్కారు నీళ్ళు ఇచ్చిందని లోలోపల గర్వపడ్డా. పెద్దోలతోపాటు మంచినీళ్ళు అడగడం తప్పేమోనని భయంగా ఉంది. విందుభోజనంలో పెద్దోల సరసన కూర్చోడానికి భయపడుతున్నట్లు ఉన్నాడు సుబ్బన్న. "ఏమిట్రా మీకింత వరకు నీళ్ళు రాలేదా? మాకు రోజూ వస్తున్నాయే. నీళ్ళు వదిలే వాచ్‌మన్‌ను అడుగుతానుండు" అన్నాడు గంభీరంగా.

అంతలోనే వాచ్‌మవ్ అక్కడికి వచ్చాడు.

“ఏమిరా శంకర్. కొళాయిలో నీళ్ళు రాలేదని సుబ్బన్నచెబుతున్నారు. ఆ సంగతి చూసుకుంటున్నావా?” నీళ్ళ ట్యాంకు దూరముండిపాయె నీళ్ళొదిలేసరికి ఊళ్లో అందరూ కుళాయిలు తిప్పుతారు. మాదిగవాద దాకా నీళ్ళు వెళ్ళేసిరిక ట్యాంకులో నీళ్ళు అయిపోతాయి. అదీగాక ట్యాంకు కన్నా మాదిగవాడ కుళాయి ఎగువనుంది. పైపుల్లోంచి నీళ్ళు మాదిగపేట చేరకముందే, ఇక్కడ ట్యాంకులో నీళ్ళు అయిపోతున్నాయి. అంతదూరం వెళ్ళిన నీళ్ళు వెనక్కు వచ్చేస్తున్నాయి. సంజాయిషీ ఇచ్చుకున్నాడు వాచ్‌మన్.

“ఏం చేద్దాంరా సుబ్బిగా.. గంగమ్మ తల్లి మీ మాదిగవాడకు రానంటున్నది” అన్నాడు సర్పంచ్ కనుబొమలు ఎగరేస్తూ.

ఊళ్ళోకి నీళ్ళు ఎక్కువ వచ్చేలా దగ్గరుండి ప్లాన్ వేయించింది సర్పంచ్. దేవుడు వరమిచ్చినా పూజారి అడ్డుపడ్డాడు. కంటితుడుపుకోసం మాదిగవాడకు పైపులు వేయించాడు. కుళాయి పెట్టించాడు. సుబ్బన్నచూసి ఇంట్లోంచి సర్పంచ్ భార్య పెద్ద రెడ్డమ్మ బయటికి వచ్చింది. “ఒరే సుబ్బిగా! పేపరోల్లు మీ ఫోటోలు ఏయబట్టి మనూరికి మంచినీళ్ళు బాగా వదకట్టి, అదేదో చేసి ఇన్తున్నార్రా. నీళ్ళు ఎంత బాగా తియ్యగా ఉన్నాయిరా. బట్టల మురికి కూడా బాగా వదులుతున్నాదిరా. దొడ్లోకి వచ్చి చూడు. యనుములు నిగనిగలాడుతున్నాయి. సర్కారు నీళ్ళు వచ్చినకాడ్నుంచి ఆ నీళ్ళే తాగుతున్నాయి. ఆ నీళ్ళతోనే యనుములను కడుగుతున్నాం” అంది సంబరంగా.

సుబ్బన్న కంట్లో నీరు ఉబికింది. కనిపించ నీయకుండా తలొంచుకున్నాడు. వాచ్‌మన్ సర్పంచ్ వైపు భయం భయంగా చూశాడు. సర్పంచ్ భార్యవైపు గుడ్లురిమి చూశాడు.

30

# కొత్త తరం

- నీలి

సర్దిపెట్టిన స్కూలు బ్యాగూ, కారియర్‌తో వున్న బుట్టా ఒంటి చేత్తో పట్టుకుని మరో చేత్తో హడావుడిగా పైట సర్దుకుంటూ హాలులో అడుగుపెట్టిన వసంతా...

"టైం కాలేదూ బయలుదేరండి మరి" అంటూ. పడక్కుర్చీలోంచే లోపలికి తొంగిచూసిన సత్యంగారూ లోపలి దృశ్యానికి చకితులయ్యారు.

కొత్తగా వేసుకున్న స్కూలు డ్రెస్‌ని అన్నివైపులా తిప్పి చూసుకుంటూ బుట్ట తిరుగుతుందా లేదా అని గిర్రున తిరిగి పరీక్షించుకుంటోంది మున్నా.

ప్రభాకరం కుర్చీలో కూచుని పాపతో చెపుతున్నాడు, "మీరెవరని ఎవరన్నా అడిగితే మాలోళ్ళం అని చెప్పాలి. ఏదీ చెప్పు. 'మేం మాలోళ్ళం' అని."

గిర్రున తిరుగుతూనే తండ్రి చెప్పినట్లుగా "మేం మాలోళ్ళం" అంటోంది మున్నా. మళ్ళీ మళ్ళీ అదే మాట చెప్పిస్తున్నాడు ప్రభాకరం కూతురితో.

మధ్య మధ్య గెంతుతూ గిర్రున తిరుగుతూ తండ్రి చెప్పమన్నట్లు చెపుతున్న మున్నాకు అదంతా ఆటల్లే వుంది. తండ్రి చెప్తున్నదేటో తను అప్పచెప్తున్నదేమిటో తను అప్పచెపుతున్నదేమిటో అర్థమయే వయసు కాదు మున్నాది. క్రెష్‌కి వెళుతున్న మున్నాకి నాలుగేళ్ళు నిండాయని స్కూల్లో జాయిన్ చేశారు. క్రెష్‌కి వెళుతున్నప్పుడు బాగ్‌లో అమ్మ కారియర్‌తోపాటు బొమ్మలు పెట్టేది. ఇప్పుడు కొత్త బాగ్‌లో అమ్మ బొమ్మలకు బదులు కొత్త పుస్తకాలు పెట్టింది.

బొమ్మలు కావాలిని పేచీ పెట్టిన మున్నాకి పుస్తకాల్లో బొమ్మలు చూపించి, కొత్త పుస్తకాల వాసన చూపించి, అట్టల మీద అందమైన స్టిక్కర్లు వేసి ఓపిగ్గా చెప్పి మెప్పించి మరీ సర్దిపెట్టింది వసంత.

గిర్రున తిరుగుతూనే పరిగెత్తుకుని వెళ్ళి తల్లి చేతిలో బాగ్ తెచ్చుకుని నిన్నా మొన్న నేర్చుకున్న పద్ధతిలో తగిలించుకుని అటూ ఇటూ నడుస్తోంది మున్నా. క్రెష్ కంటే ఎక్కువమంది పిల్లలుంటారనీ, ఒక్క ఆంటీ బదులు చాలామంది టీచర్లుంటారనీ, కొత్త కొత్త ఆటలూ పాటలూ వుంటాయనీ తల్లీ తండ్రీ తాతయ్యా చెప్పగా విని బడి అనుభవం కోసం తహతహ లాడుతోంది మున్నా.

వంగి బూటు లేసులు ముడి వేసుకుంటున్న ప్రభాకరం మొహంలో ఏముందో అర్థం కావటం లేదు వసంతకు! "మున్నా.. అర్థమయింది కదా? ఎవరడిగినా అదే చెప్పాలి. ఖచ్చితంగా చెప్పాలి. గుండెమీద చెయ్యేసుకుని మరీ చెప్పాలి సరేనా..." ప్రభాకరం గొంతులోఉద్వేగం ధ్వనిస్తోంది.

ఆగలేకపోయింది వసంత. "చిన్న పిల్లకు, దానికేం తెలుసని అవన్నీ చెప్పడం" అంది.

"చిన్న పిల్ల కనుకే ఇంకా ఏమీ తెలియదు కనుకే ఇప్పుడే చెప్పాలి" కుర్చీలోంచి లేస్తూ అన్నాడు ప్రభాకరం.

గుమ్మంవైపు నడవబోయిన ప్రభాకరం చూపుల్లో తండ్రి చూపులు కలుసుకున్నాయి. సత్యంగారికి బ్యాంక్ ఆఫీసరైన కొడుకు స్థానంలో ఏడేళ్ళ పసి ప్రభాకరం మెదిలాడొక క్షణం. చప్పున కదిలి ముందుకొచ్చి మున్నామ ఎత్తుకుని రెండు బుగ్గల మీదా ముద్దాడి "పదండి మరి" అంటూ బయటకు దారితీశారు.

స్కూటర్ మీద తల్లీ తండ్రి మధ్యలో కూచుని వెళుతున్న మున్నాను చూస్తున్న సత్యంగారికి ప్రభాకరం స్కూల్లో జాయినయిన రోజు గుర్తొచ్చింది.

సత్యంగారు అప్పటికే డిప్యూటీ తహసిల్దారు ఇంటి ముందెప్పుడూ జీపూ, హంగామా వుండేది. ప్రభాకరానికి ఏడేళ్ళు వచ్చేవరకూ ఇంటి పక్కనున్న ట్యూషన్ మాస్టారి దగ్గరే చదువు. చిన్నప్పుడే బళ్ళో వేస్తే ఎక్కడ బెంగటిల్లి పోతాడో అని, తెలిసిన మాస్టారని పక్కింటికి పంపేవారు. ఏడేళ్ళకయినా బడిలో వెయ్యకతప్పదు కనుక స్కూలుకి తీసుకెళ్ళి పరీక్ష రాయిస్తే మూడో తరగతికి అర్హుడని తేలింది. ఆ రోజు అడ్మిషన్ ఫారం నింపుతున్నప్పుడు ప్రభాకరం కూడా తండ్రి కుర్చీ పక్కనే నించుని స్కూలు అసిస్టెంటు అడుగుతున్న ప్రశ్నలూ తండ్రి సమాధానాలూ శ్రద్ధగా వింటున్నాడు.

పేరు, తండ్రి పేరు, జన్మస్థలం, కులం.. ఇలా సాగుతున్నాయి ప్రశ్నలు. కులం అన్న ప్రశ్నకు తండ్రి చెప్పిన జవాబు విని ఒక్కసారి ఛీత్కరించాడు ప్రభాకరం.

"ఛీ! మనం మాలోళ్ళం కాదు. బ్రాహ్మలం" అన్నాడు.

సత్యం తెల్లబోయాడు. "కాదు నాన్నా. మనది మాల కులమే. అయినా ఏ కులమయితే ఏం. మనుషులంతా ఒకటే" అన్నాడు కొడుకుతో అనునయంగా. "అన్నీ ఒకటే అయితే మనం మాల ఎందుకవడం? బ్రాహ్మలమే అవుదాం" ప్రభాకరం లాజిక్కి స్కూలు అసిస్టెంటు కూడా తెల్లబోయి చూస్తున్నాడు.

"అట్లా కుదరదు బాబూ" నిస్సహాయంగా అన్నారు సత్యంగారు.

"ఎందుకు కుదరదు? మనం మాంసం తినం. పూజలు చేస్తాం. అయినా మాలోళ్ళు గుడిసెల్లో వుంటారు కదా. మనమేమో డాబాలో వుంటున్నాం.మనం మాలోళ్ళం కాదు బ్రాహ్మలమే"

ఉక్రోషం తన్నుకొస్తుంటే కాళ్ళు నేలకేసి తప తప కొడుతూఏడుస్తున్నాడు ప్రభాకరం.

మిషనరీల కారణంగా చదువుకునే అవకాశం కలిగినా కాలేజీకి వెళ్ళే రోజుల్లో స్వాతంత్ర్య పోరాటం గాంధీ, అంబేద్కర్ల సిద్ధాంతాలు చాలా ప్రభావితం చేశాయి సత్యంగార్ని. మాంసం తినకపోవడంతో ప్రారంభించి చాలా నియమంగా వుండేవారాయన.

సత్యంగారు మంచి ప్రభుత్వ ఉద్యోగంలో ఉండడంతో ఆయన కుటుంబానికి మామూలు మర్యాదలే లభించేవి. కనీసం చిన్న ప్రభాకరానికి తెలిసినంతవరకూ. అయితే మాలవాళ్ళంటే గుడిసెల్లో వుంటారనీ, వాళ్ళనందరూ తక్కువగా చులకనగా చూస్తారన్నంతవరకూ తెలుసు ప్రభాకరానికి. అట్లానే బ్రాహ్మలనంతా చాలా గౌరవంగా చూస్తారనీ తెలుసు. తండ్రి హోదా, దానివల్ల లభించే గౌరవంతో తమను మిగిలినవారు చూసే పద్ధతిని బట్టి ప్రభాకరం తాము కూడా బ్రాహ్మలమే

అనుకునేవాడు. నిజానికి అంతకంటే కులం గురించి ఇంకా ముందుకుపోయి అర్థం చేసుకునే వయసూ, అనుభవమూ రెండు లేవు అప్పటికి ప్రభాకారానికి.

స్కూల్లో ఆ రోజు ప్రభాకరానికి నచ్చచెప్పటం సత్యంగారి వల్ల కాలేదు. ఇంటికొచ్చాక కూడా ఏడుస్తూ పడుకున్నాడు ప్రభాకరం. తరువాత కాలంలో అలవాటుపడ్డప్పటికీ ఆ సంఘటన మాత్రం ప్రభాకరం లేత మనసుమీద మాయని గాయాన్నే చేసింది.

"ప్లీజ్ నాన్నా, మనం బ్రాహ్మలుగా వుందాం" అంటూ అమాయకంగా బతిమిలాడిన.ఆ పసిబిడ్డ పెద్దవాడయి బిడ్డ తండ్రయి "మనం మాలోళ్ళమే అది మారేది కాదు. సిగ్గుపడవలసిన విషయమూ కాదు " అని బిడ్డకు అస్తిత్వాన్ని బోధించడం చూసి సత్యంగారికి తమ తరంలో లోపించినదేదో కొత్తతరంలో ఊపిరి పోసుకోవడం కనిపించింది.

*(9 ఏప్రిల్ 1995, ఆదివారం ఆంధ్ర జ్యోతి)*

31

# మల్లెతీత

- కలేకూరి ప్రసాద్

కడుపుబ్బరంగా అనిపిచ్చి కళ్ళు తెరిచిచూశాను. చీకటి నీడలు కదలబారతన్నాయి. బయవేసింది. నిట్టాడు కాడపెట్టిన గుడ్డిదీపం గాలికి బిక్కుబిక్కుమంటంది. ఎవురో గుసగుస లాడుకుంటున్నట్టుగా మాటలు. ఎవుళ్ళా అని జాగర్తగా ఇన్నాను. అమ్మ అయ్యతో ఏందో కయ్యమాడతంది. కాదు నవ్వుతంది. అమ్మనిద్దర బోటల్లేదన్న సంగతి తెలిసినాక ఏడవటానికి ధైర్నమొచ్చింది. "అవా..." అంటా బేర్మన్నాను. అమ్మ చటుక్కున నా ఏపు తిరిగి ఏందయ్యా అంటూ నామీద చెయ్యేసింది. అయ్యేందో గొణుక్కుంటన్నాడు. "అసూరుకో" అంటా అయ్య సేతిని ఇసిరికొట్టి పకపకా నవ్వుకుంటా పైకి లేసి" లేయ్యా.. ఒంటేలుకి పోసుకొద్దూ గాని పా" అని నా సెయ్యి పట్టుకుని బయటకి తీసుకొచ్చింది. మొబ్బులన్నీ తెల్లంగున్నయి. అప్పుడే కోటప్ప లేసినట్టుంది. పొయ్యి రాజేత్తంది. చిదుగులు మంచుకి తడిసి నట్టుండాయి. గుడిసె తగలబడిపోతన్నట్టు గప్పున పొగలేత్తంది.

"నువు బోసుకోయ్యా" అని నా సెయ్యొదిలి గబ గబా వాకిలి చిమ్మడం మొదులుబెట్టింది. ఇక అద్దే సందనుకొని తడికిమీదికి దూడనొదిలాను. జామ్మని పంపునీళ్ళు లగాయిచ్చినట్టు కొడతా గుండ్రాలు గుండ్రాలుగా తడికి మీద ఉచ్చబొమ్మల గీస్తా నిలబడిపోయాను. బళ్ళో శీనుగోడితో పందె వేసుకొనేవోళ్ళం. వాడు పందేనికి ముందే మాకెవ్వురికీ తెలియకుండా పొట్టనిండా మంచినీళ్ల తాగొచ్చేవాడు. ఎప్పుడూ వాడే గెలిసేవోడు. ఒక పాలి మా అబ్బురాంబావ ఇదంతా చూసి ఇద్దర్నీ వాయగొట్టాడు. ఇంటికొచ్చి మమ్మతో సెబితే బావగాడిని పిచ్చి తిట్లు తిట్టింది. వాడికి మమ్మంటే మాలావు బయ్యం.

అమ్మ ఎప్పుడు వాకిలి చిమ్మేసిందో ఏవో గాని నా ఎనకాతలకొచ్చి నేను చేత్తన్న రాచకార్యం చూసినట్టుంది. లాగిపెట్టి పిర్రమీద చెళ్ళున చరిచింది. నేను ఉలిక్కిపడి ఎనక్కి తిరిగిచూసి రాబోతున్న ఏడుపుని చటుక్కున ఆపుకున్నాను. ఏడిస్తే ఇంకో దెబ్బ పడేదే.

నేను బిక్కమొగమేసి అట్టనే నిలబడిపోయే సరికి ఏవనుకుందో ఏమో గబుక్కున దగ్గరికి తీసుకుని "అల్లరి నాకొడకా" అంది నవ్వుకుంటా. అమ్మ నవ్వుతుంటే పుచ్చపువ్వుల తీగమీద వాన సినుకులు పడి అది అటూ ఇటూ కదిలినట్టు గుంటది.

లోపలికి పోయి అడావిడిగా జొన్నలు చేటలో ఏసుకొచ్చింది. "ఇదిగో.. ఇగ సొల్లే లేచిరా మాగంటోరికి మల్లితీతకి పోవాల" అని గట్టిగా అరిచి జొన్నలు కడగడం మొదలుపెట్టింది. మయ్యనీ ఎప్పుడూ పిలవాలన్నా అట్టనే పిలుసుద్ది. "ఒరే ఇట్ట లెగడు గానీ తప్పేలాడు నీళ్ల పొయ్యిరా లేత్తాడు" అని అయ్యని లేపేపని నాకు పురమాయిచ్చింది. మయ్య నిద్రసెడగొట్టట మంటే నాకు యాడలేని సరదా. లేకపోతే ఎప్పుడు ఆటకి బొయ్యినా పెద్ద మొనగోడిలాగ వొచ్చి

అందరి ముందుతిట్టి లాక్కొత్తాడు. ముందే మెలుకూ వొచ్చిందో ఏవో బయటికి లేసొచ్చాడు. అడావిడిగా నోట్లో నీళ్ళు పోసుకుని పుక్కిలిచ్చాడు. "ఇప్పుడే వత్తానే" అనుకుంటూ రోడ్డేపు దారితీసాడు. "ఇదిగో అదేం కుదరదు గాని ముందు పోటేసిపో" అంది అమ్మ. "నీ..... యమ్మ అన్ని పనులు నాకెనంటే ..... కాలుమడుస్తు కొత్తనాగు అని తడికేపు పొయ్యాడు. పాపం మయ్య పనంటే వొల్లిరుసుకోని చేత్తాడు. తుమ్మలకు బొయ్యి పుల్లలు దెమ్మంటే సెట్టుకు సెట్టు కంప తొడుగు కొట్టుకొచ్చేవోడు. పొగాకు అల్లడానికి గుర్రవేత్తే ఆకందిచ్చే అయిదారుగురికి చవట్లు పొయ్యాల్సిందే. పొద్దున్నే లెమ్మంటే మాత్తరం బెమ్మ పెళయమే. లేవంగనే రాజిరత్తిగోడి వోటల్లో టీనీల్ళు తాగాల. చుట్టెలిగియ్యాల. బయిలుకి పొయి రావాల. నీళ్ళు బోసుకోవాల. ఇగా తరువాత సూడాలి ఎంత లావు పనయినా ఒనికిపోద్ది. నేను మాయ్యనే సుత్తావుండా. ఒంటేలుకి బోసుకున్నట్టే బోసుకుని రాజిరత్తిగాడి కొట్టేపు దారితీసాడు.

"అవాఁ... ఆడు సూడె జారుకుంటండు" గాట్టిగా అరిచా. నా అరుపుకి మయ్య గిరుక్కున ఎనక్కి తిరిగి "ఓరి దొంగ నా కొడకా.." అనుకూంటా తేలు కుట్టిన దొంగనాకొడుకులాగా రోలు కాడికొచ్చేడు. మమ్మ కోటప్పకాడ రోకళ్ళు తెత్తంది. ఈ తతంగవంతా సూడలా. సూత్తే రావరావణ ఇద్దెం జరిగేదే.

జొన్నలు దొక్కుతున్న రోకటి పోట్లకి మబ్బులో పడుకున్న సూరీడుకి మెలుకూ వచ్చినట్టు గుంది. ఒళ్లిరుసుకుంటూ మబ్బులు సాటు నిండి బయటకొచ్చాడు. మమ్మ గబాగబా తొక్కు కడిగి పొయ్యి రాజేసి కూటి కుండ పెట్టింది.

"ఒరే నాయినా నేను తొక్కునీల్లు అదిమ్మ గ్గోరికి బోసి మజ్జిగ తెత్తా గానీ నువ్వు గబగబా మొకం కడుక్కోనుండరా తొందరగా అన్నం తిందుగాని" అని తొక్కు కడిగిన నీళ్ళు తీసుకుని పోయింది. నేను మయ్యకెల్లి చూశా ఆడు పళ్ళన్నీ బయటపెట్టి నవ్వేండు. యీల్ల వాలకం సూత్తంటే నన్ను పనికి తీసుకుపోతారేమోనని అనుమానమొచ్చింది. యీల్లేసాలు నా దగ్గరా అనుకుంటా గబగబా మొకం కడుక్కొని బల్లోకేసుకోపొయ్యే లాగు సొక్కా ఏసుకున్నా. మయ్య సూత్తనే వున్నడు. పొయికాడ కూసొని. ఇకిట్టా లాబం లేదనుకుని నా రెండో తరగతి బొక్కు తీసుకోని గవిడి కానుకోని కూచున్నా. ఎట్టాగయినా పనెగదెంగి బళ్ళోకి పోవాలని నా ఆలోచన. పాటాలు సదివినంతసేపూ యావంత బాగోదు కాని అయ్యి లేనప్పుడు మాలావు సరదాగా వుంటుంది బడి. మజ్జాన్నం పూట పెట్టే గోదుమరవ్వ ఉప్మా మా బాగుంటది. మా పిలగాల్లంతా ఉప్మాకోసం బడికి ఎగబడేది.

మజ్జిగ తప్పేలా సంకనేసుకుని మమ్మవత్తంది. నేను మాలావు సదవరిలాగా పుస్తకం ముందేసుకుని రాములోరి బొమ్మనే సూత్తా వున్నాను. అమ్మ రాడం రాడమే 'ఒర్నా బంగారవే .. మయ్య కలట్టరవుతాడమ్మా' అనుకుంటూ యమ సంబరపడింది. ఆ మాటలకి నాక్కూడా శానా సంతోషమేసింది. కానీ అదేవీ బయట పడనీకుండా పేజీ తిప్పుకుంటూ కూసున్నా. మమ్మ సత్తు గిన్నెలో రాత్రి వొరి బువ్వేసి మజ్జిగపోసి నా ముందు పెట్టింది. ఎండిసేపనో దాన్ని పొయ్యిలో పడేసింది. కాసేపటికి కమ్మటి వాసన రాటంతో ఇంకాగలేక కంచం మీదకెగబడ్డా. కూసేపు అయ్యాక ఎండిచేవ తీసి కాలిందో లేదోనూసి నాముందు పడేసింది. మజ్జిగన్నంలో గుమగుమలాడిపోయే సేపముక్కని నంజుడేస్తుంటే నా సొవిరంగా బడిసంగతి మర్చిపోయా... మమ్మ నా దగ్గరకొచ్చి తలమీద సెయ్యేసి నిమురుకుంటూ "మయ్యకి పండక్కి మంచి కొత్తగుడ్డలు

తీసుకోవాల" అని తన మతికి తానే సెప్పుకొన్నట్టుగా అంది.

ఇదంతా నన్ను లయచేసి ఎట్నోకట్ట పనికి తీసుకుపోవాలని తెలుత్తానే వుంది. మమ్మ అబద్ధమాడదు. బట్టలు కొంటది. ఇయ్యాల్టికి సరే పోదాంలే పనికనుకొన్నా. అయినా ఓ పాలిబెట్టు సేద్దావని "బడికిపోతానే... అన్నా "పోదుగానీ లెయ్యి కొత్త ఈ నాల్రోజులూ పనికొత్తే ఆ డబ్బుల్తోటే గుడ్డలు కొనుక్కోవచ్చు. అప్పుడు మారాజులాగ కొత్త గుడ్డలేసుకుని బళ్ళోకి పోవచ్చు. ఏం.. " అంది. ఇంగ జేసేదేం లేదు. మమ్మ నాల్రోజులంటే అది పదేను రోజులన్న మాట. సర్లే కానీ మనుకోని గబగబా అన్నం తిని బడి గుడ్డలు తీసి మడ్డి బట్టలేసుకున్నా. ఈలోపు మమ్మ, మయ్య జొన్నగంజి పోసుకొని కూసున్నారు. రోజు రాత్రిపూట వరిబువ్వని నాకోసం ఉంచుద్దమ్మ.

"మరియా.. నీ యమ్మ తొందరగ కానియ్యండే.." అనుకుంటూ ఏసమ్మ కేకేసింది.

"అయిపోయింది రాయే... " గంజి తాక్కుంటేనే అమ్మరిసింది. దూది బోరెంలాగుండే వంటిని డొల్లుపుచ్చ కాయల్లే డొల్లిచ్చుకుంటావచ్చింది ఏసమ్మ.

"ఏం పిల్లో నిన్నటికి మూడు రోజులు ముందే సవర్తాడినట్టున్నావే. నన్ను జేసుకుంటవా.. బాగ జూసుకుంటా" అని అయ్య సెతురాడిండు. అది మమ్మకంటే శానాపెద్దది.

"నువ్వు లాబం లేద్రా బాయ్యా.. నీ కొడుకునైతే సేసుకుంటా"నంది. మమ్మ ఒక్కటే నవ్వు.

ఇదేంద్రా బగమంతుడా అనుకున్నాన్నేను.

"సర్లే తొందరగా తెవలండి" అనుకుంటూ కోటప్పోల్లింటికి పోయింది ఏసమ్మ.

"అవాఁ... దాన్ని సేసుకోనే.. నా కొద్దు" అన్నా.

"ఓరూరుకోరా బడాయినాకొడకా అదేదో సెతురుకందిలే" అంది మమ్మ నువ్వుకుంటూ. తొందరగా తెమిలి బువ్వలు గట్టుకుని మాగంటోరి టాట్టరెక్కి పొలానికి బొయ్యాం.

పచ్చంగ ఎదిగుంది పొగాకు సేను. మాపని మల్లి తియ్యడం. మల్లె తీయడమంటే పొగాకు చెట్టుకి మల్లెపూలు పూత్తయోమే వాటిని కోసుకురాడమేమో అనుకొనేవొడ్ని. పొగాకు చెట్టు మొదట్లో పుట్టకొక్కుల్లాగా తెల్లగా మొలుత్తుంది మల్లె. అది కలుపు. దాన్ని తియ్యకపోతే చెట్టు చచ్చిపోయిద్ది.

ఒకచేత్తో బుట్టపట్టుకుని, ఇంకోసేత్తో కొడవల్లిక్కి పట్టుకుని మల్లెను తవ్వి బుట్టలో ఏసుకొని సెట్టు బయటకి వచ్చాక పారబొయ్యాల. అదీ పని. పనిలోకి వంగాం. మమ్మ పక్కనే సాలులో వుంది. పట్టె తర్వాత పట్టెకి మారాల. మల్లెమీదికి లిక్కి దెబ్బ యాత్తంటే కసక్కన తెగిపడుతన్నాయి. ఆటిని బుట్టలో ఏసుకుంటూ వత్తన్నా. పక్కపట్టెలో మమ్మ నా పక్కనే మల్లె తీసుకుంటూ నడత్తా ఉంది. ఒక పట్టెలో మల్లె తీసి రెండో పట్టెకి మారాం.

మాతో పని సేయిచ్చడానికి మాగంటోరల్లు దొచ్చాడు. అల్లదనలు గుంటూరు జిల్లా ఏరుదాటొచ్చి మావూరి పిల్లను పెల్లి చేసుకుని ఇక్కడే వుంటుండు. తెల్ల లుంగీ కట్టుకొని తెల్ల చొక్కా తొడుక్కొని, ఎప్పుడూ బారు సిగరెట్టు నోట్లో పెట్టుకొని సిన్మా ఈరోలాగుంటాడు.

ఆయన పట్టెలన్నీ తిరుక్కుంటూ సరిగ్గా తీత్తన్నారా లేదా అని సూస్కుంటూ ఆడపిల్ల కాయల్తో సెతురులాడుకుంటూ న్నంటాడు.

నేను రెండో పట్టె సగానికొచ్చాక నా పట్టెనే సూసుకుంటూ ఎనకామాలే వచ్చాడు. నా దగ్గరకొచ్చి వంగి మల్లె తీత్తన్న నా నడుంమీద బలంగా ఈడ్చితన్నాడు. నేను వామ్మో అని కూలబడిపోయా. పడిపోయినోడ్ని వంగి సెంపలే సెంపలే బాదాడు. నాకు వూపిరి పోయినట్టే అయ్యింది. నా అరుపులు, ఏడుపులు ఇని మమ్మ గుండెలు బాదుకుంటా నాకాడికి పరుగెత్తుకొచ్చి మాగంటోరల్లుడ్ని ఒక్కతోపు తోసింది. కిందబడ్డ నన్ను తీసుకుని సోకండాలు పెట్టుకుంటూ నీ సెతేలిరిగిపోను, నీకు పాడె గట్ట దొంగ నా బట్ట ... నిన్ను గూడెందోల" అంటూ తిట్టటం మొదలుపెట్టింది.

కిందపడినోడు గబుక్కున పైకిలేసి మమ్మజుట్టుపట్టుకున్నాడు. మమ్మ అరుపులకి అందరూ పోగయ్యారు. ఏసమ్మ పరుగెత్తుకొచ్చి మమ్మజుట్టు వదలిచ్చి "ఏంజరిగింది మాదరావుగారో అనడిగింది. ఆడు ఎగసోసబోతా నీయమ్మమాల మాదిగ లంజల్లారా మేం ఎగసాయం చేసేది మీ కోసమనుకున్నారే.. సూడు ఈ పిల్ల నా కొడుకు ఏం సేత్తన్నాడో అని నేను మల్లెతీసిన పట్టెసూపిచ్చాడు. మల్లెలు సగం తెగిపడుతున్నాయి. పైసగమే వచ్చాయి. మొదళ్ళు అట్టనే వుండి పోయాయి.

"వసిపోరదు తెలియలా.. పక్కనే అల్లమ్ముందిగా దానికి చెప్తే అది తీసేదిగా, లేకపోతే నాకు చెప్తే నేను తీయిచ్చేదాన్నిగా అని ఏసమ్మ గట్టిగానే అంది.

"మా సామ్మ తేరగా వుందని ఇంతలేని పిల్ల నాకొడుకుల్ని ఏసుకురావడం డబ్బులు దెంగిపోడం.. మేం నెత్తిన గుడ్డేసుకుపోవాలే.. అని గట్టిగట్టిగా అరుస్తున్నాడు. మమ్మ ఏడుత్తావుంది నన్ను గుండెలకదుముకుంటా. ఈ లోపు చివరపట్టెలో మల్లెతీత్తన్న మా బాబాయి పరుగెత్తుకొచ్చాడు. వత్తానే నన్ను మమ్మనీ చూశాడు. మా బాబాయిని చూసింతరువాత మమ్మకి ధైర్నం వొచ్చింది. పిచ్చి తిట్లు తిట్టుకుంటూ చూడయ్యా పసోడ్ని ఎట్టా కొట్టాడో అని సూపిచ్చింది. నామొకం వాసిపోయి వుంది. నన్ను చూసాక ఇగ మా బాబాయి ఆగలేకపోయాడు. "నీ యమ్మ నా కొడకా.. అనుకుంటూ ఎగిరెగిరి తన్నాడు. మా బాబాయి బలం ముందు ఆడెందుకూ సాల్లా. అందరూ మా బాబాయిని ఇవతలికి లాక్కొచ్చారు. అందరం ఆ రోజుకి పని ఆపేసి ఇల్లకి బయలుదేరాం.

రాత్రికి కులపంచాయతీ పెట్టారు. కులపెద్దలంతా మాగంటోరింటికి బొయ్యి సారాతాగొచ్చారు. పంచాయతీలో పెద్దలంతా మా బాబాయినే తిట్టారు. వంద రూపాయలు తప్పేశారు. మా బాబాయి కట్టనన్నాడు. నీ యమ్మ దొంగనాకొడకల్లారా మొత్తం మాలపల్లిని కమ్మోరికి కట్టబెట్టండిరా అని తిట్టాడు.

"ఓరబ్బాయి ఇట్టయితే నిన్ను కులం న్నుండి ఎలేత్తాం" అన్నారు. దీంతో కుర్రకారంతా తిరగబడ్డారు. ఇక పంచాయతీ లేదు. ఇంకేం లేదు. చాలా కాలం మావోల్లు పొలం పనికి పోలేదు. అయితే ఆ యేదాదే మా ఊళ్ళో అంబేద్కర్ బొమ్మేశారు. ఆ ఏడాదే మా కుల పెద్దలందరినీ మార్చి పారేసి కుర్రాకరు పెత్తనం తీసుకున్నారు.

ఆయాల్టినుంచి మజ్జానప్పూట పేడకెల్లి రమ్మంటం తప్ప నన్నెప్పుడూ మమ్మ పన్లోకి రమ్మని పిలవలేదు.

( చూపు డిసెంబరు 1996)

32

# అనుబంధ ప్రశ్న

- పైడి తెరేష్‌బాబు

పట్ట పగలు.

ఒక గదిలోపల.

నాలుగుదేవుడి ఫోటోలు నాలుగు గోడలుగా వేళ్ళాడుతూ వున్నాయి. ఒక గోడ పక్కగా టేబులుంది. టేబుల్‌మీద పెద్ద సైజు దేవుడిపటం చెక్కకు బదులుగా పరచివుంది. అక్కడి కార్యకలాపాలన్నీ ఆ టేబుల్‌మీద దేవుడి సాక్షిగానే జరుగుతుంటాయి.

గది నిండా మనుషులున్నారు. వారు మను అనే శబ్దం నుంచి పరిణామం చెందినవారు. అందరి చేతుల్లోనూ లావాటి గ్రంథాలున్నాయి. గదిలోనికి ఒకతను పరుగెత్తుకొంటూ వచ్చాడు. అంతా మొహాలు తిప్పి అతనికేసి చూశారు. అతని చేతిలో ఒక దినపత్రికుంది. దాన్ని విసురుగా టేబుల్ మీదికి విసిరేడు. టేబుల్‌మీది దేవుడు ఉలిక్కిపడ్డాడు. టేబుల్ చుట్టూ వున్న దేవుళ్ళు కూలి ఉలిక్కిపడ్డారు.

"ఏమిటిది?"

"దళితులంతా ఒకటవుతున్నారు"

"అయితే?"

"దేవళాలు మునుగుతాయ్"

చాలామంది ఉలిక్కిపడ్డారు. కోపంగా దవడలు బిగించేరు.

"దళితుల్ని చీల్చాలి'

"అవశ్యం"

"సమర్థుడెవరు"

"వున్నాడు"

ఒకతను పైకిలేచాడు. గ్లోబుకు అక్కడక్కడా వెంట్రుకలు తాపడం చేసినట్టు బట్టతల. గుబురు మీసాలు కళ్ళజోడు, పంచె, లాల్చీ, ఉత్తరీయం వేసుకుని వున్నాడు.

"నీ సామర్థ్యం ఏ పాటిదో మా ముందునిరూపించు"

"అవశ్యం"

పైకి లేచినతనునవ్వేడు. రుషుల్లా. దేవుళ్ళలా, గీతకారుడిలా నవ్వేడు. చివర్న అతనెట్లా నవ్వగలడో కూడా చూపించేడు. చాలదు. ఇంకా రుజువు కావాలి.

అతని అహం దెబ్బతింది. చుట్టూ చూశాడు. మళ్ళీనవ్వేడు. మళ్ళీ మళ్ళీ నవ్వేడు. నవ్వుతూ నవ్వుతూ ఎడమ చేతిని చివాల్న పంచెలోకి దోపుకున్నాడు. అతను మళ్లీ మళ్ళీ నవ్వేడు. మనుషుల ముఖాలలో విస్మయం విస్మయం.. విస్మయం మొహాలు చాటల్లా విప్పారాయి.

అతను పంచెలో దోపిన ఎడంచేతిని ఒరలోంచి కత్తిదూసినట్టు బైటకులాగేడు.

వెంట్రుక!

"అఫ్టరాల్ ఒక వెంట్రుకముక్క!

అందరి దృష్టి వెంట్రుక ముక్క మీదేవుంది. అతను కళ్ళు మూసుకుని దృష్టిని భ్రూమధ్యంలో నిలిపేడు. మెల్లగా మంత్రం చదవడం మొదలైంది. మునివేళ్ళతో పట్టుకున్న వెంట్రుకనునెమ్మదిగా పైకెత్తుతున్నాడు. పైకెత్తుతున్నాడు. ఎత్తుతున్నాడు. ఎత్తేడు. ఎంతెత్తు ఎత్తాలో ఎత్తేడు.

మంత్రం!

ఎత్తడం!

ఉత్కంఠ

బాప్‌రేబాప్

వెంట్రుక ముక్క నిట్టనిలువగా రెండుగా చీలిపోయింది. మంత్రం ఆగిపోయింది. దృష్టి భ్రూమధ్యం నుండికళ్ళలోకి పాకింది. అతను నవ్వేడు. నవ్వుతూనే అన్నాడు.

"ఇక దళితుల్లో లెక్కా"

పట్టపగలు

ఒక కుగ్రామం

మాదిగవాడలో తలొంచుకొని నడుస్తున్నాడతను వేషం మారింది. ఒంటిమీద జంధ్యం. మొలకు అంగోస్త్రం తప్ప మరో నూలుపోగులేదు.

"ఎవరు మీరు"

"చతుర్వేద సుబ్బరామశాస్త్రిని"

"మీవంటి మహానుభావులు.. .మా మాదిగవాడలో?"

నేను మాదిగవాడినే.

?

కులాలు మతాలుట్రాష్. పీల్చేగాలి అందరిదీ. సూర్యుడి వెలుగు అందరిదీ ఎక్కువ తక్కువ తేడాలేమిటి నాన్సెన్స్. మా బ్రాహ్మలకులం మిమ్మల్ని యుగయుగాలుగా కాలికింద తొక్కి పట్టివుంచింది. అందుకు ప్రాయశ్చితం చేసుకుంటాను. మీ అన్నం తింటాను. మీ చింకి చాప మీద పడుకుంటాను. మిమ్మల్ని నా నెత్తిన పెట్టుకుంటాను.

"అబ్బబ్బ" ఏం సమానత్వం

"ఆహాహా ఓహోహో"

మాదిగవాడలో ఒక కుటీరం వెలిసింది అతనికి పూజలు చేసినంత పని చేస్తున్నారు అతని మొదటి జ్ఞానబోధ! "మీ నాయకుడెవరు?" "నేనే" "మీ సిద్ధాంతమేమిటి?" "అంబేద్కరిజం

"కాదు. కాకూడదు"

"ఏం'

"అతను మాలల పక్షపాతి. ఆంధ్రరాష్ట్రంలో వున్న మాలంటే అతనికి చాలా ఇష్టం. వాళ్ళకు ప్రత్యేకమైన విస్తరివేసి మీ నోట్లో దుమ్ముకొట్టాడు. మీరు అరుణ్‌శౌరి రాతల్ని చదివారా?

"చదువుతాం. కానీ"

"అయ్యో రామ చదవండి బాబూ చదవండి. ఈ గణాంక వివరాలు చదవండి. ఉద్యోగాల్లో సమాజంలో మాలాళ్ళు ఎంత శాతంగా వున్నారో మీరెంత శాతం వున్నారో తెలుస్తుంది.

"అరె ఇదేంటి"

"అదే మరి"

"న్యాయం"

"అవును మరి"

"మాలోళ్ళు మా శత్రువులన్నమాట"

"అన్న మాటేముంది వున్నమాటే"

"మరి అంబేద్కర్...?"

"తీసి అవతలపెట్టండి.. మీకే వేరే నాయకుడున్నాడు"

"ఎవరు"

"జగజ్జీవన్‌రామ్!"

.......

పట్టపగలు!!

మాల పల్లెల్లో మాలచ్చమ్మ గుడి దగ్గర ధాన్యంలో కూర్చున్నాడతను. ఎవరో నిష్ఠాగరిష్టుడైన బ్రాహ్మడు గుడి అరుగుమీద కనపడే సరికి అక్కడ పేకాట కోసం వచ్చిన కుర్రగ్యాంగ్ కొంచెం తటపటాయిస్తున్నాడు.

"రండి"

"మీరు?"

"ఒక ఆపద గురించి మిమ్మల్ని హెచ్చరించి పోదామని వచ్చాను."

"ఏమిటీస్వామీ!"

"మాదిగల మీద మా అభిప్రాయం"

"వాళ్ళూ మేమూ అన్నదమ్ముల్లాంటి వాళ్ళ:"

"వాళ్ళలా అనుకోవడం లేదే! వాళ్ళకు రావలసిందేదో మీరు దోచుకుంటున్నారని మీ మీద కారాలు మిరియాలు నూరుతున్నారు".

"అట్టానా!"

దేశంలో వున్న మీలాంటి వాళ్ళ కోసం అంబేద్కరెంత త్యాగం చేశాడు" అదీ కాదంటున్నారా'

"అనడమేమిటి మాకు అంబేద్కర్, ఫూలే జగ్జీవన్‌రామ్ మాత్రమే మా నాయకుడు అంటున్నారు"

"అన్యాయం కదా స్వామి"

"చిన్నగా అంటారేం" అసలు చారిత్రకంగా చూస్తే మాదిగలకన్నా ఎక్కువ మీరే వెనుకబడ్డారు"

"అదెట్లా"

వాళ్ళకు చెప్పులు కుట్టుకోవటం అనే కులవృత్తి వుంది. వాటిని అమ్ముకోవటం అనే వ్యాపారం ఉంది. ఆ వ్యాపారంలో వాళ్ళు ఇటు మాకూ క్షత్రియులకు వైశ్యులకు దగ్గరగా వచ్చారు. ఏ వృత్తి వ్యాపారాలు లేకుండాపోయింది. అసలు సిసలు అస్పృశ్యతకు గురయ్యింది మీరే".

"చూశారా చూశారా ఇన్నాళ్ళూ మనకి సంగతులు తెలియకుండా ఎంత అజ్ఞానంతో బతికామో"

"మాదిగవాళ్ళు తక్కువవాళ్ళు కాదు బాబూ!"

"ఇక జూస్తాం గదా!"

అక్కడికక్కడ అప్పటికప్పుడు ఒక మాల నాయకుడు తయారై మాదిగలు మన శత్రువులు అనే నినాదాన్ని తయారుచేశాడు

పట్టపగలు!

ఒక గదిలోపల టేబుల్ ముందర, టేబుల్ కింద, మీద దేవుళ్ళు. ఒకతను ఆనందంతో భరతనాట్యం చేసుకుంటూ లోపలికొచ్చాడు అతని చేతిలో పేపరుంది.

"ఏమిటి విశేషం"

"మాలలు మాదిగలు విడిపోయారు"

జై."

అతను లేచి నిలబడ్డాడు అతని ముఖంలో ఉక్రోషం తాండవిస్తోంది.

"ఏమిటా ఉక్రోషం ఇది దండలు గుద్దుకోవాల్సిన శుభతరుణం కదా"

"మాలలు మాదిగలు విడిపోయారని మామూలుగా చెబుతుంటేమాకుకోపం రాదా"

"మరెలా చెప్పాలి"

"తిరిగి మళ్ళీ కలపడానికి వీల్లేనంతగా వీళ్ళను చీల్చివేసినవాణ్ణినేనను"

"ఔను అతనికి జై"

"అతనికి త్రీచీర్స్"

అతనుకూర్చున్నాడు. ముఖం నిండా ఆనందం. క్షణాల వ్యవధిలోనే మనిషి కొంచెం ఉబ్బినట్టు కనిపించాడు.

"తాంబూలాలివ్వడం మనవంతు తన్నుకు చావడం వాళ్ళవంతు"

"మరి యజ్ఞం మొదలుపెడదాం"

"అవశ్యం!"

.......

"ఏందిరా ఏసా మాలోళ్ళతో తిరుగుతున్నావంట.

వాళ్ళతో కలవొద్దని ఎన్నిసార్లు చెప్పాలి.

మా పెద్దమ్మాయిని మాలోళ్ళబ్బాయి గోలచేశాడంటేనూ అడుగుదామని పోయినా."

"మేరమ్మని గోలచేశారా అమరి ఇంతసేపూ చెప్పవేం"

"అయిపోయిందిలే. అడిగే వస్తున్నా"

"ఏమిటైపోయింది. ఇప్పుడు మొదలైంది అసలు కథ. ఆ సాయంకాలమే మాలలు మాదిగలు చొక్కాలు పట్టుకునే దాకా వెళ్ళారు.

అర్ధరాత్రి

దేవాలయప్రాంగణం

హోమగుండం

మనుషులు చాలామంది హోమగుండం చుట్టూ చేరి మంత్రాలు చదువుతున్నారు. మంత్రాల తాత్పర్యం ఏమిటంటే.

"ఓ ఇంద్రుడా! మాల మాదిగల మధ్య తగాదాలు పెట్టటం విషయంలో సక్సెస్ అయ్యాం. అందుకు మీరు అరడజను వంది మాలల్ని మరో అరడజను మంది మాదిగల్ని సమర్పించుకుంటున్నాం. ఓ ఇంద్రుడా దేవతలకు నాయకుడైనటువంటివాడా ఈ పరిస్థితి ఇట్లానే కంటిన్యూ అయితే ముందు ముందు మాలా మాదిగ పిల్లల మానాల్ని మీకు అసంఖ్యాకంగా సమర్పించుకుంటాం. ఓ ఇంద్రుడా.."

హోమం సాగుతూనే ఉంది.

అర్ధరాత్రి

మాదిగవాడ.

ఓ ఇంటి ముందు మంచాల మీద కూర్చుని వున్నారు కొందరు.

"అది గాదశా. ఇన్నాళ్ళు కలిమన్నోళ్ళం కలిమన్నోళ్ళం ఈతన్నుకోటాలేందిరా. నాకుతెలీక అడుగుతా గానీ "మాలోల్లని ఎనకేసుకొచ్చినావంటే మాడు బగులుద్ది. నువ్వు మూస్కోశా. మాత్తండంగల్నే మనకళ్ళముందే ఎంతన్నేయం జరిగింది. మన ఓజ్జోగలన్నీ అల్లు లాగేసుకుంటున్నారు.

అర్ధరాత్రి.

హోమగుండం

మంత్రాలహోరుతో మార్మోగిపోతుంది. ఆలయ ప్రాంగణం.

"ఓ మంత్రిశ్రేష్ఠుడా మీరు ఏ పార్టీకి చెందినవారైనా లోపల్లోపల మీరు హైందవ శ్రేష్ఠులని

మేం మనసావాచా నమ్ముతున్నాం. మీరు ఆంధ్రప్రదేశ్‌కి వచ్చినప్పుడల్లా పుట్టపర్తిలోనో తిరుపతిలోనో దిగడం మాకు ఎంతోసంతోషదాయకం. పైకి ఎన్ని పేపరు స్టేట్‌మెంట్లు ఇచ్చినా ఎంత తిట్టుకున్నా విమర్శించినా మత ప్రాతిపదిక మీద మా మద్దతు పరోక్షంగా ఎప్పుడూ మీకు వుంటుంది. అలాగే మీ మద్దతు కూడా వుంటుందని ఆశిస్తున్నాం. అయోధ్యలో మీకు వీలున్నన్ని గొడవల్ని మీకు సమర్పించుకుంటాం.

"ఘనత వహించిన ఉన్నతాధికరులారా! అల్ప సంఖ్యాకులమైన మాకునూటికి నూరుశాతం ఉద్యోగాలు దొరికేట్టు చేయండి. అందుకు మీకు ప్రమోషన్లకోసం పైరవీలు మేం చేసిపెడతాం. అధికసంఖ్యాకులైనదళితులకు వెనుకబడిన వర్గాలకుపర్సంటేజీ చొప్పున మాత్రమే ఉద్యోగాలు వచ్చేట్టు చూడండి. మీరు వీరులుశూరులుమీ శక్తికి తిరుగులేదు. రిజర్వేషన్లు అమలు జరిపేటప్పుడు ఏదో ఒక కుట్రచేసి శక్తిని ప్రసాదించండి. "అర్హులైన అభ్యర్థులు దొరకనందున అనే కుంటిసాకును మాకు ఆయుధంగా ప్రసాదించండి".

పట్టపగలు!

అటు మాలల సభ

ఇటు మాదిగల సభ

పరిస్థితి ఉద్రిక్తంగా ఉంది.

ఇద్దరు నాయకులు ఉధృతంగా మాట్లాడుతున్నారు.

రెండు సభావేదికలుకు మధ్య వున్న ఖాళీ జాగాలో ఒక చదువుకున్న దళితుడు అటుకాస్సేపు ఇటు కాస్సేపు తలతిప్పుతూ అయోమయంగా చూస్తున్నాడు.

"అసలు శత్రువునొదలిపెట్టి మనం పరస్పరం శత్రువులం అంటారేంటినీళ్ళు"

"అంటే నువ్వు ఎవరికి సపోర్టు"

సపోర్టెవరికిఅనేది కాదు సమస్య. గణాంక వివరాల్ని బట్టి చూస్తే మాదిగలకు అన్యాయం జరుగుతోందని తెలిసింది. కాబట్టి మాదిగ దండోరా గురించి ప్రతి ఒక్కరు ఆలోచించాలి. మాల మాదిగలు అందరూ కలిసి రిజర్వేషన్ శాతం పెంచమని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. రిజర్వేషన్‌లను పెంచడానికి వీల్లేదని ప్రభుత్వం చేత ఆ నిపిస్తున్న వర్గాన్ని జుట్టుపట్టి అందరం కలిసికట్టుగా ఉతికి ఆరేయ్యాల గానీ వీళ్ళకు వీళ్ళు వాళ్ళుకువాళ్ళు శత్రువులని ద్వేషాన్ని రెచ్చగొట్టుకుని మరింత బలహీనమైపోవడం నాకు నచ్చదు. అన్యాయాన్ని అడ్డుకునే పద్ధతి ఇది కాదేమో!!

అర్ధరాత్రి

హోమగుండం

హవిసుపను ప్రీతిపాత్రంగా ఆరగించేవాడా! చిచ్చుపెట్టింది. మేము అనే సంగతి దళితులకు తెలియనివ్వకుండి. వాళ్ళ మధ్య ఐక్యతా బంధాన్ని ఎప్పటికప్పుడు తెంచండి"

పట్టపగలు!

దళితవాడ

ఒక రక్తపాతం. ఎవర్ని ఎవరు కొట్టారో తెలియదు మొత్తమీద రక్తపాతం. రక్తపుటేరు

మధ్య ఓ దళిత స్త్రీ సోకండాలు పెడుతోంది.

"అయ్యలారా ఒరేఎవురయ్యా మనం ఒకళ్ళకొకళ్ళం కానోళ్ళమని జెప్పిందీ కూలి దగ్గర తగువాడుకున్నా కూటిదగ్గర కలిసేవోళ్ళం గదా మీరు ఒకళ్ళనొకళ్లు పగొళ్ళు అని చెప్పిన ఆ దొంగవాబట్టెవురో గాని ముందు వాణ్ణి బట్టుకొని మక్కెలిరగదియ్యండయ్యా అయ్యా... వోరే

నాయకుల దృష్టి గణాంక వివరాల మీద వుంది. ఎలక్షన్ల మీద ఉంది. కెరీర్‌మీదుంది. లాభనష్టాల బేరీజు మీద ఉంది. ముఖ్యంగా షార్ట్‌కట్‌లో రావాల్సిన కీర్తి ప్రతిష్టల మీద ఉంది.

నిరంతరం అగ్రవర్ణం అందంగా ఆకర్షణీయంగా వ్యూహాత్మకంగా దళితజాతిని వధ్యశాల మీదికి ఆవాహన చేస్తున్నాడు శత్రువు చుట్టూ వృత్తం గీస్తున్నాడు. తర్వాత?

*(ఈనాటి ఏకలవ్య అక్టోబర్ 1996)*